# ఆనాటి గుంటూరు జిల్లా

## (1788-1848)

## దక్షిణాదిలో స్థానిక, కేంద్ర పెత్తన చరిత్ర

రచన

రాబర్ట్ ఎరిక్ ఫ్రికన్ బర్గ్

తెలుగుసేత

నరిసెట్టి ఇన్నయ్య

# ఆనాటి
# గుంటూరు జిల్లా
## (1788-1848)
### దక్షిణాదిలో స్థానిక, కేంద్ర పెత్తన చరిత్ర

రచన
రాబర్ట్ ఎరిక్ ఫ్రికన్ బర్గ్

తెలుగుసేత
నరిసెట్టి ఇన్నయ్య

**AANAATI GUNTUR ZILLA (Telugu)**

**GUNTUR DISTRICT (1788-1848) (English)**

**Author:** *Professor Robert Eric Frykenberg*

**English Edition** : Oxford, 1965

**Telugu Translation:** *Narisetti Innaiah*

Permission was given by the author - 2011

**Published by :** *Venigalla Komala*

2 Hawlings ct, Brookville, MD 20833 USA

Price : Rs.500/- $ 20

**Copies in India :**

**AKSHARA**
Banjara Hills
Hyderabad
phone: 040 - 23554096

and

**NAVODAYA**
Kachiguda X roads
(opp: Arya Samaj bhavan)
Hyderabad
Phone: 040-24652387

**Printed at:**
KARSHAK ART PRINTERS
40-APHB, OU Road
Hyderabad - 500 044.
Phone : 040-27618261, 27653348

By D.Nagalakshmi

మానవ విలువలు పాటిస్తున్న

ఆరమళ్ళ

పూర్ణచంద్ర, ఉషా దంపతులకు

ఆప్యాయంగా

ఈ తెలుగుసేత అంకితం

# విషయక్రమం

# అనువాదకుని ముందుమాట

## ఎందుకీ తెలుగు సేత?

నేను గుంటూరు జిల్లాలో పుట్టాను. (చేబ్రోలు - శివారు పాత రెడ్డిపాలెం).

ఈ గ్రంథ రచయిత రాబర్ట్ ఎరిక్ ఫ్రికన్ బర్గ్ గుంటూరు జిల్లాలో మెట్టినవాడు. పుట్టింది నీలగిరి కొండలు, వూటీలో.

అందువలన ఉభయులకూ ప్రాంతీయ అభిమానం ఈ గ్రంథంలో ఉన్నది.

ప్రొఫెసర్ రాబర్ట్ మద్రాసులోని ఊటీలో పుట్టినా, వెంటనే ఆయన తండ్రి స్వీడిష్ మిషనరీగా గుంటూరు వచ్చాడు. ఆకారణంగా ప్రొఫెసర్ రాబర్ట్ 12 ఏళ్ళ వయస్సు వచ్చేవరకూ గుంటూరు జిల్లాలో, కొంతమేరకు నల్గొండ జిల్లాలో సంచరించాడు. కనుక తెలుగు బాగా మాట్లాడ గలిగేవాడు. బాల్యదశలో కంటి జబ్బువలన స్కూలుకు పోడానికి వీల్లేకపోయింది. కాని తండ్రి కార్యక్రమాలననుసరించి వూళ్ళు తిరగడం వలన స్థానికంగా బాగా చూచి, నేర్చుకొని, యిష్టపడ్డాడు. ఆతరువాత తండ్రి వెంట మధ్యప్రాచ్యం, యూరోప్ మీదుగా 1950 ప్రాంతాలలో ఆమెరికాలో స్థిరపడి, చదివి, చివరకు ప్రొఫెసర్‌గా విస్కాన్సిన్ యూనివర్సిటీ (మాడిసన్) లో స్థిరపడ్డాడు.

అయితే గుంటూరు జిల్లా, భారతదేశ అభిమానం యినుమడించగా, మరల మరలా దేశం సందర్శించాడు. అందులో తనకు ఆసక్తి గల గుంటూరు జిల్లా చరిత్రను బాగా లోతుపాతులతో పరిశోధించాడు. 18వ శతాబ్ద కీలకం అనిపించి ఆకాలంలో గుంటూరు పరిణామాన్ని కూలంకషంగా సప్రమాణంగా రాశాడు.

రాబర్ట్ ఎన్నో రచనలు చేసినా గుంటూరు జిల్లా ఆయన, తొలి గ్రంథం. దీని ప్రామాణికతను బట్టి, ఆక్స్‌ఫర్డ్‌వారు 1965లో పుస్తకం ప్రచురించారు.

1970లో రాబర్ట్ రచన గుంటూరు జిల్లా నా దృష్టికి వచ్చింది. హైదరాబాద్‌లో ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఏషియన్ స్టడీస్ సంస్థ బర్కత్‌పురాలో వుండేది. నేను కొన్నేళ్ళు అందులో ఆఫీస్ సెక్రటరీగా పనిచేశాను. దాని కార్యదర్శిగా వున్న ఐ.ఎ.ఎస్. అధికారి వి.కె.బావ సంస్థలో చిన్న, చక్కని గ్రంథాలయం పెంపొందించారు. అక్కడే తొలుత గుంటూరు జిల్లా పుస్తకం చదివాను. స్టేట్ ఆర్కైవ్స్ డైరెక్టర్‌గా ఆయన కూడా రాబర్ట్‌కు తోడ్పడినట్లు రాశారు. పుస్తకం చక్కని పరిశోధనా రచనగా నాకు నచ్చింది.

ఆతరువాత 1975లో హైదరాబాద్ లాల్‌బహదూర్ స్టేడియంలో ప్రపంచ తెలుగు తొలి సమావేశాలు జరిగాయి. అందులో రాబర్ట్ ఫ్రికన్‌బర్గ్, గ్విన్ తదితర తెలుగు విదేశీ అభిమానులు పాల్గొన్నారు. నేను అనుకోకుండా రాబర్ట్‌ను కలిశాను. తెలుగులో పలకరించాడు. రిట్జ్ హొటల్‌లో బస చేశాడు. ఆ తరువాత మా యిరువురికీ ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు లేవు. 1992 నుండీ నేను అమెరికా తరచు వస్తూ పోతూ వున్నప్పుడు, రాబర్ట్‌ను అన్వేషించి, ఇ-మెయిల్ ద్వారా పలకరించాను. క్రమేణా మా కంప్యూటర్ పరిచయం పెరిగింది. ఇన్నయ్య పంతులుగారూ అని సంబోధించేవాడు. ఇద్దరూ వాషింగ్టన్‌లో కలుసుకుందామనుకుంటే కొన్నేళ్లు కుదరలేదు.

2010లో మళ్ళీ ఫోను ద్వారా ఇ-మెయిల్ ద్వారా మా పరిచయాలు కొనసాగించాం. అప్పటికి ఆయన విస్కాన్సిన్‌లో పొలిటికల్ సైన్స్ ప్రొఫెసర్‌గా రిటైర్ అయి, ఎమెరిటస్ ఆచార్యులుగా వున్నారు. 80 ఏళ్ల వయసులో వ్యాసరచన చేస్తున్నారు. నన్ను రమ్మని ఆహ్వానించారు.

వెడితే సాదరంగా ఒక రెస్టారెంట్‌కు తీసుకెళ్ళి భోజనం పెట్టించి, రెండు గంటలపాటు ఎన్నో విషయాలు చెప్పారు. నాది చేబ్రోలు అని తెలిసి మరీ సంతోషించారు. తనకు సుపరిచిత గ్రామం అన్నారు. విస్కాన్సిస్‌లో తెలుగు శాఖ పెట్టడానికి తోడ్పడినారు. అనేకమంది తెలుగువారితో బాగా పరిచయం వున్నది. సమకాలీనులలో భద్రిరాజు కృష్ణమూర్తి చేకూరి రామారావు, పి.వి.నరసింహారావు వంటి పేర్లు చెప్పారు.

ఆ సందర్భంగా గుంటూరు జిల్లా పుస్తకం ప్రస్తావన వచ్చింది. అది చాలా మంచి గ్రంథం అయినా ఇంగ్లీషు వున్నందున జిల్లా తెలుగు వారికి, ప్రపంచ వ్యాప్తంగా ఉన్న తెలుగు వారికి తెలియదన్నాను. ఆయన అంగీకరించి ఎవరైనా అనువాదం చేస్తే బాగుండునన్నారు. పైగా ఆ పుస్తకంలో అధ్యయనం చేసిన 18వ శతాబ్దానంతరం చరిత్ర కొనసాగించ వలసిన అవసరం వుందన్నారు. ఆంధ్ర ప్రదేశ్‌లో అన్ని జిల్లాలకు, అలాంటి చరిత్ర వస్తే, రాష్ట్ర చరిత్రగా ప్రామాణికత రాగలదన్నారు.

నేను గాని, మరెవరితోనైనా సరే, తెలుగులో తీసుకురావడానికి ప్రయత్నిస్తామంటే ఆయన ఎంత సంతోషించాడో చెప్పలేను. అయితే కాపీ రైట్ ఆక్స్‌ఫర్డ్‌కు వున్నది. ఒకపట్టాన అనుమతి కష్టం. ఆ విషయం చూడమన్నాను.

రాబర్ట్ ఫ్రికెన్‌బర్గ్ తక్షణమే ఆక్స్‌ఫర్డ్ ప్రచురణలతో సంప్రదించి, అనుమతి తాను రచయితగా స్వీకరించి, నాకు తెలియజేశారు. తెలుగులో చేస్తామని ఆ దశలో ఆయనకు హామీ యిచ్చాను. రాబర్ట్ ఎంత సంతోషపడ్డారో చెప్పలేను. గుంటూరు జిల్లాపై ఆయన అభిమానం మరోసారి గమనించాను.

అలా వచ్చింది యీ అనువాద గ్రంథం. దీనిని ఇ-బుక్‌గా కూడా అందిస్తున్నందున ప్రపంచవ్యాప్తంగా తెలుగువారు, ముఖ్యంగా

గుంటూరు జిల్లా అభిమానులు చదివి, చదివించే అవకాశం వుంది. భావితరాలకు అందించే మార్గం సుగమమైంది.

అనుకోకుండా అలా గుంటూరు జిల్లాను తెలుగులోకి తీసుకు రాగలిగాం. ఇందుకు ప్రొఫెసర్ రాబర్ట్ ఫ్రికెన్‌బర్గ్‌కు చాలా ధన్యవాదాలు.

ఆ రోజులే బాగుండేవనీ, ధర్మం నాలుగు కాళ్ళమీద నడిచిందనీ, అవినీతి వుండేదికాదనీ, లంచాలు, మోసాలు లేవని నమ్మేవారున్నారు. గ్రామాలు ప్రశాంతంగా జీవితం గడిపేవనీ, సుఖశాంతులు వెల్లి విరిశాయని అనేవారూ వున్నారు. అందులో కొంత నిజం వుందని, మానవ ఆచరణలోనే వున్న చెడు, నీతి మాలిన చర్యలు, దైవం పేరిట దుర్మార్గాలు, విచ్చలవిడితనం ఆ రోజుల్లో తక్కువేమీ కాదని, యీ చారిత్రక పరిశోధన రచన చదివితే స్పష్టపడుతుంది. ఈ విషయాలలో తెల్లదొరలు ముస్లిం పాలకులు, దేశీయ నల్ల పెత్తందార్లు ఎవరూ తీసిపోలేదు. ఇవి గట్టి మాటలని యీ రచన సప్రమాణంగా చూపుతుంది. పేదల్ని నలుచుక తినడం, రైతుల్ని పీడించడం అప్పుడూ యిప్పుడూ అలాగే వుంది. కులం విషవాయువులు అంతే ప్రమాదంతో పనిచేస్తున్నది. ఆ కోణంలో కూడా యీ రచన గొప్ప నగ్న సత్యాల్ని వెల్లడించింది.

మనుషుల కష్టార్జితాన్ని దోచి, గొప్ప భక్తులమని విగ్రహాలకు బంగారు తొడుగులు చేసి, మోసాలు చేసిన జమీందారులు, అధికారులు నేటి వారితో దీటుగా నాడూ వున్నారు.

"గుంటూరు జిల్లా" గ్రంథాన్ని తెలుగులోకి తీసుకరావడంలో సంకుచిత ధోరణి, ప్రాంతీయతకు తావిచ్చే ధోరణి వున్నదా అని, ఒకటి రెండు పర్యాయాలు ఆలోచించాను. పుస్తకం చదివిన తరువాత అటువంటి ధోరణికి తావు లేదని స్పష్టపడింది. ఇతర పరిశోధకులకు మార్గదర్శకంగా వుండగల లోతుపాతులు, నిశిత పరిశీలన, విమర్శ,

విచక్షణ గ్రంథంలో రాబర్ట్ పాటించారు. కనుక నా ప్రయత్నం మంచిదేనని స్వీకరించి, తెలుగు చేశాను.

రిఫరెన్సులు బ్రాకెట్లలో ప్రస్తావించాను. బిబ్లియోగ్రఫీ యథాతథంగా యిచ్చాను.

నా ప్రయత్నంలో అండగా నిలిచిన నా కుమార్తె డాక్టర్ నవీన అడుగడుగునా సహాయపడి, ప్రోత్సహించింది.

మిత్రులు కనికెల్ల మోసెస్ సోమసుందరం ఎంతో తోడ్పడి సాంకేతిక సహాయం అందించారు.

దామరాజు నాగలక్ష్మి ఓపికగా నా వత్తిడికి విసుగుదల చెందకుండా ప్రింటింగ్, ఇ-బుక్ ప్రతిని తయారు చేశారు. వారందరికీ సాదర అభిమానంతో రుణపడి వున్నానని చెప్పగలను.

గుంటూరు జిల్లా అనువాద గ్రంథం గురించి తెలిసి బాగా ప్రోత్సహించాల్సిన ప్రయత్నం అని దీని కొరకు ఎదురు చూసి రాగానే అందరికీ తెలియపరిచి భావవ్యాప్తికి కృషి చేస్తామని ఈనాడు జర్నలిజం స్కూలు ప్రిన్సిపాల్ ఎమ్. నాగేశ్వరరావు చెప్పటం నాకెంతో సంతోషాన్నిచ్చింది.

అమెరికాలోని టెక్సాస్ రాష్ట్రంలో డల్లాస్ నగరం నుండి అనంత మల్లవరపు అత్యుత్సాహంతో గుంటూరు జిల్లా వారు అమెరికాలో ఎక్కడున్నా వారందరికీ దీని గురించి తెలియపరుస్తానని కార్యక్రమాలు ఏర్పరచి ప్రచారంలో పెడదామని కూడా చెప్పటం నాకు మరింత ఊతం ఇచ్చింది.

న్యూజెర్సీలోని ప్రిన్స్టన్ నుండి రాజా కరణం ఈ అనువాద రచనపట్ల

తొలుత నుండీ ఆసక్తి కనబరచి ఖర్చులకు వెనుకాడకుండా దీనిని భావితరాలకు అందజేద్దామనడం ఆయనకు చరిత్రపట్ల ప్రేమను కనబరిచింది వీరందరికీ నా ప్రత్యేక అభినందనలు.

రాబర్ట్ ప్రికెన్‌బర్గ్ చివరి వరకూ అనువాద ప్రగతి కనుక్కుంటూ, యిది తెలుగులో వస్తున్నదని ఎంత సంతోషపడ్డారో మరి.

మొత్తం మీద తృప్తిగా యీ గ్రంథానువాదాన్ని తెలుగులో యివ్వగలుగుతున్నాం. బోలెడంత ఆనందం, ఎందరితోనో పంచుకో గలుగుతున్నాను.

తెలుగుసేత

నరిసెట్టి ఇన్నయ్య

# రచయిత ముందుమాట

బ్రిటిష్ యీస్ట్ ఇండియా కంపెనీ పరిపాలిస్తున్న రోజులలో మద్రాసు రాష్ట్ర తీరు ఎలా ఉంది. స్థానిక పెత్తందార్లకు కేంద్రపాలకులకూ ఘర్షణ జరిగిన తీరు  యిక్కడ పరిశీలించడం చూడొచ్చు.

బ్రిటిష్ పెత్తందార్లు జిల్లాలలో ఆధిపత్యం చలాయిస్తున్న వర్గాలతో ప్రత్యక్షసంబంధాలు పెట్టుకున్నారు. అయితే యిలాంటి పరిశీలన ఎందుకు చేపట్టాల్సి వచ్చింది. అందుకు గుంటూరు జిల్లానే ఎందుకు స్వీకరించాల్సి వచ్చిందంటే కొంత కావాలనీ, మరికొంత తలవని తలంపుగానూ జరిగిందనవచ్చు. ఈ రచనలో పరిశీలనకుగాను చాలా మందికి రుణపడివున్నాను. సహాయపడిన వారందరికీ ధన్యవాదాలు చెప్పుకోవాలి. ఇదంతా జరగడానికి వివరణ యిస్తాను.

నేను బాల్యదశను తెలుగు ప్రాంతంలో గడిపాను. ఆ అనుభవాన్ని జ్ఞానాన్ని అధారంగా రాయమని తొలుత ప్రోత్సహించిన ఖ్యాతి కాలిఫోర్నియా యూనివర్సిటీ ప్రొఫెసర్ రిచర్డ్ ఎల్. పార్క్ (తరువాత పిట్స్ యూనివర్సిటీ సోషల్ సైన్సెస్ డీన్ కూడా)కు దక్కాలి. ఇండియాలో విద్యార్థులు రెండు దశల పరిశీలనకు గురి అవుతుంటారు. చరిత్రకారులు, రాజకీయశాస్త్రజ్ఞులు ఒకవైపు దేశస్థాయిలో, మరోవైపు గ్రామస్థాయిలో, విషయాలను చరిత్రకారులు పట్టించుకున్నారు. ఆ రెండు స్థాయిల మధ్య ఏం జరిగిందో, పరిశీలించవచ్చని భావించాను. స్థానిక కేంద్ర ప్రాంతాల మధ్య వదిలేసిన ప్రాంతాన్ని సద్వినియోగ పరచుకోవచ్చను కున్నాను. అలా వదిలేసిన ప్రాంతం పరిశీలనకు బాగా పనికొచ్చింది. భారత చరిత్ర ఆనాటికి పాలకుల దృష్ట్యా రాశారు. క్రింది స్థాయి నుండి పరిశీలన చేబడితే, దాని ఆధారంగా సమగ్ర సామాజిక,

ఆర్థిక అధ్యయనం జరగొచ్చని ఆశించాను. అలాంటి ధోరణిపట్ల నన్ను దృష్టి పెట్టమని 'డ్యూక్ యూనివర్సిటీకి చెందిన ప్రొఫెసర్ రాబర్ట్ ఎల్.క్రేన్ ప్రోత్సహించారు.

నా పరిశోధనకు ఉపక్రమించడానికి రాక్ ఫెల్లర్ ఫౌండేషన్‌వారు ముందుకు వచ్చారు. దీనికి తోడు కేంబ్రిడ్జి యూనివర్సిటీకి చెందిన డా॥ పెర్సివల్ స్పియర్ ప్రోత్సాహం, సూచనలు నన్ను ప్రేరేపించాయి. రాక్ ఫెల్లర్ ఫౌండేషన్‌లో చాడ్ బోర్నగిల్ పాట్రిక్ బాగా ఆదుకున్నారు. కాలిఫోర్నియాలో పరిశోధన మొదలెట్టి, లండన్‌లోని ఇండియా ఆఫీసు లైబ్రరీలో కృషి చేశాను. 19వ శతాబ్దం తొలి రోజుల్లో మద్రాసు రాష్ట్రంలోని జిల్లా వ్యవహారాలు క్షుణ్ణంగా చూడగలిగాను. సమాచారానికి కావలసినంత విషయం, జిల్లా మాన్యువల్స్, తగినంత పరికరాల్ని యిచ్చాయి.

నా చిన్నతనంలో గుంటూరు, నల్గొండ జిల్లా గ్రామాలలో నెలల తరబడి వుంటూ తిరుగాడాను. కనుక నాలో సమధికోత్సాహం కలిగింది. కృష్ణాజిల్లా మాన్యువల్ పరిశీలిస్తే గుంటూరు నాయకుల మధ్య తీవ్ర ఘర్షణలున్నట్లు కనుగొన్నాను. అవినీతి పనులు కూడా బయట పడ్డాయి. ఆ దారిన పయనిస్తే పరిశోధనకు పెద్దగని లభించింది.

గుంటూరులో గందరగోళాల గురించి వాల్టర్ ఎలియట్ 840 పేజీలు నివేదిక యిచ్చాడు. అది నా తొలి ఆయుధం. ఇంచుమించు అంత పెద్ద రిపోర్టును జాన్ గోల్డింగం సమర్పించాడు. అందులో సుదీర్ఘ అనుబంధాలు జతపరిచాడు. గుంటూరులో సామాజిక ఆర్థిక స్థితిగతుల నివేదిక అది. స్థానిక నాయకుల నివేదికలు జతపరిచిన వాటిలో వున్నాయి. 13వ లార్డ్ ఎల్ఫిన్‌స్టోన్ పత్రాలలో ప్రముఖుల, అంత ప్రముఖులు కానివారితో జరిపిన ఉత్తరప్రత్యుత్తరాలు వున్నాయి. ఇవి మద్రాసు,

కలకత్తా, లండన్‌కు చెందినవి. వాల్టర్, మరియ ఎలయట్ (1836-58)ల పక్షం వారి ఉత్తరాలు అందులో ఉన్నాయి. ట్వీడిలేడీకు చెందిన మాథ్యూస్ తన తాతకు చెందిన పత్రాలు పరిశీలింపనిచ్చాడు. వాటిని శాశ్వతంగా ఇండియా ఆఫీస్ లైబ్రరీకి యిచ్చారు. ట్వీడిల్‌డీకు చెందిన 8వ మారిట్ కొన్ని పత్రాలు డ్యూక్ ఆఫ్ రిచ్‌మండ్స్ ప్రాచీన పత్రాలు గుడ్‌వుడ్ ఆర్కివ్స్‌లో దొరికాయి.

1788 నుండి 1859 వరకు వున్న రాత ప్రతులు పరిశీలనకు రాలేదు. గుంటూరు జిల్లాకు చెందిన ఆ రికార్డులు పరిశోధించడం యీ రచన కీలకం. ఆ రికార్డు మైక్రోఫిలం చేయడానికి మద్రాసు రికార్డు ఆఫీసు సిబ్బంది ఎం. నటేశన్, నటరాజన్ తోడ్పడకపోతే నాకు సాధ్యమయ్యేది కాదు.

ఇండియన్ అడ్మినిస్ట్రేటివ్ సర్వీసు వారనేకులు నాకు తోడ్పడ్డారు. హైదరాబాదులో ఆర్కివ్స్ రికార్డులు పరిశీలించడానికి నాటి డైరెక్టర్ వి.కె.బావ, కె.ఎం. ఉన్నితన్ సహకరించాడు. ఇంకా ఎన్. రమేశన్, ఎం.ఆర్.పాయ్, సి.కె.మూర్తి తోడ్పడ్డారు. ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి పురుషోత్తం పాయ్ జిల్లా తాలూకా ఆఫీసు రికార్డులు పరిశీలించడానికి సహకరించారు. 1919లో గుంటూరు జిల్లా కలెక్టర్ ఎం.ఎ.హలీం, ఆయన కార్యదర్శి పి.సుబ్బయ్య, ఇంకా హుజూర్ షరిస్తదార్, హెడ్ క్లర్క్, తహసిల్దార్లు వారి పనులలో నిమగ్నమౌతూనే, నాకు ఎంతో సహాయపడ్డారు.

లోగడ వాడని ఎంతో సమాచారం, అచ్చులో వున్నదీ లేనిదీ, యీ అధ్యయనానికి వాడాను. అంతవరకూ ఎవరూ తాకని సంపదను వాడడాన్ని బట్టి ఉత్తరోత్తరా దక్షిణ భారతదేశంలో స్థానిక చరిత్రకు తోడ్పడే అవకాశం ఉంది.

ఈ పరిశోధనా రచనను అక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలోని డా॥ కెన్నెత్ ఎ.బాల్‌హేచట్ పరిశీలించారు. లండన్ యూనివర్సిటీకి యీ సిద్ధాంత రచన వుద్దేశించినది. ఆయన చాలా శ్రద్ధగా యీ సిద్ధాంతాన్ని గమనించారు. చక్కగా సలహాయిచ్చి, మార్గం చూపారు. అరమరికలు లేకుండా ఆలోచనా స్రవంతిని ప్రోత్సహించారు. ఓరియంటల్, ఆఫ్రికా స్టడీస్ స్కూల్ సభ్యులు నా ఆలోచనను ప్రోత్సహించారు. నా దృష్టిని విస్తృతంగా పరిశీలించడానికి ఒక ఏడాది అధ్యయనాన్ని చికాగో యూనివర్సిటీ సహకరించింది. అధ్యయనాన్ని పునఃపరిశీలించి ప్రచురించడానికి తోడ్పడ్డారు. ప్రొఫెసర్లు స్టీఫెన్ ఎన్. హే, సూరజిత్ సిన్హా, మిల్టన్ సింగర్ చక్కని సూచనలిచ్చారు. విస్కాన్సిస్ పటాల శాఖవారు డేవిడ్ వుడ్‌వర్డ్ డాఫ్, నోల్టే, శ్రీమతి జెన్ని లీ లకు ధన్యవాదాలు, ప్రొఫెసర్ రాండల్ డి.సేల్ వీటిని పర్యవేక్షించారు. ఇతర అధ్యాయాలు చదివి, సూచనలిచ్చిన వారికి ఎ. నీలకంఠ శాస్త్రి (మద్రాసు యూనివర్సిటి) ప్రొఫెసర్ విశ్వేశ్వర ప్రసాద్ (ఢిల్లీ యూనివర్సిటి), ఎస్.పి.సేన్ (కలకత్తా యూనివర్సిటీ), ఎ.టి.ఫిష్ మాన్ (ఆంధ్రా క్రిస్టియన్ కాలేజి), న్యాపతి మాధవరావు (మైసూరు దివాన్) ప్రొఫెసర్ రిచర్డ్ పార్క్, ఆర్.ఎల్.క్రేన్, డా॥ పెర్సివల్ స్పియర్, నా భార్య కారల్ అందరికీ ధన్యవాదములు.

రాబర్ట్ ప్రికెన్‌బర్గ

*Permission Letter from Robert Eric Frykenberg*

*Dear Sri Innaiah Narisetti Puntulugaru:*

*Namaskaramandi! This letter is to formally grant you permission to translate and publish the entire book written by me, entitled: Guntur District, 1788-1848: A History of Local Influence on Central Authority in South India (Oxford: Clarendon Press, 1965) . This permission is granted under authority obtained through an Agreement between me and Oxford. University Press (OUP), dated 25 October 2010 & 28 November 2010, which releases to me the authority or right to make such an arrangement with you. Since you have received a copy of this Agreement between me and OUP, you have in your possession all terms relating thereto.*

*As you have indicated, and as I understand, you will be undertaking full responsibility for the translation and publication of the entire text of my book in the Telugu language, with the aim of making this book available f'or Telugu readers. I also understand that you are taking financial responsibility for the book and that it will be marketed for purchase, the purposes for doing so are two fold: (1) to facilitate distribution as widely as possible; and (2) to defray costs of translation and production.*

*You have also indicated a desire to make the same text available as an e-book. This is certainly acceptable to me. Yet, my concern is that, in order to become more widely available, especially for those who might have cyber equipment, that a printed paper copy be available*

*to various humble folk in the villages of Andhra Pradesh.*

*In short, as author I wish to bequeath a Telugu version of my book to all Telugu peoples. It is my honour to do so, in hopes that this work may inspire others to write similar works of local history for all districts of Andhra Pradesh. Indeed, I even dare to hope that someone will someday write a sequel to my book, covering events in Guntur country between 1848 and 1947, if not up to the present.*

*Hoping that this letter meets your needs, and contingencies, and wishing all the best for successful completion of this project, I remain*

*Sincerely yours,*

*Robert Eric Frykenberg*

## అధ్యాయం - 1

# విషయ పరిచయం

ప్రపంచ పటంలో పరిశీలిస్తే గుంటూరు జిల్లా విస్తీర్ణంలో ఉత్తర ఐర్లాండ్ కన్నా పెద్దది. వేల్స్ కంటె చిన్నది అనవచ్చు. 5795 చదరపు మైళ్ళ విస్తీర్ణంతో కృష్ణానది దక్షిణ తీరాన వుంటుంది. పల్నాడు కొండల మొదలు బంగాళాఖాతం వరకు వంపు తిరిగినట్లుండే ప్రాంతం, చాలావరకు బల్లపరుపుగా వుండే డెల్టా భూమి సముద్రతీరాన మొదలెడితే క్రమంగా ఎత్తు పెరిగి పల్నాడు కొండలు అడవుల వరకూ చూడొచ్చు. ఇసుక ప్రాంతం నుండి నల్లరేగడి వరకూ కొంత గరువు భూమి గమనించవచ్చు. పల్లపు ప్రాంతాల నుండి హఠాత్తుగా కొండలు చొచ్చుకు వచ్చినట్లనిపిస్తుంది. వీటి మధ్య పడిపోయిన కోటలు, చిన్న కట్టడాలు తొంగి చూస్తాయి. మైదాన ప్రాంతం పెద్ద కోట కొండవీడు. మరికొంత దూరంలో వినుకొండ, బెల్లంకొండ పశ్చిమ, ఉత్తర ప్రాంతాలలో గమనించవచ్చు. ఒకప్పుడు తిరుగులేని యీ మూడు కోటలు తరువాత పేలవంగా మారాయి.

గుంటూరు సంపన్న ప్రాంతం. పుష్కల పంటల జిల్లా. సంవత్సరం పొడవునా పచ్చని చేలతో నేల కనువిందుగా వుంటుంది. పంటకాలవల

వలన, చెరకు, వరి, తదితర పంటలు బాగా వృద్ధి చెందాయి. పొగాకు పొలాలు అమెరికా, బ్రిటన్ విదేశీ మారక ద్రవ్యాన్ని ఆకర్షించాయి.

సరుకు రవాణా కాలవల ద్వారా జరిగేది. లోపలి ప్రాంతాల నుండి రోడ్లన్నీ గ్రాండ్‌ట్రంక్ రోడ్డుకు కలిశాయి. ప్రధాన రైల్వేదార్లు బెజవాడ దగ్గర చిన్న మార్గాలను కలిపాయి. జిల్లాలో పారిశ్రామిక కూడళ్ళు జనాభా కేంద్రాలన్నీ దేశంలో మిగిలిన ప్రాంతాలకు కలిశాయి. గుంటూరులో మెడికల్ కాలేజీతో సహా అనేక కళాశాలలున్నాయి. పెద్ద హాస్పిటల్స్ ఉన్నాయి. నాగార్జున సాగర్ ప్రాజెక్టు వలన గుంటూరు పారిశ్రామిక కేంద్రం అయింది.

(గుంటూరు జిల్లా గణాంక అట్లాస్ - 1360 ఫస్లి (1950-1951) (హైదరాబాద్ ఆంధ్రప్రదేశ్) స్టాటిస్టికల్ అబ్‌స్ట్రాక్ట్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ (హైదరాబాద్ 1958 - రిఫరెన్స్ చూడండి.)

కాని కంపెనీ వారు పరిపాలించిన రోజులలో గుంటూరు లేదు. ఎండిన భూములు, దారుణ స్థితిలో జనం వుండేవారు. చోళ రాజుల కాలం నాటి కాలవలు ఎండిపోయాయి. చెరువులు యింకిపోయాయి. కరువులు, వరదలు, మార్చి మార్చి వచ్చేవి. ప్లేగు, కలరా ముమ్మరంగా బాధించింది. ఇవి చాలవన్నట్లు, మధ్యలో గాలివానలు, ఉప్పెనలు, మిడతల దండుతో జనం సతమతమయ్యారు. రోజులు మెరుగుగా ఉన్నాయనుకున్నప్పుడు సైతం జనాభా చాలా స్వల్పంగా వుండేది. (1961లో 3,009,997 వుంటే 1847లో 415,599 మాత్రమే వున్నాయి.

చిన్న పెద్ద గ్రామాలు కలుపుకొంటే, ఒక వెయ్యి వూళ్ళలో జనం నివసించారు. ఉప్పు కొఠారులు, బెస్త, నౌకాయాన గ్రామాల స్థానంలో వ్యవసాయ గ్రామాలు వచ్చాయి. వాటి చుట్టూ చేనేత వాణిజ్యం, తోటల

పెంపకం, తీర్థయాత్రాస్థలాలు, ప్రభుత్వ సేవకులుండే కేంద్రాలు వచ్చాయి. మైదాన ప్రాంతాల్లో పరిస్థితి అలాగుంటే, మెట్ట ప్రాంతాల్లో గనులు, పొలాల్లో పనిచేస్తూ చెదురు మదురుగా కుదురుకున్నారు.

1833లో గుంటూరుకు పెద్ద కరువు వచ్చింది. దాంతోపాటే అంటురోగాలు, దోపిడీలు చుట్టుముట్టగా, రెండు దశాబ్దాలు ఆ పరిస్థితి కొనసాగింది. ఎందరు మరణించారో మరెందరు పారిపోయారో లెక్కలేదు. 1832-1835 మధ్య జనాభా సగం, తగ్గింది. మూడొంతుల పశు సంపద అంతమైంది. పరిస్థితిని కళ్ళారా చూచిన వారి వర్ణన యిది.

మద్రాసు ప్రెసిడెన్సీలో చాలా ప్రాంతం కరువుకు గురైంది. పేదవారిని వుదారంగా ఐరోపావారు ఆదుకున్నారు. కాని రోజూ వందలాది మంది చనిపోయారు. ఆకలితో హతమయ్యారు. మృతులను పోగు చేయడానికి వందలాది దృఢకాయ పోలీస్‌ను పెట్టినా, యింకా మిగిలిపోగా, కుక్కలు, గద్దలు, డేగలు పీక్కుతిన్నాయి.

(కల్నల్ వాల్టర్ కాంప్‌బెల్ - మై ఇండియన్ జర్నల్, ఎడిన్‌బరో 1964 పేజి 424, గార్డన్ మెకంజి - మాన్యుయల్ ఆఫ్ కృష్ణా డిస్ట్రిక్ట్ (మద్రాసు -1883) పేజి.113)

కరువుకు తోడు పెనుగాలులు, తీవ్ర ఎండలు, వాటి వెంట కలరా, ప్లేగు దాపురించాయి. ఆరోగ్యవంతులెక్కడా కనిపించలేదు. (బ్రూస్ - ఆగస్టు 1836).

కనీవినీ ఎరుగని పరిస్థితి మద్రాసు ప్రభుత్వాన్ని కలవరపరచింది. పెద్ద మొత్తంలో రెమిషన్ యిచ్చి, సహాయ కార్యక్రమాలు తలపెట్టారు. ధాన్యం దిగుమతి చేసుకున్నారు. వైద్య సహాయం పెంపొందించారు. జిల్లా నుండి జనం తరలిపోకుండా ఆపే ప్రయత్నం చేశారు. జనం

లేకుంటే భూమి సాగు జరగదని భావించారు. పంట కాల్వలు, చెరువులు, రోడ్లు, వంతెనలు రిపేర్లు ప్రజా కార్యక్రమాలు బాగా సమకూర్చారు. సహాయం మంజూరు చేయడంలో ఇతోధికంగా తోడ్పడ్డారు.

(జమాబంది నివేదిక ఫసలి 1242 పేరా 2. అక్టోబరు 1833 - జూన్ 1835 ప్రొసీడింగ్స్ - సంప్రదింపులు, జులై 24 1835)

కరువు నుండి తేరుకోవడం మందకొడిగా సాగింది. అప్పుడే మరికొన్ని సమస్యలు ఎదురయ్యాయి. సంప్రదాయం నుండి ఆధునిక రీతులకు గుంటూరు మారుతున్నది. దీనివలన కొన్ని బాధలు ఎదురయ్యాయి. ఉపయోగాలు యింకా ఆమలులోకి రాలేదు. పాత వ్యవస్థ కూలిపోతూ, స్తంభించి కనిపించింది. కొత్త వ్యవస్థ మరో 20 ఏళ్ళకుగాని స్పష్టంగా రాలేదు. మార్పులు జరిగాయి. వృత్తులలో చలనం జరిగింది. సాంఘిక వ్యవస్థ గందరగోళం అయింది. సంబంధాలు దెబ్బతిన్నాయి.

బ్రిటిష్ పాలనకు ముందు 10వేల ప్రాంతీయ సైన్యం, 10 వేల సిబ్బంది జమీందార్లకు వుండేది. సాధ్యమైనంత వరకు సైనికావసరాలు స్థానికంగా సమకూర్చలేదు. పరిస్థితులు అస్థిరంగా వుండడంతో, అధికారులు, సిబ్బంది విచ్చల విడిగా ఖర్చుబెట్టడం, కొనుగోళ్ళు చేయడం స్థానికంగా సేవల్ని వినియోగించడం జరిగింది. జమీందార్లు తమ విలాసాలకు ధనం వాడారు.

సిలోన్, బర్మాల నుండి ఆభరణాలు, కాశ్మీర్ నుండి శాలువాలు, అరేబియా గుర్రాలు, కాబూల్ నుండి ఒంటెలు, మైసూరు నుండి ఏనుగులు, కాశీ నుండి బంగారు గొలుసులు, గుజరాత్ నుండి వెల్వెట్, యూరోప్ నుండి గడియారాలు, అద్దపు పరికరాలు, ఆయుధాలు తెప్పించుకున్నారు. స్థానిక మగ్గాలపై తయారైన వస్త్రాలు ఎగుమతి

అయ్యేవి. భూమి మీదుగా చేరవేసే వస్తువులపై లాభాలు బాగా వుండేవి. జమీందార్ల, నవాబుల పథకాలకు, బాధ్యతారహిత సాహసాలకు రుణాలను అందించిన ఐరోపావారు, ముస్లింలు, కోమట్లు, సిక్కులు, ఆర్మీనియన్లు విపరీతంగా వడ్డీలు రాబట్టారు.

(ఎస్.వి.కె.రావు - సోషల్ అండ్ ఎకనమిక్ కండిషన్స్ ఇన్ గుంటూరు జిల్లా - అనుబంధం గోల్డింగం నివేదిక 1839 డిసెంబరు 13).

1837 నాటికి యీ పరిస్థితి మారింది. సిపాయిలు కొద్దిమంది ప్రశాంతంగా, ఆవల శిబిరాలలో వుండేవారు. వారి జీతాలు, పెన్షన్ భద్రంగా వున్నందున నెలకు వచ్చే 7 రూపాయలలో పొదుపు చేసేవారు. సైనికులుగా, పోలీస్‌గా యిమడలేని అనేకమంది ముస్లింలు, రాజులు, తెలగాలు, కమ్మ, రెడ్డి వారంతా వ్యవసాయంలో ఎక్కువగా కుదురుకున్నారు. కొందరు వాణిజ్యంలో వుండేవారు. జమీందారీ వ్యవస్థ పతనం అయింది. ఆర్థికపరమైన అంచనాలు దెబ్బతిన్నాయి. వాణిజ్య వర్గాలు చిన్న మొత్తాలకు పోటీపడ్డారు. రహదార్ల పొడవునా సుంకాల చౌకీలు కాస్తా కాలందోషంపట్టి పోయాయి. వీటితో సంబంధంవున్న వసతి గృహాలు, రవాణా పారిశ్రామిక వర్గాలు కూడా హరించాయి.

వస్త్రాలకు బాగా గిరాకీ వుండేది. కాని విదేశీ మార్కెట్లకు పంపే బట్ట తగ్గిపోగా, మచిలీపట్నంలో ఎగుమతి వస్త్రాలు లేకుండా పోయాయి. (పర్షియా అఖాతం వైపు పంపే వస్త్రాలు ఏడాదికి 50 లక్షల నుండి లక్షన్నర వరకు పడిపోయింది) గుంటూరు మార్కెట్‌కు యూరోప్ వాణిజ్య వర్గాలు యింకా రావలసి వుంది. వారు ఇతర చోట్లకు రావడంతో స్థానిక మార్కెట్ కుంటుపడింది. దిగుమతి కంటె, స్థానికంగాను ఎగుమతులే హెచ్చుగా సాగాయి. బయట వస్త్రాలకు గిరాకి పెరిగింది.

స్థానికంగా రాజంపేట, వేటపాలెం, మంగళగిరి వంటి నగరాలలో తయారయ్యే వస్త్రాలకు మార్కెట్ లేకుండా పోయింది. జిల్లాలోకి బంగారం వెండి మార్కెట్లు వచ్చి పడ్డాయి. (గోల్డింగం నివేదిక) స్థానిక సావుకార్ల నుండి హుండీల పద్ధతిలో డబ్బు వేసి, తీసే ఆచారం పోయింది. యూరోప్ వడ్డీ వ్యాపారస్తుల ప్రవేశం జరగకముందే, దేశీయ జనాభా తొలుతగా ఎకౌంటెంట్ జనరల్ ద్వారా సేవలు పొందే ఆచారం మొదలైంది. అప్పటి గుంటూరులో మరే బ్యాంకింగ్ విధానమూ లేదు. (గోల్డింగం నివేదిక).

గుంటూరు సంధి కాలంలో ప్రవేశించింది. కనుక సంపద, జీవన ప్రమాణం అంచనా వేయడం కష్టం. కొన్ని వాస్తవాలు తొంగి చూడడం వలన, సూచన ప్రాయంగా వినియోగస్థాయి చెప్పవచ్చు. పిండారీ దాడులు 1817 వరకూ (1788లో ఆరంభమై) సాగడం వలన శాంతియుత పరిస్థితులు దెబ్బతిన్నాయి. అది మినహాయిస్తే, బ్రిటిష్‌వారు రాకముందు శాంతియుతంగానే సాగిందనవచ్చు. కరువు, వరదలు వచ్చినపుడు ధరలు మారిపోయాయి. జమీందార్ల వద్ద వున్న ఉన్నతోద్యోగులకు సైతం అందుబాటులో లేని, బియ్యం, అందరికీ లభించాయి. నగరాలలో, పెద్ద గ్రామాలలో బియ్యం లభించింది. చింతపండు, వక్కలు, ఎండు కొబ్బరి, చక్కెర, తమలపాకు, పొగాకు, నల్లమందు అందుబాటులోకి వచ్చాయి. పేద రైతులు సైతం మంచి బట్టలేసుకుని, సరుకులు దాచుకోగలిగారు.

(ఈస్ట్ ఇండియా కంపెనీ వలన పేదలకు బియ్యం లభించడం జరిగిందని చెప్పుకుంటారు. ఆనకట్ట వలన బియ్యం లభించింది. వరి పంటను ఓక్స్, విచ్ (1811-31) బాగా ప్రోత్సహించారు) 19వ శతాబ్దం వచ్చే నాటికి జనాభా సమృద్ధిని అనుభవించారు. అయితే సాంఘిక

వ్యవస్థలో వివిధ దశల్ని చూడాలి. స్తంభించిన పరిపాలన సమాజంలో జీవనాడుల్ని కుంగదీశాయి.

ఈ రచనలో అది ప్రధానాంశం.

ప్రకృతి విపత్తులు కారణంగా జనాభా పెరగలేదు. వీటి వలన బాధలకు గుర్రైన వారు నిరుపేదలే. గుంటూరు జిల్లాకు కూలీల కరువు ఎదురైంది. వారి పరిస్థితి మెరుగుపరచాల్సి వచ్చింది. అయినా పేదల స్థితి మారలేదు. సొంతకాళ్ళ మీద నిలిచే స్థితి అతనికి కలగనివ్వలేదు. గ్రామంలో సంపన్నుల ప్రవర్తన అలా వుంది.

(గోల్డింగం నివేదిక పేజి 51)

సన్నకారు రైతులకు ప్రభుత్వం అందించిన సహాయం వారికి చేరకుండానే హరించింది. (తక్కువ రుణాల గురించి తాలూకాల విషయం చర్చించినచో విపులంగా వుంది).

గ్రామాలలో సేవల్ని బానిసల స్థాయిలో అట్టిపెట్టారు. విత్తనాలు, పరికరాలు నిమిత్తం వుత్పత్తినంతటినీ గ్రామ షావుకార్లకు దత్తత చేసేవారు. తన కింద పని చేసేవారి పండగలు అవసరాలు ఆదుకుంటూ, మానసికంగా వారు కుంగిపోకుండా చూసేవారు.

చిన్న రైతులు తమ చేయి జారకుండా గ్రామ పెత్తందార్లు జాగ్రత్త పడేవారు. జమీందార్ల భూముల్ని అమ్మడానికి వీల్లేదన్నారు. నదీతీరాల్లో వుండే చిన్న కమతాలు సేరి భూములు కొద్దిగా వున్నా, విపరీతమైన ఖరీదుండేవి. వివిధ ఇనాం భూముల్ని సాగుచేయాల్సిన పరిస్థితి కల్పించారు. భూమి వ్యవసాయం వలన అది వదిలి పోవడానికి వీల్లేని స్థితి కల్పించారు. రుణాలు దారుణ వడ్డీలతో వుండేవి. పైగా పాలనా జాప్యం చెప్పనలవిగానంతగా అడ్డు పడేది. కోర్టు కలహాలు, వ్యాజ్యాలు,

చిక్కులతో చట్టాలు, స్టాంపు పేపర్లు, ఫారాలు అన్నీ కలసి జాప్యాన్ని పెంచాయి.

(గోల్డింగం నివేదిక పేరా 106)

కూలీపనికి నాలుగు విధాల చెల్లింపు వుండేది. కొందరికి పండించిన ధాన్యంబట్టి 5 తూములు, మరి కొందరికి రోజూ వుప్పుడు ధాన్యం, 8 రూపాయలు లేదా 4 రూపాయలు రెండు పంచెలు, ఒక పై పంచె, తలపాగా, జత చెప్పులు లభించేవి. తెలుగు సంవత్సరాదినాడు యీ చెల్లింపు వుండేది.

పగలు పనిచేసేవారు మార్కెట్ ధరబట్టి చెల్లింపు స్వీకరించేవారు. కలుపు తీసేవారికి తక్కువ, దున్నేవారికి, విత్తేవారికి నూర్పిడికి ఎక్కువ చెల్లింపు వుండేది.

పురుషులకు, స్త్రీలకు, పగలంతా పనిచేస్తే ధాన్యం కొలిచేవారు. స్త్రీలకు 1 నుండి 1.5 మంచలు యిస్తే, పురుషులకు 1 నుండి 1.2 మొదలు 2 వరకూ యిచ్చేవారు. తూములో 8వ వంతు మంచ అంటారు. మట్టి గోడలు కట్టేవారు, ఉప్పు తయారు చేసేవారు. కట్టెలు కొట్టేవారు. నీళ్ళు తోడిపోసేవారికి రోజుకు 1.5 నుండి 2.5 మంచల ధాన్యం తూచి యిచ్చేవారు.

(గోల్డింగం నివేదిక - 94-95, పేరాలు 25-44, 9 పేజి కులాల వారీగా వృత్తి నిపుణులు - బట్టలు నేయడం, కుట్టుపని, తోళ్ళపని యిత్యాదులు వుండేవి. ఇంకా ప్రభుత్వ ఉద్యోగాలు, సైనికులు, వివిధ కులాలలో వున్నారు. 1837 పూర్వం 40 ఏళ్ళపాటు పెద్దగా వేతనాల మార్పులేదు.

మరోవైపు బ్రిటిష్ పాలకులు, వారిని సేవించే భారతీయులున్నారు.

ఈ ఆంగ్లో ఇండియన్ రాజకీయనాయకత్వం గుంటూరులో బాగా పెత్తనం సాగించింది. వీరు స్థానిక నాయకులతో పొత్తు పెట్టుకోవడమేగాక, దక్షిణాదిలో బాగా నిలదొక్కుకున్నారు. ఆదొక పెత్తందారీ వర్గం అయింది.

భారతీయ ఉద్యోగులతో పోల్చితే, యూరోప్‌వారు చాలామంది వుండేవారు. గ్రామనాయకులను మినహాయిస్తే, మద్రాసు రాష్ట్రంలో 19వ శతాబ్దంలో మొదటి భాగంలో 1:4 చొప్పున భారతీయులు, బ్రిటన్లు వుండేవారు. సైనికుల్ని మినహాయిస్తే, ఒక భారతీయుడికి 100 మంది బ్రిటన్లు వుండేవారు. భారతీయులలో 170 నుండి 190 వరకు ఉద్యోగులుంటే బాగా తక్కువ వుండేవారు. గ్రామీణ ప్రాంతాలలో యీ తేడా యింకా హెచ్చుగా వుండేది. జమీందార్లకు చిన్న వ్యవస్థ చాలు. ప్రెసిడెన్సీలోనే ఎక్కువగా యూరోపియన్లు వుండేవారు.

1830లో గుంటూరు జిల్లాలో ముగ్గురు యూరోపియన్లకుగాను, 1368 భారతీయులున్నారు. గుంటూరులో సాధారణంగా నాలుగు నుండి ఆరుగురు బ్రిటిష్ అధికారులుండేవారు. (ఈ లెక్కలన్నిటికి హౌస్ ఆఫ్ కామన్స్‌కు యిచ్చిన వివరాలు ఆధారం. పార్లమెంటరీ పేపర్స్ (లండన్ 1853).

హెన్రీ రికెట్స్ - రిపోర్టు ఆన్ ది విజన్ ఆఫ్ సివిల్ సర్వెంట్స్ అండ్ ఎస్టాబ్లిష్‌మెంట్. 1వ భాగం - కలకత్తా 1858, పేజి 321)

గుంటూరులో సమాజంలో పరిపాలన అంతా కులాల ఆధిపత్యంతో వుండేది. పై స్థాయిలో దేశస్థ బ్రాహ్మణులుండేవారు. ఆ తరువాత వరుసగా బ్రాహ్మణులు, ముస్లింలు, ఇతర పై కులాలవారుండేవారు. అంటరాని కులాలు అట్టడుగున వున్నారు. గౌరవప్రదమైన భారతీయులు వారి కులంతో గూడు కట్టుకుని వుండేవారు. ఉన్నత స్థాయిలో కొద్దిమంది

ఇంగ్లీషు చదివి, బ్రిటిష్ వారితో సంబంధాలు పెట్టుకున్నారు. మరాఠా బ్రాహ్మణులు బ్రిటిష్ వారివలె క్రింది వారికి దూరంగా వుండేవారు. కంపెనీ పాలనలో యూరోప్ వారి వలన బ్రిటిష్ అధికారులు వారి కుటుంబాలు తట్టుకోగలిగాయి. లేకుంటే జిల్లాలో వారికి దుర్భరంగానే వుండేది. ఇంచుమించు అదొక శిక్ష ప్రాంతంగా భావించేవారు. సమాధులు పరిశీలిస్తే పిల్లలు, స్త్రీల పేర్లు కనిపించేవి. దుర్భర స్థితికి అదొక తార్కాణం. గుంటూరు వెళ్ళడానికి బ్రిటిష్‌వారు యిష్టపడేవారు కాదు. గుంటూరుపై అదుపు, సమస్య అయి కూర్చుంది. కనుక నష్టపరిహారంగా గుంటూరు కలెక్టరుకు సాలీనా 2 వేల రూపాయలు ప్రత్యేకంగా యిచ్చేవారు.

గుంటూరు జిల్లా పరిస్థితి పరిశీలించడానికి 1845లో ఒక కమీషనర్‌ను పంపారు. ఆ నివేదిక ప్రకారం - నిజాం పాలించిన కాలం కంటే, బ్రిటిష్ పాలనలో పరిస్థితి బాగా దిగజారింది.

(గమనిక : యూరోపియన్ సైనికులు10 నుండి 14 వేలుండేవారు. భారతీయులు 15 నుండి 25 వేలున్నారు. 1838లో భారత సివిలియన్లు 40 వేలున్నారు. 1858లో 35 వేలున్నారు. సివిల్ ఉద్యోగులు 200 నుండి 250 వరకూ వున్నారు) ఈ దారుణ పరిస్థితులు యీ గ్రంథంలో పరిశీలించాను.

ఇలాంటి చారిత్రక అధ్యయనం చేయాలంటే కేవలం విశ్లేషణ చేసి స్థానిక పాలన ఒక చోట ఎలా వుందో చూస్తే సరిపోదు. సామాజిక సంబంధాల లోతుపాతులు పరిశీలించక తప్పదు.

ఇంగ్లీషువారి శక్తివంతమైన పాలనను స్థానిక నాయకత్వం ఎలా జీర్ణించుకున్నది? బలమైన ప్రభుత్వం ఒకవైపున, స్థానికులకు రాయితీలు

మరో పక్క ఎలా తూగాయో చూడాలి. ప్రభుత్వ పాలనలో యిచ్చి పుచ్చుకునే ధోరణి, వ్యవస్థను అట్టి పెడుతూనే మార్పులు చేయడం, చూడవలసి వుంది.

రాజ్యాధికారాన్ని ఎలా చెలాయించారు? జిల్లా ప్రజలకు, పాలనకు సర్దుబాట్లు చేస్తూ బ్రిటిష్ వారి ప్రభుత్వం ఎలా సాగింది చూడాలి. ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులు సమర్ధవంతంగా ప్రజల సమస్యలను పరిష్కరిస్తూనే వారి అవసరాలను ఏ విధంగా ప్రజల దగ్గరకు తీసుకెళ్ళి, విధానాలను అమలు చేయడంలో కలెక్టర్ పాత్ర ఏమిటో గమనించాలి.

గుంటూరు జిల్లా పాలనలో పరిపాలన నిర్వాహకులు యాజమాన్య డైరెక్టర్లుగా సాగిన విధానం గమనార్హం. ఇందులో రెండు లక్షణాలు కనిపిస్తాయి.

మొదటిది : ప్రభావం : కనిపించని తీరులో అధికారాన్ని వినియోగించడం. సూటిగా పెత్తనం చేయకుండా, బలవంతంగా జరపకుండా ఫలితాల్ని రాబట్టడం. సాంఘిక వర్గాల (కులాల) పరంగా లోలోపల తెచ్చిన వత్తిడి, నైతిక వర్తన, సంపద, కొలమానాలకు అందని తీరులు యీ ప్రభావంలో వున్నాయి. నాయకత్వానికి తగిన అనుపానులతో కూడిన ప్రభావం కావాలి. గుంటూరు జిల్లాలో స్థానిక ప్రభావాల బలం, నాయకత్వం దానికి జతగూడిన రీతి చూడాలి.

గ్రామ నాయకుల ప్రభావం, సంపన్నుల ఆధిపత్యం, కొత్త జిల్లా అధికారులు, ఒకవైపు సంప్రదాయం కొట్టి పెడుతూనే, మార్పు తెచ్చే పద్ధతుల గమనార్హం. ఈ నాయకత్వం తమ ప్రభావాన్ని ఎలా ప్రయోగించినట్లు? పిటిషన్లు, లంచాలు, మత వత్తిడి, ఆంక్షలు, బెదిరింపులు, అన్నీ పాలనారీతులలో వినియోగించారు.

రెండవది : విధానం : ఇది నిర్వచనంలో యిమడదు. ఎంత జాగ్రత్తగా, పొందికగా చూద్దామన్నా కుదరదు. విధానం ఒక నిర్ణీత పద్ధతిలో ఆమలు జరగాలి. పాలించే తీరిది. యాజమాన్యం కొన్ని లక్ష్యాల ఆధారంగా సాగిపోతుంది. విధాన నిర్దేశకులకు ఉన్నత ఆదర్శాలుండొచ్చు. అదంతా నిర్ణయాలు తీసుకోవడం, అమలు చేసే తీరునుబట్టి సాగుతుంది. అసలు ఎలాంటి విధానం లేకపోవడం కూడా ఒక విధానమే! ప్రభుత్వం ఏ స్థాయి వారైనా సరే వారి పద్ధతులవలన అంతా స్తంభించి పోతుంది.

రెవిన్యూ విధానంలో రెవిన్యూ రావడం కద్దు. సరైన రెవిన్యూ తీరును అట్టిపెట్టి పెంపొందిస్తారు. కాని గుంటూరులో కలెక్టరేట్ రెవిన్యూ పాలనతోబాటు, సేవలందించడం, పాలనా తీరు కూడా చేబట్టింది. రెవిన్యూ విధానంలో సాధారణ పాలన కూడా చేరిందన్నమాట. రెవిన్యూ విధానంలో పనులన్నీ కేంద్రీకృతం అయ్యాయి. అధికారం గుప్పెట్లో పెట్టుకున్నారు. ప్రమోషన్లు, ఎంపిక, తొలగించడం, క్రమశిక్షణ అన్నీ యీ విధానంలోనే వున్నాయి.

19వ శతాబ్దారంభంలో బ్రిటిష్‌వారు రెండు పరిపాలనా విధానాలు అవలంబించారు. ఒక దానిలో జమీందారీ పద్ధతి ప్రకారం ప్రభుత్వపరమైన చట్ట హక్కుల్ని సంప్రదాయ సంపన్న వర్గాలకు కట్టబెట్టారు. గుంటూరు జిల్లాలోని యీ పద్ధతి మిగిలిన ప్రాంతాలకు విస్తరించకుండా ఆపేశారు.

రైత్వారీ పద్ధతిలో థామస్ మన్రో ఆలోచనను పాటించారు. కేంద్ర అధికారాలన్నీ ప్రభుత్వమే అట్టిపెట్టుకున్నది. స్థానిక నాయకుల అణచివేత నుండి వాణిజ్య వర్గాల నుండి జనాన్ని కాపాడే ప్రయత్నం చేశారు. చాలా చర్చల అనంతరం లండన్‌లో యీ నిర్ణయం తీసుకున్నారు. అయినా 1818 నాటికి డైరెక్టర్లకు యింకా సందేహాలు

తీరలేదు. (టి.హెచ్.బీగల్‌హాల్ : థామస్ మన్రో అండ్ డెవలప్‌మెంట్ ఆఫ్ అడ్మినిస్ట్రేటివ్ పాలసీ ఇన్ మద్రాసు స్టేట్ 1792-1818) కేంబ్రిడ్జ్ యూనివర్సిటీ, పి.హెచ్.డి.థీసిస్ 1960, పేజి 10-21)

ఈ రచన సాగే నాటికి యింకా ఆ సందేహాలన్నీ కాసాగాయి. రెండు విధానాలు వైవిధ్యం వలన తరచు, విధానాల అమలు స్తంభించింది. మద్రాసులో వెలస్లీ పరిశీలనగా యీ కారన్‌వాలీస్ తీరు వుండగా, అటు మన్రో పద్ధతి సైతం అమలులోకి పూర్తిగా రాలేదు. ఒకే జిల్లాలో రెండూ వుండేవి. పరస్పర విరుద్ధంగా రద్దు చేసుకునేవి. గుంటూరులో బ్రిటిష్ పాలన స్తంభించడానికి యిదొక ప్రధాన కారణం.

(పి.బి.స్మోలెట్ సివిల్ అడ్మినిస్ట్రేషన్ ఇన్ మద్రాస్ 1858. వీరు జమీందారీ పద్ధతి సమర్థించారు. జె.కార్టన్ ప్రకారం మన్రో రైత్వారీ పద్ధతి మంచిది. లెటర్ టు లో ఆన్ ది కండిషన్ ఆండ్ రిక్వైర్ మెంట్స్ ఆఫ్ మద్రాసు ప్రెసిడెన్సీ (1853) కలకత్తా రివ్యూ - వాల్యూం 17 పేజి 282-339).

ఈ అధ్యయన కాలంలో బ్రిటిష్‌వారు పూర్తి పెత్తనం స్వీకరించారు. రెండు దశాబ్దాలపాటు శాంతి నెలకొన్నది. బ్రిటిష్‌వారు ఎదురులేని పెత్తందార్లుగా పైకి అగుపించినా లోన వారి ఆధిపత్యాన్ని ఎదురించక పోలేదు. రాజ్య పాలనా తీరు బ్రిటిష్ అధికారులను కలవరపరచింది. ఒక వైపు సాంఘిక జీవనం సమాజంలో కలగాపులగం ఆసక్తిని పెంచగా మరోపక్క పూర్తి పెత్తనం వహించలేకపోయారు. గుంటూరు జిల్లావంటి చోట్ల బాగా యిబ్బందులు ఎదుర్కోవలసి వచ్చింది. కేంద్ర పెత్తనం, పట్టు బిగియకపోతే గుంటూరు వంటిచోట్ల పరిస్థితులు మరో తీరుగా సాగేవి.




భారతదేశంలో గుంటూరు జిల్లా




1788-1859 నాటి గుంటూరు జిల్లా

## అధ్యాయం - 2

# స్థానిక బలం లోతుపాతులు

## (1788)

బ్రిటిష్ రాజ్యం దేశంలో అడుగిడిన తరువాత గుంటూరు జిల్లాలో పెత్తందారీ వర్గాలు తమను ఎలా భావించాయో తెలుస్తున్నది. ఇందుకుగాను, తాళపత్రాలు రాగి రాతి ఫలకాలు చూడాల్సిందే. ఆనాటి నుండీ లభించిన అనేక ఆధారాలను చూడడం కుదిరే పని కాదు. గ్రామ నాయకత్వం ఎలా బలంగా వుండేదో, వారి స్వభావం ఏమిటో తెలుసుకోవడానికి సుదీర్ఘ అధ్యయనం అవసరం లేదు. ఈ సంప్రదాయ బలం ఏమిటో యీ పుస్తక పరిశీలనలో ఉంది.

గుంటూరు స్థానిక చరిత్రలలో వివిధ సంస్థల సామాజిక వర్గాల సమాచారం సమృద్ధిగా వుంది. అవి వెలువడిన గ్రామాలు కొండవీడు, చేబ్రోలు, పాత గుంటూరు. కనుక వాటి విలువ యినుమడించింది. అప్పుడప్పుడు లభించిన మతపర సమాచారం, జానపదాలు మనకు యింకా లోతుపాతులు తెలిపాయి. గ్రామాలలో లభించిన విశేషాలన్నీ బ్రిటీష్‌వారి రాకను పెత్తనాన్ని గురించి యించుమించు ఒకే తీరుగా పేర్కొన్నాయి. జేమ్స్‌గ్రాంట్ "పొలిటికల్ సర్వే ఆఫ్ ది నార్తరన్ సర్కార్స్"

వంటివాటికి సరిపోయాయి. (ఎలియట్ - "ఆన్ ది ఆరిజన్ ఆఫ్ విలేజ్ అకౌంటెంట్స్" లోకల్ హిస్టరీ 1788-1817 మధ్య ఎలియట్ రచనలు లభించాయి. తెలుగు నుండి మరాఠీకి, అందులో నుండి ఇంగ్లీషుకు ఎప్పుడు అనువాదం అయ్యాయో తెలుస్తున్నది).

గ్రామాలలో తప్పుడు రికార్డుల వలన రెవెన్యూలో న్యాయవ్యవస్థలో గందరగోళం నెలకొన్నది. అది తొలగించడానికి తొలుత ప్రయత్నించిన ధరణికోట పల్లవ రాజు మూకంటికి ఖ్యాతి దక్కాలి. అతని పాలనాకాలం నిర్దుష్టంగా లేదు. (ఎలియట్ అనేది 'ఆరిజన్ ఆఫ్ విలేజ్ అకౌంటెంట్స్' లోకల్ హిస్టరీ రాజుకు ప్రధానంగా యిబ్బందులు పెట్టినవారు బంగారపు పనివారే (కంసాలి). అప్పట్లో గ్రామ పాలనలోకి కాశీనుండి బ్రాహ్మణులను తెచ్చారు.

కొత్తపద్ధతిలో ఉత్తరాదిన పోలిన జాజ్ మణి రీతిలో గ్రామం చాలావరుకు స్వతంత్ర ప్రతిపత్తితో వుండేది. అందులో గ్రామానికి 12 మంది గ్రామాధికారుల్ని నియమించారు. సుంకాల నుండి వీరికి చెల్లింపులు వుండేవి. వీరిలో పెద్దకాపు, కరణం, పరీక్షకుడు రాజుకు జవాబుదార్లు. వారి తరువాత, పురోహితుడు, కుమ్మరి, చాకలి, వడ్రంగి, కంసాలి, మంగలి, నీళ్ళు మోసేవారు, కాపలాదారు, చిల్లరపనులు చేసేవారు. మాల మాదిగ కుటుంబాలు యీ చిల్లర పనులు చేబట్టేవారు. సమయం వస్తే గ్రామస్తులలో కలహాలు కుటుంబరీత్యా కులం వారీగా పెద్ద మనుషుల సభ తీరుస్తుండేది.

గ్రామ లెక్కలు పవిత్రం, రహస్యంగా భావించిన కరణాలకు అదొక కుటుంబ వ్యవస్థగా ఎంతో ప్రభావాన్ని కనబరచింది. ఎప్పుడైనా ఒకరికి మించి కూడా గ్రామకరణాలు ఉండేవారు. ఈ కరణం కుటుంబాలు

యిరుగు పొరుగున గ్రామకరణాలతో చుట్టరికాలు పెట్టుకునేవారు. ఈ సంబంధం కారణంగా కరణాల పట్టు కట్టుదిట్టంగా వుండేది. కరణాల కుటుంబ కలయికవలన, స్థానిక పట్టు పెంచుకున్నారు. పై అధికారుల దాష్టీకాన్ని ఎదుర్కొనేవారు పైగా వారిని చెడగొట్టి, ప్రభావితం చేయగలిగారు. బంధుత్వ కలయికతో పై అధికారుల పెత్తనాన్ని తగ్గించగలిగారు. ప్రాచీనకాలం నుండీ కేంద్రపెత్తనం కట్టుదిట్టంగా వుండాలంటే, కరణాల సామర్థ్యం, సహకారంపైనే వుండేది. ఇలా కరణాలు రహస్యంగా కూడబలుక్కుంటే, పరిష్కారాలు బాగా దెబ్బతినేవి. ఒకటి రెండు గ్రామాలలో అయితే యీ కరణం పెత్తనం అణచేవారు. అయితే లెక్కల అవసరం వుండేది గదా! మిగిలిన గ్రామాలలో కరణాలు మౌనంగా తమ ప్రభావాన్ని చూపేవారు.

లోగడవున్న అరవలు, జైనులు స్థానే కరణాల స్థానంలోకి బ్రాహ్మణులు వచ్చారు. బ్రాహ్మణులలో నియోగులు బాగా అజమాయిషీ చేశారు. కొండవీటి సీమలో గజపతి మంత్రి కరణాల చేతిలో 1144 (క్రీ.త.) భరించరానంతగా ఓడిపోయాడు. అందుకని ఆరువేల నియోగులన్నాడు. అలా వచ్చింది ఆ నానుడి. ఆ చంద్రతారార్కం కరణాల వ్యవస్థ వుంటుందని త్రిలింగ ప్రాంతంలో పేరొచ్చింది.

(ఎలియట్ - వడ్లమూడి కామరాజు అనువదించిన దండకవిల - రేపల్లె తాలూకా పేటూరు గ్రామం - స్థానిక చరిత్ర. ఇలాంటి సంప్రదాయాలు చాలా వచ్చాయి.)

రాజకీయ పాలనలు మారుతూ వుండగా హొయసలలు, కనక పిళ్ళులు, లింగాయతలు, పాత్రులు, బడగలు, నందవారికులు, (యజ్ఞవలికులు), లింగబలిజులు, గాజుల బలిజులు, కాయస్తులు వచ్చి చేరారు.

(లోకల్ హిస్టరీ ఆన్ ది ఆరిజన్ ఆఫ్ విలేజ్ అకౌంటెంట్స్ హిస్టారికల్ మెమోర్స్ ఆఫ్ చేబ్రోలు లోకల్ హిస్టరీ పేజి 91-104) ఇలా వచ్చిన ముతాల సంఖ్య తక్కువ. చెదురుమదురుగా ఉన్న గ్రామాలలో వీరి ప్రభావం పరిమితంగా ఉండేది. అరవల్ని, జైనుల్ని తొలగించడానికి నియోగులకు 400 ఏళ్ళు పట్టింది. (ఒక్కోసారి వెయ్యేళ్ళు కూడా) క్రమంగా తమ వారి పెత్తనాన్ని విస్తరించారు.

(గోవర్ధన్ మెకంజి - ఎ మాన్యువల్ ఆఫ్ క్రిష్ణా డిస్ట్రిక్ట్ - మద్రాసు 1883) పేజి 15-38)

కేంద్ర పెత్తనాన్ని తట్టుకొని గ్రామాలు నిలిచాయి. గ్రామస్థాయికి పైనున్న సంస్థలు పెద్దగా తట్టుకోలేదు. కొత్తరాజ్యాలు వచ్చినప్పుడు, గ్రామాల కోసం, జిల్లాలకొరకు పోరాటాలు జరిగాయి. కేంద్రస్థాయిలో పెత్తనం నిలకడగానే సాగింది. ఒక్కొక్క రాజు వచ్చి తన ఆధిపత్యాన్ని చలాయించినప్పుడు ఘర్షణలు, సైనికుల సమరాలు, సంపదలు రావడం పోవడం జరిగింది. (అనేక స్థానిక చరిత్రలు యీ విషయాలు చాటాయి. ఎలియట్ లోకల్ హిస్టరి, కె.గోపాలాచారి ఎర్లి హిస్టరీ ఆఫ్ ఆంధ్ర కంట్రి 1941, మద్రాసు యూనివర్సిటీ ప్రెస్, జి.సి.గంగూలి ది ఈస్టరన్ చాళుక్యాస్ 1937, బెనారస్, కె. ఎ. నీలకంఠ శాస్త్రి - ఎ హిస్టరీ ఆఫ్ సౌత్ ఇండియా 1955 మద్రాసు, ది చోళాస్ - 1955 మద్రాసు, టి.వి.మహాలింగం - సౌత్ ఇండియన్ పాలిటి, మద్రాసు 1955).

కొన్ని గ్రామాలు కలిపి సమితి అన్నారు. సమితులను కలిపి సీమ అన్నారు. కొండవీటి సీమలో బెల్లంకొండ, వినుకొండ, నాగార్జున కొండ వున్నవి. ఇంకా నెల్లూరు, కందుకూరు, అద్దంకి, కొండపల్లి ఏలూరు

సీమలున్నాయి. ప్రతి సీమ ఒక సంప్రతి లేదా స్థలకరణం అజమాయిషీలో వుండేది.

(ఎలియట్ - కొండవీడు కంట్రి ఆఫ్ గుంటూరు లోకల్ హిస్టరీ పేజి 1-3-5)

హిందువుల పాలన ముగియక మునుపే ముస్లిం జిహాదీలు గుంటూరుపై దాడి చేశారు. వరంగల్లు రాజును ఢిల్లీ తీసుకెళ్ళారు. కొండవీటి రెడ్డి రాజుల పాలన ఒక వందేళ్ళు. జిల్లాను అస్తవ్యస్తంగా పాలించారు. రెండు శతాబ్దాల పాటు గోల్కొండ, విజయనగరం, ఒరిస్సా ప్రభువుల మధ్య పోరాట ప్రాంతంగా మారింది. 1516 తరువాత విజయ నగర సామ్రాజ్య పెత్తనం నామమాత్రం అయింది. 1579లో గోల్కొండ పట్టు చిక్కించుకున్నది. ఇస్లాం పెత్తనం వహించినా, నదీతీరాల వెంట ఘర్షణలు జరిగాయి.

(మెకంజీ చెప్పిన దానిని బట్టి హిందువులు ఆట్టే మనలేదు. వెయ్యి ఏళ్ళ నుండి వస్తున్న ఆచారాలే కొనసాగాయి. అదే గ్రామం, అదే సాగు, అవే కళలు, పరిశ్రమలు.)

గోల్కొండ నవాబు పెత్తనంలో పాలనా రీతులు మారాయి. ముస్లిం యజమానులకు దగ్గరగా వున్న వారిని బయట నుండి తెచ్చారు. వీరంతా దేశస్త, మరాఠి బ్రహ్మణులు. దక్కన్‌లో గోల్కొండ వ్యాపారులకు వీరు చేరువయ్యారు. అనేకమంది నియోగులను చంపేశారు. మిగిలిన వారిని జిల్లాలలో కీలక స్థానాల నుండి తప్పించారు. సబ్ డివిజనల్ స్థాయిలో సాయుధ బలాలు కావాలి గనుక ఒక మార్షల్ కులం స్థానే మరొకరిని పెట్టారు. వెలమల పట్ల కఠినంగా వ్యవహరించారు. వారి స్థానే కమ్మవారిని తెచ్చి పరగణాలు, సమితులు నిర్వహించే పని ఇచ్చారు. ఈ మార్పుల

వలన గ్రామాలు అట్టే మారలేదు. గ్రామస్థాయిలో నియోగి స్థానం కదిలించలేదు. (ఎలియట్ - అన్ ది ఆరిజన్ ఆఫ్ విలేజ్ అకౌంటెంట్స్ - లోకల్ హిస్టరీ పేజి 101)

జిల్లాకు ఒక ముస్లింను, ఒక దేశస్తుని పాలనకై నియోగించారు. ముర్తజాఖాన్, ఖాసా రామారావు పాలన చేబట్టి కత్తిని, కలాన్ని ప్రయోగించారు. కొండవీటి సీమను 14 విభాగాలు చేశారు. ఇందులో వినుకొండ, బెల్లంకొండ, గుంటూరు, తాడికొండ, చేబ్రోలు, పత్తిపాడు, గురిజాల, పొన్నూరు వున్నాయి. జిల్లాకు ముర్తుజా నగర్ సర్కార్ అని పేరుపెట్టారు. 12 మంది రెవిన్యూ అధికారులను, నియమించి, పరిపాలన నిమిత్తం సమితి బందీలు (నియమనిబంధనలు) జారీ చేశారు.

(ఎలియట్ - దండకవిత - కొండవీటి గ్రామం - అనువాదాలు - స్థానికుల చరిత్ర - విన్నకోట వెంకయ్య పేజి 331, సైనికాధికారి గౌరవార్థం ఆ పేరు వుండొచ్చు).

పాలనా సంబంధమైన కీలక ఉద్యోగాలకై పోటీ పడుతూనే పోయారు. కొందరికి కత్తి బలం ఉంటే, మరికొందరికి కలం శక్తి ఉంది. క్రింది స్థాయిలో, స్థానిక బ్రాహ్మణులు, ముఖ్యంగా నియోగులు ఉద్యోగ నైపుణ్యత ప్రదర్శించారు. కమ్మ, వెలమ, తెలగ, కాపు, రాజు కులాలవారు సైనికోద్యోగాలలో వున్నారు. పై స్థాయిలో యివేపనులకు ముస్లింలు, దేశస్త, వ్యాపారి వర్గాలు తలపడ్డాయి. కత్తి, కలం బలం పోటీ వివాదాస్పదంగా సాగింది. ముస్లిం పాలనలో జోక్యం చేసుకోవడం, చెప్పా పెట్టకుండా మార్చడం పరిపాటి అయింది.

ఎంపికలో కులాన్ని పట్టించుకోవడం ఒక ప్రధాన లక్షణమైంది. రాజుకు దగ్గరగా సలహాలు యిచ్చే స్థితిని బ్రాహ్మణులు కోరుకున్నారు.

ఆ విధంగా తమ చుట్టాలకు, దగ్గర వారికి ఉద్యోగాలు యిప్పించు కోవచ్చుననుకున్నారు. గ్రామాలను సరిగా పోషిస్తేగాని, రెవిన్యూ సక్రమంగా రాదు. లేకుంటే కీలక స్థానంలో వున్న వారికి స్థానం పోతుంది. కులపోటీలు మరీ గట్టిగా వున్నప్పుడు, సర్దుబాట్లు జరిగేవి. రాష్ట్రవ్యాప్తంగా హిందువులలో కుల సర్దుబాట్లు జరిగేపని కాదు. అధికారుల పీఠాన్ని కదిలించకుండానే నెమ్మదిగా లోపాయికారీగా పదవులు స్వీకరించారు. అధికారం బలహీన పడితేనో, కులంలో కీలక వ్యక్తుల దార్ఢ్యం ఎక్కువగా వుంటేనో విచ్ఛిన్న వ్యవస్థకు దారి తీసేది. నిరంకుశ పాలనపై అలాంటి వ్యవస్థ సర్దుబాటు ప్రదర్శించేది.

గుంటూరులో అలాంటి పాలన సాగిన తీరు పరిశీలించాలి. ముస్లిం పాలకులకన్నా, దేశస్త ఖాసారామారావుకు పాలనపై పట్టు వుండేది. కొండవీటి పతనానికి ముస్లింలు కారణం కాదు. విలువైన కోట గమనిస్తే, ఏనుగులు, తుపాకులు చాలవని తేలిపోతుంది. రాగి సంచులతో గవర్నర్‌ను రామారావు లోబరచుకున్నాడు.

(ఎలియట్ హిస్టారికల్ మెమొరీ ఆఫ్ చేబ్రోలు ఇన్ ది డిస్ట్రిక్ట్ ఆఫ్ చింతపల్లి, లోకల్ హిస్టరీ పేజి 100. వెంకటరావు దీనిని 1817లో అనువదించాడు. తొలుత తెలుగులో వుండగా తరువాత మరాఠీకి, పిమ్మట ఇంగ్లీషులోకి తర్జుమా అయింది. ఆ వెంకటరావు బ్రాహ్మణుడు)

ముస్లిం పాలకులను తరచు మార్చేసినా, రాయరావు మాత్రం స్థిరంగా వుండడమే ఆయన బలానికి నిదర్శన.

గుంటూరు పై గోల్కొండ నవాబులకు గట్టి పట్టు లభించలేదు. గోల్కొండ నుండి గుంటూరు జిల్లాను విడదీయాలని అలిఖాన్ లూరి తలపెట్టిన రాయారావు సహకారం అడిగితే అది జరగలేదు. అయితే

అతని సైనిక బలానికి స్థానిక మద్దత్తు వున్నందున, కేంద్ర అజమాయిషీని అడ్డుకోగలిగాడు. రాయరావు గోల్కొండకు తిరిగి వచ్చిన తరువాత అశాంతి ప్రబలింది. జిల్లాలోకి విజయనగర దళాలు ప్రవేశించాయి. రెవిన్యూ చెల్లింపులు నిలిపివేశారు. గోల్కొండ కోటలో మహమ్మద్ పాదుషా విలువైన వజ్రాలతో కులుకుతుండగా ప్రతి గ్రామానికి వెళ్ళే రహదార్లను జిల్లా పోలీసు అధికారులు అడ్డుకుంటున్నారని తెలుసుకున్నాడు. అమిన్ ఉల్ ముల్క్‌ను పంపగా అతను తీవ్ర స్థాయిల్లో అలజడిని అణచివేశాడు. నియోగులు అధికారానికి అంటి పెట్టుకునే వున్నారు. ఎలియట్ - స్థానిక చరిత్ర పేజి 91-102)

రాను రాను కేంద్ర దళాలు నిలదొక్కుకున్నాయి. జేమ్స్‌గ్రాంట్ దీనిని గురించి వ్యాఖ్యానించాడు - కప్పం చెల్లించే వారి ఆధిపత్యం సముద్రతీర ప్రాంత రాజ్యాలలో బాగా తగ్గించివేశారు. కేంద్ర పెత్తనం పూర్తిగా నిలిచింది. ('పొలిటికల్ సర్వే ఆఫ్ ది నార్తరన్ సర్కార్స్' 5వ నివేదిక ఎడిటెడ్ - డబ్ల్యు కె.ఫమింగర్ (1918 కేతన్ అమ్ముర్తజానగర్ అమిన్రు వారి సహ పాలకులు దేశస్తులకు చెందినవని తెలుస్తున్నది. మొగలులు, మరాఠీలు మొత్తం మీద గోల్కొండపై పూర్తి పెత్తనం వహించడంతో గుంటూరు జిల్లాపై అజమాయిషీ అసాధ్యమైంది. చివరి గోల్కొండ ప్రభువు కాలంలో వికేంద్రీకృత పాలన పూర్తి అయింది. తానీషాకు చెందిన నియోగి మంత్రులు అక్కన్న, మాదన్న పంతుళ్ళు చేసిన పాలనాయుత మార్పుల వలన హవేలీ గ్రామాలు అమాని ప్రభుత్వ సమితులు స్థానికులు పాలించగలిగారు.

(ఎలియట్, మెకంజి నివేదికలు, హెన్రీమోరిస్ ఎడిస్క్రిప్టివ్ అండ్ హిస్టారికల్ ఎకౌంట్ ఆఫ్ గోదావరి డిస్ట్రిక్ట్ - లండన్‌లో ట్రూబర్ అండ్

కో ప్రచురణ 1878 పేజి 167-76, స్థానిక హిందూ ఆఫీసర్లను స్వీకరించడంలో తానీషాకు తగిన కారణాలుండొచ్చు. గోల్కొండ ఫర్మానా ప్రకారం షియా పాలకులు రాజును దైవాంశుడుగా భావించే తీరు పెంపొందించారు)

స్థానిక బ్రాహ్మణ పాలన క్రమపద్ధతిలో సాగి, సున్నీ ఛాందసులకు కలవరపాటు సృష్టించింది. కాని ఆ స్థానిక రాజ్యం జనాన్ని కదిలించి, పాటలు పాడుకునేట్లు చేసింది (ఎలియట్ 'లోకల్ హిస్టరీ')

హైదరాబాదు శకంలో గుంటూరుపై అదుపు పరిమితంగానే సాగింది. 22 రాష్ట్రాలలో గుంటూరు కేవలం ఒక రాష్ట్రంలో ఒక జిల్లా మాత్రమే. తన రాజ్యాన్ని నిలబెట్టుకోవడంలో ఔరంగజేబు నిమగ్నుడయ్యాడు. ఆయన వైస్రాయి గజియుద్దీన్ హిందు అధికారులపై ఆధారపడి పాలించాడు. 1724లో దక్కన్ సుబాలోని ఆరు రాష్ట్రాలు అసిఫ్‌జాల పాలనలోకి వచ్చాయి. తైమూరుకు వీరికి ఉన్న సంబంధం లాంఛన ప్రాయమైంది.

స్థానిక పాలనలో ముస్లిం పాలకులు స్వల్ప మార్పులు చేశారు. అవి ఏమంత ఎక్కువ కాదు. పైగా దక్షిణాదిలో ముస్లింల సంఖ్య తక్కువ. పై స్థాయి ఉద్యోగాలకు పరిమితమై, వారు అదుపు చేయదలచిన ప్రాంతాలకు కాపలా పెట్టుకున్నారు. 1687 నుండి 1752 వరకూ జిల్లాను పాలించిన ముస్లింలు 42 మంది దేశస్థులు, స్థానిక కుటుంబాల వారు వారికి సహాయపడ్డారు. కర్నూలు, నెల్లూరు, ఏలూరు, వెల్లూరు, సేలం, మధుర జిల్లాలతో పోల్చితే గుంటూరు జిల్లా అధికారుల పేర్లు పాలించిన కాలం, స్థితిగతులు గమనిస్తే పై పైన తప్ప పాలనారంగంలో అంతగా ప్రభావం లేదు. ముర్తుజానగర్ సర్కారు అమిల్దారు పాలించిన కాలం

1.42 ఏళ్ళు మాత్రమే (1687-1748) హిందువులు అంతకంటే ఎక్కువకాలం పదవులలో వున్నారు. రెవిన్యూ వసూళ్ళు పాలనపై పట్టు హిందూ అధికారులకే వుండేది.

అమిత్‌దార్ కొద్దికాలమే వుండడం వలన వారు గందరగోళంలోనే సాగారు. వారికి పూర్తి అధికారాలు ఉండేవి. అక్బర్ కాలం నుండీ ఉన్న ద్వంద్వ విధానం, నిజాం కాలంలో ఒకటైంది.

(గ్రేట్ బ్రిటన్, హౌస్ ఆఫ్ కామన్స్ 1812 ఫిఫ్త్ రిపోర్టు) దీని ప్రకారం సైనిక పోలీసు అధికారాలు ఆర్థిక సివిల్ అధికారాలు కలిపేశారు. కత్తి కలం ఒకరికే దక్కాయి. అమిల్‌దార్ సర్వాధికారి. న్యాయపాలన, పోలీసు పెత్తనం అన్నమాట. వ్యక్తిగత బలహీనతలే అతన్ని అడ్డుకున్నాయి. ఏ అధికారికీ లేనన్ని అధికారాలు అమిత్‌దార్‌కు కట్టబెట్టారు.

(జేమ్స్‌గ్రాంట్. ఫిర్‌మర్జర్ పేజి 25 గుంటూరులో ముస్లింలు పెత్తనం చేస్తుండగా, హిందువులు లాభాలన్నీ పొంది, బలపడ్డారు. ముస్లింలు ఎక్కువగా సైనికులు, ఉద్యోగులు కారు).

హైదరాబాద్ సుబేదారు, ఆర్కాట్ నవాబు, కర్నూలు, మచిలీపట్నం రాజమండ్రి, తంజావూరు రాజా, మైసూరు, విశాఖపట్టణం వారంతా అమిల్ దార్లే. వారి పెత్తనం వంశపారంపర్యం చేసి, కింది వారికి కూడా అలాంటి అవకాశం యిచ్చారు. ఉత్తర సర్కారు అమిల్దార్‌కు కర్నాటక ఫౌజుదారుకు అట్టే తేడా లేదు. కాగా హైదరాబాద్ పెత్తనం అమిల్దార్ పై ఎక్కువ.

దక్షిణాది నవాబులు ఫౌజుదార్లు, హైదరాబాదు పెత్తనం క్రింద వేరు. వీరు ఎవరికి వారే పెత్తందార్లు. ఢిల్లీకి హైదరాబాద్‌కు తేడా నామమాత్రమే వీరిదృష్టిలో.

ముర్తుజానగర్ సర్కార్ పాలన అంతా గందరగోళంగా సాగింది. ముస్లిం అమిల్‌దారు హిందువుల ద్వారా పరిపాలన సాగిస్తూ, మరోవైపున వినోదాలు, యుద్ధాలు, రాజకీయాలతో హైదరాబాద్‌లో నిమగ్నులయ్యారు. ముసల్మాన్ పాలకుల విలాసాలను సాగనివ్వడానికి హిందూ ఉద్యోగులు చేయూతనిచ్చారు.

(ఫర్మజర్, మెకంజీ రచనలు)

అమల్‌దారు ఒక్కోసారి ఒక జిల్లాకే పరిమితం కాగా ఒకే జిల్లాకు ఇద్దరు హకీంలను నియమించకపోలేదు. అమిల్‌దార్, ఫౌజ్‌దార్, జిల్లాదార్, జాగీర్దార్ వంటి బిరుదులు గుంటూరు జిల్లాలో తాత్కాలిక అధికారులకు తాత్కాలికంగా తగిలించేవారు.

ముస్లిం పాలనలో హిందూ పురాతన సంస్థలు యథావిధిగా సాగాయి. జిల్లా ఉద్యోగులలోనూ, పేర్లలోనూ మార్పు తప్ప సంస్థలలో ఏమీ లేదు. గ్రామ స్థాయి సంస్థలే జిల్లా స్థాయి వరకూ విస్తరించాయి.

(ఎలియట్ రిపోర్ట్)

పరిపాలనలో వచ్చిన మార్పులు పేర్లలో కనిపించాయి.

జిల్లా అధికారుల బిరుదులు గమనిస్తే మరాఠా బ్రాహ్మణ ప్రభావం తెలుస్తుంది. జిల్లాలో అతి ముఖ్యమైన హిందూ అధికారి దేశముఖ్. అతడే సిసలైన అధికారి. ప్రభుత్వ ఏజంట్‌గా, అతడే పాలనాధికారి, రెవిన్యూ కలెక్టర్. స్థానికులకూ బయటవారికీ కూడా సంధానకర్త కూడా. భిన్న సంస్కృతుల మధ్య అతడొక బంధం. అలాగే మతాలు, భాషలు, ఆచారాల వైవిధ్యాన్ని పొందిక చేసేవాడు. ముస్లిం సైన్యాలకు, గ్రామాలకు మధ్య ప్రాతినిధ్యం వహించేవాడు. బ్రాహ్మణ దేశపాండే జిల్లా

గణాంకాధికారి, రిజిస్ట్రార్, అన్ని అధికార చర్యలు రికార్డు చేసేవాడు. అన్ని వివరాలు అతడే చూచేవాడు. అతడు మజుందార్ గనుక ఆడిట్ చేస్తూ అధికారులపై అదుపు వహించేవాడు. తరువాత జిల్లా పోలీసు అధికారి (మన్నవార్) వుంటాడు. తమ పెత్తనం సాగించడానికి దేశముఖ్, మున్నవార్‌లు కత్తిని ప్రయోగించారు. వారు సైనిక కులం నుండి వచ్చేవారు.

(1812 ఫిఫ్త్ రిపోర్టు, గ్రేట్ బ్రిటన్ జేమ్స్ గ్రాంట్ - పొలిటికల్ సర్వే ఆఫ్ నార్తరన్ సర్కార్స్ - పార్లమెంటరీ పబ్లికేషన్స్)

సెక్రటరీ, సిరస్తిదార్‌లకు ప్రత్యేక స్థానంవుండేది. ఆఫీసు పేపర్లు చూడడం రిపోర్టులు, స్టేషనరీ అతడి అజమాయిషీలో వుండేది. జిల్లా కార్యాలయాలు, పరికరాల నిర్వహణ చూసేవాడు. ఆఫీసు సిబ్బందిని ఎంపిక చేసేవాడు. దప్తదార్, స్టాఫ్ పై పెత్తనం వుండేది. పై అధికారుల బలహీనతలు అలా వుండగా, అతనికి పూర్తి అజమాయిషీ వుండేది. జిల్లాకు అతడే ముఖ్యమంత్రి. చాలా కీలక పాత్ర నిర్వహించేవాడు. దేశపాండేవలె అతని బలం అంతా అతడి కలానిదే. దేశపాండే, సిరస్తిదార్ అధికారాలు రెండూ ఒకరి చేతిలో వుంటే యిక అతని పెత్తనం వూహించాల్సిందే.

(ఎలియట్ రిపోర్ట్)

గుంటూరు జమీందార్లు వంశపారంపర్యంగా వచ్చారు. భూమిపై అజమాయిషీ చేయడాన్ని జమీందారీ అనే పదాన్ని (పర్షియన్) విచక్షణా రహితంగా హైదరాబాద్ అధికార్లు వాడారు.

(ఎలియట్ రిపోర్టు 17 ఏప్రిల్ 1846 - పేరా 99-100) హిందూ పాలకులకు వారి దేశీయ సంరక్షణ బాధ్యతల దృష్ట్యా యీ వాడుక

వచ్చింది. హిందూ జమీందార్లు మూడు విధాలు. సంస్థాన రాజాలు, పారంపర్యజిల్లా అధికారులు, తాత్కాలిక అధికారులు. జమీందార్లందరూ తమది ప్రాచీన పరంపర అనేవారు. వారిని తొలగించే పెత్తనాన్ని పాలకులు అట్టిపెట్టుకున్నారు. గుంటూరులో జమీందారీ పదం స్పష్టంగానే వాడారు.

(ఎలియట్ రిపోర్ట్ 1846 ఏప్రిల్ 17)

గుంటూరులో చిరకాలంగా వున్న జమీందారీ కుటుంబం వెలమవారు మాణిక్యరావు. విజయనగర సామ్రాజ్యంలో మొత్తం కొండవీటి సీమపై వారు రాజకీయ పాలనాధికారాల్ని వహించారు. ముస్లింపాలకులు దేశస్త మనూర్ రామారావు కుటుంబాన్ని తెచ్చి పెట్టారు. ఈ రెండు కుటుంబాల మధ్య పెత్తనాన్ని పంచి, ముర్తుజానగర్ సర్కారు వారు 1600లో 44 హవేలి గ్రామాలను, 14 సమితులను అప్పగించారు. మానిక రామారావును దేశపాండేగా, మానూరు పంట్రూని రావును దేశపాండే, మజుందార్‌గా చేశారు. ఇంకో సిరస్తిదార్, జమీందార్, కొండవీటి కోట గవర్నర్, హుజూర్‌కు నయాకరణం బాధ్యతలు అప్పగించారు.

(ఎలియట్ రిపోర్టు - లోకల్ హిస్టరీ)

మొగలాయిలూ ఎవరిని ఆదరిస్తున్నారో, స్పష్టపడగా దేశస్త కుటుంబం ఇరకాటాన పడింది. 1770లో నది అవల నుండి ఒక కమ్మ కుటుంబాన్ని తెచ్చి పెట్టారు. ఆ దశలో వారి మధ్య పెత్తనం పంపిణీ విషయమై, ఆర్కాట్ నవాబు, రాజమండ్రి నవాబు జోక్యం చేసుకుని సర్దుబాట్లు చేయించారు. స్థానిక చరిత్రకారుడి ప్రకారం, చింతపల్లి, తాలూకాలోని చేబ్రోలు సమితిలో 22 గ్రామాలు వాసిరెడ్డి పద్మనాభుడికి

అప్పగించారు. అప్పటినుండే వాసిరెడ్డి కుటుంబ ప్రభావం పెరిగి, మాణిక్‌రావు దశ తగ్గిపోయింది. 1725లో 225 గ్రామాల పెత్తనం వాసిరెడ్డి కుటుంబానికి అప్పగించి, మన్నవార్ దేశముఖ్ పెత్తనాలిచ్చారు. 5 సమితులపై వాసిరెడ్డి అజమాయిషీ రాజు ధృవీకరించాడు.

(స్థానిక చరిత్ర - ఎలియట్ రిపోర్ట్ ఫిల్మింగర్ రచన పేజి 64, మెకంజి రచన పేజి 344, మోరిస్ రచన పేజి 210-30.)

ముస్లిం పాలన సడలినప్పుడు, గుంటూరు అధికారులు బల పడ్డారు. విజయనగర పాలన పతనమౌతుంటే, నయాకారులు, పోలియాగారులు వ్యవహరించినట్లే, స్థానిక అధికారులు బిరుదులు అవకాశాలు చేజిక్కించు కున్నారు. హైదరాబాద్‌కు రెవిన్యూ చేరడం బాగా తగ్గింది. ఒకవైపున హైదరాబాద్ సర్కార్‌కు సర్‌సుబాకు, జమీందార్లకు సిర్‌సుబాలకు సంఘర్షణలు వాటిల్లాయి.

మొత్తం మీద ఎగవేతలు, మోసాలు పెరిగిపోయాయి. గుంటూరు ఫౌజుదారులు బలహీనపడినందున పెత్తనం వహించలేకపోయారు. హైదరాబాద్‌కు వెళ్ళే రహదారిలో కోట నిర్మించారు. కింది అధికారులు రాజప్రాసాదాలను (హవేలి) ఆక్రమించుకున్నారు. అణచివేత ఎక్కువకాగా, జనాభా పలచబడి, వృధా ఖర్చులు పెరిగాయి.

(మెకంజి పేజి 39-40 స్థానిక చరిత్ర)

1732లో రాజమండ్రి నవాబ్ అన్వరుద్దీన్ జిలాదార్‌ను ముర్తుజా నగర్‌కు పంపి, వున్న అధికారుల పెత్తనం స్వాధీనపరుచుకున్నాడు.

(మెకంజి లోకల్ హిస్టరి)

ఏడేళ్లపాటు రుస్తుంఖాన్ పట్టు సాధించాడు.

(వారి పెత్తనం ప్రదర్శిస్తూ కుల్లా మినార్ నిర్మించాడు).

ఆ కాలంలోనే స్థానిక తెలుగు కుటుంబాన్ని అధికారంలోకి తెచ్చారు. వాసిరెడ్డి జమీందార్ అధికారాన్ని అదుపులో పెట్టడానికి, వినుకొండ, బెల్లంకొండ పరగణాలలో దేశముఖ్, మన్నవారి పెత్తనాలు కట్టబెట్టారు. జిల్లాలో మల్ రాజు నరసరావు కోట నిర్మించి, దాని చుట్టూ నగరాన్ని నరసరావు పేట అని పిలిచారు.

(ఫిర్మింగర్, మెకంజి లోకల్ హిస్టరి)

18వ శతాబ్ది మధ్యలో రాజకీయ అస్థిరత్వం ఇండియాను ఆవరించింది. భారత, ఐరోపా శక్తుల మధ్య జరిగిన ఘర్షణలలో బ్రిటిష్ పెత్తనం పైచేయి అయింది. గుంటూరు జిల్లా గందరగోళ అరాచక పరిస్థితులలో చిక్కింది. హుసేన్ అలీఖాన్ సమర్థవంతమైన ఫౌజుదారుగా గుంటూరు వదలి వెళ్ళాడు. ఉత్తర సర్కార్లలో క్రమపద్ధతికి ప్రయత్నించాడు. 1759-1769 మధ్య హైదరాబాద్ - మద్రాసు పెత్తందార్ల మధ్య జరిగిన రాపిడిలో రాజీకి విఫల ప్రయత్నం చేశాడు. జేమ్స్‌గ్రాంట్ పేర్కొన్న రికార్డుబట్టి గుంటూరు జిల్లాలో 5 పరగణాలుండాలి. వాటిని 25 మూతాలుగా, 868 గ్రామాలతో వుండేవని చూపారు. 5గురు దేశముఖ్‌లు వీటిని పంచుకొని  వ్యవహరించారు. కొండవీడులో 39 హవేలి గ్రామాలు కూడా వుండేవి. 1788లో బ్రిటిష్ అధికారులు చేబట్టేనాటికి జమీందార్లు కూడా చక్కగానే పాలించేవారని కనబడింది. నాలుగు జమీందారీ కుటుంబాల మధ్య గందరగోళం ఎక్కువై, పంపిణీ సామరస్యత  కుదరలేదు. కొన్ని గ్రామాలు ఇద్దరు ముగ్గురు జమీందార్ల మధ్య పంచుకోవడం స్పష్టపడింది. సంప్రదాయ స్థానిక ప్రభావం యీ గందరగోళ సన్నివేశంలో బాహాటంగా తెలిసివచ్చింది.

అధ్యాయం - 3

# 1800లకు పూర్వం తలెత్తిన బ్రిటిష్ పెత్తనం

**1837** నాటికి బ్రిటిష్ శక్తి ఇండియాపై పూర్తిగా ఆవరించింది. రెండు దశాబ్దాల పాటు భారత దేశం శాంతియుతంగా సాగింది. గుంటూరు అప్పటికే యీస్ట్ ఇండియా కంపెనీ కింద 50 ఏళ్ళువుంది. 1788కు పూర్వం గుంటూరులోనూ, దేశంలోనూ అనేక కంపెనీలతోపాటు పోటీ పడిన వారిలో బ్రిటిష్ కంపెనీ ఒకటి.

ఔరంగజేబు 1707లో చనిపోయిన తరువాత, మొగల్ పెత్తనం క్షీణించింది. ప్రత్యర్థులు పరస్పరం తలపడ్డారు. రాష్ట్రాలు చీలి, స్వతంత్రమయ్యాయి. ఉత్తరాది పెత్తనం నుండి దక్షిణాది బయట పడింది. మరాఠీ రాజ్యం పూనా నుండి పూరీ వరకు విస్తరించగా, సామ్రాజ్యాన్ని స్థాపించగలమని ధీమాగా వున్నారు. 1724 నుండీ నిజాం వుల్ ముల్క్ స్వతంత్రంగా హైదరాబాదు పాలిస్తూ, దక్కన్‌లో చాలా భాగంలోనూ, ఉత్తర సర్కారులోనూ, కోస్తా జిల్లాలలోనూ కర్నాటక (కోరమాండల్) ప్రాంతంపై పట్టు బిగించాడు. మైసూరు రాజ్యం హైదరాలీ కింద బలపడింది. మధుర తంజావూరు తిరుచిరాపల్లి వంటి ప్రాంతాలు ఆక్రమించారు.

1739లో ఢిల్లీలో నాదిర్‌షాను అణచివేశారు. అంతటితో రాజకీయ అస్థిరత్వం ఆరంభమైంది. దక్షిణాదిలో వృద్ధ నిజాం ఆఖరి దశకు ఎదురు చూశారు. ఎవరు బలవంతులైతే వారికి మంచి అవకాశం చిక్కింది.

అప్పుడు గుంటూరును ముర్తుజా నగర్ అనేవారు. లేదా కొండవీటి సీమ అన్నారు. కృష్ణానది పక్కన ఒకవైపు కోరమాండల్‌కు మరో పక్క ఉత్తర సర్కార్లను కలుపుతూ, రహదార్లతో, కీలకస్థానంలో గుంటూరు నిలిచింది. దక్కన్ - కర్నాటక మధ్య యిది కీలకస్థానంలో వుంది.

సామ్రాజ్యంలో మంచి పట్టువున్న ప్రదేశం గుంటూరు. 40 ఏళ్ళపాటు గుంటూరు కోసం తాపత్రయపడుతూ పోయారు.

1687 నుండి 1748 వరకు గుంటూరుపై మొగల్ - నిజాం పెత్తనం సాగింది. ఇది గోల్కొండ పతనం మొదలు నిజాం వుల్‌ముల్క్ మరణం వరకూ ఆరోజులలో సైతం కేంద్ర పెత్తనం గుంటూరుపై అంతగా లేదు. ఆ కాలంలో 42 మంది ముస్లిం అధికారులు గుంటూరును పరిపాలించారు. స్థానిక హిందూ నాయకుల సహకారంతో రెవిన్యూ వసూలు చేసి, పాలన జరిపారు. ఒకవైపు బయట నుండి దాడులు, మరోపక్క లోన తిరుగుబాట్లు సాగాయి. దీనివలన కుల వ్యతిరేకతలు, సాంఘిక గందరగోళాలు ఏర్పడ్డాయి. జిల్లాదారు రుస్తుంఖాన్ పాలనలో 1732-1739 మధ్య ఆర్థిక విచ్ఛిన్నత దిగజారుడు పాలన, పౌర జీవనంలో అస్తవ్యస్తత కనిపించాయి.

1748లో వృద్ధ నిజాం మరణంతో విచ్ఛిన్నత తుది దశకు చేరింది. చరిత్రలో ఎక్కడా పోలిక లేనంతగా భారత నాగరికతలలో విచ్ఛిన్నత చూచారు. పాత సంస్కృతులు విస్మరించారు. ప్రజలకు తమ సంప్రదాయం తమకు కొత్తగా తోచింది. దేశంలో ఆవరించిన అంధకారం గుంటూరును కమ్ముకున్నది.

భారత వాణిజ్య వరాలతో యూరోప్ వాణిజ్యదారులు భాగం పెంచుకుంటూ, రాజకీయాధికారానికి ప్రయత్నించారు. రాజకీయ విచ్ఛిన్నత వలన అలా ఆశించగలిగారు. ప్రపంచ వ్యాప్తంగా ఇంగ్లండ్, ఫ్రాన్స్‌లు సాయుధ పోరాటాలకు దిగాయి. అదే ఇండియాకు సోకింది. యూరోప్ ఎప్పుడైనా యీ కంపెనీల మధ్య శాంతి నెలకొన్నా, ఇండియాలో మాత్రం ఘర్షణ ఆగలేదు. 1748 నుండి 1756 మధ్య అమెరికా ఆధిపత్య పోరాటం, యూరోప్‌లో ఏడేళ్ళ సమరం సాగినప్పుడు, ఇండియాలో యూరోప్ జోక్యం ముమ్మరమైంది.

యూరోప్ తలెత్తడానికి కొన్ని శక్తులు తోడ్పడ్డాయి. చిరకాలంగా, యూరోప్ వర్తకులకు భారత వ్యాపారస్తులకు వున్న భాగస్వామ్యం వలన దేశీయ పాలనకు వీలు చిక్కింది. రాజకీయాధికారానికి కేవలం నాయకత్వం, పాలనా సమర్థన చాలదు. అందుకు సాయుధ ధళాలు కావాలి. యూరోప్ సాంకేతికత భారత సిపాయిలు, వెండి అందుకు దోహదం చేశాయి.

భారతీయుల్ని కవాతు, శిక్షణ నేర్పి సైనిక శక్తిగా ఫ్రెంచివారు తీర్చిదిద్దారు. క్రమంగా జీతాలివ్వడంతో, వారిలో భద్రత ఏర్పడింది. సైనిక దుస్తులవలన ఒక విధమైన ప్రాధాన్యత, ఏకీకరణ భావన వచ్చింది. నాయకత్వం, సామగ్రి, శిక్షణ వలన సైనికులలో విధేయత వచ్చింది. అలాంటి పోరాట దళాలకు కావలసిందల్లా యుద్ధంలో గెలుపు మాత్రమే. 1746లో అన్వరుద్దీన్ దళాల్ని కొద్దిపాటి ఫ్రెంచివారు ఓడించగలిగారు. యూరోప్ చాలా బలీయమైందనే భావన ప్రబలింది.

యూరోప్ సైనిక వ్యవస్థకు, రాజకీయాలకు తగిన నిధుల్ని భారత ప్రిన్సెస్‌లు సమకూర్చారు. యువరాజులు తమ రాజకీయ ప్రయోజనాల

నిమిత్తం పోటీపడి యూరోప్‌కు సహాయపడ్డారు. అయితే తమ చాపకిందకే నీరు తెచ్చు కుంటున్నామని వారు గ్రహించలేదు. తమ కోటలోనే యూరోప్ సైన్యం తిష్ఠవేసి క్రమంగా తమనే తొలగిస్తారని వారు తెలుసుకోలేదు.

రెండవ కర్నాటక యుద్ధం వారసత్వ ఘర్షణ. అందులో ఇంగ్లీషు వారిపై ఫ్రెంచి వారిదే పై చేయి అయింది. హైదరాబాద్ వైస్రాయి స్థానానికి ఫ్రెంచి వ్యక్తి వచ్చాడు. ఫ్రెంచి వారు మద్దత్తు ఇస్తేనే హైదరాబాద్‌లో సలాబత్ జంగ్ నిలబడగలడని, డూప్లే గ్రహించాడు. 1732 నుండి 1759 వరకు బుస్సీ దళాలు నైజాం సమర్థించి, హైద్రాబాద్‌కు మద్దత్తు యిచ్చారు. అలా సైనిక సహాయం చేసిన దానికి కృతజ్ఞతతో, గుంటూరును ఫ్రెంచివారికి జాగీర్‌గా సమర్పించారు. వెనువెంటనే ఉత్తర సర్కార్ల నుండి విడిపోయి, కర్నాటక గవర్నర్ పదవి వదిలేశారు.

అధికార శిఖరాగ్రంలో డూప్లే, బుస్సీలు వుండగా, పరిస్థితులు వారికి ప్రతికూలం అయ్యాయి. కుట్రలు, కుతంత్రాలు తల తిరిగి పోయేట్లు వచ్చిపడ్డాయి. ఫ్రెంచివారు కత్తుల బోనులో, భయవాతావరణంలో యిరుక్కు న్నారు. సర్కస్‌లో రింగ్ మాస్టర్ ఒకడే అనేక పులుల్ని అదుపులో పెట్టలేడు కదా! ఒకదాన్ని పట్టించుకునేలోపు మరొకటి తోకాడిస్తుంది. స్థానిక మద్దత్తు, విధేయత సాధించడానికి బలహీన ఆయుధం పనికిరాదు. ఫ్రెంచి వారు వచ్చి ఏడేళ్ళపాటు దేశాన్ని ఆందోళన పరచి, యాజమాన్యం వహిస్తూ, నిరంకుశ పాలనగావించారు.

(ఎలియట్ - కైఫయత్ ఆఫ్ హైదరాబాద్ మెమోరియల్ ఆఫ్ క్రానికల్స్ ఇన్ ది డిస్ట్రిక్ట్ ఆఫ్ చింతపల్లి - లోకల్ హిస్టరీ - వెంకటరావు సేకరణ - అనువాదం 1819 పే.97)

ఇంగ్లీషు దళాలు సముద్రం మీదుగా వచ్చేసరికి ఫ్రెంచివారికి చుక్కెదురైంది. అదే సమయంలో ఫ్రెంచి ప్రభుత్వం దారుణంగా తప్పటడుగులు వేసింది. డూప్లేను వెనక్కు రప్పించారు. దేశంలో మద్దత్తు ఉపసంహరించారు. హైదరాబాద్ నుండి బుస్సీని విరమించుకోమన్నారు. ఫలితంగా 1759లో మచిలీపట్నం వదులుకోవలసి వచ్చింది. ఫ్రెంచివారికి స్థానం పోయింది. తరువాత కొన్నేళ్ళకే పాండిచేరి చేజారిపోయింది. 9 ఏళ్ళ కష్టమంతా హరించిపోయింది.

ఫ్రెంచివారు విఫలమైనచోట ఇంగ్లీషువారు సఫలమయ్యారు. స్వదేశం నుండి సకాలంలో జోక్యం చేసుకోవడం, శక్తివంతమైన నాయకత్వం ముందుకు కారణం. భూభాగాన్ని సాధించడం ఎలాగనేది డూప్లే నుండి నేర్చుకోవలసి వుండగా, ఇంగ్లీషు దేశాలు విజయం పొందడంతో వారికి తగిన సమయం లభించింది.

(రాబర్ట్ ఆర్మ్ హిస్టరీ ఆఫ్ ది మిలిటరీ ట్రాన్సాక్షన్స్ ఆఫ్ ది బ్రిటిష్ నేషనల్ ఇన్ హిందూస్తాన్ - లండన్ 1803 పే.378) 1751 నాటికి ఆర్కాట్‌ను కాపాడడంలో క్లైవ్ వీరోచిత చర్య బ్రిటిష్ ప్రతిష్ఠ పెంచింది. ఫ్రెంచివారికి ప్రత్యామ్నాయం ఏర్పడింది. ముందు చూపుగల నాయకత్వం క్లైవ్‌లో వున్నది. డూప్లే నుండి నేర్చారు కూడా. సముద్రంపై ఆధిపత్యం వలన, బ్రిటిష్‌వారు ఉత్తరాదికి తరలారు. వాణిజ్యపరంగా లాభసాటి అయిన బెంగాల్‌కు వెళ్ళారు. రాజకీయంగానూ దానికి ప్రాధాన్యత వుంది. ప్లాసీ అనంతరం దక్షిణాదిలో నెగ్గడం బ్రిటిష్ వారికి ఆట్టేకాలం పట్టదు. ఒకచోట లాభాల్ని మరొక ప్రాంతానికి ఖర్చు చేయగలిగారు. 1761 నాటికి పానిపట్టు యుద్ధంలో మరాఠా తీవ్రంగా దెబ్బతిన్నది. వారి సామ్రాజ్య కలలు పటాపంచలయ్యాయి. భారత దేశంలో ప్రధాన రాజకీయ శక్తిగా బ్రిటిష్ నిలదొక్కుకున్నది.

కానీ దేశంలో అధికారం చేబట్టడం ఒక ఎత్తు, అది కాపాడుకోవడం మరొక ఎత్తు. బాధ్యతతో అధికారాన్ని కట్టుదిట్టం చేసుకోడానికి బ్రిటిష్‌వారికి కొన్నేళ్ళు పట్టింది. ఆ సమయంలో గుంటూరును పట్టించుకోవలసి వచ్చింది. దేశంలో అధికార పోరాటంలో గుంటూరు ఒక కీలక పావు అయింది.

హైదరాబాద్‌లో ఫ్రెంచి మద్దత్తు లేకుండా సలాబత్‌జంగ్ అధికారం పోగొట్టుకున్నాడు. అతని సోదరుడు నిజాం అలీ అతి సమర్థవంతంగా 40 ఏళ్ళపాటు స్వతంత్ర ప్రాంతంగా వుంచగలిగాడు. అతని సోదరుడు బసాలత్ జంగ్ ఆదోని, కొండవీడుకు వెళ్ళి, పథకాలు, కుట్రలు పన్ని తన ఆవకాశం కోసం ఎదురు చూచాడు. ఉత్తర సర్కార్లు పాలించడానికి హుసేన్ అలీఖాన్‌ను పంపారు. కాని గుంటూరు నుండి బసాలత్ జంగ్‌ను కదిలించలేకపోయారు. 1759లో ఫ్రెంచి నుండి స్వాధీనపరచుకున్న ప్రాంతాన్ని బ్రిటిష్‌వారు వదులుకోలేదు. పైగా సర్కార్లను సగం రెవెన్యూకు కొంటామన్నారు. హుసేన్ అలీ ఒప్పుకున్నాడు. కృష్ణానదికి ఉత్తర ప్రాంతాలకు కంపెనీ దళాలు వచ్చాయి. నిజాంఅలీ తీవ్ర అసంతృప్తి చెందాడు. మరాఠా దాడులకు వ్యతిరేకంగా కంపెనీ మద్దత్తు కోరినా, కష్టాల్లో వున్నప్పుడు అది జరగలేదు. సలాబత్ జంగ్ చేసిన తప్పిదాలే మళ్ళీ చేయదలచలేదు. బెజవాడకు ముస్లిం సైన్యాన్ని తరలించారు. సర్కార్లలోకి వెళ్ళడానికి అయ్యే ఖర్చులిస్తామంటే, ఉపసంహరణకు సిద్ధం అని బ్రిటిష్‌వారు నిజాంకు తెలియజేశారు. నిజాం ఆగ్రహించాడు. చివరి క్షణాల్లో హుసేన్ అలీ ఒప్పించగా నిజాం అంగీకరించాడు. బ్రిటిష్‌వారు మానుకోగా యుద్ధం తప్పింది.

1765లో క్లైవ్ తిరిగి ఇండియాకు వచ్చాడు. దేశంలో కంపెనీ

క్రమశిక్షణ, సంపద పెంచమని అతడిని పురమాయించారు. ఆ ఏడు ఆగస్టు 12న ఉత్తర సర్కార్లపై ఫర్మానా జారీ చేసి క్లైవుకు అప్పగించారు. త్వరలోనే ఒక ఉత్సవంలో యీ ఫర్మానా వెల్లడించి, కొండపల్లిని ముట్టడించారు. మరాఠా సరిహద్దుల నుండి నిజాం అలీ తిరిగొచ్చి, యుద్ధానికి సిద్ధపడ్డాడు. అతికష్టం మీద సంధి చేసుకున్నారు. ఉత్తర సర్కార్లు ఇవ్వడానిక ఒప్పుకుని, 8 లక్షల రూపాయలు సాలీనా ఇవ్వడం, రెండు కాల్బలాలు ఇస్తామన్నారు. ఒక ఏడాదిలోనే హైదర్‌అలీతో చేతులు కలిపి నిజాం కాస్తా కంపెనీపై దాడిచేశారు. కాని ఓడిపోయారు. 1768లో కొత్తసంధి చేసుకున్నారు. బ్రిటిష్‌వారి ఆధిపత్యం పెరిగింది. అంతకు మించి మార్పులేదు. జీవిత పర్యంతం గుంటూరును జాగీర్‌గా బసాలత్ జంగ్ అట్టిపెట్టుకోవచ్చన్నారు. అతని పెత్తనాన్ని ఎవరూ కాదనలేదు.

ఆ తరువాత ఒక దశాబ్దం పాటు సంఘటనలు అప్రియమైనవే. బసాలత్ జంగ్ ఫ్రెంచివారిపట్ల అనుకూలంగా వుండడం, నిజాం రాజ్యానికి దగ్గరగా వుండడం వలన శాంతి ఏర్పడలేదు? దోపిడీలు, కౌలుదార్ల నుండి వసూళ్ళు, ఫ్రెంచివారి లోపాయికారి వ్యవహారాలు, తిరగబడిన జమీందార్లు గమనిస్తే, పంటలు ఎలా పండించారో ఆశ్చర్యం వేస్తుంది.

(గార్డన్ మెకంజి - ఎ మాన్యుయేల్ అఫ్ క్రిష్ణా డిస్ట్రిక్ట్, మద్రాసు 1883. పేజి 77) కంపెనీని వదలినవారు సాహసోపేతులంతా బసాలత్ జంగ్‌కు తగ్గట్టే వ్యవహరించారు. సముద్రం నుండి ఆయుధాలు, సరుకులు కొండవీడుకు చేరేశారు. హైదరాబాద్‌కు మద్రాసునుండి హెచ్చరికల్ని ఖాతరు చేయలేదు. ఉద్రిక్తతలు పెరిగాయి. మైసూరులో బాగా బలం పెంచుకున్న హైదర్ అలీ ఆదోని వరకు వచ్చి ఆగాడు.

బసాలత్ జంగ్ భారీ ఎత్తున సొమ్ము అందించిన ఫలితం అది. కంపెనీవారు మోటుపల్లి, వేటపాలెం రేవులకు దళాల్ని పంపారు. తలుపు దగ్గరకొచ్చి గిరుతున్న పులుల్ని ఎలా ఎదుర్కోవాలో తెలియక బసాలత్‌జంగ్ వణికిపోయాడు.

భారత రాజకీయ విధానంలో ఆనాడు హద్దు ఆపూ లేదు. కనుక క్రమపద్ధతి, సమతుల్యం మాటే లేదు. సాధారణ నియమావళి లేదు. అంతర్జాతీయ చట్టం లేదు. పూర్తిగా లొంగిపోవడానికి పూర్తి పెత్తనం చలాయించడానికీ మధ్యేమార్గం అంటూ లేదు.

1779 తొలిదశలో బసాలత్ జంగ్ నుండి గుంటూరును మద్రాసు గవర్నర్ థామస్ రంబోల్డ్ అద్దెకు తీసుకున్నాడు. దీనికి బదులుగా భత్యం నిర్ధారించాడు. రక్షణ కల్పిస్తామని చెప్పారు. ఇది రాజకీయంగా ప్రశ్నార్థకం. ఆ తరువాత గుంటూరును కర్నాటక నవాబుకు లీజు యిచ్చారు. ఇదీ నైతికంగా ప్రశ్నార్థకమైంది. దీని వెనుక రహస్యంగా సొమ్ము స్వీకరించడం కద్దు.

ఇదంతా చూచి నిజాం ఆగ్రహావేశుడయ్యాడు. దీనికి తోడు ఉత్తర సర్కార్ల రెవెన్యూ నుండి లోగడ చెల్లిస్తున్నది కూడా నిలిపేశారు. 1768లో చేసిన ఒడంబడికను ఉల్లంఘించారు. ఇదంతా చూస్తుంటే, బసాలత్ జంగ్ బ్రిటిష్ వారి మద్దత్తుతో తన స్థానానికే ఎసరు పెట్టనున్నట్లు నిజాం భావించాడు. అంతటితో హైదర్ అలీ, మరాఠా సహాయం కోరాడు. ఒడంబడికను కుదుర్చుకున్నారు. బ్రిటిష్ వారు గుంటూరును ఆక్రమించడం పట్ల కలవరపడిన హైదర్ అలీ, కర్నాటకపై విరుచుక పడ్డాడు. 400 మంది ఫ్రెంచి దళాలు తోడ్పడగా, అంతవరకు బసాలత్ జంగ్‌కు తోడ్పడిన ఫ్రెంచివారి మద్దత్తు తీసుకున్నాడు. బ్రిటిష్ దళాలు

వెనక్కు తగ్గాయి. కాని కాంచీపురం వద్ద పట్టుబడి హతమయ్యారు. కర్నాటకలో దాడులు ముమ్మరంగా సాగి, మద్రాసు దాకా సోకింది.

అంతవరకు బ్రిటిష్‌వారికి ఇండియాలో అంత ప్రమాదం ఎదురు కాలేదు. యుద్ధం వలన అమెరికా, కాలనీల స్థితి అధ్వాన్నంగా వుంది. ఫ్రాన్స్, హాలండ్‌తో సహా యూరోపియన్ శక్తులన్నీ బ్రిటన్‌కు వ్యతిరేకంగా పని చేశాయి. కంపెనీకి దళాలు రాకుండా యూరోప్ నుండి అడ్డుకున్నాయి. బాంబే కలగాపులగం మరాఠా వారికి ఆగ్రహం కలిగించింది. మద్రాసు అవినీతి ముదిరి మైసూరుతో వ్యతిరేకత పెరిగిపోయింది.

అలాంటి సమయంలో వచ్చిన వారన్ హేస్టింగ్స్ సమయస్ఫూర్తితో వ్యవహరించాడు. భారత దేశంలో శక్తుల్ని చీలదీశాడు. మరాఠీ వారిని తటస్థపరిచాడు. నిజాం అలీని తన వైపుకు తిప్పుకున్నాడు. బసాలత్ జంగ్‌కు మళ్ళీ గుంటూరు కట్టబెట్టాడు. కాని మద్రాసులో తటపటాయింపు జరిగింది. తాత్కాలిక గవర్నర్‌గా మద్రాసులో ఉన్న వ్యక్తిని హేస్టింగ్స్ సస్పెండ్ చేశాడు. సర్ ఐర్‌కూటే నాయకత్వాన సైన్యాన్ని దక్షిణాదికి తరలించాడు. అత్యవసర పరిస్థితి ఎదుర్కోవడానికి బెంగాల్ నిధుల్ని వ్యయం చేశాడు. బ్రిటిష్‌వారికి సంక్షోభం తప్పించాడు.

1782లో పరిస్థితులు మారాయి. హైదర్ అలీ, బసాలత్ జంగ్ మరణించారు. మద్రాసును గవర్నర్‌గా సమర్థుడైన లార్డ్ మకాలే వచ్చాడు. నిజాం స్నేహాన్ని కాదని, గుంటూరుపై కంపెనీ హక్కును మకార్ట్నీ స్వీకరించదలచాడు. కాని హేస్టింగ్స్ ఆపాడు. ఉత్తర సర్కార్లను నిజాంకు యిచ్చేయాలని, వాటి ప్రాధాన్యత అట్టేలేదని భావించాడు. అదే సరైన నిర్ణయం కర్నాటక పాలన విషయంలో మద్రాసు, బెంగాలు మధ్య

మడత పేచీ పెట్టడంలో నవాబు చాకచక్యం చూపాడు. దాంతో హేస్టింగ్స్, మకార్థినే తీవ్రంగా ఘర్షణ పడ్డారు.

1788లో గుంటూరుపై పూర్తి ఆధిపత్యం బ్రిటిషువారికి దక్కింది. 1782లో బసాలత్ జంగ్ మరణించడంతో జిల్లా పెత్తనం సయిఫ్‌జంగ్, అతని అనుచరులకు లభించింది. అప్పటికి లార్డ్ కారన్‌వాలిస్ వచ్చి, గుంటూరు పై సర్వాధికారాలు చట్ట ప్రకారం బ్రిటిష్‌వారికి దక్కించాడు.

(మకంజీ పూర్తి వివరాలు రాశాడు. సరోజిని రేగాని రాసిన ఆంగ్లో నిజాం రిలేషన్స్ పర్టయినింగ్ టూ ది నార్త్ రన్ సర్కార్స్ - జర్నల్ ఆఫ డక్కన్ హిస్టరి అండ్ కల్చర్ (వాల్యూం 4, నంబరు 2) జూలై 1956)

జిల్లాను దత్తం చేయడానికి నిజాం విచారపడలేదు. అప్పటికి జిల్లా చితికిపోయి, లాభసాటి కాకుండా నిలిచింది.

ఆ తరువాత 12 ఏళ్ళపాటు బ్రిటిష్‌వారికి కొత్త ప్రాంతాల అధీనంపై సందేహాలున్నాయి. నిజాం నుండి కంపెనీకి గుంటూరు దక్కడం కేవలం లాంఛనప్రాయం. చాలాకాలంగా స్థానిక నాయకుల పెత్తనం క్రింద ఉన్న, జిల్లా హైదరాబాద్ అజమాయిషీలో వుందా, మద్రాసు పెత్తనం కింద వుందా అనేది అవసరమయింది.

స్థానిక స్థితిగతులు సరిగా తెలుసుకోపోవడం, సమాచారానికి అవసరమైన సౌకర్యాలు లేకపోవడంతో, బ్రిటిష్ అజమాయిషీ విఫలమైంది. బ్రిటిష్ వారికి ఎదురైన కష్టాలు - గ్రామ నాయకుల నుండి, జమీందార్ల పక్షంగా, దుబాసీల వలన, అవినీతిపరులైన బ్రిటిష్ అధికారుల వలన - సంభవించాయి.

అట్టడుగు స్థాయిలో గ్రామ నాయకులున్నారు. సంప్రదాయ పద్ధతులలో గ్రామావసరాలు తీర్చడానికి ప్రయత్నించారు. వీటికోసం

గ్రామ ఖర్చుల ధనం పనికొచ్చింది. ఈ నిధులు మత ఉత్సవాలకు, దేవాలయ నిర్వహణకు, సిబ్బందికి, దేవదాసీ నృత్యం చేసేవారికి, సంగీతకారులకు, వినోదాలకు, సంతలకు, దాతృత్వాలకు, అతిథులకు, బహుమతులు, దైవారాధనకు, కార్యాలయ పరికరాలు, ఉద్యోగులకు, బత్తాలకు వాడేవారు. గ్రామ ఖర్చులు, గ్రామ మోసూళ్ళు లెక్కలన్నీ కరణాలు చూసేవారు. ఇదంతా గ్రామాదాయానికి లోటు మాత్రమే. ప్రాచీన వ్యవసాయ తీరులో రెవిన్యూ, స్థానిక పాలన అంతా గ్రామంపైనే పడేది.

(ఎలియట్ రిపోర్టు - రాబర్ట్ హూగ్ లెటర్ 1789 సెప్టెంబరు 29)

పరిస్థితులు సానుకూలంగా లేనప్పుడు గ్రామ సహాయపనులకు గ్రామ ఖర్చుల నుండే వాడేవారు. సక్రమంగా సాగేటప్పుడు, కొంత నిధి అట్టిపెట్టి, గ్రామ నాయకత్వానికి వాడేవారు.

మచిలీపట్నం నుండి పంపిన ఇరువురు ఆఫీసర్లు - హూగ్స్, శాడ్లర్ - గుంటూరు గ్రామాల ఆదాయం చాలా హెచ్చుగా ఉందని, తగనుగుణంగా, కంపెనీకి రావడం లేదని కనుగొన్నారు. 1790లో మద్రాసు నుండి వచ్చిన విచారణ సంఘం కూడా అలానే తెలుసుకున్నది.

(ఏంథొని శాడ్లర్, మచిలీపట్నంలో కౌన్సిల్ ఛీఫ్ లెటర్ 1791 ఏప్రిల్ 30 - ఎలియట్ నివేదిక) కరణాలు రెండు విధాలైన లెక్కలు అట్టిపెట్టారు. జమీందార్లను, ప్రభుత్వాన్ని ఈ ద్వంద్వ లెక్కలతో మోసగించేవారు.

గ్రామ ఖర్చుల విధానాన్ని క్రమబద్ధం చేయడం, దురాచారాన్ని అదుపు చేయడం అసాధ్యమని గ్రహించి, ఆ పద్ధతిని రద్దు చేశారు. రానున్న కాలంలో లెక్కలన్నీ జిల్లా ట్రెజరీ ద్వారా జరగాలన్నారు. అప్పటి నుండీ గ్రామ ఖర్చుల పేరిట చెల్లించవద్దని, అలాంటిదేదైనా వుంటే

ప్రతిఘటించమన్నారు. (విచారణ సంఘం - బేసల్, కొచారన్, జోన్స్ స్కాట్ - 1790 ఆగస్టు 21 లెటర్ ఎలియట్ నివేదిక).

పాతుకుపోయిన వ్యవస్థను చట్టం ద్వారా తొలగించడం కుదిరేపని కాదు. అలాంటి నియమం అమలు పరచలేదు. 1794లో గుంటూరులో నియమితుడైన తొలి కలెక్టర్ లెక్కలు కుమ్మక్కి చేయడంలో జనం పాత్రను గ్రహించాడు.

(రాం. లేఖ 1794 ఆగస్ట్ 5)

18 గ్రామాలు లెక్కలు నమూనాగా పరిశీలిస్తే, 19850 పగోడాల ధనం అదృశ్యమైనట్లు గ్రామ నాయకులకు దక్కినట్లు గ్రహించారు. అలాంటి ఆచారాలు పెరుగుతూ పోతాయని రెవిన్యూ బోర్డు గ్రహించింది. ఈ విషయాన్ని జార్జిరాం యిలా అన్నారు.

"అణచివేతకు గుర్రైనవారు చిరకాలంగా తమ నైపుణ్యాన్ని వినియోగించి, ఎలా చెల్లింపులు ఎగవేయాలో తెలుసుకున్నారు. ఇలాంటివి కలెక్టర్ ద్వారా పట్టుబడడం సరిగా జరిగేపని కాదు." గ్రామనాయకులతో సూటిగా వ్యవహరించే బదులు, ఉత్పత్తిలో మూడింట రెండువంతులు యిచ్చేటట్లుగా, జమీందార్లకు గ్రామాలకు అప్పగిస్తే, సమస్య తీరుతుందన్నాడు. ఈ సిఫారసును అనుసరించారు.

(రాం - నివేదిక 1795 డిసెంబరు 19)

గ్రామ నాయకులతో వ్యవహరించడమే చిక్కులతో కూడినదైతే జమీందార్లతో వ్యవహారం కూడా బ్రిటిష్ వారికి అలాగే దాపురించింది. 1789లో కంబెల్లపురానికి చెందిన మాజీ జెసూట్ ఫాదర్ మానెంటి యీ విషయమై పేర్కొన్నాడు. జమీందార్లకు ఆరు గ్రామాలు యిచ్చిన పాపిరెడ్డి,

ఆరువేల పగోడాలు ఒప్పందం చేసుకున్నాడు. కాని గ్రామాల నుండి 300 కంటె వసూలు కాలేదు. అతడేమో 9 వేల పగోడాలు యివ్వాల్సి వచ్చింది. కొన్ని గ్రామాలలో జనాభాలేరన్నాడు.

(మెకంజీ రచన)

జిల్లాలో మిగిలిన జమీందార్ల కంటె వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు ఆశ్చర్యకరంగా అధిపత్యం వహించాడు. అటు బ్రిటిష్ వారినే ఎదిరించాడు. లోగడ నిజాంను సైతం అలాగే ఎదుర్కొన్నాడు. మచిలీపట్నం కౌన్సిల్ అతడి పెత్తనం కుదించాలని నదికి ఉత్తరాన ప్రాంతానికి అతడి బంధువును పెట్టారు. కానీ అతడు అవమానాలకు గురికావలసి వచ్చింది. తీవ్రంగా ఆగ్రహించిన వాసిరెడ్డి జమీందారు దండెత్తి కోటను ముట్టడించి తన బంధువును చిత్తు చేశాడు. వినుకొండ, బెల్లంకొండను వాసిరెడ్డికి అప్పగిస్తే, కొంత దారి మళ్ళించవచ్చు ననుకున్నారు. కానీ అది మరింత ప్రమాదం అనుకొని మానుకొన్నారు. అవినీతిలో కూరుకుపోయిన మచిలీపట్నం మునిసిపల్ కౌన్సిల్ కొనసాగినంతకాలం, వాసిరెడ్డి యధేచ్ఛగా తిరుగు లేకుండా ఉన్నాడు.

(జేమ్స్‌గ్రాంట్ - పొలిటికల్ సర్వే ఆఫ్ నార్తరన్ సర్కార్స్ 1812-5వ నివేదిక డబ్ల్యు క.ఫర్మింగర్ కలకత్తా -1918)

అయితే గోల్కొండ పాలకులు 13 లక్షలు, నిజాం 14 లక్షలు కావాలని వాసిరెడ్డిని అడిగారు. మచిలీపట్నం కౌన్సిల్ కూడా అంతే అడగవచ్చు. మొత్తం వాసిరెడ్డి జమీందారుతో ఒప్పందానికి వచ్చి, సాలీనా ఉత్పత్తిలో మూడింట రెండువంతులు యివ్వాలన్నారు. లోగడ 7 ఏళ్ళుగా నిజాంకు చెల్లించకుండా ఎగవేసినట్లు కాక, 30 లక్షలు

యివ్వాలని జమీందార్లను అడిగారు. జిల్లాలో మళ్ళీ జనాభా వచ్చేటట్లు చూడమన్నారు. (ఎలియట్ నివేదిక).

1790 నుండీ 1800 వరకు పరిస్థితులు అతి దారుణంగా వున్నాయి. 1791-2 కరువు తీవ్రతలో, కూలీలు పేదవారు జనాభాలో 6వవంతు చనిపోయారు. 1791లో వచ్చిన ఉప్పెన పంటల్ని, పశువుల్ని, నది పక్క గ్రామాల్ని తుడిచి పెట్టింది. వారాలతరబడి మోకాళ్ళ లోతు నీరు నిలచి పాతర్లలో దాచిన ధాన్యం సైతం ఎందుకు కొరగాకుండా చేసింది. ఆ మరుసటేడు దారుణ దుర్భిక్షం ఏర్పడింది.

(ఎలియట్ నివేదిక పేరా 10-)

వాసిరెడ్డి జమీందారు పెత్తనం సాగింది. మిగిలిన జమీందార్లు కుటుంబ కలహాలతో సతమతమయ్యారు. 1792లో ఏడేళ్ళ బకాయిలలో రెండింట మూడువంతులు చెల్లిస్తానన్నాడు. 3.15 లక్షల ఫగోడేలు 3 ఏళ్ళపాటు యిస్తానన్నాడు. అయితే జిల్లా పెత్తనం అంతా తనకు యివ్వాలన్నాడు. వాసిరెడ్డి జమీందారు మాత్రమే జిల్లాను అదుపు చేయగలడనే ఉద్దేశ్యంతో, ఆంథోని శాడ్లర్, మచిలీపట్నం మునిసిపల్ కౌన్సిల్ అంగీకరించారు. అయితే ఒప్పందాలు ప్రశ్నార్ధకంగానే మిగిలిపోయాయి. లార్డ్ కారన్‌వాలీస్ సంస్కరణలతో మచిలీపట్నం కౌన్సిల్ అదృశ్యమైంది. వాసిరెడ్డి జమీందారు కూడా బ్రిటిష్ వత్తిడి చవిచూశాడు. నది పక్క తన బంధువులను విడుదల చేసి వారి అధికారాలు మళ్ళీ కట్టబెట్టవలసి వచ్చింది. అతని చింతపల్లి కోటలో బ్రిటిష్ దళాన్ని పెట్టారు. జమీందారు కొద్ది సైన్యం తొలగించారు. కేవలం రెవిన్యూ వసూళ్ళకే పోలీసును అట్టిపెట్టుకోనిచ్చారు. జమీందారు పై కూడా గుంటూరులో కాపలా పెట్టారు.

(మెకంజీ రచన)

స్వతంత్ర ప్రతిపత్తి కోల్పోయినా, కమ్మ జమీందారు ధైర్యంగా నిలిచాడు. కంపెనీ సైనికులు భ్రష్టం చేశారంటూ తన కోటకు అతడు తిరిగి రాలేదు. దానికి బదులు అమరావతిలో కోట నిర్మించాడు. బౌద్ధ శిధిలాల రాళ్లతో కోటకట్టి, స్తంభాలకు వెండి బంగారు తొడుగు వేశాడు. కప్పు రాగి రేకుతో ఏర్పరచాడు. ఉద్యానవనాలు, దేవాలయాలు పునరుద్ధరించాడు. మరొక 20 ఏళ్ళపాటు తన ప్రభావాన్ని చూపెట్టాడు. (మెకంజీ రచన).

ఇక దుబాసీల సంతతికి వస్తే, వారు ద్వంద్వ విధి నిర్వహణ చేశారు. నమ్మకమైన సేవకులుగా, బ్రిటిష్ కంపెనీకి వాణిజ్య వ్యాఖ్యాతలుగా నిలిచారు. సమర్ధవంతంగా కలహాలు పరిష్కరించేవారు. పరస్పర విరుద్ధ శక్తుల్ని రాజీ పరచేవారు. ప్రతిష్ఠంభన తొలగించేవారు. ఒడంబడికలు చేయించేవారు. ఇండియా వంటి బహుళ సమాజంలో, యీ బనియాలు, దివాన్లు, బాబులు అవసరాలకు సరిపడా వ్యవహరించారు. పాలకులకు పాలితులకు మధ్య వారధిగా బ్రిటిష్ రాజ్యంలో వీరు విశిష్ఠ అధికార పాత్ర వహించారు.

బ్రిటిష్‌వారు గుంటూరుకు వచ్చేనాటికి మరాఠా బ్రాహ్మణులు స్థానిక పాలనలో కీలక అధికారులుగా వున్నారు.

(ఎం. రత్నస్వామి - సమ్ ఇన్ ఫ్లూయన్సస్ దట్ మేడ్ ది బ్రిటిష్ ఎడ్మినిస్ట్రేటివ్ సిస్టం ఇన్ ఇండియా - లండన్ 1919.

మరాఠీ భాష, మరాఠీ బ్రాహ్మణులు కర్నాటక పాలనలో ముఖ్య పాత్ర వహించారు. గోల్కొండ పాలనలో వారు ముఖ్య పాత్ర వహించారు. గోల్కొండ కాలంలో వారు గుంటూరు వచ్చారు.)

వారు జమీందార్లను, ముస్లింలను సేవించారు. వాణిజ్యంలో కోమట్లు బాగా యిమిడిపోయారు. ప్రభుత్వ పనులకు దేశస్తులు పరిపాలనా అనుభవం అందించారు. వారు ఇంగ్లీషు త్వరగా నేర్చుకున్నారు. (వెన్నెలకంటి వెంకట గోపాలరావు, ది లైఫ్ ఆఫ్ వెన్నెలకంటి సాబ్ రావు, నేటివ్ ఆఫ్ ఒంగోలు, ట్రాన్స్‌లేటర్, ఇంటర్ ప్రీటర్ టు లేట్ సదర్న్ కోర్టు, మద్రాసు ఫ్రం 1815 టు 1829 మద్రాసు, సి.ఫాస్టర్ అండ్ కో 1873- 1వ అధ్యాయం ఇంగ్లీషు నేర్చిన రీతి ఆసక్తికరంగా రాశారు)

కొత్త పాలకులకు కొత్త ఏజెంట్లుగా యీ బ్రాహ్మణులు వ్యవహరించారు.

గుంటూరులో బ్రిటిష్‌వారి క్రింద తొలి దేశస్తుడు వెంకట రామారావు. ఇతడు రాబర్ట్ హుగ్స్‌కు దుబాసి. మరొక ఇంగ్లీషు అనువాదకుడు, దారుణ వ్యక్తి పాపయ్య. అసలు పేరు అక్కలమంటి నరసయ్య వీరితో బాటు ఇతర అధికార్లు కలిసి తమ పెత్తందార్ల అజ్ఞానాన్ని ఆసరాగా వాడుకున్నారు. చాకచక్యంతో రికార్డులు మసిపూసి మారేడుకాయ చేసి, యిష్టం వచ్చినట్లు అల్లేశాడు. బ్రిటిష్‌వారు, జమీందార్లు అనైక్యంతో ఉండడం గమనించి, దేశస్థుల పారంపర్య పెత్తనం స్థిరపరిచాడు. కాని సంస్కరణల ఫలితంగా, యితడి అవినీతి అంతా బయటపడగా, వెంకట రామారావుతో బాటు మచిలీపట్నం కౌన్సిల్ అధికారాలు పూర్తిగా పోయాయి. (ఎలియట్ నివేదిక).

మచిలీపట్నం తొలి కలెక్టర్ రాస్తూ, నమ్మకద్రోహం వలన తిట్టుకొని ప్రయోజనం లేదు. రహస్య నిధులు సమకూర్చుకునే అధికారులు విపరీత కాంక్షతో చేస్తారు. అలాంటి వారు నిగ్రహశక్తి కనబరచడం, ఆధ్యాత్మికతతో ఉంటుంది. తప్పు చేసినందుకు శిక్షపడడం ముఖ్యం కాదు. అదృష్ట

రేఖ బాగా లేక పట్టుబడడమే కర్మ అంటారు. (ఓక్స్ రచన 1798 జూన్ 9).

స్థానిక పెత్తందారీ పాలనలో తరువాత అత్తూరి వెంకటాచలం వచ్చి చేరాడు. మామూలు జనాన్ని రాబందువలె పీక్కుతిన్నాడని రాశారు.

(రత్నస్వామి, ఇన్‌ఫ్లూయన్సస్ దట్ మేడ్ ది బ్రిటిష్ అడ్మినిస్ట్రేటివ్ సిస్టం. ఇక ఇన్ ఇండియా - లండన్, లుజాక్ అండ్ కో 1929) కొన్నిసార్లు ఇతని ఇంటిపేరు అత్మూరి అనేవారు - మెకంజి రచన).

గుంటూరులో అతడే పాతకాలపు దుబాసి. అతడి కలెక్టర్ జార్జి ఎ.రాం కలెక్టర్‌గా వృద్ధాప్యంలో వుండి అతడినేమీ మార్చలేక పోయాడు. ఇద్దరూ కలసి ఆరేళ్ళపాటు జిల్లాను దున్నేశారు. చివరకు జనవరి 1800లో అసమర్థులుగా వారిని తొలగించారు. అయినా తెరవెనుక మరో 10 ఏళ్ళపాటు అత్తూరి వెంకటాచలం సాగించుకున్నాడు. (ఎలియట్ నివేదిక).

చివరకు పొందిక లేక గుంటూరులో బ్రిటిష్ పెత్తనం బలహీన పడింది. మచిలీపట్నం ప్రావిన్షియల్ కౌన్సిల్ అజమాయిషీలో తొలుత వుంచారు. మదరాసు గవర్నర్ కింద వుండాల్సిన యీ కౌన్సిల్, ప్రమాదకరంగా స్వతంత్ర ధోరణి అవలంబించింది. మద్రాసులో అధికారులు వారి అంతఃకలహంతో మచిలీపట్నం కౌన్సిల్‌ను ఏమీ చేయలేకపోయారు. ఒక విచారణ సంఘాన్ని నియమిస్తే మోసాలు, రెవిన్యూలోపానికి కారణాలు చూపారు. విచారణ ముగియక పూర్వమే సంఘ ప్రధాన అధికారి శాడ్లియర్, అతని తరువాత డోబిన్ చనిపోయారు. మిగిలిన వారు రాజీనామా యిచ్చారు. లేదా తొలగించబడ్డారు. 1794లో మచిలీపట్నం కౌన్సిల్ రద్దు చేశారు. అక్కడ నుండీ మద్రాసు రెవిన్యూ బోర్డుకు కలెక్టర్‌ను జవాబుదారీ చేశారు. పగోడా పద్ధతిలో వాణిజ్య

కార్యక్రమాన్ని రద్దు పరచారు. అవినీతిని తుడిచిపెట్టదలచారు.

(మెకంజి రచన - రాజ్యాంగపరమైన స్థితికి సర్ కోర్ట్ నీ ఇల్ బర్ట్ రాసిన - ది గవర్నమెంట్ ఆఫ్ ఇండియా - హిస్టారికల్ సర్వే - ఆక్స్‌ఫర్డ్ 1922 పేజి 68-70 ఎ.బి.కేత్, ఎ కాన్సిస్టూషనల్ హిస్టరీ ఆఫ్ ఇండియా, లండన్ 1936-చూడాలి).

ఎవరి సహకారం అత్యవసరమో ఆ స్థానిక జనాలకు సంస్కరణలు సోకలేదు. జిల్లావనరులు, భూ ఆదాయ పూర్తి వివరాలకు గాను జిల్లా కలెక్టర్ జార్జి రాంకు కేవలం భాషా పాండిత్యం వున్నంత మాత్రాన గుంటూరులో సరిపోలేదు. ఇనాంభూముల యజమాన్యాలు నిర్మించదలచారు. అప్పుడు కచ్చితంగా భత్యాలని నిర్ధారించ వచ్చునుకున్నారు.

(రాం సర్క్యులర్ - అందరి కలెక్టర్లకు మే1795) చాలా శ్రమించి 8 సంపుటాల ఇంగ్లీషు రిజిస్టర్‌ను రాం సిద్ధం చేశాడు. అది సంతృప్తికరంగా లేదు. 1800లో రాంను తొలగించి, విలియం గార్డర్‌ను కొనసాగించ మన్నారు. కానీ ఏమీ సాధించలేకపోయారు. గుంటూరు జిల్లాలో శాశ్వత సెటిల్మెంట్ చేసిన కలెక్టర్ యాండ్రు స్కాట్ వలన కొంత రికార్డు దక్కింది.

గుంటూరులో బ్రిటిష్ పాలన గురించి లభించిన పాత రికార్డు, కొండవీటి సమితి దేశపాండే నాటి 1789లో యాండ్రూ శాడ్లర్‌కు సమర్పించినది మాత్రమే. దీని వలన ఇనాం దార్ల పేర్లు తప్ప, ముర్తుజానగర్ సర్కారు ఇనాంలు, భూములు, గ్రామాలు, సమితులు తెలిశాయి. శాశ్వత సెటిల్‌మెంట్‌కు ముందు ఆరేళ్ళపాటు సమితి దేశపాండేలు జమాఖర్చులు వున్నాయి. వృధా అయిన ఖర్చుల వివరాలు అస్పష్టంగా దొరికాయి. సాగు భూములు, పన్నులు వేయని భూములు,

పంటలు, పశువుల నాగళ్ళు, జనాభా వివరాలు ఉన్నాయి. లోగడ చేసిన మాసూలు వసూళ్ళ వివరాలున్నాయి. (ఎలియట్ నివేదిక) అయితే ఆ లెక్కలో దిద్దుబాట్లున్నందున, అనుమానాస్పదాలయ్యాయి.

కోరిక సమాచారం రాబట్టడం గుంటూరు పాలనలో బ్రిటిష్‌వారికి ఇబ్బందిగానే ఉండేది. ముఖ్యంగా పన్ను మినహాయింపులు, ఇనాంలు, సంపన్నుల భూముల విషయంలో చిక్కు ఉండేది. రాం ఇంగ్లీషు రిజిస్టర్ పై ఆధారపడ వీల్లేదు. అంతకు మించి ఇనాంల వివరాలు ఎక్కడా లేవు. సమాచారాన్ని రహస్యంగా అట్టిపెట్టడం స్థానికుల అభిలాష. ప్రమాణ కొలమానాలు గ్రామాలలో ఏ రీతులు వినియోగించారనేది స్పష్టపడలేదు.



# అధ్యాయం - 4

# రెవిన్యూ పద్ధతి

(జమీందారీ భూములు 1802-1837)

గుంటూరు జిల్లాపై బ్రిటిష్‌వారి పెత్తనమంతా రెవిన్యూ పాలనపై ఆధారపడింది. రెవిన్యూ ఆదాయం వ్యవసాయ మాసూళ్ళ ద్వారా, సరయూ విధానం వల్ల వచ్చింది.

(హెచ్.హెచ్. విల్సన్ గ్లోసరీ ఆఫ్ జ్యుడిషియల్ అండ్ రెవిన్యూ టరమ్స్ - కలకత్తా 1855)

దేశంలో ఆదాయం పరిశ్రమలు, వాణిజ్యం పై గాకుండా , వ్యవసాయం మీద ఆధారపడుతుండగా, రెవిన్యూ అంతా అక్కడ నుండే వస్తుంది. అక్కడ నుండే అధికారం లభిస్తుంది. బ్రిటిష్‌వారు రాకపూర్వం భూమిపై ఏమేరకు రెవిన్యూ వచ్చింది, రాజకీయ చిత్రాల్ని అది ఏ విధంగా సమర్థించింది. సైనిక పాలనా చట్రాన్ని ఎలా పోషించింది. రాజరికాల ఖర్చులను ఎలా భరించింది. ఆలోచిస్తే, పండితులను కలవరపరిచే విషయంగానే వుంది. రాజకుటుంబాలకు హవేలీ భూములుండేవి. మిగిలిన భూములు కవుళ్ళకు యిచ్చేవారు. వీటిపై తాత్కాలికంగా, శాశ్వతంగా డబ్బు వసూళ్ళు జరిగేవి. రాజకీయంగా జాగీర్లు

ఇచ్చేవారు. మిగిలినవి జీతాలకు బదులు కవుళ్ళుగా యిచ్చేవారు. ఇందులో మత సంస్థలకు, పాఠశాలలకు, వినోదాలకు ప్రభుత్వ వుద్యోగులకు కట్టబెట్టేవారు. జిల్లాలో 10వ వంతు గ్రామాలు బ్రాహ్మణ అగ్రహారాలుగా వుండేవి.

వీటన్నిటిని బట్టి వికేంద్రీకరణ కనిపిస్తుంది. హైదరాబాద్ గోల్కొండ పాలకులు చాటుకున్నట్లుగాక, అధికార దత్తత, స్థానిక బలం, చిన్న విభాగాలుగా విడగొట్టడం స్పష్టంగా వున్నది.

మరొక భావన ప్రబలివున్నది. అదేమంటే రాజు (రాజ్యం) సర్వాధికారి అని, భూములపై యాజమాన్యం వారిదేనని, సాగుదారులు రాజుకు పన్ను చెల్లించాలని, ఉత్పత్తిలో కొంత రాజ ప్రాసాదానికి చేరాలని ఇందులో లోహాల రూపేణ కూడా చేరుతుందని భావించారు.

ఎఫ్.డి. అస్కోలి - ఎల్లి రెవిన్యూహిస్టరి ఆఫ్ బెంగాల్ అండ్ ది ఫిఫ్త్ రిపోర్ట్ 1812 - ఆక్స్‌ఫర్డ్ 1917 పేజి 42-53, 54-62 : రంజిత్ గుహ : ఎ రూల్ ఆఫ్ ప్రాపర్టి ఫర్ బెంగాల్ - పారిస్ 1963 పి. శరణ్ - ది ప్రొవిన్షియల్ గవర్నమెంట్ ఆఫ్ మొగల్స్ 1525-1658 - అలహాబాద్ 1941 పే.249) కాని అలాంటివన్నీ సరికాదని స్థానిక స్థితిగతులు పరిశీలిస్తే అర్థమౌతుంది. ఇండియాలో భూమికంటే, భూమిలో ఏది పండుతుందనేది అతి ముఖ్యంగా స్వీకరిస్తారు. కేంద్ర ప్రభుత్వం బలహీనపడితే, అది రెవిన్యూలో తెలుస్తుంది. రాజుకు ఆదాయం తగ్గితే, ఆ మేరకు స్థానిక శక్తులకు ఆదాయం లభిస్తుంది వారు బలపడతారు.

ఏమైనా రాజకీయ శక్తులు ఎప్పుడూ పనిచేస్తూనే పోయాయి. నాట్లు వేయకముందే భాగాలు పంచుకోవడం సరేసరి. నూర్పిడి దగ్గర పడేకొద్దీ ధాన్యం పంపిణీ సంగతి ముమ్మరంగా ఆలోచించారు. వసూళ్ళు

చేసేవారు ఫిర్యాదులతో, లంచాలతో, బేరాలతో ముందుకొచ్చేవారు.

పంట నూర్పిడి పూర్తికాగానే, పెద్ద మొత్తాలు వసూళ్ళు జరగవలసి వుందనే లెక్కలు చూపుతారు. కేవలం భయం వలన రెవిన్యూ వసూళ్ళ కుంభకోణాలు కొంత అదుపులో వుండేవి.

(జేమ్స్ గ్రాంట్ రచన)

ఇతరత్రా వచ్చే రెవిన్యూ కూడా వసూళ్ళలో చాలా జటిలంగానే వుండేది. వ్యవసాయేతర ఉత్పత్తులపై పన్నులు నిర్దుష్టంగా ఉండేవి. హైదరాబాద్ సరిహద్దులలో సుంకాలు వత్తిడి చేసేవారు. ప్రతి రేవులో సముద్ర సుంకాలుండేవి. రవాణా సరుకులపై దిగుమతి పన్నులు, టోల్ సుంకాలుండేవి. వంతెనలు, ఫెర్రీలు, రోడ్లు వద్ద అడ్డుపెట్టి వసూళ్ళు చేసేవారు. ఇళ్ళు, షాపులు, దుకాణాలు, వ్యభిచార గృహాలు, సారా షాపులు, మందుల దుకాణాలపై పన్నులుండేవి. మత ఉత్సవాలపై, దేవాలయాలపై, క్రతువులపై, పండగలపై పన్నులుండేవి. కోర్టు లంచాలలో భాగం ఉండేది. జప్తులపై కొంత వసూళ్ళువుండేవి. బ్రిటిష్ వారు రాకపూర్వం అదీ స్థితి.

వత్తిడి చేసిన రెవిన్యూ, చేతికందిన మొత్తాలు చాలా తేడా చూపేది. విచ్ఛిన్న దశలో వ్యవసాయేతర వసూళ్ళు దారుణంగా వుండేవి. అదే వృత్తి కళాకారులపై వివిధ రకాల వత్తిళ్ళు పడేవి. అలాంటివి ఎక్కువకాలం సాగితే, వాణిజ్య పరిశ్రమ స్తంభించేది. అయినా వ్యాపారం సాగేది. ఏమేరకనేది తరువాత సంగతి.

గుంటూరులో శాశ్వత, జమీందారీ సెటిల్‌మెంట్స్, పాలనా సంబంధమైనదే. నికరాదాయం కోసం చేసిన ప్రయత్నమది. ఒక రకంగా

అధికారాన్ని దత్తత చేయడమే అదొక విధమైన పరోక్ష ప్రభుత్వ రీతి. భూమిని ఫ్యూడల్ పద్ధతిలో కౌలుకు ఇవ్వడమన్నమాట. ఆ విధానంలో నిరంతర రెవిన్యూ వచ్చే రీతిలో పర్యవేక్షణ నిషిద్ధాలు, వ్యవస్థీకరణ, వ్యక్తుల ఎంపిక వుండేది. మొదట బెంగాల్‌లో కారన్‌వాలీస్ ప్రవేశపెట్టగా తరువాత మద్రాసులో లార్డ్ వెల్లస్లీ అమలు చేశాడు. లార్డ్ క్లైవ్ క్రింద స్థానిక ఏజెంట్లు భూమి రెవిన్యూ పాలన చేబట్టారు.

భూస్వామి, ఆస్తిపరుడు, సొంత హక్కు అనేవి ఇంగ్లీషువారు తెచ్చిన భావనలే. జమీందారీ వ్యవస్థను రూపుమాపే తీరు యిందులో వుంది. నికరాదాయం, నిరంతరరాబడి తగిన లాభాలు అనేవి బ్రిటిష్‌వారు స్వదేశీ సంస్థానాలలో చొప్పించి, పరిశ్రమల్ని ప్రోత్సహించారు.

(యాండ్రూ స్కాట్ - రచన)

ఈ హక్కుని కాపాడే స్థానిక స్వతంత్ర శక్తి ఏదీ తలెత్త లేదు. అది దత్తం చేసిన పెత్తనం, విదేశీభావన. అలా యిచ్చిన హక్కులు అలానే తీసుకోవచ్చు కూడా.

గుంటూరు జమీందార్లు వంశపారంపర్యంగా భూములు అట్టే పెట్టుకొని నిర్ధారిత సొమ్మును శాశ్వతంగా బ్రిటిష్ కలెక్టరుకు చెల్లించాలన్నారు. గుంటూరు జమీందార్లను వంశపారంపర్య జిల్లా అధికారులుగా పరిగణించి, వారికి సనద్ అనే బిరుదులు ఇచ్చారు.

(మతాదారి అనే అసాధారణ బిరుదులు. సంస్థానం అనేది శాశ్వత బిరుదు. అది మార్చడానికి వీల్లేదు.

బి.హెచ్. బాడెన్ - పావెల్ - ది లాండ్ సిస్టమ్స్ ఆఫ్ బ్రిటిష్ ఇండియా, ఆక్స్‌ఫర్డ్ 1892 పేజి 654-8) వారు భూమిపై రెవిన్యూకు బాధ్యులు. ఇతర రెవిన్యూలతో వారికి సంబంధం లేదు. పోలీస్, న్యాయవ్యవస్థతో

నిమిత్తం లేదు. ఏడాదిలో నూర్పిడి పంటగాని, పెట్టుబడి, శ్రమగాని పరిగణనలోకి స్వీకరించలేదు. ప్రతి జమీందార్లు మార్పిడిలో సగం వసూలు చేయాలి. మూడింట రెండు వంతులు ప్రభుత్వానికివ్వాలి. మిగిలింది అట్టిపెట్టుకోవచ్చు. ప్రభుత్వ వాటాకు విలువగట్టి నిర్ధారించారు. అది తిరుగులేనిది. సంప్రదాయాన్ని బట్టి గ్రామస్తులతో వ్యవహరించాలి. వీరిని నిర్దాక్షిణ్యంగా భూమి నుండి తొలగించకూడదు. (యాండ్రుస్కాట్, ఆగస్టు 27, 1800)

హవేలీ భూముల్ని ముత్తాలుగా విభజించి, జమీందార్లకు యిచ్చి, బదులుగా రెవిన్యూ తీసుకునేవారు.

(గార్డన్ మెకంజి - ఎ మాన్యువల్ ఆఫ్ క్రిష్ణా డిస్ట్రిక్ట్, 1883, పే.347-8)

1801 డిసెంబరు 29న బోర్డు ఉత్తరువును బట్టి, ఆండ్రు స్కాట్ సనద్‌ల విధానంలో ఆస్తి భావాన్ని తెచ్చాడు. దీనికి బదులు జమీందార్లు ఏటా యీ విధంగా రెవిన్యూ చెల్లించాలి.

| జమీందారు | కస్బా | గ్రామం | పేష్కస్ |
|---|---|---|---|
| 1. వాసిరెడ్డి | అమరావతి | 333 | రు. 5,40,737 |
| 2. మల్‌రాజు | నరసరావుపేట | 323 | రు. 3,38,792 |
| 3. మనూర్ రావు | చిలకలూరిపేట | 79 | రు. 1,26,700 |
| 4. మనూర్ రావు | సత్తెనపల్లి | 80 | రు. 1,26,700 |
| 5. మాణిక్‌రావు | రేపల్లె | 67 | రు. 92,528 |
| | మొత్తం | 882 | రు.12,25,458 |

పై పద్ధతి అమలు జరగాలనే ఆశతో, ప్రభుత్వానికి రావలసిన 40 లక్షల రూపాయలు వదులుకున్నారు. మచిలీపట్నంలో ఆర్మీనియన్, కొమర్తి ఫైనాన్సెస్‌కు రావలసిన 50 లక్షలు రద్దు చేశారు. మొదటి 8 సంవత్సరాలు పూర్తి చెల్లింపు అవసరం లేదన్నారు.

(గోల్డింగం నివేదిక కాటన్‌కు - పేరా 10. 13 డిసెంబరు 1839, ఎలియట్ రిపోర్టు.)

జేమ్స్ గ్రాంట్ తన పొలిటికల్ సర్వే ఆఫ్ ది నార్తరన్ సర్కార్స్‌లో, గుంటూరుకు హుస్సేన్ అలీ యిచ్చిన అంచనా యిలా వుంది.

| జమీందారు | గ్రామాలు | మద్రాసు పగోడాలు |
|---|---|---|
| 1. వాసిరెడ్డి | 300 | 1,32,000 |
| 2. మల్‌రాజు | 230 | 70,000 |
| 3. మాణిక్‌రావు | 180 | 75,000 |
| 4. మనూర్‌రావు | 150 | 68,000 |
| 5. కొల్లూరు (అదృశ్యం) | | 6,000 |
| | 860 | 3,51,000 |

గుంటూరులో కంపెనీ పాలన సాగిన తొలి 12 ఏళ్ళలో, 11 లక్షలకు గాను 9 లక్షల రూపాయలు వసూలు చేయగలిగారు.

రాజకీయ అచకత్వంలో అలవాటు పడిన జమీందార్లు, బ్రిటిష్ విధానాల్ని హర్షించలేకపోయారు. కొత్త విధానంలో సాలీనా కలెక్టర్లకు యివ్వవలసిన దానికంటె, ఎక్కువ సొమ్ముతో సాలీనా అనుభవించారు.

(గోల్డింగం నివేదిక.

ఎ.డి.కాంప్ బెల్, ఎ న్యు ఎడిషన్ ఆఫ్ ది కోడ్ అఫ్ రెగ్యులేషన్స్ ఫర్ ది ఇంటర్నల్ గవర్నమెంట్ ఆఫ్ మద్రాస్ టెరిటరీస్ 1840 మద్రాసు)

ఫలితంగా జమీందార్లు అంతకు ముందులేని విలాసాన్ని అనుభవించారు. 15 ఏళ్ళపాటు ఒకరిని మించి మరొకరు వ్యవహరించారు. అన్ని భాగాలు అనుభవించారు. వారి సాలీనా ఖర్చులతో 13 దేశీయ దళాల్ని పోషించవచ్చు.

(ఎలియట్ రిపోర్టు)

వాసిరెడ్డి గొప్పవాడు. వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు సంపద ఆశ్చర్యకరం. తన కింద గల 551 గ్రామాలకు చెల్లింపు కాలక్రమంగా యిచ్చేవాడు. అందులో 333 గుంటూరు జిల్లావి. అతని కింద వేలాది సేవకులు, 300 గుర్రాలు, 80 ఏనుగులు, 50 ఒంటెలు లెక్కలేనన్ని ఎడ్ల బండ్లు వుండేవి. అమరావతి, చేబ్రోలు, చింతపల్లి, గుంటూరులో అతడి భవనాలు, ఇతర గృహాలు అతడి సంపదకు చిహ్నాలు.

దేవాలయాలు నిర్మించాడు. మంగళగిరిలో గోపురం కట్టించాడు. అనేక దేవాలయాలలో ఇత్తడి పూత స్తంభాలు 30 అడుగుల ఎత్తు గోపురాలు కట్టించాడు. రోజూ వందలాది వైదిక పురోహితులకు భోజనం పెట్టించాడు. పండిత సాధువులకు బంగారం, షాల్స్, ఆభరణాలు దానం చేశాడు. రాత్రింబవళ్ళు తనకోసం ప్రార్థనలు చేయడానికి స్వాములను నియోగించాడు. పండుగలు, యజ్ఞాలు, యాగాలు, వివాహాలకు ఆశ్చర్యకరంగా వ్యయం చేశాడు. తన ఎత్తు బంగారం, వెండి తూగి బ్రాహ్మణులకు అనేక పర్యాయాలు దానం చేశాడు. ఉత్సవాలలో పవిత్రదినాలలో గ్రామ నాయకులకు, వారి భార్యలకు వస్త్రాలు, ఆభరణాలు బహూకరించాడు. తాను చెల్లించాల్సిన రెవిన్యూ

ముందుగానే చెల్లించాడు. తన తీర్థయాత్రల నిమిత్తం గుంటూరు ట్రెజరీలో 1.95 లక్షల రూపాయలు దాచి, అవసరమైనప్పుడు ఉపసంహరించడానికి ఉద్దేశించాడు. కాశీలో ఉండగా మాజీ పీష్వా బాజీరావుకు సమృద్ధిగా బహుమతులు యిచ్చాడు. రామేశ్వరం నుండి తిరిగివచ్చిన తరువాత, ఒక లక్ష పగోడాలు నజరాగా నిజాంకు యిచ్చాడు. అందుకు మారుగా తన బిరుదు మానూరు సుల్తాన్ స్వీకరించాడు. (గోల్డింగం నివేదిక).

మిగిలిన గుంటూరు జమీందార్లు ఆయన దారిలో కొంచెం తక్కువ స్థాయిలో పోయారు. ఆయనకు దీటుగా మల్‌రాజు వ్యవహరించాడు. మల్‌రాజు గుండారావుకు 100 ఏనుగులు వుంచాడు. కోటప్ప కొండ తిరునాళ్ళకు వారసత ్వప్రతినిధి అయ్యాడు. మనూరు రావు, మాణిక్‌రావుల కుటుంబాలు వంశపారంపర్యతకు జుట్లు పట్టుకున్నారు. 61 (గోల్డింగం నివేదిక).

రాజ్యాల పతనావస్థ కొద్ది స్థాయిలో జరిగింది. జనానాలో విషం యిచ్చి చంపడం, యుద్ధాలు, లోలోన విద్రోహాలు, కుట్రలు బాగా పరిమితం అయ్యాయి. బ్రిటిష్ పాలనలో కుటుంబాలు, వారి సేవకులు పథకాలు అల్లి, జిల్లా సంపద కోసం పెనుగులాడారు. వాసిరెడ్డి మరణంతో పరాకాష్ఠకు చేరిన యీ పరిస్థితి, పిండారీల దోపిడీలతో మరీ ఎక్కువైంది.

1816లో వాసిరెడ్డి మరణించే నాటికి, ఇరువురు దత్తపుత్రులు, 551 గ్రామాలు, అనేక భవనాలు, 55 లక్షల విలువగల చరాస్తులు వున్నాయి. ఇవన్నీ దేశస్త దివాన్ల చేతిలో మిగిలాయి. ఆ తరువాత జరిగిన ఘర్షణలు తల దిమ్మెక్కిస్తాయి. చరాస్తులు రెండేళ్ళలో హరించాయి. వారసత్వ ఘర్షణ 30 ఏళ్ళు సాగింది. (గోల్డింగం నివేదిక) ఈ పోరాట వైవిధ్యం

పరమపద సోపాన పటంలో ఆట వలె జరిగింది. హిందూ చట్టాలు, కోర్టుల తీర్పులు 113 పేజీల చరిత్రగా మిగిలింది.

(ఎడ్మండ్ ఎఫ్. మూర్ (ఎడిటెడ్) రిపోర్ట్స్ ఆఫ్ కేసెస్, హర్డ్ అండ్ డిటర్మిన్డ్ బై ది జ్యుడిషియల్ కమిటి ఆఫ్ ది ప్రీవి కౌన్సిల్ ఆన్ అప్పీల్ ఫ్రం ది సుప్రీం అండ్ సదర్ దివాని కోర్ట్స్ ఇన్ ది యీస్ట్ ఇండీస్ IV - 1846 - 1850 లండన్ - స్టీ ఫెన్స్ అండ్ నార్టన్ 1930.)

ప్రీవీ కౌన్సిల్ తుది నిర్ణయం యిచ్చేసరికి ఆ విషయానికి ప్రాధాన్యత పోయింది. సంపద అంతా హరించింది. జమీందారీలను వేలం వేశారు. పోటీదార్లలో చాలా మంది చనిపోయారు. ఇరువురు దేశస్త కుటుంబాలు అత్యంత సంపన్నులుగా తేలారు.

(ఎడ్మండ్ ఎఫ్, మూర్, మెకంజీ రచన)

314 గ్రామాలు గల జగన్నాధ బాబును సబ్నవిస్ అనంతరావు రెచ్చగొట్టి, రామనాధ బాబుకు చెందిన 237 గ్రామాలు కోరమన్నాడు. పొత్తూరి కాళి దాసారావు కాస్తా రామనాధ బాబును వెనకేసుకొచ్చాడు. ఇద్దరు దివాన్లు కలహం కొనసాగించారు. పండితులను పిలిపించారు. సాక్షులకు లంచాలిచ్చారు. మంత్రాలు కొనుగోలు చేశారు. వినోదం సమకూర్చారు. యువ వారసులకు ధనం యిచ్చారు. బాంకర్లు దావా వేసే దాకా జగన్నాథ బాబు అప్పులు తెచ్చాడు. గోపురాల నుండి వెండి, బంగారాలు వలిచారు. (ఎలియట్ నివేదిక, గవర్నర్ మన్రో పర్యటనకు వచ్చినప్పుడు, ఇరు పక్షాలు అలసి, రాజీకి సిద్ధపడ్డారు. కాని వారి దివాన్లు పడనివ్వలేదు. (ఎ.జె.ఆర్బత్ నట్, సెలక్షన్స్ ఫ్రం మినిట్స్ అండ్ అదర్ అఫిషియల్ రైటింగ్స్ ఆఫీసర్ థామస్ మన్రో, మద్రాసు 1886).

1826లో జగన్నాథ బాబు చనిపోయాడు. ఆయన విధవ భార్య

లిరువురూ పోటీ పడ్డారు. ఒకామె తన కుమారుడే వారసుడు కావాలన్నది. ఆ తరువాత 15 ఏళ్ళపాటు, దత్తపుత్రుడు చావా లక్ష్మీపతి, రంగమ్మల్ని సబనలీస్ కుటుంబం రెచ్చగొట్టింది. అచ్చమ్మ, పొత్తూరి కాళిదాసు, రామనాథ బాబులకు వ్యతిరేకంగా ఘర్షణపడ్డారు. 1832 కరువు అనంతరం, కోర్టు తీర్పు ప్రకారం రామనాథ బాబును ఇన్‌ఛార్జిగా ఎస్టేట్‌కు పెట్టారు. కాని అతనికి అది నడిపించే సత్తా లేదు. జమీందారీ మళ్ళీ ప్రభుత్వపరం అయింది.

(మెకంజి, గోల్డింగం నివేదికలు)

ఇతర జమీందార్ల స్థితి కూడా వాసిరెడ్డిని అనుసరించే సాగింది. అజమాయిషీ స్థానే విలాసం చోటు చేసుకున్నది. వారసత్వానికి జరిగిన పోటీలో మరణాలు జరిగాయి. అప్పులు పెరిగాయి. రెవిన్యూ పడిపోగా కలెక్టర్ వారి మఠాలను ఆదుకోవలసి వచ్చింది. (గోల్డింగం రిపోర్టు)

జమీందారీ పాలన దివాన్లకు అప్పగించారు. 1832లో మొదలైన కరువు వారి పని చాలించింది. 1837 నాటికి జమీందారీలు అధ్వాన్న మయ్యాయి. 43 లక్షలు సర్కారుకు యివ్వదేలారు.

శాశ్వత సెటిల్‌మెంట్ ప్రకారం రైతుకు కీలక స్థానం యిచ్చారు. అధికారుల దాడులకు రైతులు గురికాకూడదన్నారు. పొలం విత్తడం, పంట నూర్పిడి అంతా తన కుటుంబ సంక్షేమానికి అనే భావన రైతుకు ఏర్పడాలన్నారు. శ్రమించే రైతు వర్గం మితమైన కవుళ్ళతో కొనసాగాలన్నారు.

అయితే రైతును గుర్తించడంలో స్పష్టత వున్నది. పేద అజ్ఞాన రైతు మొదట పెద్ద సాగుదారు వరకూ యిందులో యిమిడివున్నారు. రాయలకూ రైతుకూ మధ్య గందరగోళం వుంది, గ్రామంలో కూలి నుండి

మోతుబరి రైతు వరకు అందరినీ ఒకే గాట కట్టేశారు. ప్రభావంగల కొద్దిమందికే రైతు అనేది పరిమితం. గ్రామరాయలు అతను. తక్కువ పనులు, కూలీ పనులు అతడు చేయడు. నిర్ణయాలు తీసుకోవడం, ఒప్పందాలు కుదుర్చుకోవడం అతని పని. గ్రామంలో అతడు పెద్ద. అంటే కరణం, గ్రామపెద్ద, మునిసిఫ్ కొన్ని సందర్భాలలో యివన్నీ కలిపి అని అర్థం చేసుకోవాలి.

(గోల్డింగం నివేదిక)

శాశ్వత సెటిల్‌మెంట్‌కు ముందు ప్రభుత్వం ఎదుర్కొన్న పరిస్థితినే, జమీందారు కూడా పాలనలో ఎదుర్కొన్నాడు. క్రింది స్థాయిలో ఏమేరకు అజమాయిషీ చేయాలి. ఎంతవరకు అధికారులు యితరులకు యివ్వాలనేది సమస్య.

కేంద్రీకృత విధానంలో దివాన్ ఆ పని చూసుకునేవాడు. వకీల్, దేశపాండేలు చూసేవారు. అందరూ జమీందారుకు జవాబుదారీ. వికేంద్రీకరణలో కౌలుదార్లు పోటీపడి తీసుకునేవారు. వీరిని ఇజార్ దార్లంటారు. వారికీ అలాంటి సమస్యలే ఎదురయ్యాయి.

గ్రామాలలో సెటిల్‌మెంట్ విషయమై అవలంబించిన పద్ధతులు కలగా పులగంగా వున్నాయి. ప్రతి గ్రామం దేనికదిగా వుండేది. ఇజార్‌దార్, జమీందార్ సేవకులబట్టి పద్ధతులు వుండేవి. కొన్ని గ్రామాలలో మా వెతా పద్ధతి ప్రవేశపెట్టారు. ఉత్పత్తిలో ప్రమాణయుత పద్ధతులంటూ లేవు. డబ్బు చెల్లించాల్సిన పని లేదు. ప్రతి ఏటా రైతుతో ఒప్పందం కుదుర్చుకునే వారు. సాధారణంగా కరణం, ఇజార్‌దార్ బాధ్యత వహించేవారు. గ్రామంలో జరిగిన ఉత్పత్తి యావత్తూ గణనలోకి తీసుకుని, భాగం తీసుకోవడం, కొంత రెంట్ నిర్ణయించడం గానీ జరిగేది. దరఖాస్త్

యీ నిర్ణయం చేసేవాడు. లేదా ప్రతి రైతుకూ యింత అని నిర్ధారించేవారు. రైతులు , జమీందారు ఏజంట్లు పరస్పరం అనుమానిస్తూనే వుండేవారు. మాసూల్‌దార్లు, అంచనాదార్లు, కౌలుదార్లు పంటపై కన్నువేసి వుంచేవారు. కుప్పలు పంచుకున్నప్పుడు, ప్రతివారికీ వాటా వచ్చేది. దీనిని గ్రామవారీ విధానం అనేవారు.

జమీందార్ల తల బిరుసుతనం వలన వారికీ రైతులకూ సహకారం సరిగా సాగలేదు. బ్రిటిష్‌వారితో ఒప్పందం విషయమై పేచీలుండేవి. జమీందార్లు గ్రామాలను బాగా దోచుకునేవారు. జమీందార్లకు అందకుండా వీలైనంత దాయడం గ్రామ నాయకులపని. ఇందులో టక్కుటమారాలన్నీ ప్రయోగించేవారు.

జమీందారుకు కొన్ని పరిస్థితులు సానుకూలం అయ్యాయి. కులరీత్యా, మతాల వలన కొన్ని గ్రామాలు అనైక్యంగా వుండేవి. జిల్లాలో బ్రాహ్మణులు విపరీత ప్రభావం అనుభవించారు. వారిలోనూ కులశాఖల రీత్యా చీలికలు రాగా, ఒకరినొకరు ద్వేషించుకునేవారు. రాజులు లేదా తెలుగు రాజపుత్రుల తరువాత కాపులు, కమ్మ, తెలగాలున్నారు. తరువాత కొందరు శూద్రులున్నారు. కోమట్లు, బొందిలీలు, ముస్లిం వర్తకులు అటు పైకులాల, ఇటు కింది కులాలలో కూడా ద్వేషానికి గురైనారు.

సమాజ దిగువ స్థాయిలో ఒక డజను పైగా కులాలుండేవి. ఈ కులాలన్నీ అనవసరంగా ఒకరితో ఒకరు సంబంధాలు పెట్టుకునేవారు కాదు. ఇంకా దిగువ మెట్టున, పరస్పరం ద్వేషించుకునే మాల, మాదిగలుండేవారు. ఆహారం, వివాహం, దుస్తులు, సంభాషణ, సాంఘిక పద్ధతులన్నీ, కుటుంబం, గోత్రం, ఉపకులం రీత్యాసాగేవి.

(బాస్‌వెల్, జె.బి.నార్టన్ - ఎ లెటర్ టు లో అన్ ది కండిషన్ ఆఫ్

ది ప్రెసిడెన్సీ ఆఫ్ మద్రాస్ - పారో అండ్ కో, మద్రాసు 1854 పే.206)

గ్రామనాయకత్వంలో రండు మూడు కులాలున్నప్పుడు, అవి కలహాలకు దారితీసినప్పుడు, గ్రామ ఐక్యతను జమీందార్ దెబ్బతీసేవాడు. వారి కలహాల ఆధారంగా జమీందారు తన పబ్బం గడుపుకునేవాడు. జమీందారు వలన ఒక ముఠా బలపడగా మరో పక్షం దెబ్బతినేది.

మల్‌రాజు గుండారావు జమీందారు గ్రామాలలో ఆంక్షలు, బహుమానాలు అమలు పరచడంలో చాకచక్యం చూపాడు. పెద్ద రైతులు, కరణాలు, ఇజార్ దార్ల పారితోషికాలు అందుకునేవారు. వారిని ఉత్సవాలకు దర్బారుకు, తమాషాలకు పిలిచేవారు. వారిని, వారి భార్యలను వస్త్రాలతో, ఆభరణాలతో బహూకరించేవారు.

(అర్జి ఆఫ్ ఎస్.వి.కె.రావు అన్ ది సోషల్ అండ్ ఎకనమిక్ కండిషన్స్ ఆఫ్ గుంటూరు జిల్లా - గోల్డింగం నివేదిక)

గ్రామషావుకార్ల ద్వారా వారికి విత్తనాలు కొనుగోళ్ళకు తదితర అవసరాలకు రుణాలు యిప్పించేవారు. పెడసరిగా వున్న రైతుల్ని శిక్షించడం కద్దు.

వేళ్ళు చితగ్గొట్టే శిక్ష సాధారణంగా వుండేది. (రిపోర్టు ఆఫ్ ది కమిషనర్స్ ఫర్ ది ఇన్‌వెస్టిగేషన్ ఆఫ్ ఎలిజ్‌డ్ కేసెస్ ఆఫ్ టార్చర్ - మద్రాసు గవర్నమెంటు 1855 పి.బి.స్మోలెట్ - సివిల్ ఎడ్మినిస్ట్రేషన్ ఆఫ్ మద్రాస్ 1858 పే.1-34).

పూజలు, మంత్రాలు ప్రయోగించి దుష్టశక్తుల్ని ప్రకోపింపజేసి, రుగ్మతలకు దారి తీసేవారు.

(ఎలియట్ నోట్ బుక్స్ - రాబర్ట్ సెవెల్ - సర్ వాల్టర్ ఎలియట్ ఆఫ్ వెల్‌ఫెలి 1896 ఎడిన్ బరొ)

కౌలతలకు కొత్త సాధన, పాత బకాయి, ఉమ్మడిసాగు నిరాకరణ, శుభదినాలకు చందా, జంధ్యం, చెవులు కుట్టించడం యిలాంటివెన్నో ప్రయోగించి, రాబట్టేవారు. తాను తప్ప ఎవరూ సంపన్నులు కాకూడదని జమీందారు చూసేవాడు.

అయితే యీ పోరాటాలలో, జమీందారుకు సమైక్యంగా ఎదురుతిరిగిన గ్రామాలు లేకపోలేదు. ఒకే కులాధిపత్యం లేదా కొన్ని కులాల బలీయ సమైక్యత వున్న గ్రామాలలో మిగిలినవారు లోబడి వుండేవారు. లేక తరలి వెళ్ళిపోయేవారు. గ్రామ విజయానికి రహస్యం ఒక ఆయుధం లేదా లంచం యిచ్చేవారు. గ్రామ ఖర్చులలో యిది రహస్యంగా చూపేవారు. పన్నులు వేసిన పొలాల ఇనాంలు నెమ్మదిగా ఆక్రమించుకోవడం ద్వారా యివి అమలు జరిపేవారు. తనిఖీదారుల్ని కనుగప్పేవారు. పర్యవేక్షకులకు లంచాలిచ్చేవారు. అసలు రికార్డులు దాచేవారు. ఎంత సాగు జరిగిందో బయటపెట్టేవారు కాదు. రాత్రిళ్ళు పంటను తరలించేవారు. సంపదను పాతర్లు వేసేవారు. కేవలం తెలివిమాలిన రైతు మాత్రమేం తన సంపదను జమీందారుకు చూపేవాడు.

(డేనియల్ స్మిత్ - 1806 జూన్ 21 ఎలియట్ రిపోర్టు. జమీందార్ల గ్రామాలలో గ్రామ ఖర్చు చూపడం పరిపాటి).

నియమ నిబంధనలననుసరించి, గ్రామ "దక్షత్" నియామకాలు సరిగా నిర్ధారించలేదు. గ్రామ ఆఫీస్ నిర్ధారణ కాలేదు. రెవిన్యూ ఒప్పందాలు అమలు పరచేటట్లు లేవు జమీందారు కలెక్టర్ విధానాలకు మించి రైతులు వ్యవహరించేవారు. జిల్లా కోర్టులో రావలసిన వాటిని అర్జీ పెట్టుకునేవారు. శిక్షలు ప్రొవిన్షియల్ కోర్టు విధించేది. గ్రామ రహస్య చర్యల వలన, ఇంగ్లీషు వారి చట్ట చిక్కుల వలన పౌర, నేర చర్యలు

ఒక పట్టాన సాఫీగా సాగేవి కావు. వాజ్యాల వలన పేద రైతులు బాధపడ్డారు. గ్రామనాయకులు బాగానే వున్నారు. చట్ట లొసుగులు కరణాలకు, పెద్ద రైతులకు కొట్టిన పిండి.

(గోల్డింగం నివేదిక, ఎలియట్ నివేదికలో ప్రతి ఎస్టేట్ అమాని యాజమాన్య తీరులో వున్నది)



అధ్యాయం - 5

# రెవిన్యూ పద్ధతులు

## అమాని యాజమాన్యం 1800-1837

**1802**లో జమిందారీ సెటిల్మెంట్, మద్రాసు నిబంధనావళి కోడ్ వలన రెవిన్యూపాలనలో ప్రభుత్వం సరాసరి బాధ్యత వహించే తీరు, అధికారాలు తగ్గించేశారు. న్యాయ అదుపును వేరే పెత్తనానికి యిచ్చారు. పెత్తనంలో మూలస్థంభాలు జిల్లా కోర్టు, ఉత్తర ప్రొవిన్షియల్ కోర్టు.

(ఎ.డి.కాంప్ బెల్, ఎ న్యు ఎడిషన్ ఆఫ్ రెగ్యులేషన్స్ ఫర్ మద్రాసు, 1840 మద్రాసు; బి.బి.మిశ్ర ది సెంట్రల్ ఎడ్మినిస్ట్రేషన్ ఆఫ్ ది యీస్ట్ ఇండియా కంపెనీ - మాంచెస్టర్ 1959 పే 158) భూమిపై ఆదాయాన్ని జమీందార్లకు అప్పగించడం వలన ఇతర ఆదాయాలను పర్యవేక్షించడం కలెక్టర్లకు ప్రధాన పనిగా మిగిలింది.

ఇలా జరుగుతున్నప్పుడే, ఆర్కాటు నవాబు కొన్ని జిల్లాలను బ్రిటిష్ వారికి దత్తం చేయవలసి వచ్చింది. ఈ రాయలసీమలో గుంటూరుకు చేరువగా వుండే పల్నాడు కూడా చేర్చారు. 1801 ఆగస్టులో ఆ ప్రాంతాన్ని అదుపు వహించే బాధ్యత ఆండ్రూ స్కాట్‌దన్నారు. అక్కడ పరిస్థితులు కుదురుగా లేనందున అమానియాజమాన్య రీతిలో కలెక్టర్‌ను ధర్మకర్తగా

వ్యవహరించమన్నారు. పల్నాడును జమిందార్లకు పంచలేదు. (గార్డన్ మెకంజి. ఎ మాన్యుల్ ఆఫ్ కృష్ణా డిస్ట్రిక్ట్-1883).

ఆ తరువాత పన్నులు చెల్లించనందుకు జమిందార్ల ప్రాంతాలు కలెక్టర్ స్వాధీనమయ్యాయి. రానురాను జిల్లా యావత్తు కలెక్టర్ అజమాయిషీ లోకి వచ్చింది. న్యాయ, పోలీస్ అధికారాలు 1816లోనూ ప్రత్యేక న్యాయాధికారాలతో రెవిన్యూ విషయాలు చూడమని 1822, 1831 లోనూ కలెక్టర్‌ను పురమాయించడంతో, తిరుగులేని పెత్తనం యిచ్చినట్లయింది. (జె.ఎ.సి. బాస్ వెల్ - ఎ మాన్యుల్ ఆఫ్ నెల్లూరు డిస్ట్రిక్ట్ 1873 మద్రాసు పే 565)

కలెక్టర్ జిల్లా హుజూర్‌గా వుండగా సివిల్, నేర విషయాలు జిల్లా జడ్జీ వే.

అమాని యాజమాన్య సంక్రమణతో కలెక్టర్‌కు అనేక సమస్యలు ఎదరురయ్యాయి. 1800-1837 మధ్య యీ సమస్యలు మూడు తీరులుగా వచ్చాయి. జిల్లా సిబ్బంది అదుపు విషయం ప్రశ్నార్థకమైంది. గ్రామ నాయకులతో వ్యవహరించడంతో సమస్యలు తలెత్తాయి. అక్కరకొచ్చే లాండ్ రెవిన్యూ విధానం విషయమై గడ్డు సమస్యలు ఎదురయ్యాయి.

శాశ్వత సెటిల్‌మెంట్ అమలులోకి వచ్చిన తరువాత, గుంటూరులో కలెక్టర్ల అధికారాలు రెండు కారణాలుగా బలహీనపడ్డాయి. జమిందారు వ్యవస్థలో అనుభవజ్ఞులైన అధికారులు కావాలన్నారు. కాని అలాంటి వారు లభించడం తక్కువగా వుంది. కనుక అధికారుల్ని ఎంపిక చేయడంలో కలెక్టర్ల ప్రయత్నం, రెవిన్యూ విధానానికి అంతగా చాల్లేదు. బ్రిటీష్ కొంతకాలంపాటు స్థిరంగా వుంటే స్థానిక అనుభవం లభించేది.

కాని ఎవరూ ఆట్టేకాలం లేకుండా చాలా మందిని మార్చడంతో జిల్లాపై ఎలాంటి ప్రభావం లేకుండా పోయింది. (మెకంజీ నివేదిక)

గుంటూరులో అనుభవజ్ఞులైన బ్రిటిష్ అధికారులు లేకపోవడంతో భారతీయ అధికారులు బలపడ్డారు. జిల్లా కేంద్రంలో కొద్దిమంది దేశస్థ కీలక వ్యక్తులు వారి యిష్టప్రకారం వ్యవహారం నడిపారు.

గుంటూరుకు తాత్కాలిక కలెక్టర్‌గా ఫ్రాన్సిస్ రాబర్ట్‌సన్ రాకపూర్వమే, ఉప్పు శాఖలో గొడవ మొదలైంది. 1810 నాటి మాట అది. చినగంజాం అనేకమంది అధికారుల్ని మార్చి వేశారు. అత్తూరి వెంకటాచలాన్ని వెనక్కు జరిపి, అక్కలమనాటి నరసయ్యను ఇన్‌చార్జి చేశారు. అభ్యంతరాల మధ్య తన చర్యను థామస్ జారెట్ సమర్థించుకున్నాడు. అనూహ్యంగా వ్యవహరించాడని బోర్డు భావించింది. ఉప్పు శాఖకు సంబంధించి ప్రతిజిల్లాలో ఫిర్యాదులు రావడం, కలహప్రియుల ఫిర్యాదుల్ని బోర్డు అంతగా పరిగణించలేదు.

రాబర్ట్‌సన్ వచ్చీరావడంతో, డబ్బు కాజేసినందుకు హుజూర్ ష్రాఫ్‌తూను గుంట్ల నమశ్శివారావును తొలగించాడు. తరువాత హుజూర్ సిరస్తిదార్ తండకి లక్ష్మీనారాయణరావును సస్పెండ్ చేశాడు. దినచర్య రాసే వ్యక్తిని యిరికించాడు. సాక్ష్యాధారాల పత్రాలు చెరువులో దాచినట్లు కనుగొన్నారు. చాలామంది హుజూర్ కచేరీ వ్యక్తుల్ని యిరికించాడు. అయితే వారందరూ హెడ్ గుమస్తాల చేతిలో కీలుబొమ్మలు గనుక, అందరిపై తక్షణ చర్య తీసుకోనన్నాడు. (రాబర్డ్ సన్ ఫిబ్రవరి 4-21-1811)

వీటన్నిటిలో రాబర్ట్‌సన్‌కు తోడ్పడిన దేశస్థ, ఒక ముఠాకు చెందిన వాడు. కచేరిలో కీలకస్థానం ఆశించి చేశాడు. అతడే సబ్నవీస్ కేశవరావు. అతడి కుటుంబానికి మచిలీపట్నంలో చాలా ఆస్తులున్నాయి. అక్కడే

వారికి ఆసక్తి వున్నది. అతని బంధువులలో ఒకరు వాసిరెడ్డి జమిందారు దివాన్. మరొక బంధువు మచిలీపట్నం నవాబు దివాను.

(ఎలియట్ నివేదిక)

ఆండ్రూస్కాట్ ప్రకారం మాణిక్‌రావు దివాన్ అవినీతి పనులలో అత్తూరి వెంకటాచలంతో కుమ్మక్కై అయ్యాడు.

(స్కాట్ లెటర్ 13 అక్టోబరు 1800)

చిలకలూరిపేట జమిందారు మానూరురావు వెంకటకృష్ణారావు ఒకప్పుడు కచేరీ ముతాకు థామస్ జారెట్ నిమిత్తం 2 వేల పగోడాలు, కచేరీ సిబ్బందిని పంచడానికి వెయ్యి పగోడాలు, కలెక్టర్‌కు పుత్రోదయం అయినప్పుడు వెయ్యి పగోడాలు ఆభరణం నిమిత్తం యిచ్చాడు.

(రాబర్ట్‌సన్ 23 సెప్టెంబరు 1811)

షెరిస్తిదార్, జమిందార్‌కు రాసిన లేఖను మధ్యలో పట్టుకున్నాడు. దాని ప్రకారం లక్ష్మినారాయణరావు తనకూ దేశస్త మనూర్‌రావు కుటుంబానికీ గల సన్నిహిత సంబంధం బయటపెట్టాడు. దాని ప్రకారం తన పాత కొత్త జాబులన్నీ తగలెయ్యమన్నాడు. తన ఉత్తరాలను చేజిక్కించుకోమని చౌకీదార్లందరికీ సబ్నవీస్ కేశవరావు హుకూం యిచ్చాడన్నారు. వాటిని నారాయణరావుకు చేర వేయమన్నాడు. కనుక నీ ఉత్తరాలు పట్ల జాగ్రత్త వహించమన్నాడు. నా ఉత్తరాలు ఇతరులు రాస్తారు. ఉత్తరం చేరవేసేవారికి నాపేరు చెబుతాను. ఉత్తరం చదివిన తరువాత, చించేయాలన్నాడు.

(రాబర్ట్‌సన్ 20 సెప్టెంబరు 1811)

లోగడ దుబాసివలె సిరస్తిదార్‌కు చాలా కీలకస్థానం వుంది.

(ఇ.హెచ్. ఇట్‌కిన్ - బిహైండ్‌ది బంగ్లో-కలకత్తా-థాకర్, స్పింక్ అండ్ కో 1889)

లక్ష్మీనారాయణ నిలదొక్కుకొని, అన్నిటిల్లో జోక్యం చేసుకున్నాడు. అతని కనుసన్నలకోసం జమిందార్లు సైతం అతని కటాక్షానికి చెల్లించుకున్నారు. అన్నిశాఖల నుండి అతనికి ముడుపులు అందాయి. ప్రభుత్వ ఉద్యోగాలు వేలం వేశారు. ఉద్యోగాలు వచ్చినవారు ఉదారంగా డబ్బివ్వాలన్నారు.

(రాబర్ట్‌సన్ 21 ఫిబ్రరి 1811)

కచేరీ అధికారి ఒకరు నిరసన తెలుపుతూ తాడంకి కుటుంబం నిర్వహించే దేవాలయానికి డబ్బు యిప్పించారని వెధవ పనులకు యివ్వమని వత్తిడి చేశారన్నాడు. కచేరీ నాయకత్వాన్ని బెదిరించారనీ కలెక్టర్‌కు వ్యతిరేకంగా వ్యవహరించామన్నారనీ బయటపెట్టాడు.

(రాబర్ట్‌సన్ 21 ఫిబ్రవరి 1811)

కచేరీ ప్రముఖులపై చట్టబద్ధమైనచర్యకు రాబర్ట్‌సన్ రంగం సిద్ధం చేశాడు. షెరిస్తదార్‌ను జైలుకు పంపించాడు.

(రాబర్ట్‌సన్ 25 ఫిబ్రవరి 1811)

రెవిన్యూబోర్డు అతిజాగ్రత్తగా అడుగులు వేసింది. రాబర్ట్‌సన్‌కు సలహాయిస్తూ పరస్పరం ఒకరిపై ఒకరు ఎలా నిందారోపణలు చేస్తున్నారో తెలుసుకోమన్నది. వారంతా లోగడ కలెక్టర్ నియమించినవారే.

(రాబర్ట్‌సన్ మార్చి 7, 1811)

ముఠా చీలికల్ని అడ్డుపెట్టుకొని తన పట్టు బిగించుకుంటే రాబర్ట్‌సన్‌కు బాగుండేది. కాని కార్యరంగంలోదిగి విషయాసేకరణ

ప్రారంభించాడు. చేనేతవారు, మరామత్తులు చేసేవారు, ఉప్పు తయారు చేసేవారు, సరుకులు చేర వేసే వారిపై చాలా విషయసేకరణ చేసినా కోర్టులో నిలబడేది కనిపించలేదు.

(రాబర్ట్‌సన్ 15 ఏప్రిల్ 1, 6, 24, 30 జులై 16 ఆగస్ట్ 1811) హుజూర్ కచేరిలో ప్రముఖులు తమ దోషాలు కప్పి పుచ్చుకోడానికి అవకాశం యిచ్చాడు.

జిల్లా అంతటా ఆధారపత్రాలు నాశనం చేశారు. గుంటూరులో అంతా గందరగోళం ఎదురైంది. దప్తర్‌ఖానా, సెరిస్టాశాఖలలో బీభత్సం ఎదురైంది. అదంతా కావాలని చేశారన్నారు.

(రాబర్ట్‌సన్, 15 జూన్ 1811)

జిల్లాలో ప్రతిశాఖలోనూ ఉద్యోగులు విభిన్నరీతులలో అక్రమాలకు పాల్పడ్డారని రాబర్ట్‌సన్, బోర్డుకు తెలియజేశాడు. ప్రతి శాఖలోని కీలక ఉద్యోగులు యిలాంటి పనులకు మార్గగాములయ్యారన్నాడు.

జైల్లోవున్న లక్ష్మీనారాయణరావు యీలోపు గొప్పలు చెప్పుకుంటూ మచిలీపట్నం జైలుసెల్ నుండి త్వరలోనే కచేరీలో లోగడస్థానంలో రాబోతున్నామన్నారు.

(రాబర్ట్‌సన్ ఎలియట్ రిపోర్టు)

తెరవెనుక కలెక్టర్‌ను అడ్డుకొంటూ, తాడంకి కృష్ణనారాయణరావు, అచ్చులమంటి నరసయ్య, అత్తూరి వెంకటాచలం పన్నాంగంపన్నారు. హుజూర్ కచేరీలో కీలక స్థానాలన్నీ బంధువులు, స్నేహితులతో నింపేశారు. అందులో బంధువులే 26 మంది వున్నారు.

(రాబర్ట్‌సన్ 20 ఆగస్టు 1811)

కలెక్టర్ యువకుడుగా వేసే ప్రతి అడుగూ వీరు అడ్డుకున్నారు. అతడి కదలికలన్నీ ఎప్పటికప్పుడు గ్రహిస్తూ, ఉత్తరాలలో భాగాలు కూడా పట్టుకోగలిగారు. రాబర్ట్‌సన్‌ను ఏకాకి చేసి, ప్రతిఘటించారు. హుజూర్ ష్రాప్ లెక్కలలో డబ్బు కాజేసినట్లు వివరాలన్నీ అసత్యాలన్నారు. చిత్రహింసలు పెట్టించాడని రాబర్ట్‌సన్ పై బోర్డుకు ఫిర్యాదు చేశారు. మాజీకలెక్టర్ థామస్ జారెట్‌ను కలసి అతని సహాయం అర్థించారు.

(ఎలియట్ రిపోర్టు)

కచేరీలో హుజూర్ ఉద్యోగులంతా కుమ్మక్కయ్యారని బోర్డు గ్రహించినా, రాబర్ట్‌సన్ విచారణతో వారు సంతృప్తి పడలేదు. జారెట్ జోక్యాన్ని కూడా మెచ్చలేదు. గొడవ ఎక్కువైనా, ఫలితం దక్కలేదు.

(ప్రొసిడింగ్స్ ఆఫ్ 30 మే అండ్ 27 జూన్ 1811 - ఎలియల్ రిపోర్టు)

ఇరువురు అధికారుల్నీ అభిశంసించి జిల్లాపాలన థామస్ ఓక్స్‌ను చేబట్టమన్నారు.

1811 జూన్‌లో కలెక్టర్ బాధ్యతలు స్వీకరించిన థామస్ ఓక్స్, అందరూ కుమ్మక్కయినట్లు తెలిసి, జాగ్రత్తగా అడుగులు వేశాడు. కొత్తకలెక్టర్‌కు రాబర్ట్‌సన్‌పై అనేక ఫిర్యాదులు వచ్చాయి. పైగా విచ్ఛిన్నమైన పాలన, దారితప్పిన అధికారులు ఎదురయ్యారు.

రాబర్ట్‌సన్‌పై ఫిర్యాదులు చాలా వరకు తప్పుడువేనని బోర్డుకు, ఓక్స్‌కు తెలిసింది. కొందరిని శిక్షించారు. కొంత ఆస్తి చేజిక్కించుకున్నారు. కఠిన నిబంధనలు పాటించారు. కాని క్రూరంగా ఎండలో నిలబెట్టినట్లు ఎలాంటి ఆధారాలు లేవు. కంపెనీ గౌరవం కాపాడాలనీ న్యాయం చేకూర్చాలనీ, యువకుడుగా రాబర్ట్‌సన్ ప్రయత్నించాడు. ఓక్స్ క్రింద అతడిని హెడ్ అసిస్టెంట్ కలెక్టర్‌గా ప్రజాసంక్షేమ దృష్ట్యా అట్టిపెట్టారు.

(ఓక్స్ 21 జనవరి 1814)

రాబర్ట్‌సన్‌ను మోసగించి, కచేరిలో బీభత్సం తెచ్చిన సబనవీస్ కేశవరావు, తదితరులను తొలగించారు.

(రాబర్ట్‌సన్ 20 ఆగస్ట్ 1811)

అలాగే కచేరీలోని వృద్ధనాయకులనూ స్వస్తిపలికారు. హుజూర్ సిరస్తిదార్, హుజూర్ ష్రాఫ్, హుజూర్ డఫ్తర్‌దార్, మెటార్ఫాదరోగాతో సహా గుంటూరు నగరానికి చెందిన 9 మందిని తొలగించారు.

(ఓక్స్ 15 ఆగస్ట్ 1812) బయట నుండి వచ్చిన లక్ష్మయ్యను కేంద్ర సిబ్బంది ఇన్‌చార్జీ చేశారు.

(ఓక్స్ 21 జులై 1817) తాత్కాలికంగా ముఠా గొడవలు సద్దు మణిగాయి. కచేరీలో విద్రోహచర్యలు ఆపగలిగారు.

అయితే భారతీయ అధికారులు లేకుండా పాలన సాగించడం కష్టం. తొందరపాటుతో, అత్యుత్సాహంతో కలెక్టర్ వ్యవహరించరాదన్నారు. క్రమ శిక్షణచర్య నిర్దుష్టంగా, నెమ్మదిగా సాగాలన్నారు. కేవలం చెప్పుడు మాటలుగాక, స్పష్టమైన సాక్ష్యాధారాలపై ఆధారపడాలన్నారు. ప్రజాధనం ఖర్చు చేస్తున్న వారిపై, జమాఖర్చులపై శ్రద్ధ వహించాలని ఓక్స్‌కు చెప్పారు.

(ఓక్స్ 6 జులై, 1812)

అలాంటి సలహామంచిదే. ఎక్కడ డబ్బుందో, జమాఖర్చుల వ్యవహారం వుందో, అక్కడ యిలాంటివి జరుగుతూనే వుంటాయి. దొంగనాణాలు పుష్కలంగా వున్నాయి. వాటిని జాగ్రత్తగా తొలగించారు. ఈ విషయమై ప్రభుత్వాన్ని, జనాన్ని తప్పు బట్టారు. చాలా రకాలైన నాణాలు చలామణిలో వున్నాయి. డబ్బు మార్పిడి గిట్టుబాటు

వ్యాపారంగా వుండేది. చట్టబద్ధమైన ప్రామాణీకత 1836లో టెండగా వచ్చింది. ఈ బేరసారాల్లో ష్రాఫ్, ట్రెజరి అధికారులకు గిట్టుబాటయింది. లెక్కలు రాసేవాళ్ళు సాంకేతికపదాలు తెలియకుండా వినియోగించి మరోతీరు పుస్తకాలు జాగ్రత్త పరచేశారు. (సి.ఎఫ్. కిర్బి - ఎడ్వంచర్ ఆఫ్ యాన్ అర్కాట్ రూపీ - లండన్ 1867)

కచేరీలో ముఠాల ఆధారంగా పరస్పర సంబంధాలున్న సేవకుల ద్వారా ఓక్స్ తగిన సాక్ష్యాధారాలు పట్టుకున్నాడు. దీనివలన లంచాలు, నాణాలు మోసం తెలిశాయి. ప్రభుత్వ సేవకుల ప్రవర్తనా నియమావళి 1813 నవంబరు 20న అమలులోకి తెచ్చారు. లంచాలు తీసుకోవడం శిక్షార్హంగా పేర్కొన్నారు. నేరస్తులను మళ్ళీ కంపెనీ సేవకు రాకుండా చూడాలని, ప్రభుత్వ గజెట్‌లో వారి పేర్లు ప్రచురించాలని, అలాంటి వారికి జైలుశిక్ష లేదా 11 వేల రూపాయలు చెల్లించే విధంగా వుండాలన్నారు.

(ఓక్స్ 22 జనవరి 1813)

రెవిన్యూబోర్టు వారు సాక్ష్యాధారాల విషయమై పేర్కొంటూ, శిక్షకు బదులు, కోర్టులో విఫలమయ్యేకంటె, ఉద్యోగం నుండి తప్పించడం మేలన్నారు.

జిల్లాలలో అధికారులు చేతులు కలపడంతో మద్రాసు పెత్తందార్లు కలవరపడ్డారు. విద్రోహచర్యలకు కారణాలలో చదువులోపం, ప్రమోషన్లలో కచ్చితమైన నిర్ధారణ లేకపోవడం, చాలీచాలని జీతాలు, ఎంతకాలం వుద్యోగం వుంటుందో తెలియకపోవడం ప్రధానమని తేల్చారు. 1816లో దీనికి వివిధ పరిష్కారాలను మద్రాసు ప్రభుత్వం పేర్కొన్నది.

అధికారులకోసం స్కూళ్ళు స్థాపించాలి. జీతాలు పింఛన్లు పెంచాలి. సుంకాలు, ఉప్పుశాఖ అధికారులకు ప్రత్యేక ప్రోత్సాహకాలివ్వాలి.

(ఈ ప్రతిపాదనల నుండి సాధించింది అట్టేలేదు) కంపెనీలో యూరోప్ అధికార్లకు యిచ్చిన సౌకర్యాలు భారతీయులకు యివ్వాలని థామస్ మన్రో చెప్పినదాంతో ఏకీభవించారు. దీనివలన గూడుపుఠాణీలు, డబ్బు కాజేయడం, అవినీతి చర్యలు తగ్గుతాయన్నారు. సమస్యలకు కీలకం సిరస్తీదారుతో ముడివడివున్నందున అతడి జీతం పెంచాలన్నారు. హుజూర్ సిరస్తిదార్ నెలసరి జీతం 60 పగోడాలు (రూ॥ 210) వుండగా, 30 ఏళ్ళు పనిచేసిన అతనికి 200 పగోడాలు (రూ॥ 700లు) జీతం వుండాలన్నారు. అలా పెంచిన తరువాత డబ్బు కాజేయడం, అవినీతి, లంచాలకు పాలుమాలితే తీవ్రశిక్షలు వుండాలన్నారు. (కాంప్ బెల్స్ కోడ్ ఆఫ్ రెగ్యులేషన్స్ మద్రాసు 1840) గుంటూరు కచేరీలో మోసాలకు ద్రోహాలకు అడ్డుకట్ట వేయగలిగారంటే, పరిపాలనపై పట్టు వుండడమే కారణం. 1811 నుండి 1821 వరకు జిల్లా థామస్ ఓక్స్ పరిపాలించారు. ఆయన తరువాత జాన్ వెల్స్ వచ్చి 1832 వరకూ వున్నారు. అధికారాన్ని నీళ్ళుగార్చే సంఘటనలు జరిగినా, వీరిరువురి వలన స్థానిక పరిపాలనకు స్థిరత్వం ఏర్పడింది.

(ఎటియట్ రిపోర్ట్)

అమాని అనుభవం తెలిపిందేమంటే చూడడానికి అప్రధానంగా కనిపించే గ్రామాలు చాలా ప్రాధాన్యతను సంతరించుకున్నాయి. గ్రామ కచేరీలు, ఇనాం రికార్డులు వలన రాజ్యాధికారంలో నెమ్మదిగా, ప్రశాంతంగా చొరబడినట్లు తేలింది.

పల్నాడులో గ్రామ ఖర్చు ఎలా పనిచేసిందీ పరిశీలించిన డేనియల్

క్రాఫర్డ్ పేద అమాయక రైతులకు తీవ్ర నష్టాన్ని కలిగించే తీరు వున్నదనీ దేశాభివృద్ధికి అది చాలా అవరోధం అనీ అన్నాడు.

(18 జులై, 1804 - ఎలియట్ రిపోర్టు)

సముతుదార్లు, పర్యవేక్షించకపోతే, కరణాలు, కాపులు (పెద్దరెడ్లు), దేశపాండేలతో కలసి గ్రామఖర్చుల లెక్కల్ని దాచి, తమ లాభాలకు వాడుకుంటూ, పేదరైతుల్ని దెబ్బ తీశారు. దీని వలన జిల్లా నుండి చాలామంది వలస వెళ్ళారు. అధిక జనాభా సంపదను, సంతోషాన్ని స్థానిక అధికారులు అడ్డుకున్నారు. పల్నాడులో సముతుదార్లను, తానాదార్లను తొలగించారు. కరణాలను తీవ్రంగా హెచ్చరించారు. మంజూరు లేకుండా, రసీదులు యివ్వకుండా ఎలాంటి చెల్లిపులూ వుండరాదన్నారు. కాని యీ ఉత్తరువులను ఎవరూ పట్టించుకోలేదు. ప్రతిగ్రామానికి మొత్తం ఎంత వసూలు అయిందీ అనే రిజిస్టర్‌ను మాత్రం క్రాఫర్డ్ స్వీకరించగలిగాడు. వాటిని సరిచూసే మార్గం లేదు. ప్రతి గ్రామ లెక్కలు ఏ కలెక్టరూ తనిఖీ చేయజాలడు. సహకరించే సిబ్బంది అవసరం.

థామస్ ఓక్స్ యీ సమస్యల్ని బాగా పట్టించుకున్నాడు. పల్నాడులో అమాని యాజమాన్యం గమనిస్తే, యావత్తు సిబ్బంది సర్కారుకు చెడ్డ పేరు తెస్తున్నట్లు చూచాడు. భయానక వతావరణం ఆవరించివుంది. దీనికి మూలం గ్రామ ఖర్చుకాగా, అందులో రెండుసార్లు తొలగించబడిన అచలమనాటి నరసయ్య కీలకపాత్రవహించాడు. పల్నాడులోని ప్రతి గ్రామంలో లెక్కలు దాచిపెట్టడం, తిమ్మిని బొమ్మిచేసి చూపడం చూచాడు.

(ఓక్స్ నివేదిక జూన్ 20, 1812)

గ్రామాలలోని కుండలలో, బుట్టలలో, భూమిలో చెరువుల్లో దాచిన

లెక్కలు పత్రాలు బయటపడ్డాయి. గ్రామఖర్చులు వివిధ నజ్రానా బహుమతులుగా జిల్లాకచేరీ స్థాయి వరకూ అందాయి.

ఓక్స్ సెలవుపై వున్నప్పుడు, థాకరి పదవిలో వుండగా, చిలకలూరిపేట, సత్తెనపల్లి భూములు 1816లో ఆమాని యాజమాన్యం లోకి వచ్చాయి. జమిందారీ కరణాల కారణంగా లెక్కలు కానరాకుండా చేశారు.

(12 అక్టోబరు 1816 థాకరే నివేదిక)

గ్రామాలలో కరణాలు, గ్రామ పెద్దలు, కాపులు వసూళ్ళు చేశారు. చిన్నరైతుల్ని దోపిడి చేస్తుంటే ఆపే వారే లేకపోయారు.

(మానూరు జమిందారుపై ఓక్స్ నివేదిక, 30 సెప్టెంబరు 1818)

వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు మరణానంతరం, తాత్కాలికంగా వాసిరెడ్డి గ్రామాలు స్వాధీనం చేసుకున్నారు. స్థానికనాయకులు దోచుకున్నారని ఓక్స్ నివేదించారు.

(26 మే 1817 - అంతకుముందు దోపిడీ ఎలా జరిగిందో ఓక్స్ పట్టించుకోలేదు)

జగన్నాధబాబు తన 121 గ్రామాలలో లెక్కలు చూప నిరాకరించాడు. అతని గ్రామాలలో కరణాలు కూడా సహకరించలేదు. బాహాటంటా బయటపెడతామని బెదిరిస్తే 74 గ్రామాలలో లెక్కలు అందాయి.

గ్రామఖర్చుల వ్యవహారంపై ఓక్స్ సమగ్రనివేదికను 1818 సెప్టెంబరు 3న నివేదించాడు. గ్రామాలలో కలహాలు పరిష్కరించడానికి, గ్రామాధికారుల ఖర్చులు ఆదుకోడానికి, ఉద్దేశించిన ఖర్చులవి. వీటిని కచేరీ అధికారులకు, కోర్టులకు లంచాలుగా వాడారు. ఈ లెక్కలు కరణాల వద్ద వుండేవి. నిజమైన లెక్కలు దాచి, దొంగ లెక్కల్ని వాడి

ప్రభుత్వాన్ని జమిందారును మోసగించేవారు. లంచాలన్నీ దేవుడికి సమర్పించిన బహుమతులుగా పేర్కొనేవారు. ఇందులో ఆశ్చర్యం లేదు. కచేరీ అధికారులు దైవసేవకులుగా చూడడంలో యిది ఆశ్చర్యమేమీకాదు.

(కర్మ, ధర్మ వంటి పదాలు అడ్డు పెట్టుకొని ప్రతిదీ దైవం పేరిట చేసేవారు)

గ్రామంలో అదనపు ధనాన్ని తీసేసుకొని దొంగలెక్కలు చూపేవారు. గ్రామఖర్చుల వలన గ్రామప్రభావం పెరిగి పైఅధికారులకు వ్యతిరేకంగా ప్రయోగించేవారు.

1802 మద్రాసు రెగ్యులేషన్ చట్టం ప్రకారం ఇనాం భూములకు పట్టాలివ్వడం చెల్లదు. 1768 ఫిబ్రవరి 26 ముందు యిచ్చి వుంటే తప్ప. తర్వాత యిచ్చిన వాటిని ప్రభుత్వం మంజూరు చేయాలి. ఏడాది లోపు గ్రాంట్లు రిజిస్టర్ చేయకపోతే వాటిని అంచనావేయాలి. ప్రతి 5 ఏళ్ళకోసారి గ్రాంట్లు మళ్ళీ రిజిస్టర్ చేయించుకోపోతే, వాటిని కోల్పోతారు.

ఈ వ్యవహారంలో లొసుగు ఏమంటే, చెల్లని యినాం భూముల్ని జిల్లా కోర్టు ద్వారా తప్ప, ప్రభుత్వం స్వాధీన పరచుకోజాలదు. దానికి పూర్వం, గ్రాంట్ వివరాలు, రిజిస్ట్రేషన్ విషయాలు నిర్వహించాలి. రిజిస్ట్రేషన్ లేకుంటే ప్రభుత్వం స్వాధీనం చేసుకోజాలదు. పైగా యితర ఆక్రమణలో ఆపజాలదు. వందలాది చిన్న యినాంలు వున్నందున వీటికి తోడు పెద్ద అగ్రహారాలున్నందున, ప్రభుత్వచర్య అసాధ్యమైంది.

(1912లో 73 భూ ఆక్రమణ కేసులు గుంటూరులో వున్నాయి.)

ప్రతిదానికీ పేచీ, ఖర్చు. అనిశ్చిత పరిస్థితి కారణంగా ప్రభుత్వపని జటిలం అయింది.

భూములు రిజిస్టర్ చేయడానికి, రాం రిజిస్టర్ వంటి ప్రయత్నం, పూర్తిగా విఫలమైంది. 1803లో డేనియల్ క్రాఫర్డ్ ప్రకటన ప్రకారం, గ్రాంట్లన్నీ రిజిస్టర్ చేయాలనేది పూర్తిగా విఫలమైంది. 1807లో గుంటూరు జిల్లా జడ్జి, మాజిస్ట్రేట్ జాన్ బైంగ్, జిల్లా ఇనాం రిజిస్టర్ అడిగతే అలాంటిది లేదన్నారు. మరొక ప్రకటన ద్వారా ఒక చిత్తు రిజిస్టర్ తయారు చేశారు. అందులో ఇనాందార్ల పట్టిక 9 సంపుటాలుగా తయారైంది. అసలు ఇనాం భూములలో 10వ వంతు మాత్రమే యీ సంపుటంలో వుందన్నారు.

(1798, 1804, 1807, 1823, 1826 లో స్థానిక అధికార్లకు యిచ్చిన ఉత్తరువులు)

1813 థామస్ ఓక్స్ వచ్చి మళ్ళీ ప్రస్తావిస్తేగాని ఆ విషయం బయటకు రాలేదు. ఇనాం సమస్య కోర్టులకు వదిలేస్తే సంవత్సరాల తరబడి వృధా అవుతుందని, ఇనాం భూముల సమస్య పరిష్కారానికి ఒక సంఘాన్ని వేయాలని ఓక్స్ సూచించాడు.

(పల్నాడ్ సెటిల్‌మెంట్ రిపోర్టు - ఓక్స్)

కొందరు బ్రాహ్మణులు అన్యాయంగా అనుభవిస్తున్న విషయాలు ప్రభుత్వ దృష్టికి వస్తాయన్నాడు. చాలా అగ్రహార గ్రామాలకు ఆధారాలు అర్థరహితంగా వున్నాయన్నాడు.

1821లో పల్నాడులో కరువు పరిస్థితి పరిశీలించడానికి ఓక్స్ పర్యటించే వరకూ యినాం సమస్య పైకి రాలేదు గ్రామనాయకుల వలన పేద రైతులు, ప్రభుత్వం ఎలా యిబ్బందులకు గురైందో గ్రహించారు. చాలాసార్లు సగానికి పై గ్రామ భూముల్ని మన్యం భూములుగా పేర్కొన్నారు. మన్యం భూముల సరిహద్దులు స్పష్టంగాలేవు. విపత్తు

అక్కరకు రావలసిన ప్రత్యేక భూముల్ని కాజేశారు. ఎన్నడో చనిపోయిన వారి పేర్లు ఇనాందార్ల జాబితలోచేర్చి, ఆ పేరుతో కరణాలు అనుభవించారు. ఇంకా అన్యాక్రాంతం కాకుండా, అంతవరకూ భూముల్ని రిజిస్టర్ చేయాలనే ప్రయత్నం కూడా విఫలమైనట్లు ఓక్స్ అంగీకరించాడు.

(ఓక్స్ బోర్డు ఆఫ్ రివెన్యూకు - 10 మార్చి, 1821)

రెండేళ్ళ తరువాత జాన్ విష్ వచ్చి గ్రామాలలో పట్టించుకున్నాడు. కరణం కుటుంబం అటు భూమినీ, యిటు పదవినీ నిర్వహిస్తున్నట్లు గమనించి కలవరపడ్డాడు. కలెక్టర్ ప్రశ్నించి, ఎవరు పదవి నిర్వాహకులు అంటే, ఒకరి మీద ఒకరు చెప్పి తప్పుకున్నారు. యావత్తు కుటుంబం దాదాపు 20 మంది వరకూ వుండగా అందరూ వస్తేనే ఏదైనా తేలుతుంది. అప్పటికే కుటుంబీకుల యిష్టాయిష్టాలపై ఆధారపడుతుంది.

(విష్ 2 డిసెంబరు, 1822)

నిర్దుష్టమైన ఇనాం రిజిస్టర్ కోసం పరిశీలన జరపమని కొద్దిమందిని విష్ నియమించాడు. లోగడ వివరాలతో పోల్చి చూడదలచాడు. 1807 రిజిస్టర్ రెండు ప్రతులు లభిస్తే, ఒక దానితో ఒకటి పొంతనలేదు. పాతపుస్తకం కంటె అదనంగా 90 ఇనాందార్లు, 169కు చేలభూములు కొత్త రిజిస్టర్‌లో వున్నాయి. ఈ కొత్త ఇనాందార్లందరూ గుంటూరు నగరానికి చెందినవారే. కొత్త పుస్తకం కచేరీనుండి తీసుకెళ్ళిన దఫ్తదార్లు కొత్త పేజీలు చేర్చారు. కాని ఏ ప్రతీ ఉపయోగకారికాదు.

(ఎలియట్ 14 ఏప్రిల్, 1846)

విష్ విచారణ ఏనాటికో పూర్తికాలేదు. అతని రిజిస్టర్‌ను సరైనదో కాదో చూడలేకపోయారు. వాటిని పొందికగా అమర్చనూ లేదు.

మొత్తంమీద 696 గ్రామాలు పరిశీలించారు. అందులో వాసిరెడ్డి, మల్‌రాజు గ్రామాలు వున్నాయి. జమిందారీ దేశపాండేల రిజిస్టర్, కలెక్టర్ వద్ద రిజిస్టర్ పోల్చిచూస్తే, నాలుగోవంతు ఇనాంలు సరిగాలేవు. అగ్రహారాలు, ఇనాంలు సరిగా నమోదు చేయలేదు. తొలుత మంజూరైన భూముల పట్టాలకు అదనంగా చేర్చే వుద్దేశంతో యిలా చేశారు.

తొలుత పల్నాడులోనూ, తరువాత గుంటూరులోనూ రైత్వారి విధానం ప్రవేశపెట్టడం నెమ్మదిగా, చిక్కులతో జరిగింది. అడుగడుగునా పాలనా జాప్యాలు, జమిందారీ గ్రామవారీ పద్ధతులలో విధాన నిర్ణయస్థాయి భేదాలు, స్థానిక వినియోగం, ఆక్రమణలు అన్నీ అవరోధాలయ్యాయి.

శాశ్వత సెటిల్‌మెంట్ కింద విభజించి, అమ్మడానికి పల్నాడు అస్థిరత తోడ్పడలేదు. ఇజారాదార్లు గ్రామాలు అద్దెకు తీసుకొని ఏటా తమ కోర్కెలు మారుస్తూపోయారు. ఉజ్జాయింపు సర్వే అనంతరం గ్రామ రైతులకు లీజు మంజూరు చేస్తే క్రాఫర్డే ఉత్తరువులిచ్చాడు.

(గార్డ్‌క్ మెక్‌ంజి : ఎ మాన్యుల్ ఆఫ్ కృష్ణాడిస్ట్రిక్ట్ - మద్రాసు 1883 పే.151-62. పల్నాడు సెటిల్‌మెంట్ చరిత్ర అంతా బోర్డు పరిశీలించింది - ఓక్స్‌కు లేఖ 3 మార్చి, 1814)

మరోవైపు కొత్త మార్గాలు కనిపిస్తుండగా రైత్వారి విధానం హానికరం అనుకున్నారు. ఇరాజదార్లు, రైతు పెద్దలతో వ్యవహరించడం మంచి దనుకున్నారు. 1812లో శాశ్వతగ్రామ సెటిల్‌మెంట్ జారీ చేశారు. ప్రతి గ్రామానికీ వనరులు, ఉత్పత్తి, ఒప్పందాలు అవసరమయ్యాయి. ఒకవైపున 3 ఏళ్ళ సెటిల్‌మెంట్ కొనసాగగా ఏటా గాని పదేళ్ళకో మారుగాని సెటిల్‌మెంట్‌ని నిర్ధారించే విషయం పరిశీలించమని ఓక్స్‌ను కోరారు. ఓక్స్ సూచనపై 7 సంవత్సరాల సెటిల్‌మెంట్‌తో ప్రవేశపెట్టారు.

(1814 డిసెంబరు 2)

రైత్వారి పద్ధతి ముందుకు సాగుతుండగా, మద్రాసులో, లండన్‌లో వివిధ పద్ధతుల బాగోగులు చర్చించారు. పల్నాడులో సరైన సర్వేలేదు. ఉత్పత్తి కచ్చితంగా చెప్పలేం. రైతులు గ్రామపద్ధతి కోరుకుంటున్నారు. ఈ దృష్ట్యా యీ కొండల ప్రాంతానికి రైత్వారి విధానాన్ని పెట్టవద్దని డైరెక్టర్లకోర్టుకు మద్రాసు అధికార్లు చెప్పారు. కాని వారు విఫలమయ్యారు.

(ఓక్స్ 12 ఫిబ్రవరి, 25 మార్చి 1816)

1820లో మద్రాసు గవర్నర్‌గా థామస్ మన్రో రావడంతో యీ విధానం ఖాయమైనా, తొందరపడి అమలు పరచలేదు.

కొత్త విధానం పాలనాధికారంతో తప్ప శాసనబద్ధంగా లేదు. పాలనా సామర్థ్యం బట్టి అది పనీచేసే తీరుంటుంది. గ్రామ దరఖాస్తు లేక జమీదారు పట్టాకాలం ముగిస్తే, రైతులకు పట్టాలిచ్చి, భూమికి కొంత డబ్బు నిర్ధారించేవారు. భూమిలో ఉత్పత్తిని బట్టి దానివిలువ శాశ్వతంగా వుండేది. ఆ భూమిని దున్నడం తాత్కాలిక హక్కుగా వుండేది. అమ్మడానికి అవకాశం వుండేది. ఏ యేటి కాఏడు వదలుకునే అవకాశం కూడా యిచ్చారు. రానున్న యేటికి భూమిని తీసుకునే విషయం జమాబంది సమయంలో రైతు నిర్ధారించాలి. సమయానికి చెల్లించకపోతే, భూమిని కోల్పోతాడు. కొన్నిసార్లు అతని కౌలుకాలాన్ని ఎవరైనా ప్రశ్నించవచ్చు. ఇవన్నీ ఉమ్మడిపట్టాలున్న చోట, పట్టాను విభజించి నప్పుడు, ఉమ్మడి కుటుంబాల సందర్భంగా జరుగుతుంటాయి. మక్తాల విషయం ఆయా కులాల వారీగా కూడా వుంటుంది. గ్రామాధికారి వద్ద పట్టారికార్డు అవుతుంది. గ్రామాధికారులు చెల్లింపులు నమోదు చేసి,

జమాఖర్చులు వుంచుతారు.

(బి.హెచ్. బేడెక్ పావెల్ - ఎ మాన్యుల్ ఆఫ్ లాండ్ రెవిన్యూ సిస్టమ్స్ అండ్ లాండ్ టెన్యూర్ ఇన్ బ్రిటిష్ ఇండియా - కలకత్తా - గవర్నమెంట్ ప్రెస్ 1882) - వాల్టర్ ఇలియట్ - కరెస్పాండెన్స్ రిలేటింగ్ రైత్వారీ పే. 77-95, 1825-1837 మధ్య యివన్నీ అధికార్ల పత్రాలు తెలుగు కైఫియత్ ఫ్రం రైత్స్ ఆఫ్ సర్టన్ విలేజస్ ఇన్ పల్నాడ్ తాలూకా గొల్డింగం నివేదిక 16 ఏప్రిల్, 1841)

గ్రామ కౌలులీజ్ కాలం 7 సంవత్సరాల తరువాత ముగియగా, 1821లో, ఆచరణకు విధానానికీ గల తేడా బయటపడింది. రైత్వారి విధానం లాంఛనంగా అమలు అయింది. ఉత్తరువులు వచ్చిన తరువాత కూడా, ఓక్స్ ప్రకారం గ్రామస్తులు పాతపద్ధతినే కోరుకున్నారు.

(ఎ.జే. ఆర్బత్‌నాట్-సెలక్షన్స్ ఫ్రం మినిట్స్, అండ్ అదర్ అఫిషియల్ రైటింగ్స్ ఆఫ్ థామస్‌మన్రో, మద్రాసు యూనివర్శిటి 1817 రైత్వారి విధాన బాగోగులు చర్చిండం లేదు. ఎరిక్‌స్టోక్స్ - ది ఇంగ్లీష్ యుటిలిటేరియన్స్ ఇన్ ఇండియా - ఆక్స్‌ఫర్డ్ 1959) - అంచనాలు సిద్ధాంతంపై యిది బాగా రాశారు)

బోర్డు సలహాపై, గ్రామలీజుల విలువలు, భూమి వర్గీకరణ సరైన దేనని ఒప్పుకున్నారు. రైతులమధ్య గ్రామంలో రెంట్స్ విభజించారు. రైతులు తమ గ్రామాధికారుల ద్వారా కలెక్టర్‌కు జవాబుదారీ అన్నారు. రైతుల ఒప్పందంతో తగిన చర్యలు తీసుకొన్నట్లు రెవిన్యూ బోర్డు ప్రకటించింది. ఇతర జిల్లాలకు నమూనా చూపడానికి వీలుగా పని ప్రారంభించమన్నారు.

(ఓక్స్‌కు బోర్డు సలహా 23 మార్చి, 1821)

గ్రామస్తులే కార్యక్రమం అంతా నిర్వహించారనీ అందువలన గ్రామనాయుకులు సంతృప్తి చెందారనీ, రెండేళ్ళలోగా వెల్స్ నివేదించాడు. ఒక్క కరణం తప్ప ఎవరూ గ్రామపెద్ద వివరణ ప్రశ్నించలేదన్నాడు. కరణాలు ఇజారదార్ల వలె వ్యవహరించారు. గ్రామలెక్కలు నిర్వహించేటప్పుడూ అదే పాత్ర పోషించారు. 11 కరణాలు నిర్దుష్టభావాలు గల వారేమీ కాదు. వారి భావాలూ అంత పటిష్టం కాదు కనుక వాటిపై ఆధారపడనవసరం లేదు.

(వెల్స్ 9 జూన్ 1823)

పరిపాలనా సంబంధంగా చూసే, కరణాల పని చాలా అవమాన కరమైనది. నిరుపయోగం తప్పుత్రోవపట్టించేది కూడా.

(బోర్టుకు వెల్స్ రాశాడు 2 డిసెంబరు, 1822)

పల్నాడులో అమలుపరచిన రైత్వారి విధానఫలితాలు, అలాగే అమానియాజమాన్యంలో జమిందారీ గ్రామాలలో అమలు పరచిందీ పట్టించుకోనవసరంలేదు. పల్నాడులో శాంతి పరిస్థితుల వలన రెవిన్యూ నాలుగింతలు పెరిగింది. కొత్తవిధానంలో రెవిన్యూ పెరగలేదు.

(కాటన్‌కు గోల్డింగం రాసినది 13 డిసెంబరు, 1839)

గ్రామస్థాయిలో నాయకత్వంలోగాని, అదుపుగాని మార్పులేదు. దీనినిబట్టి కొత్తవిధానంలో కింది స్థాయి సాగుదార్లకు ప్రభుత్వ అజమాయిషీ విస్తరించింది. రైతును జాగ్రత్తగా నిర్వహించలేదు. సన్నకారు రైతులు లాభం పొంది, స్వతంత్రస్థాయి చేరుకోలేదు. కాని పెద్దరైతులు పెత్తనం కొనసాగించారు. ఇదంతా గ్రామ లీజులలో పట్టాలు, గ్రామ యంత్రాంగం ద్వారా సాగింది. వారే సమాచారాన్ని సమీకరించడం, లేదా ప్రభావం చూపి సమీకరించేటట్లు చేయడం జరిగింది. ప్రభుత్వం

కచ్చితమైన సర్వే చేయలేదు. కనుక యీ నాయకత్వమే అంచనాలు నిర్వహించింది. గ్రామాలలో తమ వారికి కాకుంటే, తమ ప్రత్యర్థులపట్ల, అసమాన అంచనాలు వేసి చూపారు. అవకాశం లభిస్తే వీరిపై జిల్లా అధికారులు విరుచుకపడేవారే. అయితే కలెక్టర్‌తగు జాగ్రత్తతో సంప్రదాయగ్రామ స్థిరత్వాన్ని కాపాడాడు.

(జె.బి.నార్డన్-ఎ లెటర్ టు రాబర్డ్ లో ఆన్ ది కండిషన్ అండ్ రిక్వైర్‌మెంట్స్ ఆఫ్ మద్రాసు ప్రెసిడెన్సీ - పలోనా అండ్ కో 1854 - పే, 178-9)

థామస్ ఓక్స్, జాన్ వెల్స్ అమానిపాలనపై పట్టు బిగించడంతో జిల్లాలో బ్రిటీష్ పెత్తనానికి పూతం లభించింది. అంతేగాని రెవిన్యూ విధానంలో బలం వలన కాదు. ప్రజల సంక్షేమాన్ని దృష్టిలో పెట్టుకుంటే ఏ విధానమైనా సఫలమవుతుంది. ఓక్స్, వెల్స్ ఒక కన్నేసి ప్రజాక్షేమాన్ని కాపాడడంతో స్థానిక ప్రభుత్వం దిగజారకుండా నడిచింది. ఇది జమీందార్ల పాలనకు భిన్నం.

(కాటన్‌కు గోల్డింగం నివేదిక 13 డిసెంబరు, 1839 చనిపోతున్న మల్‌రాజు వి. గుండూరావు వద్ద బహుమతులు స్వీకరించిన సిరస్తిదార్‌ను చూస్తూ వూరుకున్న గుంటూరు కలెక్టర్ ఓక్స్‌ను తొలగించారు. ఆ జమీందారు నుండి రుణం కూడా స్వీకరించాడు. (అర్బత్‌నట్ పే.521-7)

1800-1837 మధ్య గుంటూరుజిల్లాలో బ్రిటిష్‌వారు రెండు విధానాలు అనుసరించారు. జమిందారీ విధానంలో వంశపారంపర్య మాజీ జిల్లా నాయుకులు, మరాఠీ-బ్రాహ్మణులు, శూద్రులలో పైకులాలవారు, తమ భూములలోని ఉత్పత్తిలో మూడోవంతు చెల్లించాలి. గుంటూరు జిల్లాలో చట్టబద్ధమైన అధికారం చలాయించడానికి, లేక

యితర ఉద్దేశాలతోనో యిలా చేశారేమో చెప్పజాలం.

రైత్వారి విధానం మరొకటి జమిందారీ విధానానికి యిది విరుద్ధం. వ్యవసాయరంగమంతటిలోనూ ప్రభుత్వ అదుపును యీ విధానం ప్రోత్సహించింది. సాగుదార్ల హక్కులు దృష్టిలో పెట్టుకొని చేశారా, ప్రభుత్వ అవసరాలు రీత్యా చేశారో నిర్ధారించడం కష్టం. రెండు విధానాలలో కచ్చితమైన తేడా మాత్రం వున్నది. జమిందారీ విధానం, రైత్వారిపద్ధతి స్థానిక పరిస్థితుల రీత్యాసాగాయి. స్థానిక ప్రభావాల కారణంగా, జమిందారీ రైత్వారీ పద్ధతులు పూర్తిగా అమలు జరగలేదు.

గ్రామసంస్థలు, నాయకత్వం, ఆచారవ్యవహారాలు చాలా వరకు రెవిన్యూ పద్ధతిపై ప్రభావం చూపెట్టాయి. ఈ గ్రామాలే సాంఘిక వ్యవస్థలు. రెవిన్యూ విధానానికి ఆధారం అవే.

(బేడెన్ - పావెల్, ది రెవిన్యూ సిస్టం ఆఫ్ మద్రాసు)

బ్రిటిష్‌వారు జమిందార్లతో కుదుర్చుకున్నా, గ్రామలతో వ్యవహరించాల్సివుంది. ఇజార్‌దార్‌తో జమిందారు కుదురుకున్నా, గ్రామంతో సర్దుకపోవాల్సివుంది.

ఒక్కొక్క గ్రామం ఒక బ్రాహ్మణ కుటుంబ ఆధిపత్యంలో పెత్తనం చేయవచ్చు. మరొకచోట, బ్రాహ్మణులు, రాజులు కలియవచ్చు. ఇంకోచోట బ్రాహ్మణులు, కమ్మవారు చేతులు కలవచ్చు. ఇలా సాగిపోతూ వుంటుంది. మరోగ్రామంలో, పాలెంగా మాలమాదిగల ఆధిపత్యంలో సాగవచ్చు. శక్తివంతమైన పెద్దగ్రామం చిన్నకుగ్రామాలను అదుపులో వుంచవచ్చు. పేద, చిన్నగ్రామాలు బయటశక్తుల్ని ఎదర్కోవడంలో సతమతంకావచ్చు. కరణం, పెద్దరైతు తిరుగులేకుండా పెత్తనం చేస్తూ, కొందరు ముఠాదార్లతో సర్దుబాటు చేసుకోవచ్చు. స్థానిక వ్యవహారాలు

సర్దుబాటు చేయమని కరణాన్ని బయటనుండికూడా పిలిపించవచ్చు. ఏమైనా గ్రామం కీలక స్థానంలో వుంటుంది. కాని ఏ రెండు గ్రామరీతులూ ఒకే రకంగా వుండవు. గ్రామాలలో వైవిధ్యమే నిర్ధారిస్తుంది.

1837కు ముందు పల్నాడులోగాని, గుంటూరులోగాని రెవిన్యూ విధానం విచ్ఛినం కాలేదు. రైత్వారి విధానం పేర్లలో, ఫారాలలో వున్నట్లుగా ఆచరణలో, వాస్తవంలో లేదు.

రెవిన్యూవిధానంలో కంట్రాక్టు తీసుకున్నవారు గ్రామనాయకులేగాని, వ్యవసాయ కూలీలుకాదు. జమిందారీ, అమాని యాజమాన్యలో ఏర్పాట్లన్నీ తాత్కలికంగా జరిగేవి. పట్టాలు, ఉమ్మడి పట్టాలు, రెంట్లు, జాయింట్ రెంట్లు అన్నీ గ్రామస్థాయిలో స్థానికంగా సాగేవి. 1817 తరువాత జమిందారీ విధానం పేరుకేగాని వాస్తవంగా అమలు జరగలేదు.

ఆచరణలో జమిందారీపద్ధతిలో గ్రామవారీ రీతిలో అమాని విధానానిదే పై చేయి అయింది.

విధాన గందరగోళం గురించి జాన్ గోల్డింగం 1838లో వ్యాఖ్యానించాడు. "రెవిన్యూ పద్ధతిలో వాస్తవం తెలియడానికి చాలాకాలం పడుతుంది. భ్రష్టమైన యాజమాన్యాన్ని అట్టిపెట్టడానికి చాలామంది నిమగ్నులయ్యారు. వివరాలకు చాలా మానసిక కృషి అవసరం. ఆచారాల ఆధారంగా నడుస్తున్న రీతులలో యివన్నీ జటిలమైనవి."

(కాటన్‌కు గోల్డింగ్ం నివేదిక)

తమను దెబ్బతీయకుండా విషయాల్ని దాచిపెట్టడం గ్రామాలకు మామూలు అయింది. ప్రభుత్వ అజమాయిషీ కంటె జమిందారీ పద్ధతిలో గ్రామాలు అధ్వాన్నంగా వున్నాయి.



## అధ్యాయం - 6

# జిల్లా వ్యవస్థ - కేంద్రస్థానం
## (1837)

సంప్రదాయబద్ధంగా సర్వాధికారి దైవాంశసంభూతుడు. అతడి అండన వుండే వారంతా అతడిని గౌరవించి, సత్కరించి, పారితోషికాలిచ్చి పోషించేవారు. బ్రిటిష్‌వారి పాలనలో ఆ స్థాయి హుజూర్‌కు వుండేది. జిల్లాపై సర్వాధికారిగా చలాయించాడు. విదేశీ కలెక్టర్‌నే హుజూర్ అని కూడా అనేవారు. గుంటూరులో యూరోపియన్‌లకు, అనధికార యూరోపియన్లకు యిలాంటి ఆదరణ లభించింది. హుజూర్ స్థానం విశిష్ఠంగా పరిణమించింది.

లార్డ్‌కారన్ వాలీస్ ప్రవేశపెట్టిన మార్పులతో హుజూర్‌స్థానంలో మార్పు వచ్చింది. జిల్లాపాలన అధికారాలు శాశ్వతంగా విడదీశారు. రెవిన్యూ, న్యాయ మాజిస్ట్రేట్ విభాగాలు చేశారు. మాజిస్ట్రేట్ అధికారాలు రెవిన్యూతో గాని, న్యాయశాఖతోగాని కలిపారు. మద్రాసులో మన్రో విధానాల కారణంగా జిల్లాజడ్జి అధికారాలు కాస్తా జిల్లా కలెక్టర్‌కు యిచ్చారు.

జిల్లాలో ప్రభుత్వవ్యవహారాలకు హుజూర్ బాధ్యుడు. ప్రజా

సంక్షేమాన్ని అతడే చూడాలి. రెవిన్యూపాలనలో వుద్యోగులు రెవిన్యూ చెల్లించేవారందరినీ అతడు పట్టించుకునేవాడు.

భూమిని శాశ్వతకౌలులో వుంచని చోట ఆక్రమిత భూమిపై సాలీనా వసూళ్ళను కలెక్టర్ నిర్ణయించేవాడు. పంటను బట్టి, మార్కెట్ సీజన్ అనుసరించి, వాయిదాల పద్ధతులలో కిస్తులు వసూలు చేసేవారు. గత ఏడాది బకాయీలను రాబట్టేవారు. భూమి సర్వే, అంచనాలకు బాధ్యత వహించేవారు. సముద్రంపై భూమిపై సుంకాలు తీసుకునేవారు. సారాయి, మందులు, వృత్తి పన్నులు ఉప్పు, పొగాకు విక్రయాలపై, లైసెన్సులపై, స్టాంపు పేపర్ యిత్యాదులపై వసూళ్ళు చేసేవారు. ప్రభుత్వ ఆస్తులు, భవనాలు, ధర్మాదాయాలు, అనర్హ యాజమాన్యాల ఆస్తులను నిర్వహించే వారు.

కలెక్టరే మాజిస్ట్రేట్, పోలీస్ అధికారి

(1858 వరకు పోలీస్ ఇన్స్‌పెక్టర్ జనరల్‌కు జవాబు దారీకాదు)

శాంతిభద్రతలు కాపాడడం, చట్టాన్ని అమలుచేయడం, నేరుస్తులను శిక్షించడం అతడి బాధ్యత. రెండేళ్ళ వరకూ కఠినశిక్ష విధించవచ్చు. వెయ్యి రూపాయల జరిమానా, కొరడాదెబ్బలు యివ్వవచ్చు. నేరుస్తులను విచారించి శిక్షించే న్యాయాధికారాలు కూడా వున్నాయి.

పరిపాలనలో కలెక్టర్, వ్యవసాయం, వాణిజ్యం, విద్య, ఆరోగ్యం, తపాలాశాఖ, డాక్‌బంగళాలు, చౌల్ట్రీలు, రోడ్లు, బ్రిడ్జిలు, ఆనకట్టలు, కాలువలు, ఇంజనీరింగ్ పనులు చూస్తాడు. జిల్లాలో అతడి అజమాయిషీ అన్నిటిపైనా వుండేది. తుఫాన్ కరువు ఆర్థికమాంద్యం, దోపిడీలు, యిత్యాదులన్నీ కలెక్టర్ నిర్వహణలోకి వచ్చాయి.

రెవిన్యూబోర్డు, ప్రభుత్వం, కేంద్రశాఖల ఆమోదం మాత్రం కలెక్టర్‌కు

కావాలి. జిల్లా ట్రెజరర్ కూడా అతడే గనుక ఎకౌంటెంట్ జనరల్ ఉత్తరువులు అవసరం. సాధారణ ద్రవ్య వ్యవహారాలన్నీ కలెక్టర్ చూచినా, మంజూరుకు ఆయాశాఖల అనుమతి అవసరమయ్యేది. చిల్లర ఖర్చులకు కేవలం 20 రూపాలయలు మాత్రమే మద్రాసు ప్రభుత్వ అనుమతి లేకుండా ఖర్చు చేయవచ్చు.

కలెక్టర్ తన పాలనకై భారతీయ అధికారులను ఎంపిక చేయవచ్చు, తొలగించవచ్చు. ఒక్క హుజూర్ సిరస్తిదార్‌ను మాత్రం నామినేట్ చేయవచ్చు. తహసిల్దార్ స్థాయిలో దిగువనున్న వారిని తొలగించవచ్చు. తహసిల్దార్‌ను తొలగించాలంటే రెవిన్యూబోర్డు అనుమతి వుండాలి.

(రికెట్స్ - రిపోర్టు ఫర్ రివిజన్ ఆఫ్ సివిల్ శాలరీస్ అండ్ ఎస్టాబ్లిష్‌మెంట్స్ కలకత్తా 1858, పే 161-5)

ప్రమాదమంతా కేంద్రీకరణ విపరీతంగావడంలోనే వుంది. మొత్తం 132,000 చదరుపుమైళ్ళు వైశాల్యం, వెయ్యిమైళ్ళ పొడవు, 1.5 మిలియన్ రైతులు 3 కోట్లకు పైగా భూమిశిస్తు చెల్లిస్తుండగా, 20 మంది కలెక్టర్లు వుండగా, రెవిన్యూ బోర్డు శ్రుతిమించవచ్చు. ఇతర ప్రాంతాలలో చిన్న జిల్లాలకంటె మూడునాలుగు రెట్లున్న జిల్లాలలో కలెక్టర్లపై ఒత్తిడి చాలా హెచ్చుగా వుంటుంది.

మద్రాసు నుండి అతిగా జోక్యం చేసుకుంటే ప్రయత్నాలు స్తంభించవచ్చు. కలెక్టర్‌స్థాయికి చేరడానికి, 20 ఏళ్ళు పట్టగా, మద్రాసులో అతిస్వల్పంగా వున్న స్థానాలకు పోడానికి చాలాకాలం పడుతుంది. కనుక ఆశిస్తున్న అధికారులు కొంత శ్రమపడాలి. రెవిన్యూబోర్డు నిధులపై గట్టి నిఘాపెట్టి, అధికారుల నియామకం, తొలగింపు, జిల్లాపోలీస్, రెవిన్యూ అధికారుల విషయంలో జాగ్రత్తపడాలి. కలెక్టర్ల ఉత్తరువులపై పైకి విజ్ఞప్తి

పెట్టుకోవచ్చు. బోర్డుతో ఉత్తరప్రత్యుత్తరాలు నడపవీలుంది. శాసనాలు, పోలీస్, ఆర్థిక, ఆరోగ్య పారిశుద్ధ్యం, వ్యవసాయం అన్నీ పైకి రాసి విజ్ఞప్తి చేయవచ్చు. భూకౌళ్ళపై రెవిన్యూబోర్డు గట్టి పెత్తనం వహించి, శ్రద్ధపట్టాలి. ఎక్కడోవున్న జిల్లాలపై ఎలా నిఘా పెడతారు, విషయాలని ఎలా గ్రహిస్తారు, సరైన నిర్ణయానికి వచ్చి, ఉత్తరువులిస్తారనేది అంతుపట్టని విషయం. వేలాది విజ్ఞప్తులూ ఎలా గమనిస్తారో మరి. చాలా దుర్లభం. రెవిన్యూబోర్డు యీ విషయంలో ఎప్పుడూ అందుకోలేక వెనకబడేవుండేది.

దీనికి పరిష్కారమల్లా కలెక్టర్లను విచక్షణతో బాధ్యత వహించ మనడమే. నిర్ణయాలు తీసుకోవడంలో బోర్డు, కౌన్సిళ్ళు చాలా మందగొడిగా సాగేవి. నిర్ణయాలు తీసుకోవడంలోనూ అంతే.

బోర్డు స్థంభించినప్పుడు, ప్రభుత్వం కలవరపడినప్పుడు, కలెక్టర్‌ను నమ్మితే కొంత సాఫల్యత చేకూరేది. రెవిన్యూ బోర్డులో అవగాహన గల సభ్యులుంటే, కనీసస్థాయిలో అజమాయిషీ నడిచేది. కీలకమైన ఆర్థికం, తప్ప, మిగిలినవి కలెక్టర్‌కు వదిలేసేవారు.

1837 నాటికి గుంటూరుపై సరైన అదుపులేక కొన్నేళ్ళపాటు స్థంభన ఏర్పడింది. గుంటూరుపాలన తలా తోకా లేకుండాసాగింది. జిల్లాకు అవగాహన గల గట్టి హుజూర్ అవసరమైనప్పుడు, మరోపక్క కరువు, కలరా, ప్లేగ్ పీడిస్తున్నప్పుడు, పరిస్థితి చేజారింది. జాన్ విష్ 1831 జులైలో వెళ్ళిపోయినప్పటి నుండి 1837లో జాన్ గోల్డింగం వచ్చే వరకూ తాత్కాలిక కలెక్టర్లు 10 మంది మారారు. మరో 15 మంది అధికారులు ఇన్‌ఛార్జిగా వున్నారు. 11 మాసాలకు మించి ఎవరూలేరు. కలెక్టర్ సగటున నాలుగైదు మాసాలే వున్నారు. 6 ఏళ్ళలో 17 బదిలీలు చేశారు. ఇంకా ఆశ్చర్య

మేమంటే తెలుగు ప్రాంతానికి యీ కలెక్టర్లు కేవలం కొత్త.

(గార్డన్ మెకంజి : ఎ మాన్యుల్ ఆఫ్ కృష్ణా డిస్ట్రిక్ట్ మద్రాసు 1883. పే 358 ఎలియట్ రిపోర్టు)

జిల్లాసంక్షేమ బాధ్యత, భారం ఒక వ్యక్తికి తలకుమించిన విషయం. కలెక్టర్‌కు సహాయపడే నిమిత్తం యూరోప్ అధికారులను అందించారు. ఇందులో సాధారణ సహాయం ఒకటి నైపుణ్యత విషయాలు చూచేది మరొకటి.

గుంటూరుకు అప్పట్లో సబ్‌కలెక్టర్ లేడు. కాని రెవిన్యూ పనిమాత్రం నిలదొక్కుకోని జిల్లాకు వుండాల్సినంతగా వుంది. అయినా దీనిని జమిందారీ పద్ధతిలో పరిగణించారు. పెద్దగుమాస్తాకు యిదమిత్థమైన విధులులేవు. కాని సాధారణంగా ఒకటి రెండు తాలూకాలలో రెవిన్యూ, పోలీన్‌పాలన అప్పగించేవారు. మిగిలిన వారికి అలాగే నియామకాలిచ్చేవారు. ఒక ఏడాదిపాటు జిల్లాలో వున్న తరువాతే విధులు అప్పగించేవారు. అప్పటికే మద్రాసునుండి అంగీకారం రావాలి. మద్రాసులో పరీక్షలు పూర్తిచేసుకున్న జూనియర్ ఆఫీసర్లు ప్రత్యేకవిధులు లేకపోయినా కలెక్టర్ విచక్షణ బట్టి నియమితులయ్యేవారు.

(మరోతరం పోయిన తరువాతగాని సబ్‌కలెక్టర్లకు ఉప్పు, ట్రెజరీ శాఖల్ని అప్పగించలేదు-

ప్రొసీడింగ్స్, సెప్టెంబరు 19, 1836)

సివిల్ సర్వీస్‌లో సీనియారిటీని బట్టి ప్రమోషన్లు వుండేవి. ఖాళీలను బట్టి వీటిని నిర్ధారించేవారు. ఇంకా కానరాని వత్తిళ్ళు లేకపోలేదు. జూనియర్ అసిస్టెంట్‌ను సర్వీసులోకి తీసుకోవాలంటే ఒకటి రెండు

దేశీయభాషలు రావాల్సిందే. విఫలమైతే కలెక్టర్‌కింద పనిచేయడానికి వీలుగా వూళ్ళలో పోస్టులు యిచ్చేవారు. అప్పటికే అనర్హమైతే, వుద్యోగం వదులుకోవలసి వచ్చేది. సర్వీస్‌లో అర్హత సాధిస్తే, హెడ్ అసిస్టెంట్‌గా, సబ్‌కలెక్టర్‌గా యిచ్చేవారు. నాలుగేళ్ళ తరువాత కలెక్టర్‌గా అర్హత వచ్చేది. ఏడేళ్ళ సర్వీసు తరువాత ప్రిన్సిపాల్ కలెక్టర్ అయ్యేవారు. 20 ఏళ్ళలోపు కలెక్టర్ కావడం అరుదు ప్రతిభ, సీనియారిటీని బట్టి కలెక్టర్‌ను ప్రిన్సిపాల్ కలెక్టర్ చేసేవారు.

గుంటూరుకు ప్రిన్సిపాల్ కలెక్టర్ చాలా అరుదుగా వచ్చినా కడప, తంజావూరుకు ఎప్పుడూ ప్రిన్సిపాల్ కలెక్టర్ వుండేవాడు. (ప్రిన్సిపాల్ కలెక్టర్‌కు సాలీనా 36వేల రూపాయలు వచ్చేవి. కలెక్టర్‌కు 30వేలు. సబ్‌కలెక్టర్‌కు 14వేల రూపాయలు. హెడ్ అసిస్టెంట్ 6 ఏళ్ళ అనుభవం వుంటే, 8వేలు లేక 6వేల 700 రూపాయలు వచ్చేవి. ఇందులో 3 ఏళ్ళు రెవిన్యూలో తప్పనిసరిగా పనిచేసి వుండాలి.

జూనియర్లకు 350 నుండి 260 వరకు నెలకు వుండేది. వారి భాషాపాటవాన్ని బట్టి యిది ఉండేది. ఇంటి అలవెన్స్, వసతి భత్యాలుండేవి. జాన్ గోల్డింగంకు సాలీనా 52వేల రూపాయలుండేది. గుంటూరుకు ప్రిన్సిపాల్ కలెక్టర్లు వుండేవారు కాదు)

చక్రవర్తిపాలనలోకి దేశం వచ్చిన తరువాత ప్రత్యేకాధికారులు పెరిగారు. వీరు కలెక్టర్ కిందపని చేసినా వారి శాఖలకు బాధ్యులు 1837లో గుంటూరుకు ఒక సర్జన్, ఒక ఇంజనీర్ వుండేవారు.

(సి.డి.మాక్లీన్ : స్టెండింగ్ ఇన్‌ఫర్‌మేషన్ రిగార్డింగ్ ఆఫిషియల్ అడ్మినిస్ట్రేషన్ ఆఫ్ మద్రాసు ప్రెసిడెన్సీ ఇన్ యీచ్ డిపార్ట్‌మెంట్ - మద్రాసు 1877 : జిల్లా పోస్టు 1846 వరకూ అధికారయుతంకాగా 1854లో

జనరల్ పోస్టులో కలిపేశారు. పోస్టుమాస్టర్ జనరల్ క్రింద కలెక్టర్ అజమాయిషీ వుండేది : థామస్‌మన్రో నిర్ణయం ప్రకారం విద్యాబోర్డుకు కలెక్టర్ బాధ్యుడు. 1855 విద్యాశాఖ ఏర్పరిచే వరకూ ఎలాంటి ప్రగతీ సాధించలేదు. 1834లోనే యిలాంటి బోర్డు ప్రతిపాదన వచ్చింది. రిజిస్ట్రేషన్ ఇన్‌స్పెక్టర్ జనరల్‌కు బాధ్యతవహించే రిజిస్ట్రార్ల విధానం 1864లోగాని అమలులోకి రాలేదు).

స్థానిక సైనికదళానికి చెందిన సర్జన్ మెడికల్ అధికారిగా కలెక్టర్‌కు తోడ్పడేవాడు. అందరికీ సేవలు అందించలేక, వైద్య సర్వీసులు ప్రభుత్వ ఉద్యోగులకే పరిమితం చేశారు. 1846లో జాన్ విష్ ఉత్తరువుపై సత్రాన్ని ఆసుపత్రిగా ప్రజోపయోగానికి మార్చారు. పరిమిత సౌకర్యాలతో జిల్లాసర్జన్ వివిధ శాఖల ఉపయోగాలు చూచాడు.

(జార్జి ఎవన్స్ ఎడ్జికం 1829 నుండీ గుంటూరులో అసిస్టెంట్ సివిల్ సర్జన్‌గా వుండగా, 1837లో అతని స్థానంలో ఎడ్వర్డ్‌స్మిత్ వచ్చాడు. హుజూర్‌కు ఫస్ట్‌క్లాస్ దేశం డ్రస్సెర్ వుండేవాడు. నెలకు 35 రూపాయల జీతం. కలెక్టర్‌కు బోర్డు వివరణ 20 జూన్, 1837)

గుంటూరులో తొలుత ఇంజనీర్లు, సర్వేయర్లు సైనిక అధికారులే. 1817లో జిల్లా పరిస్థితిని లెఫ్టినెంట్ ఎఫ్. మౌంట్ ఫోర్డు స్పష్టంగా యిచ్చాడు. రెవిన్యూబోర్డు కిందవున్న పబ్లిక్‌వర్క్‌శాఖను 1837లో విభజించి రాష్ట్రంలో నాలుగు విభాగాలు చేశారు. ప్రతి విభాగానికి ఒక సివిల్ ఇంజనీర్, ముగ్గురు వరకూ అసిస్టెంట్ సివిల్ ఇంజనీర్లు వుండేవారు. సివిల్ ఇజంనీర్‌కు గుంటూరులో ఒక అసిస్టెంట్ ఏటా వుండేవారు. ఇంజనీరింగ్ పనులకు అంచనాలు. పథకాలు, బిల్స్ నిర్దుష్టత సిద్ధం చేసేవారు. స్థానిక మరామ్మత్తుశాఖ ద్వారా పథకాలు నిర్వహించే

వారు. కలెక్టర్ ఉత్తరువుల బట్టి నడుచుకునేవారు.

1833లో వచ్చిన దాత కరువు సమయంలో కృష్ణలో మూడొంతుల నీరుండేది. డెల్టా సాగుకు 1792లొ వచ్చిన సూచనలు అమలు చేయ నారంభించారు.

చిన్ననీటి పారుదల పథకాలు స్వీకరించి అమలు చేయమని కేప్టన్ బకల్‌ను పురమాయించారు. పుల్లేరు కాలువ 34 మిలియన్ క్యూబిక్ యార్డుల నీటిని అందిస్తుండగా, 1837లో దీనిని ప్రారంభించారు. నదిపై ఆనకట్ట నిర్మించి, కాలువలు తవ్వాలని, మొత్తం డెల్టా ప్రాంతాన్నిసాగులోకి తీసుకరావాలని కెప్టన్ బకెల్ పెద్దపథకం వేశారు. దీనికయ్యే వ్యయం చూసి ప్రభుత్వం, డైరెక్టర్లు అదిరిపడ్డారు. ఆ పథకం అమలు చేయడానికి 13 ఏళ్ళు ఆగాల్సి వచ్చింది.

(మెకంజీ, పే 252-9)

సదర్ ఫీజుదారీ అదాలత్ (క్రిమినల్ హైకోర్టు ఆఫ్ అప్పీలు) సదర్ దివాని అదాలత్ (సివిల్ హైకోర్టు ఆఫ్ అప్పీలు) కింద, రాష్ట్రంలో న్యాయపాలనకు నాలుగు ప్రాంతీయ విభాగాలు చేశారు. గుంటూరు ఉత్తరవిభాగంలో వుంది. మచిలీపట్నం కేంద్రంగా ప్రావిన్షియల్ సర్క్యూట్ కోర్టు కింద యిది పనిచేసిది. ప్రావిజనల్ కోర్టు కింద జిల్లాకోర్టు వుండేది.

1837లో జిల్లా జడ్జి అధికారాలు పరిమితం. 5 వేల రూపాయలపైన విలువ గల కేసులన్నీ ప్రావిజినల్ కోర్డు ఆధ్వర్యంలో వుండేవి. 10 ఏళ్ళకు పైగా కఠినశిక్షతో కారాగారం, 30 కొరడా దెబ్బలుకూడా వారి పెత్తనానికే చెందాయి. కనుక, అతడిని హుజూర్‌తో సాటిగా చూచేవారు. ఇది కలెక్టర్ కింద యూరోపియన్ సబ్ ఆర్డినేట్స్ స్థితి వంటిది. 1843 సంస్కరణతో

కలెక్టర్ కంటె తక్కువస్థాయి అనేది మార్చారు. లోగడ ప్రావిజినల్ కోర్టుకుగల అధికారాలన్నీ సివిల్, సెషన్స్‌జడ్జికి యిచ్చారు. దీంతో సివిల్ విషయాలలో అన్ని హక్కులు, నేరస్తులను 14 ఏళ్ళ వరకూ జైలుకు పంపడం, 39 కొరడాదెబ్బలు అతడు విధించవచ్చు. 1860లో ఇండియన్ పీనల్‌కోడ్ వచ్చే వరకూ యిది మారలేదు.

(బోస్ వెల్, పే.558-9 :

ఎఫ్.జె.రిచర్డ్స్ : మద్రాసు డిస్ట్రిక్ గజటేర్స్ : సేలం- మద్రాసు 1918

ఎఫ్.ఆర్.హెమింగ్ లే : మద్రాసు డిస్ట్రిక్ట్ గజటేర్స్ - గోదావరి - మద్రాసు 1915 : మక్లీన్ పే : 183-95)

జిల్లాజడ్జి కిందిస్థాయిలో, యాక్టింగ్ అసిస్టెంట్ జడ్జి, జాయింట్ క్రిమినల్ జడ్జి వున్నారు. (1837లో ఆ పదివిని ఎడ్వర్డ్ న్యూబరీ నిర్వహించారు) దీనివలన న్యాయవిధానంలో ద్వందరీతి వుండేది. నేర న్యాయ విషయంలో 3 శ్రేణుల మాజిస్ట్రేట్ కోర్టులుండేవి. మొదటిశ్రేణిలో సంప్రదాయ యూరోపియన్‌లు వుండేవారు. రెండవశ్రేణిలో తహసిల్దార్ వుండగా, 6నెలల శిక్ష, 200 రూపాయల జరిమానా, కొరడా దెబ్బలుండేవి. మూడోశ్రేణిలో తాలూకా సిరస్తిదార్లు, లేదా డెప్యూటి తహసిల్దార్లున్నారు. నెలరోజుల శిక్ష, 50 రూపాయల జరిమానా వేయవచ్చు. కిందిస్థాయిలో గ్రామ మునిసిఫ్‌లకు నేరశిక్షాధికారాలుండేవి. 1816 రెగ్యులేషన్ 16 ప్రకారం, 12 గంటలపాలు గ్రామ చౌల్ట్రీలో నేరస్తులను అట్టిపెట్టవచ్చు. తక్కువ కుల నేరస్తులను ఆరుగంటల వరకు నిర్భంధించవచ్చు. సివిల్ విషయాలలో జిల్లా జడ్జికి దిగువస్థాయిలో మూడుస్థాయిలున్నాయి. గుంటూరు నగరంలో ప్రిన్సిపల్ సదర్ అమిన్ కింద సబార్టినేట్ కోర్టు వుండేది.

జిల్లాజడ్జికి సహాయంగా యితను పనిచేస్తాడు. జిల్లాకోర్డు సివిల్ పరిమితే అతనికీ వున్నది. ఆ తరువాత ప్రతి తాలూకా కేంద్రంలో జిల్లా మునిసిఫ్ కోర్టులున్నాయి. వెయ్యిరూపాయల వరకూ కేసులు నిర్ణయించ వచ్చు. కేసులలో 20 రూపాయల వరకూ శిక్షించవచ్చు. గ్రామస్థాయిలో 1816 రెగ్యులేషన్ 4 కింద గ్రామమునిసిఫ్ 10 రూపాయల విలువగల ఆస్తి తగాదాలు పరిష్కరించవచ్చు. దీనిపై అప్పీలు వుండదు. మధ్య వర్తిత్వంలో 100 రూపాయల వరకూ స్వీకరించవచ్చు. కలహ పరిష్కారానికి గ్రామ, జిల్లా పంచాయితీలను కలెక్టర్ పిలిపించవచ్చు. (వారానికి 3 పర్యాయాలు జిల్లాకోర్టు వుండేది).

గుంటూరులో కచేరి జిల్లాపాలనకు జీవనాడి. జిల్లా కేంద్ర కార్యాలయం - అనేక భవనసముదాయంతో, ఒక దానితో మరొకటి నడిచి వెళ్ళేందుకు వీలుగా వుండేది. జిల్లా అధికారం యిక్కడే చలాయించడం పరిపాటి. కచేరీ సమాచారాన్ని అందుకుంటూ, అట్టిపెడుతూ, పైనుండి వచ్చే నిర్ణయాలు అమలుచేస్తూ, కిందనుండి వచ్చే విజ్ఞప్తులు, ఫిర్యాదులు పరిష్కరిస్తూ పోయేది.

అయా శాఖలలో ఆర్థిక, పోలీస్, పాలనా వ్యవహారాలు చక్క బెట్టేవారు.

నిర్ణయాలకు, పాలనాచక్రం తిప్పడానికీ కీలకప్రాత కచేరీ చేబడితే, యీ వ్యవహారాలు నడపడానికి సిరస్తిదార్ వూతం యిచ్చేవాడు. లోగడ దేశముఖ్ వంటి వాడే సిరస్తిదారు. అతను దుబాసి కూడా. 1836లో రెవిన్యూబోర్డు అతడి అధికారపాత్ర నిర్వహించింది :

కలెక్టర్ అజమాయిషీలో దేశీయరెవిన్యూ అధికారి హెడ్‌సిరస్తిదారు. ప్రతిశాఖను అతడు పర్యవేక్షిస్తాడు. లెక్కల తనిఖీదారుకూడా. రెవిన్యూ

పాలనలో విషయాలను కలెక్టర్ అతనితో సంప్రదిస్తాడు. సాలీనా సెటిల్‌మెంట్ విషయం కూడా చూస్తాడు. కింది అధికారులకు కలెక్టర్ ఉత్తరువులు యితని ద్వారా వెడతాయి. అతడికి స్వతంత్ర ప్రతిపత్తి లేదు కాని, కలెక్టర్ పేరిట అన్నీ నడిపిస్తాడు. తొలి నియామకంలో అతడి జీతం 210 రూపాయలు, స్థిరపడని జిల్లాలో అయితే 280 రూపాయలిస్తారు. ఇది క్రమేణా సర్వీసును బట్టి పెంచుతారు. 125 వరహాలు సెటిల్డ్ జిల్లాలో, అస్థిరమైన జిల్లాలో 200 పగోడాలు (వరహాలు) యిస్తారు. ఇది 20 ఏళ్ళ తరువాత వరకూ పెంచుతారు.

(ప్రొసీడింగ్స్ 19 సెప్టెంబరు, 1836)

సిరస్తిదారు పదవి యించుమించు శాశ్వతమైనది. అతని విధులు బహుళం, విపరీతం కూడా. కనుక అతడి పదవి విలువ ఎక్కువ. (రికెట్స్ పేజీ 333)

సిరస్తిదారీ అసలైన పాలకుడు. చాలా పెత్తనం వుంటుంది. స్థానిక చరిత్ర, పరిస్థితులు ఔపోశనం పట్టిన వ్యక్తిగా, కలెక్టర్‌కు యితడే చేరువలో వుంటాడు. రెవిన్యూ బాధ్యతలన్నీ కలెక్టర్లు యితడికే అప్పగిస్తారు. 1851 జూన్‌లో ప్రభుత్వం యిచ్చిన ఉత్తరువులబట్టి శిఖరాగ్ర బాధ్యతలు సిరస్తిదార్‌కు వున్నాయి. యూరోప్ అధికార్లతో బాటు అన్ని జమాలెక్కలు సిరస్తిదార్‌కు తెలియాలి. ప్రతిశాఖకూ సిరస్తిదారే బాధ్యుడు దురాచారాలను అతడు తెలియపరచాలి.

(1940 నుండీ యితడి స్థానంలోకి కలెక్టర్ పి.ఎ. వచ్చాడు)

మద్రాసు కలెక్టరేట్ల లోతుపాతులు తెలుసుకోవడం, మరాఠా బ్రాహ్మణులకు తప్ప అన్యులకు అంతుబట్టేదికాదు. మద్రాసు

ప్రెసిడెన్సీలో 1855 జనవరి 22 నాటికి జిల్లాపాలనలో కులాధిపత్యం విపరీతంగా పెరిగిపోయింది.

ఈ కింద పట్టికలోని వివరాలు చూడండి.

| కులం | సిరస్తిదార్ | నయాబ్ సిరస్తిదార్ | తాసిల్దార్ | మొత్తం |
|---|---|---|---|---|
| మరాఠాబ్రాహ్మణులు | 17 | 20 | 117 | 154 |
| ఇతర బ్రాహ్మణులు | 2 | 13 | 68 | 83 |
| ఇతర హిందువులు | 2 | 3 | 45 | 50 |
| దేశీయ క్రైస్తవులు | 0 | 2 | 13 | 13 |
| ముస్లింలు | 0 | 0 | 0 | 0 |
| యురేషియన్లు | 21 | 18 | 246 | 305 |
| మొత్తం | 21 | 18 | 246 | 305 |

గుంటూరులో దేశస్థ ఉన్నతులు చిరకాలంగా పెత్తనం చేస్తున్నారు. కనుకనే హుజూర్‌సిరస్తిదార్ మరాఠా బ్రాహ్మణుడు గావడం అశ్చర్యలేదు.

1836 జూన్‌లో అలెగ్జాండర్ బ్రూస్ నివేదిస్తూ, గనగం సీతారామరావు ఆరోగ్యం క్షీణిస్తున్నదనీ, ఆయన సేవల్ని గుర్తించి, జీతం పెంచి, ఒక సహాయకుడిని యివ్వమన్నాడు. 1816లోని జీతాలపెంపుదల షరిస్తస్తాదార్‌కు 1823లో పెంచారు. 1825 జూన్ 8 నాటికి సీతారాం ప్రధాన షరిస్తదారు. 1830, 1835లో అతనికి నెలవారీ పగోడా (వరహాల) పెరుగుదల రావలసింది. కాని అతడికి నెలవారీగా 111 రూపాయలు 1832 నుండీ జమిందారీల నుండి వస్తున్నది. అప్పటికి మొత్తం 321 రూపాయలు నెలకు వచ్చిందన్నమాట, అతని 280 రూపాయలు

నెలవారీగా, 2940 రూపాలయ బకాయితో సహాయిచ్చి, జమిందారీల నుండి వచ్చే 111 రూపాయలలో 71 రూపాయలు సహాయకుడికి యిస్తే బాగుటుందని బ్రూస్ సూచించాడు.

(జూన్ 1836. జీతాలస్కేళ్ళతో ఇక్కడ సంబంధంలేదు)

బ్రూస్, సీతారం దృష్టిలో న్యాపతి శేషగిరిరావు వున్నాడు. బ్రిటిష్ వారు గుంటూరులో అడుగుపెట్టినప్పుడు జన్మించిన శేషగిరిరావు, అత్తూరి వెంకటాచలం, కీలక శక్తివంతుడుగా వుండగా పోషణలోకి వచ్చాడు. 22 ఏళ్ళకు శేషగిరిరావు జిల్లాసర్వీస్‌కు వచ్చారు.

1820 ప్రాంతాల్లో మాజిస్ట్రేట్ శాఖ యజమాని అయ్యాడు. అతని కుమార్తె సీతారామారావు కుమారుడిని పెళ్ళి చేసుకున్నది. అతను దేశస్తనాయకుడు.

(నేను మాజీ జమిందార్‌తో మాట్లాడినప్పుడు మానూరురావు, న్యాపతి కుటుంబాలకు సన్నిహిత సంబంధం వుందని గ్రహించాను. మైసూరు మాజీ దివాన్ న్యాపతి మాధవరావు ద్వారా కుటుంబ కేంద్రస్థానం చేబ్రోలు అని తెలిసింది - ఫ్రికన్ బర్గ్)

యూరోప్ సీనియర్ అధికార్లతో అతడికి సన్నిహితత్వం వుంది. జాన్‌విష్ అతడిని హెచ్చరిస్తూ, సత్తెనపల్లి జమిందారు దైవారాధనోత్సవాల ఆహ్వానంతో వెళ్ళవద్దని, పరోక్ష సంబంధాలతో వ్యాపార బాంధ్యవ్యాలు మంచిది కాదన్నాడు.

(జాన్ విష్, జేమ్స్ బెల్, పాట్రిక్ గ్రాంట్, ఎ.ఎస్.మాథిసన్, మాల్కొం లెవిన్‌లు శేషగిరిరావుకు లేఖలు రాశారు. డిసెంబరు 1845) ఇంగ్లీషు సాహిత్యాన్ని జేమ్స్ బెల్ యిచ్చాడు. పాట్రిక్ గ్రాంట్, ఎ. ఎస్. మాథిసన్

అతన్ని ఆమోదించారు. మాల్కొం లెలిన్ అతన్ని కాకినాడ తీసుకెళ్ళి, రాజమండ్రి హుజూర్ సిరస్తిదార్ కావడానికి సహాయపడ్డాడు. ఇది 1835 నాటి సంగతి. ఒక ఏడాదిలో బ్రూస్ రాస్తూ తగిన పదవి అతనికి యివ్వాలని ప్రయత్నిస్తున్నామన్నాడు.

అదనపు జీతానికి సీతారాం అర్హుడు. అతడికి సహాయం కావాలి గనుక, యిది వదులుకోడానికి సిద్ధమయ్యాడు. కనుక వెంటనే రావలసిందన్నాడు. అవసరమైతే రాజమండ్రి కలెక్టర్‌కు రాయదలచాడు. గ్రాంట్ కలెక్టర్.

(బ్రూస్ బాపట్ల నుండి శేషగిరిరావుకు లేఖ, 1836 జూన్ 7)

అప్పట్లో మరాతా బ్రాహ్మణుల మధ్య ముఠా తగాదాలున్నాయి. అతనికి ముందు రాజమండ్రిలో వున్న వ్యక్తిని డిస్మిస్ చేశారు. గ్రాంట్ సమక్షంలో అతన్ని అపఖ్యాతపాలు చేయడంలో కొంతవరకు సఫల మయ్యారు.

(బ్రూస్‌కు గ్రాంట్ - శేషగిరిరావు ద్వారా, రాజమండ్రి నుండి 1836 జూన్ 27)

రాజమండ్రి జిల్లాలో సామర్థ్యం వుంటే యిలాంటివి అడ్డుపడక పోను అన్నాడు లెనిన్.

(గోల్డింగంకు లక్ష్మీనరసురావు 1841 డిసెంబరు 24 జిల్లా అధికారుల మధ్య తీవ్ర ముఠాకుమ్ములాటలే పాలనలో వైఫల్యానికి, ఆర్థిక దుస్థితికి కారణాలన్నాడు.)

శేషగిరిరావు తరువాత ప్రధాన సిరస్తిదార్‌గా మంగనూరి లక్ష్మినరసు రావు అయ్యాడు. జిల్లాలో కొట్టొచ్చినట్లున్న అవినీతిని చక్కదిద్ద బూనాడు.

(వూటి నుండి శేషగిరిరావుకు లెవిన్ లేఖ 1836, సెప్టెంబరు 14)

సీతారామారావు ఆరోగ్యం క్షీణిస్తున్న దృష్ట్యా గుంటూరులో శేషగిరిరావుకు సహాయం అవసరమైంది. కనుక రాజమండ్రిలో పెద్దపదవి వదలుకొని గుంటూరులో తక్కువస్థాయి పదవి స్వీకరించాడు.

గుంటూరుకు అంత త్వరగా శేషగిరిరావు రావడాన్ని మద్రాసులో సంతోషంగా స్వీకరించలేదు. త్వరపడి రాజీనామా యివ్వడాన్ని లెవిన్ హర్షించలేదు. ఆయన ప్రతిభ గుర్తించేటంతకాలం అతడు రాజమండ్రిలో వుండలేదన్నాడు. మద్రాసులో కొత్తవిధానం రూపొందించిన రీత్యా, ప్రభుత్వ పక్షాన జమిందార్లను యజమానులుగా తిరిగి నియమించారు. గుంటూరులో తగ్గిపోయిన కార్యక్రమం రీత్యా శేషగిరిరావుకు నియామకం కష్టాలలో పడింది. (శేషగిరిరావుకు బ్రూస్, మద్రాస్ - 1836).

సీతారాంకు జీతం పెంచకముందు స్పెషల్ అసిస్టెంట్‌షిప్ రాక ముందే, బ్రూస్ గుంటూరు నుంచి వెళ్ళిపోయాడు. (జీతం పెంపుదల 1836, ఆగస్టు 22)

మద్రాసు నుండి నవంబరులో యిలా రాశాడు బ్రూస్.

"నీ సత్ప్రవర్తన కారణంగా హుజూర్‌లో మరొక శాఖలో నీకు ఉద్యోగం వస్తుంది. నీ అర్హతలు వున్నతమైనవి, ప్రజోపయోగమైనవి. సీతారామారావుకు ఏదైనా సంభవిస్తే నిన్ను సిరస్తిదార్‌గా నియమించ దలచాను. గుంటూరులో నిన్ను నియమించడానికి నీ సామర్థ్యం, నిర్ణయం తీసుకునే వైఖరి, అభిరుచి అన్నీ అర్హతలే."

కచేరీలో ప్రధానులను పేర్కొని తన జ్ఞాపకాలు ఉదహరించాడు విష్. శేషగిరిరావు దేశీయసేవకులలో ఉత్తముడన్నాడు. పాలనాధి

కారాలలో ఒక దేశస్తస్థానంలో మరోదేశస్తుడు అలా ఎంపిక అయ్యాడు.

(వి.వి.జి.రావు : ది లైఫ్ ఆఫ్ వెన్నెలకంటి సుబ్బారావు - సి. పారిస్టర్ అండ్ కో, మద్రాసు 1873. రత్నస్వామి సం ఇన్ఫ్లూయన్సెస్ దట్ మేడ్ ది బ్రిటిష్ ఎడ్మినిస్ట్రేటివ్ సిస్టం ఇన్ ఇండియా - లుజాక్ 1919 లండన్ పే 87).

జిల్లాకచేరి విశాలమైంది, సంక్లిష్టమైంది కూడా. ఇందులో వివిధ శాఖలున్నాయి. అవసరాలు మారుతుంటే, యీ వ్యవస్థకూడా అనేక రూపాంతరాలు చెందింది. కనుక నిర్ధిష్టంగా వివరణ జటిలమౌతుంది.

కచేరీలో కీలకకేంద్రం సచివాలయం. అందులో జమాఖర్చులు కీలకస్థానం ఆక్రమించింది. షిరస్తిదార్ విపరీతాధికారాలతో వుండేవాడు. షిరస్తిఖానా కేవలం దేశీయ లెక్కలకు పరిమితంకాదు. ఐదు శాఖల కూడలి అది.

సచివాయంలో ఆరు శాఖలు : 1. షరిస్తశాఖ. 2. మున్షిశాఖ. 3. లెక్కలు, ఉత్తరప్రత్యుత్తరాల శాఖను ఇంగ్లీషుశాఖ అనేవారు. 4. ట్రెజరి. 5. రికార్డు ఆఫీస్. 6. పరికరాల నిర్వహణశాఖ. ఈ కేంద్రశాఖ తెలుగు ఇంగ్లీషు భాషల సంధానకర్తగా వుండేది. స్థానిక కేంద్రపాలకు కూడలి కూడా. దీనికి మరాఠి వాడేవారు.

(హెచ్. స్టోక్స్ లేఖ 1854 సెప్టెంబరు 22)

సచివాలయం తరవాత, 3 శాఖలుండేవి. రెవిన్యూశాఖలో వసూలు యితర రెవిన్యూలు చూచేవారు. జమిందార్ల నుండి. ఇతర శాఖలనుండి భూశిస్తు లెక్కలు అక్కడ చూస్తారు. ప్రతి జమిందారీకి ఒక మదత్‌గార్ (గుమస్తా) వుండేవారు.

## పెత్తందారీ మెట్లు - వరస

బ్రిటిష్ ప్రజలు

పార్లమెంట్

కౌన్సిల్ బోర్డు

డైరెక్టర్ల కోర్టు

భారత ప్రభుత్వం

మద్రాసు ప్రభుత్వం

| | |
|---|---|
| రెవిన్యూబోర్డు | సదర్ అదాలత్స్ |
| జిల్లా కలెక్టర్, మేజిస్ట్రేట్ | జిల్లా జడ్జి |
| హుజూర్‌సిరస్తిదార్ | కోర్టు సిరస్తిదార్ |
| కచేరి - శాఖధిపతులు | ప్రధానసదర్ అమిన్ |
| తాసీల్దార్లు | జిల్లా మునిసిఫ్ |
| నమత్‌దార్ | జిల్లాపంచాయితీలు |
| గ్రామరైతుపెద్ద, కరణం | గ్రామ మునిసిఫ్ |
| గ్రామకులాలు | గ్రామపంచాయితీలు |

## జిల్లా పాలనా చట్రం

కలెక్టర్(హుజూర్) మాజిస్ట్రేట్
|
యూరప్ సిబ్బంది
|
హుజూర్ సిరస్తిదార్
|
సెక్రటేరియట్ శాఖలు
|
సెరిస్త
మున్షి
ఇంగ్లీష్
ట్రెజరి
దఫ్తర్
సదర్‌వారిద్

నయాబ్ సిరస్తిదార్
రెవిన్యూశాఖ
సయాద్
సముద్ర సుంకాలు
మోటార్ఫా
అబ్కారి
స్టాంప్
చిన్న కమతాలు

జనరల్ బ్రాంచ్
మారమర్
డాక్-తపాల్
ఆరోగ్యం
విద్య
మతాలు
సంక్షేమం
వగైరాలు

మాజిస్టీరియన్ బ్రాంచ్
యాజమాన్యం
పోలీస్
గార్డు
జైలు
లీగల్
ఓత్

అమిన్లు
|
పేష్కార్, నయాబ్ అమిన్
|
సచివాలయం

రెవిన్యూ — జనరల్ — మాజిస్టీరియల్

జనరల్
|
సమత్‌దార్
|
కరణాలు — గ్రామ రైతు పెద్ద — గ్రామమునిసిఫ్

ప్రతి విషయాన్ని బట్టి ఒక శాఖ ఉండేది

జడ్జి
|
సిరస్తిదార్
|
సచివాలయం
రిజిస్ట్రీ
|
జిల్లాకోర్టు
నేరం
సివిల్
అక్సిలం
|
ప్రిన్సిపల్ సదర్ అమిన్
|
కాజి
|
జిల్లా మునిసిఫ్
|
గ్రామ మునిసిఫ్

ఆయా శాఖలలో పనినిబట్టి రెవిన్యూ శాఖలలో పేష్కర్, ఇద్దరు మదత్‌గార్లు, ఒక మున్షి, వుంటారు. భూశిస్తు, ఉప్పు శాఖలలో ఇంగ్లీషు రైటర్లు వుండేవారు. పోలీస్ శాఖ వేరే భవనంలో వుండేది. ఇందులోనే సచివాలయం, న్యాయశాఖ వుండేది. సాధారణ సర్వీసు శాఖ కలెక్టర్, షిరస్తిదార్ యిచ్చిన సమస్యల్ని పట్టించుకునేవారు. ఇంకా మరమ్మత్తు, తపాలా ఆరోగ్యశాఖలుండేవి. విద్య, మత సంస్థలు, గణాంకం, సంక్షేమం, ఆయుధాలు ప్రత్యేకంగా చూచేవారు.

కుల, కుటుంబ సంబంధాలలో జిల్లా సర్వీసుల్లో ప్రవేశం వుండేది. పది పన్నెండేళ్ళ వయస్సులో, 5 ఏళ్ళు నేర్చిన తరువాత, సాధారణ లెక్కలు, హిందూ ఇతిహాసాలు, ఆఫీసులో బోయ్‌గా పనికుదిరేది. ఇది కూడా కుటుంబ సంబంధాల వలన లభించేది. అక్కడ అనేక ఏళ్ళు పనిచేసి అనుభవం గడించిన తరువాత నెలకు నాలుగైదు రూపాయల జీతానికి పని కుదిరేది. కులాన్నిబట్టి, సంబంధాల్ని బట్టి, ప్రభావాన్ని అనుసరించి ఉద్యోగం కుదిరేవి. నెలకు నాలుగైదు రూపాయలిచ్చేవారు. ఎక్కువ జీతాలున్న ఉద్యోగాలు పరిమితంగా వుండేవి. సమర్థులు చాలామంది వుండేవారు కనుక పాలనా నైపుణ్యతతోబాటు యితరు అర్హతలు అవసరమయ్యేవి.

(ఇలాంటివి ఎలా జరిగేవనేది ఆసక్తికరంగా పంచకారిఖాన్ - ది రివలేషన్స్ ఆఫ్ ఏన్ ఆర్డర్లీ - 1884 బెనారస్ చూడాలి).

తెలగకమ్మ, ముస్లింకు ఉద్యోగం వస్తే అదృష్టం అనుకోవాలి. పబ్లిక్ వర్క్స్ ఉద్యోగాలు ఉన్నత కులాలవారు అభిలషించి, అమీన్ పదవులు ఆశించేవారు. ముస్లింలు డబ్బు వ్యవహారాలు చూడడానికి విముఖులు కానందున, కోమట్లతో పోటీ పడేవారు. నియోగి బ్రాహ్మణుడైతే, కుల ప్రభావం వలన హుజూర్ శాఖలోకి ప్రవేశిస్తాడు. మరాఠా బ్రాహ్మణులకు

సైతం సెక్రటేరియట్ ప్రవేశించాలంటే కష్టమయ్యేది.

ఇంగ్లీషు నేర్చిన గుంటూరు కుటుంబీకులకు ఇంగ్లీషు శాఖలో స్వచ్ఛంద సేవ ఉద్యోగం లభించేది. దేశస్తులైతే నైపుణ్యం, అనుభవం వలన దక్షిణాదిలో వివాహ సంబంధాలు పెట్టుకొని ఉద్యోగాలలో ప్రవేశించగలిగేవారు. ఒక ఉద్యోగంలో ప్రవేశిస్తే, ఆపైకి వెళ్ళడానికి అనేక అమ్మకాలు, కొనుగోళ్ళు సాగేవి. పైకి పోయే కొద్దీ ఉద్యోగాలకోసం కుతంత్రాలు కుట్రలు ఎన్నో వుండేవి. హుజూర్ కచేరీలో మరాఠా ఈర్ష్య, అసూయలు బాగా పనిచేసేవి.

(వివి గోపాలరావు - ది లైఫ్ ఆఫ్ వెన్నెలకంటి సుబ్బారావు 1873 మద్రాసు సి. పారెస్టర్ అండ్ కో 1837లో సుబ్బారావు రిటైర్ అయి చనిపోయారు. ఏ జిల్లాకు వెళ్ళినా బంధువులలో హుజూర్ సిరస్తిదార్ హెడ్ మున్షి, హెడ్ ఇంగ్లీషు అకౌంటెంట్ ఉండేవారు.

జె.ఎ.బి. డైక్స్ - సేలం ఏన్ ఇండియన్ కలెక్టరేట్ లండన్ డబ్ల్యు హెచ్ ఎలెన్ అండ్ కో 1853)

జిల్లా అధికారి కాలానుగుణంగా తన కుటుంబానికి, తన వారి భవిష్యత్తుకు కట్టుదిట్టం చేసేవాడు. ఆఫీసర్ ఉన్నచోట భూమి కొనడం, అట్టిపెట్టుకోవడం జరగరాదని రెవిన్యూ బోర్డు ఉత్తరువులున్నాయి. (డి.వైట్ 1845లో రాస్తూ యీ ఉత్తరువు పూర్తిగా పెడచెవిన బెట్టారన్నాడు) లోపాయికారిగా అగ్రహారం గ్రామాలు కొనేవారు. వృద్ధ అధికారి తన కుమారులను, బంధువులను మంచి స్థితికి తెచ్చేవాడు. ఇనాంలు కూడగట్టేవాడు. రుణాలు స్వీకరించేవాడు. శత్రువులపై కన్నేసి వుంచేవారు. కాశీ, రామేశ్వరం, కంచి, తీర్థయాత్రలు చేసి, బలపడి, స్థానిక వ్యవహారాలలో పట్టు బిగించేవాడు.

(సెక్షన్ రూల్స్ 1836 ఫిబ్రవరి, ఫోర్ట్ సెంట్ జార్జి గజెట్ కీ 73-76).


1 North Canara
2 South Canara
3 Malabar
4 Coimbatore
5 Madura
6 Tinnevelly
7 Tanjore
8 Trichinopoly
9 Salem
10 South Arcot
11 North Arcot
12 Chingleput
13 Bellary
14 Kurnool
15 Cuddapah
16 Nellore
17 Guntur
18 Masulipatam
19 Rajahmundry
20 Vizagapatam
21 Ganjam
N
0 200 Mls.
0 300 Kms.

మద్రాసు ప్రెసిడెన్సీ

## అధ్యాయం - 7

# జిల్లాలో క్షేత్ర పనితీరు

## (1837)

హుజూర్ అత్యున్నత అధికారం ప్రత్యక్షంగా చూపుతుండగా, క్షేత్రరంగం కనిపించదు. జిల్లా కేంద్రంతో పోల్చితే, క్షేత్ర రంగం చాలా సంక్లిష్టమైనది. ప్రతి ఏటా సంఖ్య, స్వభావం, పరిమాణం మారుతుండడమే యిందుకు కారణం. క్షేత్ర పరిధిలో ప్రభుత్వ కార్యకలాపాలు నిరంతరం మారుతుండేవి.

1827 గుంటూరు పట్టణాన్ని చూస్తే, 36 పట్టణాలు, 846 గ్రామాలు, 650 కుగ్రామాలు వున్నాయి. క్షేత్ర పరిధి గమనిస్తే, పురాతన కొండవీడు సీమ, వినుకొండ, బెల్లం కొండ, 5 పరగణాలతో ముర్తుజా నగర్ సర్కారు, తీరు తెన్నూ లేకుండా వున్నాయి. జమీందారి ఆమని పద్ధతులు కూడా అడ్డగోలుగా కనిపిస్తాయి. పాలనా రీతులలో పరస్పరం జోక్యాలున్నవి. 3 జమీందార్ల గ్రామాలుండగా, కొండవీడు సీమలో ఒకే గ్రామాన్ని ముగ్గురు పంచుకున్నవి కూడా కనిపిస్తాయి. అమీను గ్రామానికి చేరుకోడానికి మూడు నాలుగు యితర అమీన్లు దాటి వెళ్ళాల్సి వచ్చేది.

జమీందారీలన్నీ ప్రభుత్వ అజమాయిషీలోకి రావడంతో క్షేత్ర పరిధి

విస్తృతమైంది. 1821 నుండీ వాసిరెడ్డి గ్రామాలు వారసత్వ కలహాల కారణంగా కలెక్టర్ అజమాయిషీలోకి రాలేదు. 1833లో వాటిని రామనాథ బాబుకు ఇచ్చేశారు. 1828 నుండీ రేపల్లె గ్రామాలు (మాణిక్యరావు) కోర్టు వార్డులుగా కలెక్టర్ ఆధ్వర్యాన వున్నాయి. కరువులో చెల్లింపులు లేనందున, మల్‌రాజు విభాగాలు మనూరు రావు భాగాలు స్వాధీనం చేసుకున్నారు.

(గోల్డింగం నివేదిక 13 డిసెంబరు 1839)

పోలీస్ అమీన్, రెవిన్యూ అమిన్, తానాదార్, తహసిల్దార్ ఎవరైనాసరే తాలూకాలలో దేశీయ కలెక్టర్లే. గుంటూరు హుజూర్ కలెక్టర్ వలె వీరి విధులు విస్తృతమైనవి. ఆర్థిక, నేర అదుపు, సేవా కార్యక్రమాలు చేస్తున్నందున వీరి నెలజీతం 40 నుండి 200 రూపాయలుండేది.

గుంటూరులో అమీన్ల జీతం జమీందార్ల లెక్కల నుండి చెల్లించేవారు. 14లో 9మంది తానాదార్లు రెవిన్యూ పనికి నియోగించారు. జమీందార్ల శాంతిని కాపాడతామని అన్నప్పటికీ, అది అమలు జరగలేదు. 1836 తరువాత బ్రూస్ సూచన ప్రకారం, జమీందార్లను వారి ఎస్టేట్లకు ఇన్‌ఛార్జ్ చేశారు.

(గుంటూరు కలెక్టరేట్ మాప్, 1827 మద్రాసు 1815-16లో సైనికాధికారులు సిద్ధం చేశారు. లెఫ్టినెంట్ ఎస్.మౌంట్ ఫోర్డ్ ఆధ్వర్యం. భూభాగాల పంపిణీ సిఫారసులు. రెవిన్యూ బోర్డుకు స్టోక్స్ 25మే 1843. తాలూకా అంటే తొలుత ఒక విభాగమే. హైదరాబాద్ రికార్డుల ప్రకారం రాష్ట్రంలో పెద్ద విభాగాలకు అన్వయించారు. దక్కన్ పరిభాషలో తాలూకా అంటే జిల్లాలో ఒక భాగం. ఇది పరగణాల వంటిది. తాలూకా అంటే గ్రామ జమాఖర్చులు అనే అర్థంలో అరుదుగా వాడారు).

పల్నాడులో 16 విభాగాలతో సహా 14 తాలూకాలు క్షేత్రపాలనలో ప్రాధాన్యత వహించాయి. ఇవిగాక రెండు పోలీస్ స్టేషన్లు, 2 ఉప్పు క్షేత్రాలు ఉండేవి. గుంటూరు స్థిరంగా వున్నందున, విభాగాలన్నీ, స్టేషన్లని వాటి అధికార్లను థానాదార్లని పిలచేవారు. తాసీల్దారు ఇంకా రాలేదు.

(గుంటూరులో 14 థానాలివి - 1. గుంటూరు, 2. కూరపాడు, 3.చేబ్రోలు, 4. తెనాలి, 5. రాజపేట, 6. చిలకలూరిపేట (కొండవీడు), 7. మంగళగిరి, 8. బాపట్ల, 9. రేపల్లె, 10. రాచూరు, 11. సత్తెనపల్లి, 12. బెల్లంకొండ, 13. వినుకొండ, 14. వంగ్లాపురం.

పల్నాడు థానాలు - 1. దాచేపల్లి, 2. తుమ్మురుకోట, 3. ఉప్పు థానాలు, 4. చినగంజాం, 5. నిజాంపట్నం.

పోలీస్ స్టేషన్లు - పోలూరు, గురజాల.)

1837లో పోలీస్ కార్యక్రమాల్లో భాగం పంచుకున్నందుకు ప్రభుత్వమే అమీన్‌కు చెల్లించింది. జమీందారీ లెక్కల్లో నుండి యిచ్చే జీతం అమలులోకి రాలేదు.

1841-1850 మధ్య అమీన్ రెవిన్యూ విధుల్ని, గుంటూరు అసిస్టెంట్ కలెక్టర్ హెన్రి నెవిల్ చాలా చక్కగా వివరించాడు. 1. కలెక్టర్ ఉత్తరువులను బట్టి భూముల్ని ఆక్రమించడం వదిలేయడం, సాగు చేయడం జరగాలి. 2. హుజూర్ ఆధ్వర్యాన సాలీనా జమాబంది సమాచార వివరాలు సిద్ధం చేయాలి. 3. పశువుల మేతకు, తదితర వాటికి పన్నుల వసూళ్ళు. 4. క్షేత్రపరిశీలకులను పర్యవేక్షించడం, 5. కింది నుండి, పై నుండి వచ్చిన ఫిర్యాదులు పంపడం. 6. ప్రతి గ్రామ కరణం లెక్కలు, పుస్తకాలు తనిఖీ, 7. ప్రతి రైతు రసీదు పుస్తకాలు చూచి, కరణం సరిగా నమోదు చేశాడా లేదా? గమనించడం, 8. రెవిన్యూ వచ్చే అబ్కారి వంటివి లెక్కలు

తయారు చేయుట. 9. నిర్ణీత ఫారాలపై సాలీనా జమాబంది లెక్కలు హుజూర్‌కు సమర్పించుట, 10. రెవిన్యూ లెక్కల్ని నెలవారీగా హుజూర్ ట్రెజరీకి జమ చేయుట, 11. దాతృత్వ ప్రయోజనాలకు ఉద్దేశించిన మొక్కల నిమిత్తం దరఖాస్తులను నమోదు చేసుకొనుట, 12. తాలూకా కచేరీలలో రికార్డులు అట్టిపెట్టుట, ఏర్పాట్ల తనిఖీ, 13. నెలవారీ పెన్షన్లు అందుకునే వ్యక్తులను గమనించి, లెక్కల్ని హుజూర్‌కు అందచేయుట, 14. టీకాల కార్యక్రమం పరిశీలించి, మిగిలినవి సరిగా తిరిగి వచ్చాయేమో గమనించుట, 15. అబ్కారీ నియమాల ప్రకారం పర్యవేక్షించాల్సిన షాపులు. 16. తహసిల్దార్, స్టాఫ్‌లకు కుదువబెట్టిన అస్తులను పరిశీలించుట. 17. సెలవు దరఖాస్తులు హుజూర్‌కు పంపుట. 18. చెరువులు, కాల్వల నుండి నీటి సరఫరా పర్యవేక్షణ. 19. గ్రామ, జిల్లా అధికార్ల కేసులను పరిశీలించుట. 20. కాలదోషం పట్టిన ఇనాంలు. 21. సరిహద్దు కలహాలు పరిష్కరించుట. 22. సాధారణ విషయాలన్నీ కలెక్టర్‌కు నివేదించుట. 23. దేవాలయ నిధులు, వరహాలు కాజేసిన విషయాలు తనిఖీ చేయుట.

(రికెట్స్ - రిపోర్ట్ అఫ్ ది కమిషనర్ ఫర్ ది రివిజన్ అఫ్ సివిల్ శాలరీస్ అండ్ ఎస్టాబ్లిష్‌మెంట్స్, 1858 కలకత్తా పే.345-6)

తన డివిజన్‌లో అమీన్, పోలీస్ హెడ్, మాజిస్ట్రేట్ కూడా. కంపెనీ దేశంలో ప్రవేశించినప్పుడు పోలీగార్లు, కవల్‌గార్లను తొలగించింది. జిల్లా జడ్జి ఆధ్వర్యంలో దరోగాలను ప్రవేశపెట్టారు. (1802) రెవిన్యూ నుండి పరిపాలన వేరుచేసి, కృత్రిమ చట్ట పద్ధతులను ప్రవేశపెడితే, దారుణంగా విఫలమయ్యాయి. 1816లో మన్రో విధానానికి మూలమైన సంస్కరణ లతో, తహసిల్‌దారీ, తానాదారీ అధికారులను కలిపారు. ఆ తరువాత

స్థానిక స్థితిగతుల కనుగుణంగా పద్ధతులలో స్వల్ప మార్పులు చేశారు. (మన్రోపద్ధతిలో అవసరమైన విధానాలు గుంటూరులో అమీన్‌లకు అన్వయించారు. లెనిన్ 17 జూన్ 1834.

కవాలీలు దేశాన్ని ఆదరించి, దోపిడీకి దూరంగా నేరాన్ని అదుపులో పెడతామంటూ దోచుకు తిన్నారు.

అమీన్ సామర్థ్యం, నమ్మకం పైనా, అతనికి హుజూర్ నుండి లభించే మద్దతుపైనా సమస్యలు గిరి గీసుకున్నాయి. ఈ ఉద్యోగం ప్రధానమని భావించి, కలెక్టర్ ద్వారా యిష్టమొచ్చినట్లు ప్రవర్తించే వీలులేదని మన్రో తలపోశాడు. దేశీయ అధికారులను కఠినంగా చూడడం, శిక్షార్హం చేయడం మంచిది కాదని, సస్పెండ్ అయిన తిరునల్వేలిలో పెద్ద సిరస్తిదార్ ఉదాహరణ యిచ్చేవాడు.

"ఒక కన్నేసి వుంచడం వేరు, నిరంతరం అనుమానించడం వేరు. కలెక్టర్‌కు అతనికింద పనిచేసేవారికి నిరంతర అనుమానం తగదు. ఎవరో కొత్త వారిని నమ్మజాలం. (అర్బత్‌నట్‌కు మన్రోమినిట్, మే 20, 1828) ప్రతిభావంతులపట్ల నమ్మకం, బాధ్యత వుంచాలని 1835లో కలెక్టర్లకు చెప్పారు. తమ కృషికి మద్దత్తు ఆశించడం తహసిల్దార్లకు సహజం అన్నారు.

(గుంటూరు కలెక్టర్, మాజిస్ట్రేట్‌కు సర్క్యులర్ 19 మే, 1835)

2 ఏళ్ళ వరకూ తాసిల్దారు లేని జిల్లాలున్నాయి. అలాగైతే, పాలన అంతా అస్తవ్యస్తమౌతుందన్నారు. అస్థిరతస్థానే శాశ్వత రీతులుండాలి. అలాంటి స్థితి మన సుస్థిరతకు దెబ్బ అన్నారు. యూరోప్ ఏజెన్సీలో తటపటాయింపులు పోగొట్టాలన్నారు. తరచు జిల్లాకు కొత్త కలెక్టర్

రావడంతో ఆందోళన పెరిగిపోయి, జిల్లా అధికార్లలో ముఠాతత్వం పెచ్చు పెరిగింది.

(గుంటూరు కలెక్టర్ - మాజిస్ట్రేట్‌కు సర్క్యులర్ 19 మే 1835)

గుంటూరుకు తరచు కొత్త కలెక్టర్ రావడం, లోపల ఏం జరుగుతుందో తెలుసుకోలేకపోవడం, హుజూర్ అధికారులపై ఆధారపడడం ఎలాగో నిర్ధారించలేకపోవడం, అమీన్ల సమర్థత తెలుసుకునే అవకాశం అరుదుగావడం సహజం. ప్రతి సంవత్సరం సాగు భూమి విస్తరించింది. కొత్త భూమిపట్ల కలహాలు పరిష్కరించాల్సి వచ్చింది. సాలీనా లెక్కలు సరి చూడాలి. ప్రతి క్షేత్రానికి అమీన్ ఏమేరకు కాలం వినియోగించగలడో చూడాలి. తాలూకా పర్యవేక్షణకు చాలా సామర్థ్యం కావాలి. ఇవన్నీ జటిలమైనవి.

అమీన్ పర్యవేక్షించే ప్రాంతాలు స్పష్టంగా ప్రాంతాలున్నాయి. మాజిస్ట్రేట్ అధికారాలు న్యాయవిధానాలకు లోబడి జరగాలి. వ్యక్తుల్ని ఎంపిక చేయడం, పదోన్నతి, పెన్షన్ నిర్ణయం, క్రమశిక్షణ అంతా రెవిన్యూ పంథాలో సాగాలి. రోజువారీ పోలీస్, మాజిస్ట్రేట్ పాలన రెవిన్యూ బోర్డు పట్టించుకోదు. జిల్లా అధికారి విజ్ఞప్తి రెవిన్యూ బోర్డు చూడాలి. ఈ అధికార అయోమయంలో అమీన్ పెత్తనం కొనసాగింది. 1855లో మద్రాసు టార్చర్ కమిషన్ బయట పెట్టిన అనంతరం, పోలీస్, మాజిస్ట్రేట్ పర్యవేక్షణ ప్రారంభించారు.

(రిపోర్ట్ ఆఫ్ కమిషన్ ఫర్ ఇన్‌వెస్టిగేషన్ ఆఫ్ ఎలిజ్‌డ్ కేసెస్ ఆఫ్ టార్చర్ 1855 మద్రాసు)

గుంటూరు తాలూకాలో 1834-1837 మధ్య ఏడాదికి ఇద్దరు అమీన్లను డిస్మిస్ చేశారు. రెవిన్యూ బోర్డుకు విజ్ఞప్తి చేస్తే, 4లో

అనుకూలం కాగా ఒకటి మాత్రం మంజూరు చేశారు. మద్రాసు అధికారుల అండను బట్టి, యూరోప్ కలెక్టర్లు హుజూర్లతో చేతులు కలపగా, వారి పెత్తనానికి తగినంత మద్దత్తు పొందలేక పోయారు. గ్రామ ప్రాంతాల్లో అమిన్ల పట్టు బిగిసింది.

(5గురు అమిన్లు - మంత్రి వెంకటాచలం బోడి కృష్ణయ్య, తోట కృష్ణమ్మ, పి. కనకయ్య, డి. లక్ష్మి నరసురావు.)

జిల్లా వలె తాలూకా వ్యవస్థీకరించారు. ఒక కేంద్రం, క్షేత్రశాఖ లున్నాయి. తాలూకా కేంద్రంలో తానా కాబా వుండేది. కచేరీ కేంద్రాన్ని పట్టణం లేదా గ్రామంలో పెట్టారు. కాస్బా అనేది క్షేత్ర స్టేషన్. దాని కచేరీని ఒక సంస్థ అనలేదు.

కాస్బా వ్యవస్థలు ఆయా పరిస్థితుల బట్టి వుండేవి. గుంటూరు తానాలో ఒక కొత్వాల్, ఒక గుమాస్తా వున్నారు. పోలీసు విధులకే పరిమితమైన స్టేషన్లు చిన్నగా వుండేవి. భూశిస్తు బాధ్యతలేని కాస్బాకు తగినంత మంది మార్బలం వుండేది. వారికి ఇతర విధుల నిర్వహణ పని వుండేది.

కరువు కాలంలో జమీందారీలు ప్రభుత్వ అజమాయిషీలోకి వచ్చాయి. ప్రభుత్వ కొత్త విధానంతో, అమాని యాజమాన్యాన్ని జమీందార్లకు అప్పగించారు. వారు అమిల్‌దార్లు (రెవిన్యూ వసూళ్ళ అధికారులు)గా ప్రభుత్వ పక్షాన వ్యవహరించారు.

తొలుత యిలాంటి ఉద్దేశాన్ని మాల్కొం లెనిన్ 1834 సెప్టెంబరు 28న వెల్లడించాడు. రేపల్లె వ్యవహారాలు చర్చిస్తూ జంగన రావు వృద్ధాప్యంలో ఉన్నందున, ప్రభుత్వ పక్షాన జమీందార్లందరూ అమ

ఎస్టేట్ల వ్యవహారం తామే చూసుకోవాలన్నాడు. అమాని కింద జమీందార్ల స్థితి దారుణంగా వుంది. మరోపక్క కరువు కాటకాలు తలాతోక లేని పాలనావ్యవస్థ వున్న రీత్యా, పరిస్థితులు చక్కబడడానికి చాలాకాలం పడుతుందని కలెక్టర్ పేర్కొన్నాడు. ఎస్టేట్లలో లాభాలు రావడం, రెవిన్యూ బకాయిలు వసూలు చేయడం చాలా సమయం తీసుకుంటుంది జమీందార్లు తమ ఆస్తుల్ని కాపాడదలచారు. తమ భూముల్ని, తమను విమోచనగావించడానికి చాలా యిబ్బంది పడాలి. ప్రభుత్వ అజమాయిషీపై జిల్లా అధికారుల బ్రతుకు దెరువు ఆధారపడింది.

రేపల్లెను అప్పటికే యజమానిచేతిలో పెట్టారు. కొత్త విధానాన్ని రెవిన్యూ బోర్డు 1836 మార్చి 14న ప్రతిపాదించింది. వాసిరెడ్డి జమీందారీ దారుణ స్థితిలో వున్నందున, ఆ భూముల్ని పునరుద్ధరించేవారికి యాజమాన్య అదుపు అవసరం. (మాథిసన్‌కు బోర్డు సూచన 1836 మార్చి 14) ఆ ప్రాంతాలు పర్యటించి వచ్చిన గవర్నర్, లెఫ్టినెంట్ జనరల్ ఫ్రెడరిక్ ఆడం అలాంటి చర్య అంగీకరించాడు. (1836 ఏప్రిల్ 7)

1836 జూన్‌లో, ఆగస్టు 12న ఉత్తరువులు కలెక్టర్‌కు చేరగా, రామనాథ్ బాబుకు ఆయన ఆస్తులు స్వాధీనం చేశారు. (రామనాథ బాబు వారస హక్కుదారని సదర్ అదాలత్ ప్రకటించినా, కింగ్ కౌన్సిల్‌లో కేసు వున్నది) సంవత్సరం లోపే అమిల్దార్లుగా మనూర్ రావు జమీందార్లు సత్తెనపల్లికి, చిలకలూరిపేటకు తిరిగి అంగీకరించారు. మల్‌రాజు ఆస్తులు అమానీ అదుపులో వున్నాయి.

ఈ నిర్ణయాన్ని డైరెక్టర్ల బోర్డు ఒప్పుకొని, ఒక ఏడాదికి ధృవపరిచింది. అమీన్ ఎస్టేట్లను జమీందార్లు నిర్వహించడం యీ కొత్త విధానం ద్వారా మంచిదన్నారు. (మద్రాసు డిస్పాజెస్).

కలెక్టర్‌గాని, మరెవరోగాని ఆస్తులపట్ల జాగ్రత్తపడేదానికంటె, జమీందార్ అయితేనే తన ఆస్తులపట్ల తగు శ్రద్ధ వహిస్తాడన్నారు. ప్రతి జమీందారూ కలెక్టర్‌కు బాధ్యుడు గనుక, యీ విధానంలో చిక్కులు తక్కువ అనుకున్నారు. కలెక్టర్లు యీ విధానాన్ని అనుసరించడం యథేచ్ఛగా తగునన్నారు.

ఈ కొత్త విధాన అమలులో పాలనా విషయాలు, వ్యక్తులపై ప్రభావం, స్థానిక మఠాల పై వత్తిడులు అశ్రద్ధ చేయరాదు. వ్యవస్థలోకి జమీందార్లు, వారి దివాన్లు రావడంతో, గందరగోళం తప్పదు. కొన్ని ప్రభుత్వ ఉద్యోగాలు అనవసరమౌతాయి. జమీందారీ పాలనలో కొత్త ఉద్యోగాలు వస్తాయి.

న్యాయ, మాజిస్ట్రేట్, పోలీస్ కార్యక్రమాలలో వ్యవస్త కాస్తా, డివిజనల్, లేదా తాలూకా స్థాయి దగ్గర ఆగుతుంది. తాలూకా కింది స్థాయిలో, గ్రామానికి ఎగువ దశలో, రెవిన్యూ పనులకు అవకాశమున్న స్థాయి వుంది. ఇవి రెండు విధాలు. భూమిశిస్తు పాలన పై ప్రధాన సబ్‌డివిజన్ వుంటుంది. వాణిజ్య మార్గాలలో సుంకాలు విధించేవి. ద్వితీయ శ్రేణిలో కనిపిస్తాయి.

ఒకటి మొదలు 24 గ్రామాల వరకు తాలూకా సబ్ డివిజన్‌లో సమితులు అంటారు. (ప్రాచీన కాలం సమితులు యింకా పెద్దవి. యించుమించు తాలూకాతో సమానం. ముత్తాలనేవి జమీందార్లకు విభాగాలు. 20వ శతాబ్దంలో వీటినే ఫిర్కాలన్నారు).

ఇవి అమాని అదుపులో వున్నప్పుడు, సమర్‌దార్ విధులు తాహసిల్దార్ వంటివే. నెలకు 10 నుండి 14 రూపాయలు యిచ్చేవారు. ఒక గుమాస్తా, ఒక మున్షి, ఒక ఓవర్‌సీర్ ఇద్దరు జవాన్లను యిచ్చేవారు. వీరికి వరుసగా

7, 5, 5, 4 రూపాయలు యిచ్చేవారు. (గుంటూరు జిల్లాలో యీ విధానం పనిచేసే తీరు వివరంగా పేర్కొనబడింది. బోర్డుకు స్టోక్స్ లేఖ 1847 ఆగస్టు 17).

పోలీస్ పెత్తనం మినహాయిస్తే సమట్‌దారు విధులు తాసిల్దార్ పనుల వంటివే. దైనందికంగా చేయాల్సిన విధులకు కావలసిన ఫారాలు, వివరాలు యిచ్చేవారు. ఇందులో భూమిశిస్తు, మరామ్మత్తు, పాలన వుండేవి. పెద్ద గ్రామాలలో అతని కార్యాలయం చావడిలో వుండేది. తనకిందగల గ్రామాలలో విధులు నిర్వహించేవారు.

ఏప్రిల్ మే పంట కాలంలో సమత్‌దార్ ప్రతి గ్రామం వెళ్ళేవాడు. గ్రామ నాయకులను సంప్రదించి, భూకమతాలకు పరిమితులు, చనిపోయినందున ఆక్రమించకుండా వున్న భూములు, వదిలేసినవి పట్టించుకునేవారు. గత సంవత్సర ఒడంబడికల బట్టి రైతుల నుండి దరఖాస్తులు స్వీకరించేవారు. నిర్ణయాలు తీసుకునేముందు, భూములు తనిఖీ చేసి, సరిహద్దులు మారాయా, పొలం ఒక నాగలికి సరిపోతుందా అని పరిశీలించేవారు. పొలాలు సరిగా విభజించాం. సంఖ్య అమర్చారా, భూమినిబట్టి నిర్ణయించారా అని చూచేవారు. ఇదంతా గ్రామ నాయకుల సమక్షాన జరిగేది. ప్రతిపాదన కుదిస్తే, అమీకి అనుమతి కావాలి. ప్రభుత్వాన్ని మోసగిస్తున్నారేమో పరిశీలిస్తారు. గ్రామ వాసులకంటే బయట వారికి ఎక్కువ సానుకూలత చూపరు. ఒకసారి ప్రతిపాదన ఆమోదిస్తే, రైతుకు కారనామా (కంట్రాక్ట్) యిచ్చి, పుస్తకంలో నమోదు చేసి, రైతు ఒడంబడిక కాపీ స్వీకరించేవారు.

పక్షానికి ఒకసారి తానా కాస్పాకు సమత్‌దార్ నివేదికలు అందిస్తాడు. కరణాల నివేదిక బట్టి వ్యవసాయాభివృద్ధి వివరంగా పేర్కొంటారు.

ఇందులో దున్నుట విత్తుట, పంటలు, నీటి సరఫరా, చీడలు, ఇంకా పంటకు, రెవిన్యూకు సంబంధమైనవి నమోదు చేస్తారు. గ్రామ నాయకుల సమక్షంలో సమత్‌దార్ పొలాల్ని పరిశీలించి, ప్రతిపొలం వివరాలు పుస్తకంలో రాస్తారు. ముందు చిత్తు ప్రతి, తరువాత నింపడమనే పద్ధతి అంగీకరించేవారు కాదు. (స్టోక్స్ రాసిన వివరాలు సమత్‌దార్‌లకు) అప్పటికప్పుడు రాసి, నింపి, అమీన్‌కు పంపాలి. ఇందులో పంట అంచనాలు కాజేసే రీతులు, మోసాల్ని అరికట్టే విధానాలు ఉంటాయి.

ప్రతి గ్రామానికి పుల్లరి రేటు నిర్ణయించడం సమత్‌దార్, జమాబంది సమయంలో చేయాలి. హుజూర్ వచ్చినప్పుడు రైతులు, కరణాలు, గ్రామస్తులు ప్రత్యక్షం కావాలి. కవులు ఒడంబడిక సమయంలో లోగడ, ప్రస్తుత పరిస్థితుల రీత్యా, ప్రతి ప్రశ్నకు సమాధానం యివ్వాలి. ఫిర్యాదులు, కలహాలకు జవాబు చెప్పాలి. కలెక్టర్, అమీన్ ప్రశ్నలకు రసీదు పుస్తకాలు దగ్గర పెట్టుకొని కరణాలు చెప్పాలి.

వసూళ్ళ సమయానికి, సమత్‌దారు ఒక కన్నేసి, కోతలు, మార్పిడి, కొలతలు, కుప్పలు గమనించాలి. ప్రతి గ్రామంలో కిస్తు కట్టడానికి తేదీలు, మొత్తాలు నిర్ధారిస్తారు. గ్రామాధికారులు అనుభవ శూన్యులుకాకుండా చూసుకోవాలి. అదనపు వసూళ్ళు జరపరాదు. లెక్కల పుస్తకం ప్రతి గ్రామానికి అధునాతనంగా వుంచాలి. తేదీ వారీగా మొత్తాల్ని చూపాలి. గ్రామ పుస్తకాలతో కరణాల లెక్కలు సరిపోవాలి. అలాకాక, తేడా వస్తే అమీన్‌కు వేరే పుస్తకం ద్వారా తెలియపరచాలి.

సమత్‌దారు తన దైనందిక చర్య నమోదు చేయాలి. జరిగేదంతా స్థానిక నాయకుల ద్వారా తెలుసుకోవాలి. మరణాలు, వెళ్ళిపోయినవారు, వృత్తి మార్పులు, కొత్తగా వచ్చినవారు వంటి వివరాలు అట్టి పెట్టాలి.

గొర్రెలు, మేకలు, పశువుల వివరాలు వుంచాలి. వాతావరణం, నీటి సరఫరా, చెరువులు, కాల్వలు, వంతెనలు, రోడ్లు, భారీ వర్షాలు, సుడిగాలుల ప్రభావం గమనించాలి. ప్రతి గ్రామానికి చెరువులు తవ్వేవారు, మరామ్మత్తు కూలీలు, బండ్లు, ఎడ్లు, పల్లకి బోయీలు, మోసే కూలీలు గమనించాలి. టాంటాం ద్వారా ప్రకటనల బాధ్యత వహించాలి. ప్రభుత్వ భవనాలు, భూములు, రహదారి బంగళాలు, చౌల్ట్రీలు, తోపులు పట్ల శ్రద్ధ వహించాలి.

సమత్‌దార్ బాధ్యతలు భారీగావుంటే, అతడు పనిచేసే సమయం, అనుకూలత గమనించాలి. అలాంటి వ్యక్తి స్థానిక నియోగి బ్రాహ్మణుడై వుంటాడు. సబ్ డివిజనల్ హెూదాలతో అతడికి సన్నిహిత సంబంధం వుంటుంది. కుటుంబ ఆసక్తుల నిబంధనలు సరేసరి. అతనికి ప్రమోషన్ అరుదు. అతని కులంలో సమితి స్థాయిలో చూస్తే, హుజూర్ స్థాయికి చేరేవారు చాలా స్వల్పం. అతనిపై అజమాయిషీ అంత భారంగా వుండదు. హడల్‌స్టన్ స్టోక్స్ రాసిన దానిని బట్టి, స్థానిక అవినీతి, కలహాలు వున్న కరణాలలో, కలసి పోయే అవకాశం వుండొచ్చు. కాని కలెక్టర్లు వ్యక్తిగతంగా వీరి స్థితిగతిని గమనించడం కష్టం. హుజూర్ సేవకులవలె వీరికి విధులు, నియమాలు చెప్పడమూ దుర్లభమే. ఇది 1847లో వాస్తవమైతే 1837లో అంతకంటే మెరుగైన స్థితి లేదు.

గుంటూరు జిల్లాలో ట్రాఫిక్ రద్దీని అడ్డుకోడానికి 46 చౌకీలు, రెండు సముద్ర సుంకాల స్టేషన్లు తోడ్పడ్డాయి.

చౌకీదారు నెలకు 10 నుండి 12 రూపాయల జీతంతో పర్యవేక్షించ డానికి ఒక గుమాస్తా, పైగస్తీ, నలుగురైదుగురు జవాన్లు వుండేవారు. ప్రతి బండి, ప్రతి కావడి ఆపేవారు. పరిశీలించేవారు. రిజిస్టర్ చేసేవారు.

చెల్లింపులు స్వీకరించేవారు. ప్రతి స్టేషన్ వద్దా ఆహారం, పశుమేత, ప్రయాణ సౌకర్యాలు కల్పిస్తూ కొందరు జీవనోపాధి ఒనగూర్చేవారు. ప్రతి స్టేషన్ వాణిజ్యానికి అవరోధమే. ప్రతి చౌకీదారూ ఆర్థిక వ్యవస్థను మందకొడిగా సాగడానికి, స్తంభించడానికి తోడ్పడ్డారు. విచారణ జరిపి, 1837లో యీ ప్రతిబంధకాలను తొలగించే చర్యలు చేబట్టారు. డ్యూటీ వేసే విషయాలు 36 అంశాలకు కుదించారు. జిల్లాలో చౌకీలు 26కు పరిమితం చేశారు. (గోల్డింగం 1837 జులై 20) భూమిపై సుంకాల మీద ఆధారపడేవారు. గొడవ చేశారు. అయినా ప్రగతి కనిపించింది. సమాజంలో వ్యతిరేకత లేకుండా సంస్కరణలు తేవాలనుకున్నారు. ప్రెసిడెన్సీలో 1844 నాటికి చౌకీదార్లను తొలగించారు.

ఇంతవరకు ప్రస్తావించని గ్రామాల సంగతి చెప్పాలి. వీటికి చెందిన సంస్థలు, వాటిలో ప్రధాన సమూహాల ప్రస్తావన చూడాలి. ప్రాచీన ఆచారాన్నిబట్టి, పెద్దల నాయకులు గ్రామంలో చెట్టు కింద సమావేశమై, కాలం గమనించకుండా, చర్చలు చేసేవారు. వారంతా బ్రాహ్మణులు, సంపన్నులు గనుక, పేదలకు కనీసావసరాలు అందకపోతే సేవలు కష్టం అని గ్రహించారు. నాయకులు బలవంతులు, గ్రామపెద్దలు, స్థానికంగా ప్రభావంగలవారు. ఈ నాయకులు పెద్ద కాపు, పెద్ద కరణం గనుక బలమైనవారు.

హఠాత్తుగా ఒకనాడు గ్రామ వ్యవహారం తీరంతా నాశనం కావడం జరిగే పనికాదు. మన్రో సంస్కరణలను సమర్థించేవారు. 1802 నిబంధనావళిని తీవ్రంగా ప్రతిఘటించారు. గ్రామానికి ఒకే పెద్దను నియమించి, పోలీస్ దరోగాకు బాధ్యుడనడంతో, శతాబ్దాలుగా వస్తున్న గ్రామ సమాజం, వ్యవస్థ దెబ్బతిన్నదన్నారు. మన్రో సంస్కరణ వ్యతిరేకులు వాదిస్తూ, ప్రతి రైతును స్వీకరించడంతో, ఉమ్మడి బాధ్యతను

దెబ్బతీశారని, లోగడ బలహీనుల్ని అణిచి వేసే విధానాన్ని నిరోధించే తీరుకూడా దెబ్బతిన్నదన్నారు.

(జె.డబ్ల్యు. బి. డైక్స్ - సేలం. ఏన్ ఇండియన్ కలెక్టరేట్, 1853 లండన్ పైన ఏం జరిగినా గ్రామాలు ఏమీ ప్రభావితం కాలేదన్నారు)

పరస్పర విరుద్ధ వాదనల నుండి ప్రభుత్వ పోలీస్ ఒక వాదనకు వచ్చారు. గ్రామ వ్యవస్థ, సమాజం కదలించరాదు. 1837లో కలెక్టరేట్‌లో వచ్చిన రెండు ప్రకటనలు యిందుకు సోదాహరణ.

కోర్టు డైరక్టర్లు కొంచెం ముందుకు వెళ్ళి రెవిన్యూ నివేదికపై వ్యాఖ్యానాలకు భిన్నంగా, మద్రాసు తీర్మానం (1835 జులై 21) ఆమోదించారు. ఆస్తిలేని వారిని కవుళ్ళు స్వీకరించనివ్వరాదన్నారు. సన్నకారు రైతులకు అది తోడ్పడదు. పేదరికాన్ని తొలగించనివ్వదు. ఆర్థిక స్వాతంత్రానికి దారితీయదు.

గ్రామ పంచాయితీలు రైతులకు వడ్డీ వ్యాపారస్తులకు పేచీలొస్తే విచారించి నిర్ణయం తీసుకోవచ్చని ప్రభుత్వం ఉత్తరువులిచ్చింది. సంపన్న రైతుల, షావుకార్ల వలలో పడి పేదరైతులు కొట్టుమిట్టాడుతున్నారు. తగాదాలకు జిల్లా కోర్టులు, వాజ్యాల పద్ధతులు ప్రయోగించడం కద్దు. జిల్లా అధికారులు జోక్యం చేసుకుని, అవకాశాన్ని తమకు అనుకూలంగా మలచుకుంటున్నారు. విత్తనాలవంటి వాటికి పేదలకు డబ్బు కావాలి. సంపన్నులు పేదలకు డబ్బిచ్చి, అందుకుగాను ప్రభుత్వ సహాయంకోరి, రెండు విధాలా లాభపడుతున్నారు. ఈ సమస్య గురించి గోల్డింగం రాశాడు. సావుకార్లకు ప్రత్యామ్నాయ మార్గాలుండాలన్నాడు. గ్రామ పంచాయతీలకు పెత్తనం యిస్తే, అదికూడా గ్రామనాయకులు తమకు అనుకూలంగా వాడుకున్నారు.

భూశిస్తు విషయంలో గ్రామ నాయకులు శక్తివంతంగా వున్నారు. తమ లెక్కలు లోతుపాతులతో తనిఖీ చేయలేరని కరణాలకు బాగా తెలుసు. అలా పరీక్షించేవారు లేరు. రుజువు చేయడానికి చేయకపోడానికి రైతులు తప్ప మరెవరూ లేరు. సాలీనా సెటిల్‌మెంట్ అనేది కరణాలు చేయాల్సిందే. కరణాల పని పరీక్షించడం తమాషా అయింది. తమ పొలాల విషయంలో సాలీనా ఒప్పందాలు, మార్పులకు రైతులకు హక్కు వున్నదని రైత్వారి పద్ధతి అంటుంది. ఇది చూడడం కలెక్టర్, అసిస్టెంట్ కలెక్టర్, తాసిల్దార్‌కు కుదిరేది కాదు. ఎప్పుడైనా ఒక కరణాన్ని శిక్షించడం, సమత్‌దార్‌ను తొలగించడం వలన సంప్రదాయ రీతుల నుండి గ్రామాన్ని బయట పడేయలేకపోయారు.

గుంటూరు జిల్లా గందరగోళ పరచిన కరువు పరిస్థితులు ప్రస్తావించాం. దీని వెనుక ఆర్థిక స్తంభన వున్నది. గుంటూరును ఆధునిక లోకంలోకి తీసుకు రావలసిన సమస్య ఉంది. స్థానిక సమాజ సంప్రదాయాన్ని ఛేధించకుండానే ఆధునిక ప్రపంచంలోకి గుంటూరును తీసుకు రావడమనేదే ప్రభుత్వ సమస్య. సమాజ అంతర్గత రీతులలో ప్రభుత్వ జోక్యం కనీస పరిమితిలో వుండాలని గోల్డింగం ఉద్దేశ్యం. సమాజాన్ని ఆర్థిక దిగ్బంధంలో వుంచిన సంకెళ్ళను తెంచగలమని అనుకున్న గోల్డింగం, వ్యక్తిగత గందరగోళంలో కూరుక పోయాడు. (గోల్డింగం రిపోర్టు).



అధ్యాయం - 8

# షెరిస్తదార్ వారసత్వ కలహాలు

(1837-1839)

గుంటూరులో కలెక్టర్లు త్వరగా మారిపోతూ సాగిన బ్రిటిష్‌పాలన వలన, దేశీయాధికారం పెంపొంది, గుంటూరు బ్రాహ్మణుల మధ్య ముఠాకలహాలకు దారితీసింది. 1831 నుండీ పరిపాలనపై పట్టులేకుండా పోయింది. లోగడ ఘర్షణలలో వున్నవారు పోరాటం సాగించారు.

(ఎలియట్ నివేదిక :

గార్డన్ మెకంజి : ఎ మాన్యుల్ ఆఫ్ కృష్ణా డిస్ట్రిక్ట్ 1883 మద్రాసు, పే. 358)

కొత్తకలెక్టర్ వస్తుంటే పాతషిరస్తిదార్లు చనిపోతుంటే, పాతకక్షలు చెలరేగాయి.

1837 జులై 29న జాన్ గోల్డింగం గుంటూరు ఇన్‌చార్జిగా పదవిలోకి వచ్చాడు. అతడు ప్రెసిడెన్సీ ఖగోళశాస్త్రజ్ఞుడి కుమారుడు. 1801లో పోర్ట్ సెయింట్ జార్జిలో పుట్టాడు. దక్షిణ ఇండియాలో పెరిగాడు. 1818లో మద్రాసు సివిల్ సర్వీస్‌కు సిఫారసు చేశారు. (రైటర్స్ పిటిషన్స్ : 31

సంపుటి. 304) మద్రాసులో అతని లోగడ సర్వీసు గడిచింది. 1935లో షర్లా నుండి తిరిగి వచ్చాడు. గుంటూరుకు వచ్చే ముందు నాలుగు జిల్లాలు మారాడు.

అతడు శక్తిమంతుడు. ఆచరణాత్మకవ్యక్తి వ్యవసాయం, ఇంజనీరింగ్, అర్థికశాస్త్రాలలో ఆసక్తివుంది. సంస్కరణ పట్ల ఉత్సాహం వుంది. క్రైస్తవ మతప్రచారంలో ఆసక్తివుంది. (జాన్ నోబెల్ : రాబర్ట్ నోబెల్. మిషనరీ టు ది తెలుగు ప్యూపుల్ - 1867 లండన్ పే. 125. డ్రాక్ అండ్ కుడర్ : ది తెలుగుమిషన్ - ఫిలడల్ఫియ, 1914, పే 40-50.

ఎఫ్. గ్లాడ్‌స్టోన్ : ది సి.ఎం.ఎస్. తెలుగుమిషన్, మైసురు, 1941, పే. 1. "ఇతరులకంటె, జాన్ గోల్డింగం ఆ ప్రాంతంలో మిషనరీ స్థాపకుడు - మద్రాసులో స్థిరపడిన కుటుంబానికి చెందినవాడు.")

యాక్టింగ్ కలెక్టర్ వరుసలో సబ్బవీస్ వెంకటకృష్ణారావు వచ్చాడు. అతడు పెద్దకుటుంబం నుండి వచ్చిన దేశస్తుడు. అతని తండ్రి ఆనందరావు దివాన్‌గా వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు వద్దవున్నాడు. మరో మామ నరసింగరావు మచిలీపట్నం నవాబ్‌కు దివాన్. గుంటూరు, మచిలీపట్నానికి హుజూర్ షిరస్తిదార్‌గా మరో మామ వెంకటరావు వున్నాడు. లోగడ ముఠాకలహాలలో మరో మామ కేశవరావు నిమగ్నుడయ్యాడు. 1828 నుండీ మచిలీపట్నం నవాబ్‌కు వకీల్‌గా కృష్ణారావు వున్నాడు. అడ్వకేట్ జనరల్ జార్జినార్టన్‌కు ప్రీతిపాత్రుడు కూడా.

1831లో జిల్లాసర్వీస్‌లోకి రావాలని ప్రయత్నిస్తే, నిరంతర జబ్బు అడ్డుపడింది. కోలుకున్న తరువాత తటపటాయించాడు. ముఠా తగాదాలలో, అవినీతిలో అతడు కూరుకుపోయాడు.

(గోల్డింగం 1837 నవంబరు 24)

క్రిందిస్థాయి ఉద్యోగంలో ప్రవేశించి, సీనియారిటీతో ప్రమోషన్ పొందాలని గోల్డింగం అతడికి మచిలీపట్నంలో సలహా చెప్పాడు. గోల్డింగం వెంట గుంటూరు వచ్చిన కృష్ణారావు వుంగలాపురం తానాకు అమిన్‌గా ఒప్పుకున్నాడు. అంతటితో ఘర్షణకు నాందిపలికింది. సీతారం మరణావస్థలో వున్నాడు. అప్పటికే హుజూర్ కచేరీలో శేషగిరిరావు వున్నాడు. అవకాశం కోసం కృష్ణారావు ఎదురు చూచాడు. గోల్డింగం రావడంతో, ముఠా తగాదాలు చెలరేగి, విజృంభించాయి. ఆ తరువాత ఒకసారి ఒక ముఠాకు మరోసారి ఇంకో ముఠాకు పరిస్థితులు అనుకూలించాయి.

కొత్త కలెక్టర్‌కు ఎదురైన పరిస్థితులు చేదు అనుభవాలతో వున్నాయి. గుంటూరులో యాక్టింగ్ అసిస్టెంట్ జడ్జిగా ఎడ్వర్డ్‌గ్లాస్, జాయింట్ క్రిమినల్ జడ్జిగానూ సీనియర్‌గా వున్నారు. 1837 జూలై తరువాత ఎ.ఎస్ మాథిసన్ (జాయింట్ క్రిమినల్ జడ్జి), జి.ఎ. హారిస్ యాక్టింగ్ హెడ్ అసిస్టెంట్ కలెక్టర్‌గా వున్నారు. వీరు కూడా జిల్లాకు కొత్త. హారిస్ వచ్చి నెలనే అయింది. లోగడ నవంబరులో చివరి యాక్టింగ్ కలెక్టర్ జిల్లా వదలివెళ్ళారు.

1837లో యిలా అధికారస్థానాలు ఖాళీగా వుండగా, 1836-37కు జమాబంది మే చివరకు ముగియ వలసి వుండగా, కనీసం మొదలు కాలేదు. లోగడ సంవత్సరం సెటిల్‌మెంట్ పూర్తిచేసి, రానున్న ఏడాది పని ప్రారంభించే భాగం గోల్డింగంపై పడింది. గ్రామాలలో దుర్భిక్షం, మిడతలు పంటల్ని నాశనం చేశాయి.

(గోల్డింగం : జమామంది రిపోర్ట్, ఫస్లి 1247. 1838 సెప్టెంబరు 6)

గోల్డింగం యిలా పేర్కొన్నాడు. : "జిల్లాపదవి బాధ్యతలు చేబట్టిన తరువాత, అక్రమాల కారణంగా జిల్లా చాలా బాధలకు లోనైందని గ్రహించాను. రైతులు కుంగిపోయారు. జిల్లా దిగజారిపోయింది. సమర్థవంతమైన యాజమాన్యాన్ని నెలకొల్పవలసి వచ్చింది. ఈ పరిస్థితి తెచ్చి పెట్టిన వారిని తొలగించాలి. హుజూర్‌లో అవినీతి అడ్డుకునే బదులు, వారే ప్రోత్సహించారు." దుష్పరిపాలన బయటపడగా, హుజూర్‌కు క్షేత్రంలో వారికి అవగాహనతో గూడుపుఠాణి జరిపినట్లు తేలిందని గోల్డింగం అన్నాడు. (ఆ సమయంలో గుంటూరు-బెజవాడ మధ్య దోపిడీ ముఠాలు పనిచేశాయి.)

రెవిన్యూ బకాయిలు రద్దు చేయవలసివుండగా, గ్రామస్తులు చెల్లించిన వాటిని గమనించకుండా, ఒప్పందాలు అమలు జరపలేదు. ఈ కారణంగా మల్‌రాజు గ్రామాలలో రైతులు సాగుచేయ నిరాకరించారు. బ్రిడ్జిలు, ఉప్పు కొఠారీలకు తప్పుడు అంచనాలు వేశారు. వర్తకులు ఎగుమతి చేసే తెల్ల, రంగు వస్త్రాలకు రవాణా డ్యూటీగాక, ప్రతి వంద వస్త్రాలకు ఒకటి రెండురూపాలయలు కట్టాల్సి వచ్చింది. దొంగ ఆస్తులు స్వీకరించిన వారికి రక్షణ కల్పించారు. పోలీస్ చేయి యిందులోవుంది. ఈ కారణంగానే హద్దనూరి భవనారావును డిస్మిస్ చేశారు. అతడు కృష్ణారావు స్థానంలో వచ్చిన అధికారి. తాడికొండ నాగయ్యను అవమానించగా అతడు మరణించాడు. ఈ కారణంగా అక్కరాజు నిత్యానందం అనే మేజిస్ట్రేట్‌శాఖ మేనేజర్‌ను. గుంటూరు కొత్వాల్‌ను, దఫాదారును తొలగించారు.

పాతుకపోయిన పాలకసిబ్బంది నుండి మద్దత్తు లభించనందున కొత్తకలెక్టర్ వున్న కొద్దికాలంలో అంతగా తెలుసుకోలేకపోయాడు. కాని, హుజూర్ షిరస్తిదార్ సీతారాం బాగా తోడ్పడ్డాడు. అయితే అతడు

అవసానదశలో సొంతవ్యవహారాలలో తలమునకలైవున్నాడు. కొత్తగా బయటబడిన వ్యవహారాల వలన, నయాభ తహసిల్దార్ ఉత్సాహం చూపలేదు. అతడు ఉప్పు, మరామ్మత్తు శాఖలు చూస్తున్నాడు. హెడ్ అసిస్టెంట్ సిరస్తిదార్ మాజిస్ట్రేట్ అనుభవాలతో, భూశిస్తు వ్యవహారాలు చూస్తుండగా, అతడికీ అసంతృప్తి మిగిలింది. కృష్ణారావు, అతని స్నేహితులకు సానుకూలత వున్నందున, కలెక్టర్‌కు అన్నీ తెలియజేశాడు.

అక్టోబర్‌లో సీతారాం చనిపోయాడు. అతని స్థానంలో కృష్ణారావును గోల్డింగం నియమించాడు. పక్షం రోజులలో అతని అనుభవం, అర్హతలు, సర్వీసు రికార్డు తెలియజేయమని రెవిన్యూబోర్డు అడిగింది. 24 నవంబరున బోర్డుకు అడిగివన్నీ అందించారు. అతడిని నామినేట్ చేయడానికి కలెక్టర్ కారణాలు : ఇతర అభ్యర్థుల అనర్హత. జిల్లాదారుణ పరిస్థితులు. కృష్ణారావు అర్హత. మిగిలిన 6గురు అభ్యర్థులు గోల్డింగంను తృప్తిపరచలేదు. నక్కలపల్లి సుబ్బారావు నయాబ్ తహసిల్దార్‌గా అవినీతిపరుడు. హెడ్ అసిస్టెంట్ సిరస్తిదార్ న్యాపతి శేషగిరిరావు మాజిస్ట్రేట్ పనుల్లో వుండగా, అర్హత లేకపోగా, అంత మంచి రికార్డు లేదు.

తయార్‌ఖాన్ వినుకొండ అమీన్, సౌశీల్యుడు. సంపన్న సావుకారు. జిల్లా అంతటా ఆర్థికవ్యవహారాల వలన, అతడి వ్యక్తిగత ఆసక్తులు సిరస్తిదార్‌గా విధులకు అడ్డొచ్చాయి. ఈ కారణంగా హుజూర్ స్రాప్ అర్హత ప్రశ్నార్థకమైంది. కాంచనపల్లి కృష్ణారావు హుజూర్‌స్రాఫ్‌గా నిష్పాక్షిత చూపలేకపోయాడు. పల్నాడు అమీన్లు అభిలషణీయులుకారు. మందపంటి సుబ్బారావు మదత్‌గార్‌గా కేవలం 5 ఏళ్ళ అనుభవమే వున్నది. వెలదండి దాసప్పను లోగడ రెవిన్యూబోర్డు అవినీతి పనులకు విచారణ చేసింది.

గోల్డింగం గట్టి అభిప్రాయాలు గలవాడు. జిల్లా అధ్వాన్నస్థితిలో పడడానికి అవినీతి, యాజమాన్యలోపం కారణాలన్నాడు. అవినీతికి, ముఠావ్యవహారాలకు దూరంగా నిష్పక్షపాతంగా వ్యవహరించగల వ్యక్తి సంస్కరించగలడు. స్థానిక అధికారులు బాధ్యతవహించి, జిల్లాను అధ్వాన్నస్థితికి తెచ్చారు. కనుక బయట నుండి సమర్థులను తీసుకరావాలి. ఇవన్నీ దృష్టిలో పెట్టుకొని, అప్పటికే సామర్థ్యం చూపిన కృష్ణారావును ఎంపిక చేశామన్నారు. డిసెంబరు 10న బోర్డు కాస్తా కృష్ణారావు ఎంపికను తృణీకరించింది.

వాసిరెడ్డి తాలూకాలో కొన్నినెలలు అమీన్‌గావుండడం, వాసిరెడ్డి జమిందార్, మచిలీపట్నం నవాబ్‌లతో సన్నిహితం గావడం వలన, గుంటూరు షిరస్తిదార్‌గా అర్హత రాదన్నారు. దీనిబదులు తహసిల్దార్ ఎంపిక నయం అన్నారు. వున్నంతలో న్యాపతి శేషగిరిరావు నయం గనుక అతన్ని నియమించమని కలెక్టర్‌కు చెప్పారు.

ఈలోగా మల్‌రాజు గ్రామాల వ్యవహారం కుదిరింది. జమాబంది నెమ్మదిగా సాగింది. మంగళగిరి, గుంటూరు, తెనాలి ప్రాంతాలకు యిది విస్తరించింది. జమిందార్లను వారి దివాన్లను, అమీన్లను గ్రామ వారీగా లెక్కలు యివ్వమన్నారు. వివరాలు యిచ్చే బదులు వారి దగ్గర లెక్కలతో సరిపుచ్చారు (గోల్డింగం - జమాబంది ఫస్లి 1246 దీనికి కృష్ణారావు ప్రధాన కారణమని కలెక్టర్ అన్నారు.) కృష్ణారావు శ్రమించినమాట వాస్తవం. తన వ్యతిరేకుల్ని తొలగించి, తన వారితో నింపడంలో కృష్ణారావు సఫలుడయ్యాడు.

(లంచానికీ, మామూళ్ళకూ తేడా సున్నితమైంది. ప్రతిదీ లంచంగా తేలవచ్చుగాని, అలాకుదరదు)

తెనాలి, బాపట్ల తానాలు వాసిరెడ్డి జమిందారీలోవి. 1822లో జమిందారీ కాస్తా అమానీ అదుపులోకి వెళ్ళింది. జిల్లా అధికారులు వచ్చి జమిందారీ సేవకుల్ని తొలగించి, వారితో విరోధం తెచ్చుకున్నారు. అది చాలాకాలం సాగింది. జమాబంది కోసం గోల్డింగం వచ్చినప్పుడు, అధికార్లపై ఫిర్యాదుల్ని గుప్పించారు. తమ వ్యాపారం సాగించుకోడానికి తమ నుండి చాలా లంచాలు గుంజారని కోమట్లు చెప్పారు. రెవిన్యూ చెల్లింపుల విషయంలో తమ నుండి లంచాలు ఆశించిన విషయాలను కరణాలు, రైతులు చెప్పారు. పెట్రిగుంట సుబ్బయ్య అనే పెద్దరైతు తన వద్దనున్న లేఖను చూపి, నయాబ్ షిరస్తిదార్ నక్కలపల్లి సుబ్బారావు, న్యాపతి శేషగిరిరావులు 310 రూపాయలు కావాలనడాన్ని చూపారు. మాజీ అమీన్ మహమ్మద్‌ఖాన్ లేఖలు యివ్వడానికి ఎం.కె.వీరప్పను పంపి, డబ్బు వసూళ్ళు చేశారన్నాడు.

సాక్ష్యాధారాలుండడంలో కలెక్టర్ రెండు మార్గాంతరాలు పాటించాడు. నక్కనలపల్లి సుబ్బారావుపై ఫిర్యాదులు గనుక తప్పుడు అయితే, జమిందారీ సేవకులతో కుమ్మక్కై అయి, నయాబ్ సిరస్తిదార్, అతని సహాయకులను ధ్వంసం చేయదలచి అలా చేసి వుండవచ్చు. అలాగైతే హుజూర్ కచేరీ అధికార్ల ప్రాద్బలంతో జిల్లా అధికార్లు అలా ప్రవర్తించి వుండాలి. తొటకృష్ణమయ్య, (రామనాధబాబు దివాన్), నక్కలపల్లి సుబ్బారావు, కలసి జనాన్ని భ్రష్టుపట్టించి వుండాలి. (తోట కృష్ణమయ్య దారుణమైన వృద్ధఅధికారి. 20 ఏళ్ళ క్రితం థామస్ఓక్స్ నమ్మకం సాధించాడు. రామనాధబాబు తన వ్యవహారాలు యితన్ని చూచిపెట్టమన్నాడు) ఉభయపక్షాలూ చాకచక్యంతో వ్యవహరించారు. వీటిలో దేనినీ ఎంపిక చేయజాలం.

గోల్డింగం తన నిర్ణయంలో ఒకేతీరు పాటించాడు. అటు ప్రజలు,

యిటు ప్రభుత్వం యీ గ్రామాలలో ఒక క్రమపద్ధతిలో జనాన్ని పీడించి దోపిడీచేశారు. హుజూర్‌లో పాలకబృందాన్ని ఛేదించాలని నిర్ధారించాడు. పాలనా సామర్ధ్యాన్ని దృష్టిలో పెట్టుకొని కొద్దిమందిపై తీవ్రచర్య తీసుకున్నాడు. ప్రమాదకర ప్రభావితుల్ని తటస్థం చేయగలిగాడు.

గోల్డింగం సంస్కరణలకు, కృష్ణారావు అతని అనుచరులకు అడ్డొచ్చిన వ్యక్తి నక్కలపల్లిసుబ్బారావు. అతనిపై 1822 రెగ్యులేషన్ కింద చర్య తీసుకో దలచలేదు. కేవలం అతన్ని డిస్మిస్ చేయదలిచానన్నాడు. సుబ్బారావుకు జరిమానావేసి, మారుమూల తానామ్ ఇన్‌చార్జీగా పంపేశారు. ఆ విధంగా పాలనపై గోల్డింగం పట్టుసాధించాడు. కచేరీలో పాతుకుపోయిన నాయకులకు వ్యతిరేకంగా కృష్ణారావు పైచేయి సాధించగలిగాడు.

ఆ తరువాత హుజూర్ సిరస్తిదార్ అధికారికంగా ఎవరూలేరు. కృష్ణారావును సెరిస్తిదార్‌గా పెట్టమని కలెక్టర్ కోరినా రెవిన్యూబోర్డు నిరాకరించింది. 1836-37లో చివరకు జమామంది నివేదిక మద్రాసుకు పంపారు. అయినా, కృష్ణారావు ప్రతిభను గుర్తించలేదు. 1838 ఏప్రిల్‌లో నయాబ్ తహసిల్దార్‌గా కృష్ణారావును నియమించారు. నక్కలపల్లి సుబ్బారావు నవంబరులో ఖాళీ చేసిన స్థానం అది. హుజూర్ సిరస్తిదార్ లేనందున, తుది ఏర్పాట్లు చేసేవరకూ ఆ పదవి చూడమన్నారు. ఈ లోగా హెడ్‌అసిస్టెంట్ న్యాపతి శేషగిరిరావును తాత్కాలిక నయాబ్ చేశారు.

పాతనాయకులకు ఎసరు పెడుతున్న రీత్యా వారు ఎదుర్కొడానికి సన్నద్ధమయ్యారు. హుజూర్‌గా తనను తొలగించడంపై నక్కలపల్లి సుబ్బారావు రెవిన్యూబోర్డుకు విజ్ఞప్తి చేశాడు. అతనికేసులో ప్రొసీడింగ్స్‌ను

బోర్డు పంపింది. 1838 మే 19న అవి పంపారు. జూలై 5న తీవ్ర అభ్యంతరాలతో మద్రాసుకు తిప్పిపంపారు. హుజూర్ కచేరీలో ఏర్పాట్లను ఖండించారు. కృష్ణారావు నియామకాన్ని నిరాకరించారు.

మద్రాసు - గుంటూరు మధ్య అభ్యంతరాలు తెగిందాకా లాగారు. జమాబంది నివేదిక 1837-38 సెప్టెంబరు 6 గోల్డింగం సమర్పించి, సబ్బవీస్ వెంకటకృష్ణారావు హెడ్‌సిరస్తెదార్‌గా అక్టోబరు నుండి చేసిన తీరు బాగా శ్లాఘించాడు. సెటిల్‌మెంట్ తుదిదశలో తాను, కృష్ణారావు కలసి చేస్తున్నందున, రెవిన్యూబోర్డు ఉత్తరువులను అమలు పరచడం లేదని గోల్డింగం తెలియజేశాడు.

"కృష్ణారావు ప్రతిభనుబోర్డుకు తెలియపరచడం నా విధి. సంవత్సరంలో ఫలితాలు అతనికి అనుకూల నిర్ణయాన్నిస్తాయి. అన్నీ పరిగణలోకి తీసుకొనే అతన్ని ఎంపికచేశాం. జిల్లాసంక్షేమాన్ని అతనంతగా పట్టించుకున్న వారు లేరు" అని గోల్డింగం రాశాడు.

హెడ్ సిరస్తెదార్‌గా కృష్ణారావును కొనసాగనివ్వాలన్నాడు. జిల్లా అవసరాల దృష్ట్యా, బోర్డు విచక్షణాధికారాలు వినియోగించి కృష్ణారావును సాగనివ్వమన్నాడు. కృష్ణారావును బోర్డు పరిశీలిస్తే, వారికి నచ్చుతుందన్నాడు. బోర్డు తుది నిర్ణయాన్ని శిరసావహిస్తానన్నాడు.

1838 మార్చి 14 నాటికి జమాబంది నివేదికపై బోర్డు నిర్ణయానికి వచ్చింది. సెప్టెంబరు 27 బోర్డు గట్టిగా నిలచి, వెంటనే హుజూర్ సిరస్తెదార్‌గా కృష్ణారావును తీసేయమన్నది.

25 అక్టోబరు నాటికి కృష్ణారావు యింకా వున్నాడని తెలిసి, బోర్డు వెంటనే న్యాపతి శేషగిరిరావును నియమించమన్నది. కలెక్టర్ అటువంటి

మరోవ్యక్తిని కనగొనలేని పక్షంలో అలా చేయమన్నది. ఇంకా జాప్యం చేస్తే న్యాపతి శేషగిరిరావును స్వయంగా నియమిస్తామన్నారు. గోల్డింగం చేసేదిలేక, రాజమండ్రి మాజీ హెడ్‌సిరస్తిదార్‌ను గుంటూరు హెడ్ సిరస్తిదార్‌గా కృష్ణారావు స్థానంలో పెట్టారు.

అది చాలనదన్నట్లు నక్కలపల్లి సుబ్బారావును కచేరీలో నయాబ్ తహసిల్దార్‌గా బోర్డు నియమించింది. తమ కలెక్టర్‌కు వ్యతిరేకంగా బోర్డు అలా వ్యవహరించింది. నక్కలపల్లి సుబ్బారావు విషయంలో కలెక్టర్ గోల్డింగం పొందిక లేకుండా వ్యవహరించాడనీ, అలాంటి చర్యలకు పాల్పడ్డ యితరులను పట్టించుకోలేదన్నది. కలెక్టర్ అయిష్టంగా శేషగిరిరావు విషయంలో బోర్డుకు తలవంచాల్సి వచ్చింది. నక్కలపల్లి సుబ్బారావుకు వ్యతిరేకంగా ఫిర్యాదులు చేసిన వ్యక్తిని నామినేట్ చేసినందుకు కలెక్టర్‌ను ఆక్షేపించారు. శేషగిరిరావు గుంటూరులో ఇతర చోట్ల పనిచేసినప్పుడు వివిధ వ్యక్తులు ఆయన్ను మెచ్చుకున్నారని బోర్డు ఒప్పుకున్నది.

తాత్కాలిక కలెక్టర్ పేర్కొన్న విషయాలలో వైరుధ్యాలున్నా యన్నారు. స్థానికపరిస్థితి బాగా అవగాహన చేసుకున్న కలెక్టర్‌ను పెడచెవిన బెట్టారు. కలెక్టర్ సేకరించిన సాక్ష్యాధారాలన్నీ తుడిచిపెట్టారు. గోల్డింగం తన చర్యల్ని సమర్థించు కుంటూ, గవర్నర్ ఇన్ కౌన్సిల్‌కు విజ్ఞప్తి చేసి, నక్కలపల్లి సుబ్బారావును క్షమించడం, ఎంత వృథా జరిగిపోయిందో, ఎంత అణచివేత తొలగిపోయేదో వివరించాడు. కలెక్టర్‌ను విస్తృత విచక్షణాధికారాలుండాలన్నాడు.

కృష్ణారావుకు అనుకూలంగా తనను తొలగించడంపై నక్కలపల్లి సుబ్బారావు పెట్టుకున్న అర్జీ లార్డ్ ఎల్ఫిన్‌స్టన్‌కు చేరింది. గోల్డింగం విజ్ఞప్తి

కూడా అప్పుడే అందింది. బోర్డు ఉత్తరువులు పాటించాల్సిందని, గోల్డింగం వీటిని అనుసరించాలని చెప్పాడు.

ఆ తరువాత ప్రభుత్వంపై గోల్డింగం వత్తిడి చేసినట్లు లేదు. గవర్నర్ వెంటబడి కొందరు కోర్కెలు వెల్లడిస్తుండగా, గోల్డింగం మాత్రం తన కుటుంబం వారి ఆరోగ్యపరిస్థితుల రీత్యా గుంటూరు నుండి చిత్తూరుకు బదిలీకోరాడు.

(1841 డిసెంబరు 2, 1842 జూన్ 23)

అతని విజ్ఞప్తిని హెూంశాఖ అధికారులకు ప్రస్తావించారు. రెవిన్యూబోర్డు ఉత్తరువులను, గోల్డింగం గుంటూరు వదలి వెళ్ళిన తరువాత, తెలుసుకున్న దేమంటే, కోర్ట్ ఆఫ్ డైరెక్టర్లు ఆయన జాప్యంపట్ల అసంతృప్తి వ్యక్తం చేశారని. కనుక విషయం సాధారణమైనదనీ, దీనికి ప్రాధాన్యత లేదనీ తేలింది. కలెక్టర్‌కు తెలియడానికి అది పంపారంతే. అది జిల్లా రికార్డులలో కలిసిపోయింది.



అధ్యాయం - 9

# జిల్లా అధికార్లను తొలగించడంలో పెనుగులాటలు

(1837-1839)

జిల్లాకేంద్రంలో ముమ్మరంగా కలహాల సంగతి అలా వుండగా, క్షేత్రంతరంగంలో అంతకు తక్కువేమీ లేవని గోల్డింగం కనుగొన్నాడు. స్థానిక సమస్యల వాడివేడిలో ఆయనకూడా మునిగితేలాడు. వత్సకుటుంబం నిరోధించిన తీరు, వంగముల సుబ్బారావు పట్టుదల చూచి అతడు కలవర పడ్డాడు. ఒక్కొక్క పోరాటం వెనుక స్థానిక సమాజస్వభావం వెల్లడైంది. వత్స ధర్మపురి, రాచూర్ తానాకు అమిన్‌గా నియమితుడయ్యాడు. తగిన సమయంలో అతడు తాలూకా కేంద్రం మంగళగిరికి వచ్చాడు. కొన్నేళ్ళక్రితం వాసిరెడ్డి జగన్నాథబాబు మరణానంతరం (1827లో) వాసిరెడ్డి దివాన్ సబ్నవీస్ ఆనంతరావు నుండి రామనాథబాబు చాలా విలువైన వస్త్రాలు కుదువబెట్టి, డబ్బు తీసుకున్నాడు. 1837లో ఆనంతరావు చనిపోగా, తన వస్త్రాలు తిరిగి యివ్వమని జమిందార్ అడిగాడు. ఇవ్వకపోవడంతో బలవంతంగా రాత్రిళ్ళు గోడౌన్‌లో చొరబడ్డాడు. వస్త్రాల దొంగతనానికిగాను అతన్ని, అతని సేవకులను అరెస్టు చేశారు. అది సబ్నవీస్ ఆస్తి అని కృష్ణారావు అన్నాడు.

అమరావతి గ్రామ మునుసబు రిపోర్టును బట్టి జమిందార్‌పై అభియోగం నమోదు అయింది. జమిందార్ క్రిమినల్ కోర్టుకు హాజరైనప్పుడు, అతనిపై ఫిర్యాదు ఫైలు కచేరీ తానానుండి అదృశ్యమైంది. విచారణ జరిపితే అమరావతి మునునబు కనిపించలేదు. (బహుశాహత్యకు గురి అయివుండొచ్చు) సరైన సాక్ష్యం లేక కేసుకొట్టేశారు.

ధర్మపురి రహస్యంగా కీలకసాక్ష్య నివేదికను జమిందార్ వకీలుకు చేరవేశాడని, జమిందార్‌కు విఘాతం కలిగించే విషయం అందులో వుందని, గోల్డింగంకు తెలిసింది. అమీన్‌కు వ్యతిరేకంగా మిగిలిన విషయాలు కూడా గుంటూరుకు చేరాయి. మంగళగిరికి వచ్చినప్పుడు తెలిసిన విషయాలతో, ధర్మపురిని కలెక్టర్ డిస్మిస్ చేశాడు.

ప్రభుత్వ రికార్డ్డు ఆఫీసు నుండి అధికార నివేదిక కాజేసి, మటుమాయం చేసినందుకు క్రిమినల్ కోర్టులో వత్స ధర్మపురిపై కేసుపెట్టారు. అలాంటి రిపోర్టు అసలులేదని ఒకవేళ వుంటే గులపాటి సూరయ్య అనే యువపోలీస్ మదత్‌గార్ కాజేసి వుండాలని వాదించాడు.

ఆ నివేదిక విషయం ప్రస్తావిస్తూ సూరయ్య తన కుటుంబానికి అమరావతిలో తెలియపరచాడన్నారు. ఉభయపక్షాల వాదనలతో, నిజం ఏదో కోర్టు నిర్ధారించ లేకపోయింది. మొత్తం మీద ఆ రిపోర్టు అదృశ్యమైన రీతికి చెప్పిన కారణాలను పరిగణనలోకి తీసుకోలేకపోయారు. ధర్మపురిని విడుదల చేశారు.

1837 డిసెంబరు 19న మాజీ అమీన్, రెవిన్యూబోర్డుకు ధరఖాస్తు పెట్టాడు. 11 మాసాల అనంతరం, కేసులో అసలు రికార్డు పంపమని కలెక్టర్‌ను అడిగారు.

1838 నవంబరులో గోల్డింగం ప్రత్రాలు పంపాడు. ధర్మపురి డబ్బు తీసుకొని, మంగళగిరి దేవాయల సిబ్బంది కళ్ళుముసుకొని, రథం కిందబడి రథోత్సవంలో చనిపోయిన వారిని పట్టించుకోకుండా జాగ్రత్త వహించారన్నాడు. ఈ లంచాల వ్యవహారంలో కోమర్తి గుమాస్తాను వాడుకొని వ్యవహరించాడని, దేవాలయ యజమాని చందూలాల్‌పై అభియోగం పెట్టారు. రికార్డుతో పారిపోతున్న కోమర్తిని పట్టుకున్నారు. తప్పుడు సాక్ష్యం యివ్వకుండా అతని సోదరుడిని హైదరాబాద్ పంపారు. సొంతలాభాలకు చౌకబారుగా వ్యవహరించాడని మాజీ అమీన్‌ను గోల్డింగం అభిశంసించాడు. టేక్ మీదుగా కంపెనీసైన్యం వెడుతుండగా స్థానిక వర్తకులకు మంచి లాభసాటి బేరాలు వచ్చేవేళ, బియ్యం మార్కెట్ ధర కంటె తక్కువగా రెండు ఇత్తడి డబ్బుకు (16 డబ్బులు = 1 అణా) అమ్మజూపాడు. అప్పుడు కోమర్తి నాయకులు పోలీస్ మదల్‌గార్ గులపాటి సూరయ్య వద్దకు రాయబారం వచ్చారు. అమిన్ మధ్యాహ్నం విశ్రాంతి తీసుకునే చోటకు వారిని తీసుకెళ్ళాడు. 29 రూపాయలు లెక్కించగా, రెండు సత్తు వాటిని మార్చారు. మాజీ అమిన్ విపరీత లాభాలు ఆర్జించాడు. సుంకాలను రహశ్యంగా రెట్టింపు చేశాడు. ఎక్సైజ్‌పన్నులు, సర్‌చార్జిలు, పాస్‌లు, స్టాంప్‌పేపర్ రేట్లు, వస్త్రాలు, పొగాకు, యింకా అనేక వాణిజ్య వస్తువుల పన్నులపై ఆర్జించాడు. ఒకప్పుడు అదుపులోవున్న వాణిజ్యపన్నులు అదుపు తప్పాయి. మగ్గాలపై పన్ను తగ్గించి, చేనేత వారి నుండి ధర్మపురి లంచాలు రాబట్టాడు.

గోల్డింగం జరుగుతున్న తతంగం లోగుట్టు పట్టేసినా, కోర్టువిధానం అతన్ని సాగనివ్వలేదు. సబ్నవీస్ వెంకట కృష్ణారావును. హుజూర్ సిరస్తిదారు ఎంపికపై బోర్డుకు విజ్ఞప్తి చేయడంతో వారు ప్రభావితులయ్యే అవకాశం వుంది. అమీన్ కొనుకల జగ్గయ్య మంగళగిరిలో ధర్మపురి

తరువాత వచ్చాడు. అతడికి నూజివీడు జమిందారు, కృష్ణారావులతో సంబంధాలున్న మాట వాస్తవం. గోల్డింగం ఎలాంటి పక్షపాతం చూపలేదు. ఆరోగ్యరీత్యా జగ్గయ్యను బదిలీ చేశాడు. జగ్గయ్య ఆ మధ్యే చనిపోయాడు. కృష్ణారావు, అతని అనుచరులను నిందిస్తూ, ప్రతిదానికీ వారే కారణమని పిటీషన్లు పెట్టారు.

రెవిన్యూబోర్డు న్యాయరీత్యా కేవలం పద్ధతులను అనుసరించింది. విషయం లోతుకు పోలేదు. మొత్తంమీద ధర్మపురి దరఖాస్తును ఆమోదించింది. అతన్ని తిరిగి నియమించడంలో తప్పులేదన్నది.

చినగంజాం గుంటూరుజిల్లాలో ఉప్పు మార్కెట్ కేంద్రం సముద్ర నీటిని పొలాల్లో నిలవచేసేవారు.

ఉప్పుపరిశ్రమ, ఉప్పు తయారీ ప్రభుత్వ గుత్తాధిపత్యమే.

(మద్రాసు కోడ్ ఆఫ్ రెగ్యులేషన్స్ మద్రాసు 1840. బెంగాల్ నుండి 1805 జూలై 4న వచ్చిన ఉత్తరువుల ప్రకారం గుత్తాధికారం స్వీకరించారు.)

1837లో ఉప్పుపై 3 లక్షల రూపాయలు ఆదాయం వుండేది. డిపోలలో అమ్మకాల వలన రూపాయికి 7 అణాలు ప్రభుత్వానికి వచ్చేది. ఉప్పు ఉత్పత్తి, ధర నిర్ణయం ప్రభుత్వమే కట్టుదిట్టం చేసింది. చినగంజాంలో 400 మంది ఉప్పు తయారు చేసేవారు. వ్యవసాయ పంటపొలాలవలె, ఉప్పు భూములు కూడా నీరు కట్టడానికి వుండేవి. అక్కడ బ్రాహ్మణుల నుండి అంటరాని వారి వరకూ వుండేవారు. ఉప్పు తయారు చేసేవారిలో, కుడి, ఎడమ పక్షాలు కుల విభేదాలతో వుండేవి. గుర్రం స్వారి, పల్లకీ ప్రయాణం. గొడుగు పట్టుకోవడం, పందిరి వేయడం, డప్పు వాయించడం, వూరేగింపులో తేడాలొస్తే, కొట్లాటలు జరిగేవి. (ఎలియట్ నివేదిక)

ఉప్పుతయారీలో సంపన్నులు కుడిహస్తం వారు. పేదలు వామ పక్షీయులు. పేదలు తమ పనికి అప్పుల వారిపై ఆధార పడుతుండేవారు.

1837 జూన్ 22న వత్స లక్ష్మయ్య చార్జి తీసుకోకముందే కుడి ఎడమ పక్షాల మధ్య కలహాలున్నాయి. అతనికి ముందున్న గనగంరెడ్డిరావు కుడిపక్షం వారిని వెనకేసుకొచ్చి, వామపక్ష కులాలవారు ఉప్పు క్షేత్రాల నుండి సరుకు తీసుకెళ్ళడానికి విపరీతంగా డబ్బు గుంజజేవాడు. లేకుంటే అడ్డుపెట్టేవాడు. ఒక ముఠాను వదలేసి, మరొకముఠా దగ్గర విపరీతంగా డబ్బు తీసుకున్నారు. తన డబ్బు వసూలు చేసుకొనక ముందే రెడ్డిరావును బదిలీ చేశారు.

వత్సలక్ష్మయ్య తన అవకాశాల్ని వదులుకోదలచలేదు. తనకు 100 రూపాయలు, తోట లక్ష్మినరసు పేష్కార్‌కు రూ. 50లు డపాదార్లిద్దరికీ చెరొక రూ.25లు, తానా సిబ్బందికి రూ.58లు వామపక్షం వారిచే పంపిణీ చేయించారు. కాని ఆ జనమంతా అతనికి శత్రువులయ్యారు. గ్రామదేవత ఉత్సవం చేయకుండా వారిని అడ్డుకున్నారు. ప్రత్యేక మునిసిఫ్ నియామక దరఖాస్తును తొక్కిపట్టారు.

సబ్బవీస్ వెంకటకృష్ణారావు విషయ తీవ్రత సోకిందోలేదో తెలియదు. 1837 నవంబరు 30న వామపక్ష కులంలో 5గురు రాచూరు తానా వెల్లటూరులో గోల్డింగం దగ్గరకు వెళ్ళారు. చినగంజాం ఉప్పు అమీన్‌పై గూడుబోయిన సంగారెడ్డి ఆరోపణలు చేస్తూ తమ వద్ద డబ్బు గుంజాడన్నారు. ఫిర్యాదు స్వీకరించిన గోల్డింగం విచారించమని సెరిస్తపేష్కర్ ఎడుపూడి రామయ్యను వెళ్ళి విచారించమన్నాడు. పేష్కార్ సమక్షంలో 26మంది ఉప్పు రైతులు, కోమర్తిలు సాక్ష్యం యిచ్చారు. లంచం డబ్బు అప్పుగా యిచ్చినవారు గోల్డింగం దగ్గర సాక్ష్యం పలికారు. కొట్టివేతలతో వున్న లెక్కల పుస్తకాలను రుణాలిచ్చిన వారి దగ్గర సాక్ష్యంగా

స్వీకరించారు. ఉప్పు పేష్కర్ తోట లక్ష్మీనరసును డిస్మిస్ చేశారు. డఫాదార్లు, పై గస్తీలు, నవిసింద, దఫైత్‌లను ఉద్యోగాలు తగ్గించారు. వత్స లక్ష్మయ్యను సస్పెండ్ చేశారు. త్వరలో బాపట్లలో కలెక్టర్ ఎదుట ప్రత్యక్షం కావాలన్నారు.

హుజూర్ కచేరీలో గుమాస్తా, వత్సలక్ష్మయ్య కోరికపై డిఫెన్స్ రాశాడు. కలెక్టర్ ఎదుట సస్పెండ్ అయిన అమిన్ వచ్చి అధికార్ల ముందు ప్రమాణం చేశాడు.

సాక్షుల కథనం విని, రికార్డు పరిశీలించడానికి, క్రాస్ పరీక్షను అనుమతించారు. డిఫెన్స్‌కు కావలసిందేదీ తొలగించలేదు. చివరకు వత్స లక్ష్మయ్యను కలెక్టర్ డిస్మిస్ చేశాడు.

మాజీ అమీన్ వెంటనే రెవిన్యూబోర్డుకు విజ్ఞప్తి చేశాడు. కలెక్టర్ పక్షపాతంతో వ్యవహరించాడన్నారు. తన తొలగింపుకు హెడ్ సిరస్తిదార్ వెంకటకృష్ణారావు కారణమన్నాడు. సెరిస్త పేష్కర్ తనకు వ్యతిరేకం అన్నాడు. కావాలని సాక్ష్యం కల్పించారన్నాడు. తనకు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పిన వారు దోపిడీలు, గొర్రెల దొంగతనం, ఇళ్ళ దొంగతనాలు చేశారన్నాడు. హుజూర్ గుమాస్తా తన డిఫెన్స్ సాక్ష్యం సరిగా చేయలేదన్నాడు. కలెక్టర్ ఇంటర్వ్యూలో తనకు లభించలేదన్నాడు. ఎన్నో ఏళ్ళు ప్రభుత్వసేవ చేసిన తనను తొలగించారని, రెడ్డిగారు చేసిన తప్పుకు తనను బలిచేశారని, ఉప్పు పనివారెవరినీ డిస్మిస్ చేయలేదని అన్నాడు.

అసలు రికార్డు సమర్పించమని కలక్టర్‌ను ఆదేశించగా (1838 అక్టోబరు 11) మాజీ అమిన్ వాదనల్ని పూర్వపక్షం చేయడానికి ప్రయత్నించాడు.

అప్పట్లో అధికార హెడ్‌సిరస్తిదార్‌ను బోర్డు ముందు అపఖ్యాతి

పాలుచేయడానికి అప్పీలు వుద్దేశించినట్లు కలెక్టర్ భావించాడు. అది అప్పీలులో స్పష్టపడిందన్నాడు. కరువు సమయంలో బ్రతుకు దెరువుకై కొందరు దొంగతనానికి పాల్పడ్డారు. రోడ్డు మీద కనిపించిన గొర్రెల్ని ఎత్తుకపోయారు. ఉప్పు వృధాకాకుండా చూడడం, ప్రభుత్వ అధికార్లు ఉప్పు కొనకుండా నిరోధించడం కలెక్టర్ విధి. అవినీతి చర్యలలో రెడ్డిరావు చేయివుండొచ్చు. కాని దీనివలన లాభం పొందినవాడు వత్సలక్ష్మయ్య. 1818లో అతన్ని గుంటూరుజిల్లా నుండి డిస్మిస్ చేశారు. రాజమండ్రి జిల్లా నుండి కూడా తొలగించారు. ఉత్తరువుల కోసం గుంటూరులో వేచివుండమని దరఖాస్తుదారుకు చెప్పారు. అలాచేయకపోగా కలెక్టర్‌ను వెంబడించాడు.

1839 మే 6న కలెక్టర్ ఉత్తరువును బోర్డు మరోసారి తృణీకరించింది. ఉప్పుశాఖలో అసమర్థత కొత్తేమీకాదు. చినగంజాంలో గందరగోళ నివేదిక లున్నాయి. లంచాల వలన లాభపడింది రెడ్డిరావు. (వసూళ్ళు చేసింది అతడుకాదు, లక్ష్మయ్య) ఉప్పు రెవిన్యూలో 20 శాతం పెరిగిన సంగతి బోర్డు పక్కన బెట్టి చార్జి రుజువుకాలేదని బోర్డు అన్నది.

భవిష్యత్తులో అవకాశం వస్తే లక్ష్మయ్యను నియమించమంటూ, అలాంటి దానికి అతడిని అనర్హం చేయరాదని బోర్డు భావించింది. (అలాగే వుద్దం వెంకటాచలం, దఫాదార్ విషయంలోనూ చెప్పారు 1839 మే 16)

హెడ్ ఇంగ్లీషు రైటర్ వత్స భాషాచార్యుల్ని పదవి తగ్గించారు. దీపావళి నాడు అర్థరాత్రి టపాకాయ బాంబులు పెట్టి తన మామకు అనుకూలంగా సాక్ష్యం కోసం ఒక కులం వారిని బెదిరించాడు. ధర్మపురి, లక్ష్మయ్యలు అతని మామలు. సత్తెనపల్లి జమిందారు నుండి అక్రమంగా

బహుమానాలు స్వీకరించాడు. ఇతర సాక్షుల్ని బెదిరించడం, లంచాలివ్వడం కూడా తన మామ కేసుకోసం చేశాడు.

భాషాచార్యులు రాజీనామాచేసి, బోర్డుకు విజ్ఞప్తి చేశాడు. సబ్బవీస్ జనం చేసిన పనులకు వారిని దెప్పి పొడిచాడు. అనేక సాక్ష్యాలు, శీల ప్రస్తావనలు సమర్పించాడు. జిల్లా సర్వీసులో వుంటూపోతూ వచ్చాడో వీటివలన తెలిసింది.

భాషాచార్యుల్ని పదవి తగ్గించడంగాక తొలగించాల్సిందని బోర్డు అభిప్రాయపడింది. కలెక్టర్ జవాబిస్తూ మద్రాసులో వున్న బోర్డుకంటె, రంగంమీద వున్న వ్యక్తికి తెలిసి, నిర్ణయించగలడన్నారు. ఇంకా యిలా అన్నాడు :

"1822 రెగ్యులేషన్ 9 కింద అమలుచేసిన చాలా కేసుల్ని తిప్పికొట్టారు. దీనివలన కలెక్టర్ పెత్తనం బలహీనపడింది. దేశానికి దెబ్బ తగిలింది. ఒకే విషయాన్ని ఒకే తీరుగా ఇరువురు గమనించకపోవడం చాలా అసంతృప్తికరం. అప్పీళ్ళను యీ దృష్ట్యా గమనించాలి. అప్పలేట్ ట్రిబ్యునల్ ఎదుట వున్నసాక్ష్యం జీవరహితమైన పటాలకంటె మెరుగు కాకపోవడం గమనార్హం."

వందలాది మైళ్ళదూరం నుండి వ్యక్తుల సౌశీల్య స్వభావాన్ని, సాక్ష్యాలు అందించిన తీరును, సున్నిత ఉద్దేశాలను, అర్థంచేసుకోవడం దుర్లభం. బహుశ భాషాచార్యుల్ని డిస్మిస్ చేయకుండా ఉదాశీనత వహించి వుండొచ్చు. బోర్డు గనుక వ్యక్తుల్ని లోతుగా గమనిస్తే, జనం ఆసక్తి, కార్యాలయ స్వభావం తెలుస్తుంది. అప్పుడు సాక్షులలోపం ఏమిటో డాక్యుమెంట్ల లొసుగులు తెలిసేవి. కలెక్టర్లనుండి బోర్డు కోరేది స్పష్టమైన సంతృప్తికరమైన ఆధారాలు. అప్పుడు నిర్ణయం సరిగా వుంటుంది.



అధ్యాయం - 10

# సచివాలయంలో ఘర్షణలు

## (1839-1842)

గోల్డింగం గుంటూరులో వున్నంతకాలం సంఘర్షణలు కొనసాగాయి. జిల్లా పాలనలో యంత్రాంగాన్ని అదుపులో వుంచిన న్యాపతి పార్టీ క్షేత్రరంగంలో గ్రామస్థాయిలో కూడా తమ ప్రభావాన్ని సాగించదలచారు. మద్రాసులో వారి స్థితిబలహీనపడకుండా జాగ్రత్త పడదలచారు. సబ్నవీస్ పక్షానికి కలెక్టర్ మద్దత్తువుంది. ఆ దృష్ట్యా యితర ముఠాలు జొరబడకుండా జాగ్రత్తపడ్డారు. ఇరుపక్షాలు సచివాలయ శాఖలలో అదుపుకై కృషిచేశారు. అవసరమైతే జిల్లాకేంద్రం బయట, జిల్లా వెలుపల మద్దతుకు చూచారు.

రెవిన్యూబోర్డు వారు గోల్డింగం పెత్తనాన్ని కాదన్నారు. కింది వారిని తొలగించే హక్కు తీసేశారు. అయినా సెరిస్తదార్ శాఖకు హెడ్ అసిస్టెంట్‌గా మహమ్మద్ గఫూర్‌ను తెచ్చాడు. కృష్ణారావును హెడ్‌మున్షీగా స్వీకరించాడు. ఒక ఏడాది పాటు వీరిరువురూ పాత అధికార నాయకత్వానికి విరుగుడుగా ఉపకరించారు.

కృష్ణారావు ప్రమోషన్ అడుగుతూనే పోయాడు. 1840 ఫిబ్రవరిలో

నక్కలపల్లి సుబ్బారావును అమీన్‌షిప్‌కు పంపాడు. కృష్ణారావును నయాబ్ సిరస్తిదార్ గావించాడు.

శేషగిరిరావు యిచ్చిన సూచనలు అమలు చేయలేనప్పుడు, కృష్ణారావుకు పని పురమాయించారు. 1840 చివరకు హెడ్ సిరస్తిదార్ పనులన్నీ కృష్ణారావు చేశాడు. ఇరువురు పరస్పరం ఒకరి ఉత్తరువులు ఒకరు కాదని, గొడవ సృష్టించారు. కృష్ణారావు, శేషగిరిరావు మధ్య శత్రుత్వం పెరిగింది. కృష్ణారావు ఉత్తరువులు పాటిస్తుండగా శేషగిరిరావు ఏమీ చేయజాలక పోయాడు. అలాంటి అసమర్థత, బాహాటంగా వ్యతిరేకత గోల్డింగం సహనం కోల్పోయేట్లు చేసింది.

1841లో శేషగిరిరావుకు వ్యతిరేకంగా గోల్డింగం కేసు పెంపొందించగా, స్పర్థలు పెరిగాయి. పైచేయి కోసం ఉభయులూ ప్రయత్నించారు. నయాబ్ సిరస్తిదార్, హెడ్‌మున్సికి జీతాలుపెంచి, వారిని ప్రభావితులు చేశాడు. అవన్నీ మద్రాసు అధికారులు తిప్పికొట్టారు. 1841 చివరకు ఉభయపక్షాలకూ గిట్టుబాటు కాకపోగా, సచివాలయం మాత్రం వివాదాలలో వూగిపోయింది.

1841 సంవత్సరమంతా శేషగిరిరావుపై కేసుపెంపొందిచడంలో గోల్డింగం నిమగ్నుడయ్యాడు. ఆవేశాలు పెరిగి, ఉభయపక్షాలూ పైచేయి గావడానికి ప్రయత్నించారు. జిల్లాపాలనలో పరస్పరం అడ్డుకున్నారు. నయాబ్ సెరస్తిదార్, హెడ్‌మున్షి, వారి మద్దత్తుదార్లకు అనుకూలంగా కలెక్టర్ మార్పులు చేశాడు. నియమ నిబంధనలు చట్ట వ్యతిరేకంగా వున్నాయంటూ మద్రాసులో అధికారులు అడ్డుపడ్డారు. తేలిందేమంటే, చాలా కాలంపాటు సచివాయంలో ఉభయులకూ సదవకాశం లేకపోగా, తీవ్ర వ్యతిరేకతలు నెలకొన్నాయి.

పల్నాడు అమీన్‌లు (దాచేపల్లి, తిమురకోట) హుజూర్ సిరస్తిదార్‌తో కలసి, తప్పుడు కారణాలుచూపి, భూశిస్తు వాయిదా వేయించారన్నారు. హుజూర్ సిరస్తిదార్‌ను బిగించడంలో కలెక్టర్, నయాబ్ పన్నాగం పన్నారా అనేది తేల్చడంకష్టం. బహుశ యిదంతా పథకం ప్రకారం జరిగివుండొచ్చు. శేషగిరిరావు అమీన్లకు తోడ్పడి కలెక్టర్‌ను యిబ్బంది పెడదామనుకోవచ్చు. రెవిన్యూ వసూళ్ళు వాయిదావేసిన తరువాత, కలెక్టర్ గోల్డింగం పల్నాడు వెళ్ళి, తప్పుడు లెక్కలు కనుగొన్నాడు. తాలూకా, గ్రామాధికార్ల సాక్ష్యాలు నమోదు చేశాడు.

అప్పటికి వరకూ పల్నాడు లెక్కలన్నీ సరైనవేనన్న శేషగిరిరావు మాట మార్చాడు. తనను పదవినుండి తొలగించడానికి సబ్బవీస్ పక్షం ఎత్తుగడ అని చెప్పాడు. హుజూర్ కచేరీలో తప్పుడు లెక్కలు తయారైనట్లు అతనికి తెలుసు. నయాబ్ తాసిల్దార్ భయంతో అతడికి సమాచారం అందించ లేదు. కలెక్టర్ సమక్షంలో విధులు యథావిధిగా సాగలేదు. పల్నాడు లెక్కలు నమ్మవద్దని కలెక్టర్‌కు హుకూం పంపాడా ? అయినా రెవిన్యూ వసూళ్ళ వాయిదాకు కలెక్టర్ ఉత్తరువు లిచ్చాడు. తన కళ్ళ ఎదుటే డైరీలో ఆర్డర్లు వెళ్ళాయి. ఉచ్చు పన్నారనుకొని, గ్రామ నాయకులను లెక్కలు చూపమన్నాడు. అవి సరిగా వున్నందున, వారికి హెచ్చరిక చేసి మళ్ళీ పదవులలో సాగనిచ్చాడు. ఒక ఏడాదిగా తనకు అనుకూల అధికారుల్ని సెక్రటేరియట్‌లో తొలగించారు. ఇప్పుడు ఆయన వంతు వచ్చింది. జమాబంది రిపోర్టు చూడనివ్వకుండా రహస్యంగా వుంచడంలో, హుజూర్ సిరస్తిదార్ విధులు చేయడానికి వీల్లేకుండా అయింది.

కచేరీలో దైనందిన వ్యవహారాలలో రహస్యం లేదని కలెక్టర్

గ్రహించాడు. హుజూర్ సిరస్తిదార్ విన్నట్లుగాక, తాను మరీ అంధకారంలో లేనట్లు కలెక్టర్ తెలుసుకున్నాడు.

కచేరీలో రహస్యాలెన్నో గుంటూరు నగరంలో తెలిశాయని శేషగిరి రావు అన్నాడు. పైగా తనకు తెలియకుండా అట్టిపెట్టారన్నాడు. కావాలని దాచి పెట్టారంటున్న విషయాలు హుజూర్ సిరస్తిదార్‌కు తెలుసునని కలెక్టర్‌కు అర్థమైంది.

మున్షీశాఖవారికి ఏం జరుగుతుందో తెలుసుగాని అంతకుమించి సహాయపడలేరు. అన్ని ఉత్తరువులు ఒకే వ్యక్తి రాశాడు. మరొకవ్యక్తి డైరీలో అన్నీ ఎక్కించాడు. ఇంకోవ్యక్తి అన్నీ రిజిస్టర్ చేశాడు. ఇతరులు పిటిషన్లు రిజిస్టర్ చేశారు. హెడ్‌మున్షిశాఖను తనఖీ చేశాడు. డైరీలో, రిజిస్టర్‌లో నమోదుకాకుండా, అమీన్లుకు ఆర్డర్లుపోవు. అలాంటి ఉత్తరువులు పంపలేదని, రికార్డు కాలేదని గోల్డింగం రాశాడు. డైరీలు ఆఫీసు గుమాస్తా దస్తూరీలో వుంటాయి. ప్రతి పేజీపై నంబరు, సాయంత్రానికి కలెక్టర్ చిన్న సంతకం వుంటుంది. అలాంటి చోట తప్పుడు రికార్డు అంటే మున్షిశాఖ యావత్తు గూడుపుఠాణి జరపాలి. అది సాధ్యమయ్యేది కాదు. తన సంతకం లేకుండా వున్న రికార్డు తప్పుడుదని అర్థం. ఇలాంటి విషయాలపై కాలం వృధా చేయరాదు. దైనందినపాలన రహస్యంగా సాగించడమనేది గోల్డింగం దృష్టిలో అర్థంలేని ఆరోపణే.

పని పేరుకపోవడానికి శేషగిరిరావు కారణమన్నారు. అక్టోబరు 1838 ఫిబ్రవరి 1840 మధ్య మొత్తం 4212 కేసులు పూర్తికాకుండా వుండిపోయాయి. నయాబ్ సిరస్తిదార్, హెడ్‌మున్షి (వినుగొంటి రామదాసు) చెప్పిన ప్రకారం హుజూర్ సిరస్తిదార్ చేతులెత్తేసి తాను చేయలేకపోతున్నానని నయాబ్ చేపట్టాలని అన్నాడట. ఈ విషయం

గోల్డింగంకు చేరేశారు. కృష్ణారావు పేరుకపోయిన వాటిని సాధ్యమైనంత వరకు పరిష్కరించగా, శేషగిరిరావు 104 కేసులలో 5 మాత్రమే చేయగలిగాడు.

(ఆఫీసులో గడ్డిచాపలపై కూర్చొని కార్యాలయ సిబ్బంది, ఫైల్సు చుట్టూపెట్టుకొని, బడిలో ఒక రాత బల్లతో పనిచేసేవారు. ఫైళ్ళకు ఎర్రరిబ్బను చుట్టేవారు. ఉన్నతాధికారులకు మాత్రం చిన్నడస్కులు వుండేవి)

హుజూర్ సిరస్తిదార్‌కు 1841లో 110 కేసులు యిచ్చినా వాటిని తాకలేదు. మొత్తం మీద శేషగిరిరావుకు 200 కేసులు పరిష్కారానికి వున్నాయి. ఈ విషయంలో కలెక్టర్‌కు మద్దత్తుగా హెడ్‌సేల్ మదత్‌గార్ ఎడ్లపాలెం రమణరావు, హెడ్ మున్షీ, నయాబ్‌లు వున్నారు.

హుజూర్, నయాబ్ సిరస్తిదార్లు కలసి పనిచేయలేదు. ముఖ్య వ్యవహారాలన్నీ కృష్ణారావుద్వారా, అతని సహాయకుల ద్వారా వెడుతుండేవి. శేషగిరిరావు ద్వారాపోలేదు. కనుక అక్రమపనులు తన దృష్టికి రాలేదన్నాడు. కనుక పరిష్కరించే దారిలేదన్నాడు. కొత్త అధికార్లను ఎంపిక చేయడంలో, కొత్త విధులు యివ్వడంలో, పని పురమా యించడంలో అతని అధికారాలు బాగా కుదించేశారు. నయాబ్‌కు అతిగౌరవం యిచ్చినా, ప్రభుత్వ అధికార్లు అతనిమాట వినలేదు.

కచేరీలో సహాయనిరాకరణ విషయం గోల్డింగం కాదనలేదు. నయాబ్ సిరస్తిదార్ కాస్తా హుజూర్ సిరస్తిదార్‌కు శత్రువు. హుజూర్ సిరస్తిదార్ సాక్ష్యాధారాలు రాబట్టలేదనడం నమ్మశక్యం కాదు. నయాబ్‌కు భయపడి నిజం చెప్పరనడం సరికాదు. సమర్థులైన గుమాస్తాల సహాయం అతనికి వున్నదని గోల్డింగం ఉద్దేశ్యం.

లోలోన పోరాటాలే అసలు గొడవకు మూలం అని గోల్డింగం భావించాడు. న్యాపతి మద్దతుదార్లు కచేరీలో వున్నారు. సెరిస్తి కానాలోనే తిష్ఠవేశారు. ప్రభుత్వ కార్యకలాపాలు స్తంభించేదాకా ఉభయపక్షాలూ కుట్రలు, కుతంత్రాలుపన్నాయి.

పూజలుచేసి మంత్రాలు వల్లించారు. భయానక దృశ్యాలు సృష్టించారు. భూతప్రేత ప్రేరణలు చేశారు. కృష్ణారావు అతని స్నేహితులకు హానిచేయడానికి ఉద్దేశించిన పనులేయివి. న్యాపతి పక్షానికే అలాంటివే అన్వయించారు. భయానక వాతావరణం వలన క్రింది అధికార్లు చలించిపోగా, నైతికస్థాయి దెబ్బతిన్నది.

శేషగిరిరావు రహస్యంగా మద్రాసులో రెవిన్యూబోర్డుకూ, తన మిత్రులకూ విషయాలు చేరవేయడంలో గోల్డింగం రెచ్చిపోయాడు. నెల్లూరు, రాజమండ్రి, మచిలీపట్నంలో తనకు గల సంబంధాలు వాడుకొని హుజూర్ సిరస్తిదార్ తనకు మద్దత్తుగా, ప్రత్యర్థులను బలహీన పరచేటట్లు విషయాల్ని వాడాడు. నెల్లూరు పోస్ట్ ఆఫీసు ద్వారా శేషగిరిరావు అక్రమ సమాచారం చేరవేశాడు. మంగలిషాపులో గేటు కాపలాదారు, ఇళ్ళలో పని వారి గుసగుసలు, చప్రాసీలు యిలాంటివన్నీ చాలా పనిచేశాయి. దీనంతటిలో గోల్డింగం బాగా చలించి పోయాడు.

పరిపాలనలో పెత్తన ప్రభావానికి రికార్డులు అదుపులో వుండాలి. పాలకులు నిర్దుష్టమైన వివరాలతో సమాచారాన్ని వుంచితే వెంటనే చూడవచ్చు. పరువు, సామర్థ్యం, న్యాయం అనేవి ప్రభుత్వంలో రికార్డులపైనే ఆధారపడు తుంది. ప్రభుత్వబలం, ఏ మేరకు త్వరగా సరైన, విషయంను అందుకోగలం అనేది ముఖ్యం. ఇదే విషయం పరిపాలనలో ఏ విభాగానికైనా అన్వయిస్తుంది. చాపకింద నీరువలె

నైపుణ్యంగా చేస్తే, పాలనారంగం బలపడినా, ప్రభుత్వం దెబ్బ తింటుంది.

లోగడ రికార్డు ఆఫీసు ధోరణిపట్ల రెవిన్యూబోర్డు నిరసన తెలిపింది. 1836 నవంబరులో గందరగోళం, మిగిలిపోయిన కృషిని దృష్టికి తెచ్చారు. డైరెక్టర్ల కోర్టుకూడా అవమానకరమైన ధోరణిని నిరసించి, రికార్డులస్థితిని తరచు తెలుపమన్నది.

(1837 ఏప్రిల్ 19)

రికార్డులు అస్తవ్యస్తంగా వుండడమే కాదు. కావాలని మారుస్తున్నట్లు గోల్డింగం కనుగొన్నాడు. తొలిమాన్యాలతో రికార్డులు సరిపోవడంలేదు. కొత్తవాటిని మధ్యలో చేర్చారు. రికార్డు ఆఫీసులో స్టాంపు పేపర్లపై నకళ్ళను తయారుచేసి కలెక్టర్ సంతకానికి పంపిస్తున్నారు. అసలు వాటితో సరిచూడడం వీలుకాలేదు.

రికార్డు గదిలో వారు చెప్పిందే ప్రమాణమైకూర్చున్నది. రికార్డు ఆఫీసు అందరి సిబ్బందికీ అందుబాటులో వుంది. రికార్డు అట్టిపెట్టేవారితో సులభంగా వ్యవహరించ గలగడంతో సామర్థ్యానికి తావులేదు.

(జీతం బదులు గ్రామవారసత్వ అధికారులకు యిచ్చే భూమిని మాన్యం అంటారు.)

ఇరువురు దప్తర్‌దార్లున్నారు. (మద్రాసుపద్ధతిలో పరస్పరపోటీపడే కులాలను అదుపులో వుంచడానికి ద్వందదప్తర్ విధానం పెట్టారు. ఇది లోతుగా పరిశీలించాలి)

కోటం రాజు వెంకటరాయలు ఇంగ్లీషు రికార్డు కీపర్‌గా సీనియర్ అధికారి. అతడు న్యాపతికి మద్దతుదార్లు. 35 ఏళ్ళ అనుభవశాలి. 1818లో థామస్ ఓక్స్ నియమించినవ్యక్తి. రెండవ అధికారి దేశీయ రికార్డుకీపర్

నాన్‌శ్వరన్. అతన్ని గురించి అంతగా తెలియదు. దప్తదార్ల క్రింద పనిచేసే కార్యాలయ సిబ్బంది 2 విభాగాలుగా వున్నారు. రికార్డు గార్డు షేక్‌ముక్తుం. అతడు సబ్నవీస్ పక్షపాతి. కచేరీలో వున్న ఉభయపక్షాలను బట్టి స్వచ్ఛంద సేవకులు విభజించపడ్డారు. వారి గురించి ఆట్టే తెలియదు.

రికార్డుశాఖలో జరుగుతున్నదంతా ఉభయముతాలకు, అటు ప్రభుత్వానికీ అవసరమే. రికార్డులను అట్టిపెట్టడం, మార్చడం, రికార్డు సృష్టించడం, ఫైళ్ళలో నకిలీ కాగితాలు జొప్పించడం, మొత్తం కష్టడీని గుప్పిట్లో అట్టి పెట్టుకోవడం ఉభయ పక్షాలకూ అవసరమే. అదిగాక, అర్జీదార్లు, పేచీదార్లు, స్థానిక నాయకులు తమకు అనుకూలంగా మార్చడానికి చేతులు తడపడం పరిపాటి.

దప్తర్‌ఖానాలో సామర్థ్యం, పర్యవేక్షణ అవసరమని, కచేరీలో కొత్త నిబంధనల్ని గోల్డింగం ప్రవేశపెట్టాడు. (1838 జులై 20) అప్పటినుండి నకళ్ళ ప్రతులు రికార్డుగదిలో చేయరాదు. అసలు ప్రతులు కలెక్టర్‌కు పంపాలి. వాటి నకళ్ళు తీసేపని షెరిస్తశాఖకు, మున్షీశాఖకు అప్పగిస్తారు. హెడ్‌మున్షి సంతకంతో ప్రతులు తీయాలి. లేదా అందుకు సంబంధించిన ప్రత్యేక అధికారి మాత్రమే చేయాలి. దప్తర్‌ఖానాలో దప్తర్‌దార్లు వారి సిబ్బంది మాత్రమే కలెక్టర్ అనుమతితో ప్రవేశించవచ్చు. రికార్డు ఆఫీసులో ప్రవేశించే వారి పేర్లను దప్తర్ గార్డులు నమోదు చేయాలి.

ఈ మార్పులు పాలనారీత్యా సరైనవైనా, నయాబ్ షిరస్తిదార్‌కు అనుకూలంగా మారాయి. దప్తర్‌ఖానాలో అతని పథకాలు బీభత్సమైనవి. అనుమానాస్పదుడైన కోలంరాజు వెంకటరాయలు ద్వారా ఉత్తరువులు అందుకోవాలి. ఒకసారి అతని కార్యాలయానికి రికార్డు చేరితే, కృష్ణారావుకు బాగా అందుబాటులో వుంటాయనుకున్నారు. కాని అతనికి

అసంతృప్తే ఎదురైంది. వెంకటరాయలు సిబ్బంది జాప్యంచేయడం, అడ్డుపెట్టడం మొదలెట్టారు. రికార్డు ఆఫీసు నుండి వచ్చిన పత్రాలపై గోల్డింగం కన్నేసివుంచాడు. దఫ్తర్‌బంద్‌లో ఒకర్ని అడ్డంపెట్టుకొని కృష్ణారావు మరింత కుటిల యత్నాలు చేశాడు. రాత్రిళ్ళు రికార్డులను నగరంలోకి తీసుకెళ్ళి, ఉదయం కచేరీ ఆఫీసు తెరవకముందు తిరిగి తెచ్చిపెట్టేవారు. వెంకటరాయలు, శేషగిరిరావు ఆ విషయం చెప్పారు. ఆ విధంగా పుస్తకాలన్నీ మళ్ళీ నకళ్ళురాసి, యధేచ్ఛగా మార్పులు చేశారు.

1840లో దఫ్తర్‌ఖానా గొడవ గుప్పుమన్నది. రెండుమూడేళ్ళుగా ఉభయపక్షాలు యావత్తు రికార్డు మోసం చేశారన్నారు. రాత్రిళ్ళు ఇళ్ళకు తీసుకెళ్ళారని పరస్పరం నెపం వేశారు. తరచు అధికార్లను మార్చడం, తొలగించడంతో గందరగోళం జరిగింది.

కోటంరాజు వెంటరాయలు చెప్పింది, ఒకవేళ అబద్ధమైనా, ఆసక్తికరమైంది. ఒక సాయంత్రం షేక్‌మగ్దూం కుమారుడు, ఇరువు వైష్ణవ బ్రాహ్మణులతో కచేరీ బయట చెట్టుకింద గుసగుసలాడుకోవడం చూచాడు. అనుమానించి, ఆఫీసు తాళం వేసి, వెళ్ళిపోతున్నట్లు నటించాడు కోటంరాజు. అప్పుడు వారి ఆఫీసులో ప్రవేశించి ఆఫీసు రికార్డు ఫైలు తెరిచాడు. తక్షణమే గదిలోకి ప్రవేశించి, వారిని పట్టుకొని నిలదీస్తే తృప్తికర సమాధానం యివ్వలేకపోయారు. ఆ మరునాడు అదే బ్రాహ్మణులు రాచూరు తానాలోని నారాయణలపల్లిలో 30 ఎకరాల భూమి తమదంటూ దరఖాస్తుపెట్టారు. సబ్డివీస్ భాగస్వామి నంబూరికృష్ణయ్య గుంటూరు తానా అమీన్‌గా వెంటనే, అనుమానాస్పదమైన పత్రాలను నయాబ్ షిరస్తిదార్‌కు సమర్పించమన్నాడు.

ఫిర్యాదులు, ఎదురు ఫిర్యాదుల మధ్య అవినీతి, గందరగోళం తప్ప, గోల్డింగం యింకేమీ కనుగొనలేకపోయాడు. సెరిస్తఖానా నాయకుల మద్దత్తు వుంటేనే మొత్తం రికార్డు తల్లక్రిందులు చేయడం సాధ్యం. మిగిలిపోయిన పనిమూలంగా గందరగోళం ప్రబలి, రికార్డుమార్చడానికి తావిచ్చింది.

ఎవరు నేరస్తులో కానివారెవరో తేల్చుకోలేకపోయారు. దఫ్తర్‌ఖానా సిబ్బందిని తొలగించి, ప్రత్యేకాధికారులను పెట్టాలని, రికార్డులు సరిదిద్దాలని తలపెట్టాడు. 1842లో యీ సూచనను రెవిన్యూబోర్డు తిరస్కరించింది. తప్పనిసరి అనుకుంటేగాని అలాంటి చర్యకు అనుమతి యివ్వజాలమన్నారు.

పరిస్థితి మార్చడానికి ఏమీ చేయలేదు. దఫ్తర్‌ఖాన్ గందరగోళం యధావిధిగా సాగింది. బోర్డు కార్యాలయంలో ఉభయపక్షాలకూ మిత్రులున్నారు. సెరిస్తాశాఖకు కావలసిన రికార్డులకు సెరిస్తదార్ సంతకంతో కాగితం వస్తేచాలు. మున్షి, మాజిస్ట్రేట్‌శాఖలకు రికార్డు కావాలంటే, కలెక్టర్ సంతకం అవసరం. కలెక్టర్ తాను సంతకం చేయడమో, లేక నయాబ్ సిరస్తిదార్‌ను సంతకం చేయమనడమో జరుగుతుండేది. ఉభయపక్షాలూ, సరైన పాలన సాగకుండా తమ పబ్బం గడుపుకున్నారు.

ఈ నిరంతరపోరాటంలో ఉభయపక్షాల పేపర్లు, రికార్డులు, అభిప్రాయాలు, సాక్ష్యాలు రెవిన్యూబోర్డు ముందుంచారు. రెవిన్యూబోర్డు వూహించినట్లుగానే గోల్డింగం నివేదికను కాదని, శేషగిరిరావును వెనకేసుకొచ్చింది. శేషగిరిరావును గోల్డింగం చూచిన తీరును విమర్శించింది.

సెక్రటేరియట్‌లో కృష్ణారావును చలాయించడానికి అనుమతించడాన్ని గర్హించింది. కృష్ణారావును సస్పెండ్‌చేసి, అతనిపై ఫిర్యాదుల్ని విచారించాలన్నది. హుజూర్‌లో కృష్ణారావును తిరిగి నియమించరాదన్నది. శేషగిరిరావును హుజూర్ సిరస్తేదార్‌గా పూర్తి అధికారాలతో నియమించమన్నది. శేషగిరిరావుకు గోల్డింగంకు వున్న వైరుధ్యం జిల్లాపాలనకు ప్రతిబంధంకం అన్నది. శేషగిరిరావుకు యితరచోట్ల తగిన పోస్ట్ లభిస్తే, అతని స్థానంలో అర్హుడు రాగలిగితే, అలాంటి సూచనలు పాటించమని రెవిన్యూబోర్డును కంపెనీ అధికారులు కోరారు.

సుదీర్ఘ పోరాట చరిత్రను, సెక్రటేరియట్ సంఘర్షణలన్నీ రాయాలంటే చాలా చోటుకావాలి. ఇదంతా చాలా విసుగు పుట్టించే విషయం. బయట సహాయాన్ని ఉభయపక్షాలూ అర్థించాయి. గోల్డింగం గుంటూరులో వున్న చివరి రోజులలో జరిగిన రెండు సంఘర్షణలు, బయటివారి సహాయతీరు గమనిస్తేచాలు.

కృష్ణారావుపై కొత్తూరు రాయల్‌నాయుడు ధ్వజమెత్తాడు. జిల్లా మునిసిఫ్‌గా సబ్బవీస్‌ముతా వ్యతిరేకత 10 ఏళ్ళు సాగింది. ఆయనపైనే డబ్బు వ్యవహారంలో విచారణ జరుగుతున్నది. కృష్ణారావుకు వ్యతిరేకంగా మునిసిఫ్ పిటీషన్ పెట్టాడు. తనపై తప్పుడు ఆరోపణలతో కుట్రపన్నారన్నాడు. 40 వేల రూపాయల తప్పుడు వ్యవహారంలో వున్న వీరు, చాలామంది అధికార్లకు పూర్తి జీతం యివ్వలేదన్నాడు. దీనికి మద్దత్తుగా నిలిచినవారు : నామగడ్డ నరసింగరావు, రామకృష్ణమ్మ, మాజిస్ట్రేట్‌శాఖ మేనేజర్, తోట కృష్ణమ (చేబ్రోలు అమీన్), జె.ఎ. సోమయాజులు, సుబ్బయ్య (హెడ్ అసిస్టెంట్ సిరస్తేదార్, అంబరఖాన్ పురుషోత్తం (హుజూర్ మదత్‌గార్) తదితరులు.

రాయల్ నాయుడు పిటేషన్‌పై సమాచారం పంపమని 1841

ఫిబ్రవరిలో గోల్డింగంను అడిగారు. దుష్టభావనతో పిటిషన్ పెట్టారని గోల్డింగం అన్నాడు. హుజూర్ సిరస్తిదార్‌తో సంప్రదించి చార్జి పెట్టారన్నాడు. పిటిషన్ మరచిపోవాలని, అంతా దురుద్దేశమయం అన్నాడు.

కాని అలా విస్మరించలేదు. ఈ విషయాన్ని కొనసాగించడం అనవసరమని బోర్డు భావించింది. రాయల్ నాయుడును ఒప్పుకోలేదు. కాని ఫిర్యాదుల పరంపరసాగింది. సదర్ అదాలత్ రాయల నాయుడుపై ఫిర్యాదుల్ని కాదని, మరో జిల్లాలో మంచిస్థానంలో నియమించింది. గుంటూరులో అసిస్టెంట్ జడ్జి హెన్రీవుడ్ ప్రత్యేక విచారణ జరిపి, కృష్ణారావుపై ఫిర్యాదులు జిల్లాలో వున్న పరిస్థితుల వలన వచ్చాయని, కొట్టి పారేసింది. అప్పటికి జిల్లానుండి గోల్డింగం వెళ్ళిపోయారు.

హుజూర్‌లో కృష్ణారావు పనిచేయకుండా నిషేధించడం ఖాయపడిన తరువాత, న్యాపతి శేషగిరిరావు, అతని ముఠాకు వ్యతిరేకంగా కొత్తశక్తులు తలెత్తాయి. శేషగిరిరావుకు వేరే ఏర్పాట్లకు బోర్డు సుముఖత దృష్ట్యా, గోల్డింగం అతడిని అమీన్‌గా బదిలీచేశాడు. కృష్ణారావును క్షేత్రరంగంలోకి పంపాడు. మంగనూరి లక్ష్మీనరసురావును ఆఫీస్‌హెడ్‌గా నామినేట్ చేస్తు బోర్డుకు రాశాడు.

లక్ష్మీనరసురావు 27 సంవత్సరాలు కంపెనీకి పనిచేసిన అనుభవ పూర్వక దేశస్తుడు. థామస్ ఓక్సహయాంలో ముఠాతత్వానికి వ్యతిరేకంగా అతడిని తీసుకరాగా, యించుమించు రెవిన్యూ శాఖలన్నిటిలో పనిచేశాడు. 1817లో గుంటూరు, నెల్లూరును కుదిపేసిన ఉప్పుగొడవల్లో అతడు విచారణ సంఘంలో పనిచేశాడు. అతనితో బాటు జాన్‌వాగన్, జాన్‌యాన్ స్టేలు వున్నారు. 1826లో నెల్లూరు వెళ్ళి 7 ఏళ్ళపాటు

క్షేత్రంలోనూ, సెరిస్తదార్‌గానూ పనిచేశాడు. క్రిస్టాఫర్ థాంసన్, ఎడ్వర్డ్‌స్మాలె, జాన్‌విష్‌ల కింద పనిచేసి పేరు తెచ్చుకున్నాడు. నెల్లూరు హెడ్‌సిరస్తదార్‌గా విష్ అతన్ని కోరాడు. జార్జిరసెల్ అతన్ని రాజమండ్రి కలెక్టర్‌కు సిఫారసు చేశాడు. శేషగిరిరావు తరువాత రాజమండ్రిలో పనిచేసి, పాట్రిక్ గ్రాంట్‌కు తోడ్పడి, ఉప్పుశాఖలో కొట్టొచ్చినట్లున్న అవినీతిని బయటపెట్టారు. గ్రాంట్ వెళ్ళిపోయిన తరువాత 70 రూపాయలకు రైటర్‌గా పనిచేయడం తన పరువులకు తగదని రాజీనామా చేశాడు.

1841 నవంబరులో గుంటూరు హుజూర్ సెరిస్తదార్ పదవి యిస్తామన్నప్పుడు, మంగనూరి లక్ష్మినరసురావు ఆ విషయంలో బోర్డు తన నామినేషన్ ఎలా ఎలా స్వీకరిస్తుందో తెలుసుకోడానికి వెళ్ళాడు.

బోర్డువారి హామితో డిసెంబరు 16న గుంటూరు చేరుకున్నాడు. అదేరోజు బోర్డువారు గోల్డింగంకు రాస్తూ, అతని ఏర్పాట్లు నిరాకరించి, శేషగిరిరావుకు యివ్వదలచిన పదవి ఒప్పుకోలేదు. శేషగిరిరావుకు తగిన పదవిని అతడి శక్తి, అనుభవరీత్యా యివ్వలేదన్నారు.

బోర్డు తమ తొలినిర్ణయాన్ని అలా మార్చేయడం కలెక్టర్‌కు యిబ్బంది కరమైంది. (1841 ఇండియా రిజిస్టర్ చూస్తే శాశ్వత సభ్యత్వంలో రెండుమార్పులు, తాత్కాలికంగా ఇరువురు సభ్యులుండడం గమనించవచ్చు) బోర్డు నిర్ణయాన్ని లక్ష్మీనరసుకు తెలియపరచి, నెలకు 70 రూపాలయ చొప్పున నయాబ్ సిరస్తిదార్ నియామకం యిస్తామన్నారు. తాను పనిచేయదలచ లేదంటూ లక్ష్మీనరసు అది తృణీకరించాడు. మాజిస్ట్రేట్‌శాఖలో తన సర్వీస్ కింద పనిచేసిన న్యాపతి శేషగిరిరావు కింద వుండదలచలేదు.

బోర్డు నవంబరు 11న చేసిన సూచన అమలు పరచానంటూ

గోల్డింగం తెలియబరచాడు. డిసెంబరు 16 ఉత్తరువులు తనను యిబ్బంది పాలు చేశాయన్నాడు. శేషగిరిరావును ఇప్పుడున్న స్థితిలో వాడుకోలేమని బోర్డు అనలేదా? కొత్తపదవిలో జాగ్రత్తగా వినయంగా వుండమని లక్ష్మీనరసుకు చెప్పలేదా ?

అలాంటిది, అంతహఠాత్తుగా బోర్డు ఎలా నిర్ణయం మార్చేసింది? ఆ దశలో పదవిలో వున్న తాను చాలా కలవరపాటులో వున్నానని గోల్డింగం అన్నాడు.

ప్రభుత్వానికి గోల్డింగం విజ్ఞప్తి చేశాడు. సరైన మార్గంలో ప్రభుత్వం దగ్గరకు రావాలని అతనికి సలహాచెప్పారు. తటపటాయిస్తున్న శేషగిరిరావు దృష్ట్యా, కృష్ణారావును వినియోగించినట్లు తెలిపాడు. కృష్ణారావు వెళ్ళిపోయాడు. లక్ష్మీనరసును తొలగిస్తే ప్రజాక్షేమానికి తిలోదకాలిచ్చి నట్లేనన్నాడు. వాసిరెడ్డి జమిందారీ అమానీ యాజమాన్యం కిందకు రానున్నరీత్యా, సమస్య జటిల మౌతుందన్నాడు. హుజూర్ సిరస్తిదార్ నుండి ఎంతో ఆశించవలసివుండగా, సామాన్య అర్హతలు లేనివారిని తీసుకరావద్దన్నాడు. మంగనూరి లక్ష్మీనరసును హెడ్‌సిరస్తిదార్‌ను చేయమన్నాడు. న్యాపతి శేషగిరిరావును నియమిస్తే కలెక్టర్‌నుండి బాధ్యతలు తీసేసినట్లే అన్నాడు.

లక్ష్మీనరసును కాదనడం అనుభవజ్ఞుడైన వ్యక్తిని పక్కన బెట్టడమే. గుంటూరును శేషగిరిరావు అదుపులో పెడితే, అతడు వెళ్ళదలచలేదు. మరెవరూ అతన్ని స్వీకరించదలచలేదు.

గోల్డింగం విజ్ఞప్తిపట్ల రెవిన్యూబోర్డు యింకా బిగుసుకపోయింది. అతని సిఫారసు తమకు అందజేయలేదని గర్జించారు. బోర్డు సభ్యులతో లక్ష్మీనరసు ప్రైవేట్‌గా మాట్లాడిన విషయాలు ప్రస్తావించినందుకు

ఆక్షేపించారు. అది తీవ్ర అభ్యంతరకరం అన్నది. శేషగిరిరావును తొలగించే ప్రశ్నలేదన్నారు.

గోల్డింగం గుంటూరు కలెక్టర్‌గా వున్న 5 ఏళ్ళలో పాలనారంగంలో అన్నిస్థాయిల్లో అనేక విధాల సంఘర్షణలు జరిగాయి. శేషగిరిరావు, అతని ముఠాను ఎదుర్కోవడంలో కలెక్టర్ విఫలమయ్యాడు. కృష్ణారావుకు మద్దతుగా తగిన సిబ్బందిని పెంపొందించ లేకపోయాడు. లక్ష్మీనరసురావు సెక్రటేరియట్‌కు తీసుకరాలేకపోయాడు.

జిల్లా అధికారుల ముఠా తగాదాలలో బ్రిటిష్ అధికారులు దూరంగా వుండలేకపోయారు. కలెక్టర్, బోర్డు నిస్సహాయంగా యిరుక్కుపోయారు. రాష్ట్ర అధికారి సామర్థ్యం పెంచాలని చూస్తే, ఏదోక ముఠావైపుకు లాగేసింది. గోల్డింగం వలె రెవిన్యూబోర్డు సైతం పరిస్థితిలో చిక్కుకున్నారు.

జిల్లా అధికారులు చీలిపోయినట్లే, రెవిన్యూబోర్డు కలెక్టర్ కూడా చీలిపోయారు. రెవిన్యూ బోర్డు మద్దత్తు లభిస్తే, కలెక్టర్ గోల్డింగం సంస్కరణలు తెచ్చేవాడే. ఆయనకు కొంత స్వేచ్ఛ యిస్తే చేయగలిగేవాడే. వృద్ధ అధికారులపట్ల పక్షపాతం వహించిన రెవిన్యూబోర్డు న్యాయం చేకూర్చాలనుకున్నది. 1837-1842 మధ్య బోర్డు అవలంబించిన ధోరణి, కలెక్టర్‌ను సమర్థించడంలో కనబరిస్తే జిల్లాపాలనలో సమర్థత పెరిగేది. కలెక్టర్ దృఢనిశ్చయాన్ని కాదనలేక, తమకు అనుకూలంగా ఆయన్ను మలచుకోలేక, బోర్డు తీసుకున్న నిర్ణయాలు పాలనలో ప్రతిష్టంభన తెచ్చిపెట్టాయి. ఫలితంగా పాత పాలకాధికారులు బలపడ్డారు.



అధ్యాయం - 11

# విచ్ఛిన్నమైన జమీందారీలు

(1837-1842)

మద్రాసులో పాలనా చట్రం వున్న తీరు ఎలావుందో (19వ శతాబ్ది తొలిదశలో) గమనిస్తే, గందరగోళ పరిస్థితి తెలుస్తుంది. భారత ఉపఖండంలో రాజకీయ, చట్టబద్ధ ఆచరణ రీతులు, తాత్విక భావనలు, లోతుపాతులు కలసిపోయి, భిన్న వ్యాఖ్యానాలకు దారితీసింది.

గుంటూరు నుండి సమాచారం మెట్లు మెట్లుగా వివిధ స్థాయిలలో పైకి చేరిన సంగతి గమనార్హం. లండన్‌లో తీసుకున్న నిర్ణయాలు అంచెలంచెలుగా గుంటూరుకు చేరేటప్పటికి ఎన్ని మలుపులు తిరిగాయో చెప్పనలవికాదు. నిర్ణయాలు అమలు పెట్టేసరికి క్షేత్రరంగంలో వున్న అధికారి నైపుణ్యత, పెత్తనం, లౌకిక జ్ఞానం జోడయ్యాయి. చొరవ తీసుకోవడం, విధానాలు అమలు చేయడం కచ్చితంగా పొందికగా వుండడం అరుదు.

ఆలోచనలో, నిర్ణయంలో, ఆచరణలో గందరగోళానికి, భూమి యాజమాన్యం, కవుళ్ళు, జమీందారీల పనితీరు యిలావుంది.

తొలుత భూమి వ్యక్తిగత యాజమాన్యంలో వుండాలి. ప్రకృతి

నియమం వలె యాజమాన్య హక్కు సంరక్షించాలి. నిరంకుశ, కృత్రిమ నిబంధనల నుండి కాపాడాలి. గ్రామాలలో రాజకీయ సుస్థిరత వంశపారంపర్య భూస్వాముల పైనా, స్థానిక ప్రజలు వారిపట్ల చూపే విధేయతనుబట్టి వుంటుంది. భూమి సాగుకు భద్రత వుండాలి. సృష్టించిన సంపదను పంచుకోవాలి. సంపదను తెలివిగా పంపిణీ చేయడంలో ప్రభుత్వ వివేచన చాలా అవసరం. అప్పుడే దేశం బాగుపడుతుంది. (జె.డబ్ల్యు.కయి - ది ఎడ్మినిస్ట్రేషన్ ఆఫ్ ది యీస్ట్ ఇండియా కంపెనీ - లండన్ 1853. ఎ.ఎల్.భాషం - ది వండర్ దట్ వజ్ ఇండియా లండన్ 1954.

బి.హెచ్. బాడెన్ పొవెల్ - లాండ్ సిస్టమ్స్ ఆఫ్ బ్రిటిష్ ఇండియా - లండన్ వెరా యాన్ స్టే - ది ఎకనమిక్ డెవలప్‌మెంట్ ఆఫ్ ఇండియా - లండన్ 1952).

ఈ అభిప్రాయాలు పాలనా వ్యవస్థలో అధికార్ల మధ్య ఒకే తీరులో లేవు. మద్రాసు గవర్నర్ ఇన్ కౌన్సిల్‌కు సంబంధించి రెండు విధాల ఆలోచనలు మిళితమయ్యాయి. న్యాయాధికారుల ప్రకారం యాజమాన్యాలను ఇంగ్లీషువారి చట్టబద్ధతలో చూచేవారు.

రైతులకు సన్నకారు సాగుదార్లకు యాజమాన్య హక్కుల్ని అప్పుడప్పుడూ పరిగణించేవారు. పేరుకపోయిన కేసులు, అప్పులు యిత్యాది విషయాలలో గ్రామ కక్షలు, కార్పణ్యాలకు న్యాయాధికార్లు దూరంగా వుండేవారు. (వారిని చేతగాని వారని, విషయం తెలియదనీ అంటుండేవారు) జమీందారీ భూముల వ్యవహారంలో రెవిన్యూ అధికార్లు బాగా అనుభవం గడించి, గ్రామాలలో ఎగవేతల్ని పట్టేసేవారు. వ్యక్తిగత ఆస్తి హక్కు పవిత్రమని రెవిన్యూ అధికారులు అనుకోలేదు. ఉత్పత్తిలో

మూడోవంతు ప్రభుత్వానికి చెందాలనడం ఆచరణాత్మకం కాదు. భూస్వామి ఎవరనేది కాదు, పంటలో పంపిణీ తగినట్లు జరిగిందా లేదా అనేది సమస్య. జమీందారును స్వతంత్ర రెవిన్యూ అధికారిగా చూస్తుంటే, అతడు తన బాధ్యతల్ని విస్మరిస్తే అప్పుడు ప్రభుత్వం తన వాటా రాబట్టడానికి ప్రయత్నిస్తుంది.

ఈ రెండు వ్యవస్థల మధ్య యిరుక్కుపోయిన గవర్నర్ ఇన్ కౌన్సిల్, విషయాన్ని లండన్‌కు నివేదిస్తారు. గూడుపుఠాణీకి పేరొందిన మద్రాసు కారణంగా, సమాచారాన్ని ప్రైవేట్‌గా చేరవేయడం కూడా కద్దు.

(రెవిన్యూ విధానంలో వివాదం వచ్చినప్పుడు 1850 ప్రాంతాల్లో, అనేక గ్రంథాలు వెలువడ్డాయి. జె.బి.డబ్ల్యు, డైక్స్ - సేలం, ఏన్ ఇండియన్ కలెక్టరేట్ - 1853 లండన్.

రైత్వారీకి వ్యతిరేకంగా జమీందారీని సమర్థిస్తూ రెవిన్యూ అధికారి రాశాడు. మద్రాసు లాయర్ రైత్వారీని సమర్థించాడు. ఉభయులూ ప్రభుత్వాన్ని ఖండించారు.

పి.బి.స్మాలర్ - మద్రాస్ : ఇట్స్ సివిల్ ఎడ్మినిస్ట్రేషన్.

జె.బి.నార్టన్ - ఎ లెటర్ టు రాబర్ట్‌లో ఆన్ ది కండిషన్ అండ్ ది రిక్వైర్‌మెంట్ ఆఫ్ ది ప్రెసిడెన్సీ, ఆఫ్ మద్రాసు - 1854 మద్రాసు.

బోర్డిలన్ జె.డి. - రిమార్క్స్ ఆన్ ది రైత్వారి సిస్టం ఆఫ్ లాండ్ రెవిన్యూ యాజ్ ఇట్ ఎగ్జిస్ట్ ఇన్ ది ప్రెసిడెన్సీ ఆఫ్ మద్రాసు, 1853 మద్రాసు).

మద్రాసు లండన్ పెత్తందార్లు తక్షణ ఆచరణ యుక్తమైన సంగతులు పట్టించుకున్నారు. ఆర్థిక, రాజకీయ స్థిరత్వం వారికి ముఖ్యం. హోం

శాఖవారు సూత్రాలు, హక్కులపై శ్రద్ధ చూపారు. స్థానిక అధికారులు వాస్తవ స్థితిగతులు, ఆచరణ చూచారు.

మద్రాసు ప్రభుత్వం ఇచ్చిపుచ్చుకునే ధోరణిలో తక్షణ విషయాలను గమనించారు. కోర్టు ఆఫ్ డైరెక్టర్లు అలా కాదు. తగిన ఆదరణ లేకుండా స్థానిక ప్రముఖుడి పట్ల వ్యవహరిస్తే ఏమౌతుందో విశాఖపట్నం, కర్నూలు, మలబారులో తెలిసివచ్చింది. స్థానిక ప్రముఖుడికి అతి గౌరవం యిస్తే ఏం జరుగుతుందో మధుర, నెల్లూరు, గుంటూరు, రాజమండ్రిలో తెలిసి వచ్చింది. మొత్తం మీద మద్రాసు ప్రభుత్వం కంటె, కోర్టు ఆఫ్ డైరెక్టర్లు జమీందార్లపట్ల సహనం ప్రదర్శించారు. వారు అల్లర్లకు కారణమై, శిస్తులు సరిగా చెల్లించకుండా ఉన్నారు. స్థానిక ప్రభుత్వం పట్ల కోర్టు సహనం పాటించలేదు. కంట్రోలు బోర్డు అదే సహనం చూపలేకపోయింది. 1845 తరువాత వైఫల్యాలకు మద్రాసు ప్రభుత్వాన్ని దెప్పిపొడిచారు.

1836లో అలెగ్జాండర్ (బ్రూస్) సూచనమేరకు, కోర్టు ఆఫ్ డైరెక్టర్లు ప్రయోగం చేశారు. గుంటూరులో జమీందార్లకు రెవిన్యూ అధికార్లుగా వ్యవహరించమంటూ చట్టపరమైన యజమానుల్ని చేశారు. 1838 జులైలో మద్రాసు ప్రభుత్వానికి కోర్టు యిలా వివరణ యిచ్చింది.

"కలెక్టర్‌కు యిచ్చిన సూచనల్ని అంగీకరిస్తున్నాం. జమీందార్లు తమ విధులు పాటించి, బకాయిలు చెల్లించేటట్లు చూడాలి."

సత్తెనపల్లి జమీందారీలో జరిగిన దారుణ కరువు, ఫలితంగా మూడింట రెండు వంతుల జనాభా పోవడం కారణంగా, లోగడ ఏం జరిగినా సరే, ప్రస్తుతం వారి ఎస్టేట్లను వారే నిర్వహించేటట్లు చూడాలి. ప్రజల దృష్టిలో జమీందార్లను చులకన చేయరాదు. పరిస్థితులు వారి అదుపు తప్పి, ప్రకృతి వైపరీత్యాల కారణంగా జరిగాయి.

గోల్డింగం పాలనలో జమీందార్లు అమిల్‌దార్లుగా పనిచేస్తే ఏం జరిగిందో గమనించారు. జమీందార్ల పై పర్యవేక్షణ లేనందున వైఫల్యం చెందారు. 1836-37లో గోల్డింగం తొలి జమాబంది నివేదికలో జమీందార్ల అసమర్ధత, ఎగవేత ధోరణి, అణచివేత విధానాలు, వారి దివాన్ల అనర్హత పేర్కొన్నాడు. ఖర్చులు గట్టిగా పరిమితం చేయాలని, జమాఖర్చులు నిశితంగా గమనించాలని, జమీందారీ సిబ్బందిని అదుపులో పెట్టాలన్నాడు. జరిగిన పరిశోధన విఫలమైందన్నాడు.

1838 ఆగస్టు 2న రెవిన్యూ బోర్డు సమాధానమిచ్చింది. అలెగ్జాండర్ బ్రూస్, మాల్కోం లెనిన్ నివేదికల ననుసరించి, జమీందార్ల పాలనను వెనకేసుకొచ్చి, తమ విధానాన్ని వివరించారు. ఉన్న కష్టాలు తెలిసే పరిశోధన చేబట్టాం అన్నారు. కొన్ని పరిమితులకు లోబడి, జిల్లా అధికార్ల పర్యవేక్షణలో యీ విధానం అనుకూలంగా చేసుకోవచ్చు. సమర్ధ పాలనకై యిచ్చిన ఉత్తరువులు స్పష్టంగా లేవు. యాజమాన్య ఖర్చులు నిర్ధారించాలి. కుటుంబ సహాయం నిర్ధారించాలి. ఇదంతా గట్టి నిఘాలో, తగిన రసీదులు పంపిణీలు చేస్తూ, ప్రతి పంటకాలం ప్రారంభమయ్యే ముందు అమలు జరపాలి. ఇందులో అతి వుండరాదని బోర్డు చెబుతూ యింకా యిలా అన్నారు.

"ఇదంతా ఉదారంగా జరిగేటట్లు కలెక్టర్ చూడాలి. జమీందార్లు తమ సేవకులకు ఎస్టేట్ పాలన అప్పగిస్తే, సామర్థ్యం, నమ్మకమైన వారిని గమనించాలి. జమీందారు యాజమాన్యంలో జోక్యం చేసుకోరాదు. సంవత్సరంలో కలెక్టర్ సందర్శించి, పాలనపట్ల తృప్తి చెందేట్లు చూడాలి. వసూళ్ళు జరిగినవి సరిగా లెక్క చెప్పేట్లు గమనించాలి."

జమీందార్లను మరీ వత్తిడి చేయవద్దని కలెక్టర్‌కు చెప్పారు. లోగడ వారి సంపద దృష్ట్యా, ప్రస్తుత దారుణ స్థితిగతుల రీత్యా, ప్రభుత్వ సహాయం పై వారికి ఆశలు పోకుండా చూడాలన్నారు. బకాయీలను వదిలేయమన్నారు. క్రమేణా చెల్లించాల్సినదేదో నిర్ధారించమన్నారు. జమీందార్లు సాధారణ స్థితికి వచ్చేవరకు అలా చేయమన్నారు.

బోర్డు భావాల్ని గవర్నర్ ఇన్ కౌన్సిల్ అంగీకరించాడు. కలెక్టర్ నివేదించినట్లుగా జమీందార్లు అసమర్థులు కారని, ఎగగొట్టేవారు కాదన్నారు.

మరొక ఏడాది అదే ఫలితాలతో గడచింది. కలెక్టర్ తిరిగి జమీందారీలలో బాగా గడిపి, వివరంగా నివేదించాడు. మారు మూలలు గమనించాడు. జిల్లా చరిత్రను తరచి చూచాడు. జమీందార్లు లెక్కలు చూపడానికి నిరాకరించారు. మొత్తం వసూళ్ళు పేష్కష్‌లో సగానికి లోపేవుంది. (రు.6,08,358కి గాను రు. 12,25,458 వచ్చింది.)

1838-09లో రెవిన్యూ బోర్డు సిఫారసులను గోల్డింగం అమలు పరిచాడు. బోర్డులో రెండవ సభ్యుడు ఛార్లస్ కాటన్ కూడా ఉత్తరువులిచ్చాడు. డైరెక్టర్ల కోర్టు కాటన్‌ను ప్రెసిడెన్సీలో ఆర్థిక స్థితిగతుల్ని గమనించి, గుంటూరులో సాంఘిక, ఆర్థిక వ్యవహారాల్ని క్షుణ్ణంగా చూడమని కోరారు.

అంతటితో కలెక్టర్ బాగా లోతుపాతుల్ని పరిశీలించి రెండు విశేష నివేదికలిచ్చాడు?

సి.ఆర్. కాటన్‌కు గోల్డింగం యిచ్చిన నివేదిక 16 మాసాలకుగాని పరిశీలనకు రాలేదు. కనుక ప్రస్తుతం అది గమనించడం లేదు. 1839 జమాబంది రిపోర్టు అతని గొప్ప సాధన. జమీందార్ల నుండి హుజూర్

ఆఫీసు నుండి వచ్చిన వ్యతిరేకత దృష్ట్యా దీనికి ప్రాధాన్యత వుంది. అభ్యంతరాల మధ్య సాధ్యమైనంత మేరకు అలవెన్సులు యిచ్చారు. జమీందార్ల కోసం అట్టిపెట్టిన సాగు భూమి గురించి ఒక రూపం, అవగాహన వచ్చింది. నదీతీరంలో 9 వేల ఎకరాల భూమి తన ఆధ్వర్యాన సాగులో వుందని రేపల్లె జమీందారు అంగీకరించాడు. ఇవి కమతపు భూములు. జమీందార్లకు ఇతరత్రా వచ్చే ఆదాయాన్ని చూపలేదు. జమీందార్ల వాస్తవ ఆదాయం అంచనా వేయలేం. జమీందార్ల పూర్తి వివరాలు, గ్రామాల లెక్కలు, వర్గీకరణ, భూసారం, నీటి వనరులు, ప్రజల గురించి చెప్పాడు. జమీందారీ లెక్కలు మాత్రం రాబట్టలేక పోయాడు. ఖర్చులో అవకతవకలు, అతిగా పెట్టడం గమనిస్తే, చిలకలూరిపేట కుటుంబం 22,977 రు.లు. వ్యయం చేయగా, సత్తెనపల్లి జమీందారు ప్రైవేటు అప్పులకు చాలా చెల్లించాడు. ప్రభుత్వ అజమాయిషీపట్ల జమీందార్లకు విశ్వాసం లేదని గోల్డింగం చూపాడు.

జమీందార్ల ప్రస్తుత స్థితి, భవిష్యత్తు గురించి గోల్డింగం వివరాలు రాకపోయినా కొన్ని సంగతులు రాబట్టవచ్చునన్నాడు. ఎప్పుడూ వున్న ఆచారాల నుండి భిన్నంగా వ్యవహరిస్తూ మక్తా విధానం, కుప్పలు పంచుకోవడంలో, కవుళ్ళలో దారితప్పించారన్నాడు. పుష్కలంగా పంటరాగా, ధరలు బాగా పెరగగా, జమీందార్లు బాగా అవకాశం తీసుకొని, అటు ప్రభుత్వాన్ని యిటు వ్యవసాయదారులను దెబ్బతీశారన్నాడు. జిల్లా 38 ఏళ్ళుగా రెవిన్యూ పాలన రీతుల్ని జిల్లాలో జమీందారీ సూత్రాల్ని రూపొందించారు. జమీందార్లు యజమానులుగా ఆర్థిక విషయాలలో ఎలా ప్రవర్తించాలో చూడాలి. శాశ్వత కౌలుదారీ విధానం క్రింద సాలీనా జమీందార్లనుండి వసూళ్ళు 70 శాతానికి రావలసి వుంది. తమకు నిర్ధారించిన అలవెన్సులకు జమీందార్లు పరిమితం

కాకపోగా, దర్బారు ఖర్చులు నజరాలు, దైవం పేరిట చందాలు వసూలు చేశారు. అమల్‌దారీ పద్ధతి ఎంత వ్యయంతో కూడిందో గమనించాలంటే ఫుల్ రాజు ఎస్టేటు చూస్తే చాలు.

1840 సెప్టెంబరు 10 నాటికి ఆ నివేదిక పరిశీలించిన బోర్డు సంతృప్తి చెందలేదు. కలెక్టర్ చెప్పిన ప్రత్యేక జమాఖర్చులు, దారి తప్పిన వ్యయం గురించి వ్యాఖ్యానిస్తూ, ఆచరణలో వారి అభిప్రాయాలు అమలు పరచ వచ్చునన్నారు. లోగడ సంవత్సరాలతో పోల్చి, ప్రస్తుత సంవత్సరం లెక్కలు గ్రామాల్లో రాబట్టవచ్చునన్నారు. కలెక్టర్ కచేరీలో అవి సేకరించదగునన్నారు. బాగా లొసుగు వున్న చోటకే అధికారిని పంపించి విచారణ చేయ వచ్చునన్నారు.

"గ్రామ లెక్కల్ని ఏడాది ప్రారంభంలో చివరలో చూపమని, తేడాలకు సంజాయిషీ కోరాలి. జమీందార్లపట్ల ఉదారంగా వ్యవహరించి వారికి సహాయపడవచ్చు. పరిస్థితి గడ్డుగా వున్నప్పుడు అలాచేసి, జమీందార్లపై అదుపు పెట్టాలి."

43 లక్షలకు చేరిన బకాయిాల దృష్ట్యా పరిష్కారం తీవ్రతరం చేయమన్నారు. ఆదాయంలో అధిక భాగం సొంతానికి వాడుకోకుండా జమీందార్లకు పగ్గం వేయాలి. జమీందారీ పద్ధతి కొనసాగించాలంటే వారి నుండి రాబట్టే మొత్తాల్ని తగ్గించి, అమాని రెవిన్యూలో యివ్వ దలిచింది నిర్ధారించాలి. అత్యవసర చర్యలు తీసుకోవాలని, సొంత అప్పులు వదిలించుకునేటట్లు చూడాలన్నారు.

అయినా విధానంలో గణనీయమైన మార్పు రాలేదు. గోల్డింగం పాలన సాగినంతవరకూ జమీందారీల అదుపు క్షీణించింది. 1838 నుండి 1842 వరకు శాశ్వత రాబడి రాబట్టిన తీరు గమనార్హం.

సుమారు రాబట్టిన పేష్కష్ - ఫస్లి 1248-1252

| జమీందారీ | ఫస్లీ 1248 % | 1249 % | 1250 % | 1251 % | 1252 % |
|---|---|---|---|---|---|
| రేపల్లె | 66 | 75 | 73 | 64 | 68 |
| సత్తెనపల్లి | 48 | 45 | 73 | 68 | 60 |
| చిలుకలూరిపేట | 55 | 62 | 62 | 58 | 41 |
| వాసిరెడ్డి | 55 | 67 | 80 | 52 | 49 |
| మల్‌రాజు (అమాని) | 51 | 66 | 68 | 64 | 61 |

(జమాబంది నివేదికలు, ప్రొసీడింగ్స్)

బోర్డు ప్రభుత్వం వెంటాడినా, కలెక్టర్ ప్రయత్నించినా, నాలుగు యాజమాన్యాలు తమ పాలనా లెక్కలు యివ్వలేదు.

అమిల్‌దారీ - జమీందారీలపై ప్రయోగంలో ప్రభుత్వ వైఫల్యం వివరణ కాలేదు. ఉభయులూ మౌలికంగా భిన్న దృక్పథాలలో వున్నారు. ఉభయుల మధ్యా అవగాహన లేదు. జిల్లా అధికార్ల నుండి స్వీకరించమన్నంత సులభం కాదు. జమీందారీ లెక్కలు రాబట్టడం. కలెక్టర్ గట్టి మద్దతు లేదు. జమీందార్లు మాట వినకపోతే కలెక్టర్ వాళ్ళను తొలగించలేడు. ఎంపికలో అతని ప్రమేయం లేదు. జమీందార్లు తమ భూముల్లో అమీన్ అధికారాలకు మించి వినియోగించారు. వారి విపరీత రుణాల కారణంగా, భవిష్యత్తు అనిశ్చయమైపోయింది. వారంతా కలెక్టర్‌కు సహకరించేబదులు, తమ అవకాశాలు చూసుకున్నారు.

జమీందార్లు సంపన్నులుగా బలపడడానికి ఏ మేరకు అవకాశాలు వాడుకున్నారో తెలుసుకునే ఆధారాలు కలెక్టర్‌కు, బోర్డుకు, ప్రభుత్వానికి లేదు. జమీందార్లు ఎలా కూడగట్టుకున్నారో 1845లో గాని వెలికి రాలేదు. బోర్డు సభ్యుడు వాల్టర్ ఎలియట్ ద్వారా గ్రామాలన్నీ పరిశీలిస్తే ఎన్నో తెలిశాయి. జమీందార్ల వ్యవహారాలు ఉదాహరణగా తెలుసుకోడానికి కొన్ని ప్రస్తావించవచ్చు.

ఏదోఒక వంకతో గ్రామస్తుల నుండి ప్రతి సందర్భంలో నజరానాలు వసూలు చేశారు. ఇందులో కొన్ని వ్యవసాయ సంబంధమైనవికాగా, మిగిలినవన్నీ వ్యక్తి, కుటుంబం, మతపరంగా వసూళ్ళే.

జమీందారు అవసరాలను బట్టి, పంటకాలంలో ఆర్థిక స్థితి ననుసరించి, ప్రజల ధోరణి దృష్టిలో పెట్టుకుని గ్రామాలలో ఆయా సందర్భాలలో వసూళ్ళు రాబట్టారు. ప్రతి సందర్భంలో రు.10 నుండి రు. 1600ల వరకూ ప్రతి గ్రామానికీ యీ వసూళ్ళు చేశారు. నజరానా, కట్నాలనేవి జమీందార్ కుమార్తె పెళ్ళికి, దివాన్ కూతురు వివాహానికి, మైనారిటీ తీరనున్న జమీందార్‌కు, కుమారుడు పుట్టినందుకు, పిల్లల చదువుకు, వడుగుకు సత్తెనపల్లి కోట పునర్నిర్మాణానికి, రేపల్లెలో కోటద్వారం మర్మామ్మత్తుకు వసూళ్ళు చేశారు. జమీందారుకు ఎప్పుడూ ఏదోఒక కారణం వుండేది వసూళ్ళకు.

(కమిషన్ ఇన్‌క్వైరీ రిపోర్టు - గుంటూరులో 882 గ్రామాలలో వివరంగా ఉదాహరణలున్నాయి.)

వ్యవసాయోత్పత్తులపై నిరంతర వసూళ్ళుండేవి. కోతకు రు.2, నూర్పిడికి రు.2, అదనం రు.4 నజరానా, వెరసి రు.8లు ప్రతి జమీందారీ గ్రామంలో వసూలు చేశారు.

కౌలతలకు పుట్టికి రు.1 చొప్పున వసూలు చేశారు. పాతబకాయీల మినహాయింపులు కావాలంటే అదనంగా చెల్లించమనేవారు. అనుకూల కవులుకు పారితోషికం తీసుకునేవారు. పాతకవుళ్ళు, మక్తాలు తీసేయాలంటే నజరానాలు తీసుకునేవారు. (గ్రామం ఎంత లాభపడితే, నజరానాలు ఆ మేరకు ఉండేవి).

అన్ని జమీందారీలో ఏకారణం లేకుండానే సంపన్న గ్రామాలలో వసూళ్ళు చేశారు. రెవిన్యూ వసూళ్ళు చేసి, జమీందార్ల లెక్కల్లో చూపలేదు. బహుమానాలు, ఖర్చులనే పద్దులు రాసేవారు.

ఏదో ఒక వంకతో సంపన్న గ్రామాలలో మాగాణి భూముల్ని భుక్తం చేసుకున్నారు. ప్రభుత్వం సేరి భూములలో ఆదాయం అంచనాలేదు. సాధారణంగా ఆ భూముల్ని వ్యక్తిగతమైనవిగానో సేవకులవనో చూపేవారు. కాజేసిన వారిలో నాట్యకత్తె, పురోహితుడు, దివాన్, పంతులు, దేవాలయం, అప్పులిచ్చినవారు, వత్తిడి చేసే బంధువును చూపేవారు. జమీందార్లు అసలు లెక్కలు దాచి దొంగ పేర్లతో గ్రామాలను కవుళ్ళకిచ్చేవారు. చాకచక్యంతో యీ కవుళ్ళను పాత తారీఖులు వేసి, జమీందార్లకు రానున్న కాలంలో అక్కరకొచ్చేట్లు రాసేవారు. ఇవన్నీ చాలా సూక్ష్మంగా సున్నితంగా చేశారు.

(వాల్టర్ ఎలియట్ నివేదిక - 1946 ఏప్రిల్ గ్రామాలు ఉదహరించినవి కొన్ని -

నేనాకిమవు, గుండ్లపల్లి, చెన్నపల్లి, ఉరుకుడ్లపాడు, నాదెనలపూడి, ఉన్నవ, మనగదపూర్, ఉప్పలపాడు, వెల్లటూరు, పాచేలు, తాడిపత్రు, పాటిబండ, బాపట్ల, కొల్లిపర, ఉప్పుటూరు, కొమనూరు, దోనేపూడి, పెద్ద కొండూరు, కోటపల్లి, జలాలపూర్, తాడికొండ, కూమపాడు,

మాదెనల, జాలారి, ముల్పూరు, నందిగామ, గొల్లపాడు, ఇర్లపాడు, కనుపర్రు ఇప్పుర పాలెం, వరగాని, పాతేర, పెనుమూడి, కూరపాడు, బుద్ధం, నిజాంపట్నం, పెదగంజాం.)

జమీందార్ల దృష్టి, అలవాట్ల నుండి విశ్వజనీన స్వార్థపరత్వం వలన జమీందారీలను సమర్థించారు. అక్కడే సిద్ధాంతానికీ ఆచరణకు వైవిధ్యం ఏర్పడింది. జమీందార్లు తాము దైవాంశతో అనుభవించే రాజాలమను కుంటారు. కనుక వ్యక్తిగత వైభోగాలకు విపరీతంగా వ్యయం చేసి, చివరకు ముఖం చెల్లని స్థితికి దిగజారతారు. నిరంతర బాధ్యతారాహిత్యత, యాజమాన్య అస్తవ్యస్తం, సంకుచిత దృష్టికి తోడు ప్రకృతి వైపరీత్యాలు రావడం తోడైంది. లోగడ ఆడంబరంగా గడిపిన తీరులో సాగాలంటే అప్పులు చేయాలి, లేదా బలవంతపు వసూళ్ళకు పూనుకోవాలి.

అప్పులిచ్చిన వాళ్ళు గద్దల వలె పీడిస్తుంటే, ప్రభుత్వం సహనం కోల్పోయి ఆగ్రహిస్తే, జమీందార్లు నేలవిడిచి సాము చేశారు. కళ్ళుకప్పుకు పోయిన వారి స్వార్థం వారికి మార్గదర్శకమైంది.

గ్రామాల నుండి అన్ని సమయాల్లో తమకు కావలసింది జమీందార్లు రాబట్టలేకపోయారు. జనం ఆగ్రహావేశులు కాకుండా, ప్రభుత్వం కన్నెర్ర చేయకుండా, కత్తిమీద సాము చేయవలసి వచ్చింది. జమీందార్లకు గ్రామ నాయ నాయకులను పరిగణనలోకి తీసుకోవాలి. బలవంతుల్ని ఓదార్చక పోతే, అభ్యంతరాలు తీవ్రతరమౌతాయి. కనుక జమీందార్లతో చేతులు కలిపి కరణాలు, మునసబులు, గ్రామంలో పలుకుబడిగలవారు వసూళ్ళకు దిగితే, పేదజనం ఒకవైపు, ప్రభుత్వం మరోపక్క నష్టపడేవారు. జమీందార్లు చూపే రసీదులలో మూడోవంతు మాత్రమే వాస్తవం అని వాల్టర్ ఎలియట్ రాశాడు.

రాష్ట్రంలో ఆర్థిక స్థితిపై తీవ్ర పరిశీలన జరిగింది. 1837 ఆగస్టు 30న దేశంలో పతనావస్థ పై నిర్దుష్టంగా విచారణ జరపాలని డైరెక్టర్ల కోర్టు కోరింది. 1838 జులై 30న బోర్డు రెండో సభ్యుడు చార్లస్ కాటన్‌ను విచారణ చేయమన్నారు. కలెక్టర్లందరూ సహకరించాలన్నారు.

ఒక ఏడాదిపాటు సమాచార సేకరణ జరిపిన గోల్డింగం గుంటూరు స్థితిపై నివేదిక సమర్పించాడు. జమీందారీ సెటిల్‌మెంట్ విఫలమైందన్నాడు. 30 ఏళ్ళుగా వసూలౌతున్న రెవిన్యూవలె, సెటిల్‌మెంట్ వలన వచ్చిందని, అదీ ప్రైవేట్ రుణాలు రద్దు చేయడం, జమీందార్లను పోషించడం కారణం అన్నాడు. మంచి పంటకాలం, ఎక్కువ ధరలు వలన జాప్యం జరిగిందన్నాడు. లెక్కలు చూపించినంతగా మార్కెట్ ధరలు ఎన్నడూ పడిపోలేదు. దేశసంపద, ప్రజల సంతోషం మాత్రం పెంపొందలేదు.

జమీందార్లను అదుపులో పెట్టే మార్గం లేదని గోల్డింగం నిక్కచ్చిగా చెప్పాడు. అజమాయిషీలేని పెత్తనాన్ని వారికి ఇచ్చారన్నాడు. రైత్వారీ పద్ధతి విధ్వంసక పూరితమైతే, అది ప్రభుత్వ దోషం. ఎక్కడ తప్పు వుందో తెలుసుకుని సరిదిద్దే ఏర్పాటు వుంటుంది. యంత్రాంగం బలహీనమైతే, అసమర్థమైతే, పరిష్కార మార్గాలున్నాయి. హుజూర్ అధికారాలు వినియోగించడంలో, మద్రాసు మద్దతు స్తంభిస్తే తరచు బదిలీలు వుంటే, సరిదిద్దవచ్చు.

రైత్వారీ పద్ధతిలో సామర్థ్యాన్ని ప్రభుత్వం కిందకు తీసుకురావచ్చు. కానీ జమీందారీలో సమర్థ పాలన దుస్సాధ్యం. వాళ్ళ నైతిక లక్షణాలు, సూత్రాలు జిల్లా సంపన్నతకు విరుద్ధం. జమీందార్లు తమ కౌలుదార్లను పీడించుకు తినడం, వివాహాలలో, శవ వూరేగింపులో, పూజలలో యిష్టం వచ్చినట్లు ఖర్చు చేయడం తెలుసు.

గోల్డింగం నివేదికపై ప్రాథమిక పరిశీలన చేయక పూర్వమే, ఆరోగ్య రీత్యా, కాటన్ దేశం వదిలి వెళ్ళాల్సి వచ్చింది. ఆ తరువాత కౌన్సిల్ సభ్యుడు జాన్ సల్లివన్ విచారణ చేబట్టాడు. అతడికి మన్రో తెలుసు. మన్రో సంప్రదాయాన్ని సమర్థించాడు.

(లార్డ్ ఎల్ఫిన్‌స్టన్ మినిట్ 1840 ఎల్ఫిన్‌స్టెన్ కలెక్షన్)

గోల్డింగం నివేదిక చాలా వివేచనాత్మకమని 1840 డిసెంబరు 24న సల్లివన్ తన అభిప్రాయంగా తెలియపరచాడు. జిల్లా అధ్వాన్న స్థితికి తరచు బదిలీలు, హానికరమైన న్యాయ విధానాలు, తప్పుడు యాజమాన్యం, పంట కాలాల్లో నష్టాలు, అంచనాలు క్రమంగా లేకపోవడం కారణాలే. జమీందారీ దుష్టపాలన అసలు మూలకారణం అన్నాడు.

ఒక స్థానిక రైతు మాటల్లో, రైతుల సంపద తమకు మూలాధారమని ప్రభుత్వం భావిస్తే, నిధుల సంచులన్నీ తమ కోసమేనని జమీందార్లు తలపోశారు. మద్రాసు నియమావళి గట్టిగా అమలు పరిస్తే, చాలా కాలం కిందటే ఎస్టేట్స్ అమ్మేసేవారే. పల్నాడులో అమాని పాలన, గుంటూరులో పాలన పోల్చి చూస్తే, రైత్వారీ సూత్రాల ఔన్నత్యం అర్థమౌతుంది. తప్పుడు పాలన వలన రైతులు దుస్థితిలో చిక్కుకోగా, జమీందార్లు చికాకులో పడ్డారు. జమీందార్లను రద్దు చేయాలని గోల్డింగం కాటన్ చెప్పిన దాంతో అతడు అంగీకరించాడు. రైత్వారీ పద్ధతి పునరుద్ధరించాలన్నాడు.

ప్రభుత్వం జమీందార్లను కొనుగోలు చేయడాన్ని రెవిన్యూ బోర్డు సానుకూలంగా స్పందించింది. అదే జమీందార్లకు కొత్త ఒడంబడికలు అన్వయించాలి. పాత పద్ధతులలో చేసిన ప్రైవేటు అప్పులకు బాధ్యత వహించరాదు. రెవిన్యూ చెల్లింపులు స్థానిక ఒనరులబట్టి పెంచి, లోగడ

స్థాయికి వచ్చేట్లు చూడాలి. జమీందార్ల శాశ్వతంగా ప్రభుత్వం, వెనకేసుకు రావడం జిల్లాలో ఆమోదయోగ్యం కాలేదు.

1841 ఏప్రిల్ 16న సల్లివన్ అభిప్రాయాలను గవర్నర్ ఇన్ కౌన్సిల్ ఆమోదించింది. జమీందార్లు చేయలేని సాగు అభివృద్ధిపై దృష్టి పెట్టాలని, దానివలన ఆర్థికాభివృద్ధి సాధ్యమన్నారు. గుంటూరు జమీందార్లను రద్దు గావించడానికి డైరెక్టర్ల కోర్టు యిష్టపడలేదు. మద్రాసు ప్రభుత్వానికి మరో మార్గం తోచలేదు. అప్పుల కారణంగా జమీందార్లను అమ్మరాదనేది బలపడవచ్చు. ప్రాచీన కుటుంబాల గౌరవం కాపాడుతూనే, ప్రభుత్వం నష్టపడకుండా జనం పతనం కాకుండా చూడాలన్నారు.

గుంటూరు పరిస్థితులు ముందే మూసేయాల్సిన స్థితికి వచ్చాయి. 1840 నవంబరులో ఎస్టేట్ యజమాని మానూరు వెంకన్నరావు చనిపోయాడు. అతనికి వారసులు లేరు. విధవలంతా అసమర్థులు. అంతటితో ఎస్టేటును కుదువ బెట్టారు. వాసిరెడ్డి, సత్తెనపల్లి గ్రామాలు అలాగే చేయాలంటే, తప్పని సరైతే గాని అలా చేయవద్దని కౌన్సిల్ క్వీన్ డైరెక్టర్ల బోర్డు ఉత్తరువులు రావాలన్నారు.

అవసరం రానే వచ్చింది. 1842 జనవరి 8న జమీందారీలో 333 గ్రామాలు స్వాధీనం చేసుకోడానికి గోల్డింగంకు అవకాశం లభించింది. అప్పటివరకు వాసిరెడ్డి రామనాథబాబు ప్రవర్తన కొన్ని నెలలుగా గమనిస్తూ పోయాడు. ఈ చేసే అదనపు కార్యక్రమం ముగియక మునుపే, గోల్డింగం జిల్లా వదలి వెళ్ళాడు.

1842 జూన్ 21న గుంటూరు జమీందారీల విషయమై డైరెక్టర్ల కోర్టు నిర్ణయించింది. జమీందార్లకు అదుపులేని అజమాయిషీ యివ్వాలని రెవిన్యూ బోర్డు చేసిన సూచన డైరెక్టర్లు ఒప్పుకోలేదు. జమీందార్లపై

కఠిన చర్యకు అంగీకరించలేదు. స్థానికంగా నిరసన వస్తుందనుకున్నారు. జమీందార్లను బుజ్జగించడానికి కోర్టు సుముఖంగా వున్నా, కలెక్టర్ గనుక జమీందారీలను నిర్వహించాలంటే యాజమాన్య హక్కులన్నీ పూర్తిగా ప్రభుత్వానికి చెందాలి. సంస్కరణ సమూలంగా జరిగి, వారి పరిపాలన పునర్వ్యవస్థీకరణ జరగనిదే జమీందారీలను పునరుద్ధరించలేమన్నారు. ప్రభుత్వ అనుమతి లేనిదే జమీందారీలు ఎవరూ ప్రభుత్వ ఏర్పాట్లలో జోక్యం చేసుకోరాదన్నారు.

ప్రైవేట్ అప్పులిచ్చిన వారిని ఏం చేయాలనేది మద్రాసు పెత్తనానికి వదిలేశారు.

మద్రాసు ప్రభుత్వాన్ని తీవ్రంగా మందలిస్తూ, వ్యక్తిగత విధానాలను ఖండిస్తూ డైరెక్టర్ల కోర్టు ఉత్తరువులిచ్చింది. తరచు కలెక్టర్లను గుంటూరులో మార్చినందు వలన చాలా ప్రభావం చూపెట్టినట్లు గోల్డింగం చెప్పిన విషయాన్ని గమనించారు. గోల్డింగం అభిప్రాయం మద్రాసులో అన్ని జిల్లాలకు వర్తిస్తుందని సల్లివన్ అన్నాడు. దీనిపై కోర్టు యిలా వ్యాఖ్యానించింది.

"కలెక్టర్‌ను తొలగించడం, చీటికి మాటికి మార్చడం ఆమోద యోగ్యం కాదన్నాం. కలెక్టర్‌కు స్థానిక పరిస్థితుల పై తగిన అవగాహన వచ్చినప్పుడు, జిల్లా అవసరాలు గ్రహించినప్పుడు, మారిస్తే అతని సేవా విలువ దెబ్బ తింటుంది. తాత్కాలిక ఖాళీని భర్తీ చేయడానికి అనవసరంగా అనేక నియామకాలు చేయడం దోషం, ఒక ఖాళీ కోసం, 4 నియామకాలు చేశారు."

(1842 జులై 9 ప్రొసీడింగ్స్)

ఆచరణలో ఉన్నదానికి భిన్నంగా అక్రమ ఉత్తరువుల పట్ల కోర్టు నిరసన తెలిపింది.

గుంటూరు కలెక్టర్‌కు అదనపు భత్యం యిచ్చి, జిల్లాలో పనిపూర్తి అయ్యేవరకూ చూడాలని కంట్రోలు బోర్డు రాసింది.

ఈలోగా పతనావస్థ ఆరంభమైంది. ప్రభుత్వం వెలుపల అదుపులో లేని ఎస్టేట్ ఒక్కటే మిగిలింది. పాత ఆస్తులను స్వీకరించడం, రెవిన్యూ వసూళ్ళు ఆపడం, సానుకూలంగాని భూములు వదిలేయడం, పాలనా అజమాయిషీ నుండి తప్పుకోవడం జరిగింది.

1842 నవంబరు 21న కోర్టు ఉత్తరువులు, బోర్డు ప్రొసీడింగ్స్, గుంటూరుకు పంపి, కొత్త విధానాన్ని అమలు చేయమన్నారు. జమీందారీల నుండి స్వాధీనం చేసుకోవలసిన వాటిని స్టోక్స్‌కు చెప్పారు. జమీందారుకు యివ్వవలసిన పోషణ భరణం నిర్ధారించమన్నారు. ప్రతి జమీందారు ప్రైవేటు అప్పులు బయట పెట్టమన్నారు. జమీందార్ల విలాసాలకు ఎలాంటి కేటాయింపులు వద్దన్నారు. స్వాధీనం పూర్తి కాగానే, పూర్తిగా క్షేత్ర సర్వే చేసి, అంచనాలు వేయమన్నారు. బొంబాయి, ఆగ్రాలో చేసిన సర్వే కాగితాలు యిచ్చారు. మన్రో రచనలు అందించారు. సమస్యలపై బోర్డు అభిప్రాయాలు తెలియపరిచారు. అమానీ పాలనలో ఆందోళనకరమైన ఉద్యోగుల జోక్యాన్ని ఆపడానికి బోర్డు నిర్ణయించింది.

సరైన సర్వే జరిగేవరకూ, గ్రామ నాయకులు కవుళ్ళు వసూలు చేయాలి. ప్రతి గ్రామ రైతుకుగాక, యూవత్తు గ్రామానికి యిది వర్తించాలి.

1832 నుండీ అమానీ అదుపులో వున్న మల్‌రాజు గ్రామాలు తన ఎస్టేట్‌ను 1843 జనవరి 15న స్వాధీనం చేశాడు. కొద్ది రోజులు తరువాత చిలకలూరిపేట జమీందారు విధవలు జనవరి 25 ధారాదత్తం చేశారు. వాసిరెడ్డి రామనాథబాబు, మనూర్ వెంకట గోపాల్‌రావు, మాణిక్ జగన్న రావులు మొండిగా వున్నారు. వారి ధోరణి మద్రాసుకు తెలియజేశారు.

సంప్రదింపులు విఫలమైతే, వారి ఎస్టేట్లు వేలం వేస్తామని మద్రాసు ఆర్డర్లిచ్చింది.

ఏప్రిల్ 3న సత్తెనపల్లి జమీందారు లొంగాడు. ఏప్రిల్ 17న రేపల్లెను జిల్లా అధికారులు స్వాధీనం చేసుకున్నారు. వాసిరెడ్డినాయుడు, మానిక్‌రావు ఎస్టేట్లు అమ్మకానికి పెట్టమన్నారు. ఆ ప్రకటన చూచి, రామనాథ్ బాబు, జగ్గన్నరావు లొంగారు. అమ్మకానికి రెండు రోజుల ముందు జగ్గన్నరావు లొంగాడు. అప్పటికీ 40 ఏళ్ళ క్రితం యిచ్చిన డాక్యుమెంట్లు తీసుకోడానికి కొంత సమయం పట్టింది.



## అధ్యాయం - 12

# సర్కారు అధికారుల కుమ్మక్కు

## (1842-1845)

**1842**లో కలెక్టర్ గోల్డింగంను (GOLDINGHAM) ఉత్తర ఆర్కాట్‌కు బదిలీచేశారు. సమయం చాలా అననుకూలమైనది. మద్రాసు, లండన్‌లో గుంటూరు పాలనావిధానంపై సమీక్ష జరుగుతున్నది. స్థానికశక్తులు ప్రమాదకరంగా పరిణమించాయి. హుజూర్ సచివాలయం పై న్యాపతి శేషగిరిరావు, అతని అనుచరబృందం పట్టు చిక్కించు కున్నారు. వ్యతిరేక ముఠావారు తీవ్రంగా స్పర్థ పెంచుకున్నారు. జమిందారీ విధానం పతనమైంది. జిల్లా అంతా అస్తవ్యస్తంగా వుంది. ముఠాకలహాలు జమిందారీలలో ప్రవేశించి, ఆశ్రితపక్షపాత వ్యవహారాలకు దారి తీసింది. మల్‌రాజు, చిలకలూరిపేట విభాగాలు, పల్నాడు తాలూకా అమాని గ్రామాలలో శక్తులు చాపకింద నీరు వలె వ్యాపించి, కేంద్ర అదుపును అడ్డుకున్నాయి.

మరోరెండు మాసాలలో దిగజారుడు అవస్త పెరిగిపోయింది. ఇండియాలో రెండేళ్ళు మాత్రమే అనుభవం గల జూనియర్ అధికారి ఆర్థర్ హాతవే సిరస్తిదార్ దెబ్బకు తట్టుకునే స్థితిలో లేడు.

ఒకనెల తిరగకముందే ఆర్చిబాల్ మాథిసన్ ఆ స్థానంలోకి వచ్చాడు. లోగడ అతడు గుంటూరులో పనిచేశాడు. శేషగిరిరావు స్నేహితుడు కూడా. హుజూర్ ముఠాను అతను అడ్డుకోడు కూడా.

1842 ఏప్రిల్‌లో కొత్తకలెక్టర్ హడల్‌స్టన్ స్టోక్స్ వచ్చాడు. అతనికి హెన్రీనెవిల్ హెడ్ అసిస్టెంట్‌గా వచ్చాడు. డోవరిడ్జ్, డర్బీ వికార్ కుమారుడే స్టోక్స్. కంపెనీ డైరెక్టర్ జాన్ హడల్‌స్టన్‌కు దగ్గర బంధువు. 1825లో ఉద్యోగంలోకి వచ్చాడు. తిరునల్వేలి, కనరాలో కొద్దికాలం పనిచేసి, కర్నూలులో ఒక దశాబ్దం వున్నాడు. 1841లో మళ్ళీ కర్నూలు వచ్చాడు. ఆ తరువాత పదేళ్ళు గుంటూరులో గడిపాడు. మధ్యలో ఒక ఏడాది (1844-45) సిక్ సెలవుపై వెళ్ళివచ్చాడు. హెన్రినెవిల్ అతని హెడ్ అసిస్టెంట్. గోల్డింగం కింద 1841-42లో తర్ఫీదు అయ్యాడు. గోల్డింగంవలె, స్టోక్స్, నెవిల్ కూడా మతవిశ్వాసకులు, మతప్రచార కార్యకలాపాలను సమర్థించారు. పరిపాలనలో మాత్రం ఆధునిక శాస్త్రీయ రీతుల్ని అన్వయించదలచారు. (వీరు ముగ్గురూ తెలుగు బాగా మాట్లాడేవారు).

స్టోక్స్ వచ్చేనాటికి, శేషగిరిరావు జిల్లా గుప్పిట్లో వుంచుకున్నాడు. హుజూర్ సిరస్తిదార్‌గా అతడు సబ్బవీస్ ముఠాపై విజయం సాధించాడు. గోల్డింగంను నిరోధించగలిగాడు. రెవిన్యూబోర్డు అతనికి మద్దత్తు పలికింది. జమిందారీలు పతనంగావడంలో అతని అవకాశాలు మరీ పెరిగాయి.

జిల్లా వదలివెళ్ళే ముందు 400 గ్రామాల పాలనను సబ్బవీస్ పాలనకు అప్పగించి, గోల్డింగం వెళ్ళాడు. అతని గుప్పిట్లో నుండి అన్ని గ్రామాలుపోవడం సిరస్తిదార్‌కు యిష్టంలేదు. కనుక యీ చర్యపై రెవిన్యూబోర్డుకు విజ్ఞప్తి చేశాడు.

సబ్డివీస్‌ వెంకటకృష్ణారావు పట్ల పక్షపాతం చూపి, తన పదవిని దుర్వినియోగపరచినట్లు రెవిన్యూబోర్డు ఆక్షేపించింది. నయాబ్ తహసిల్దార్ మంగనూరి లక్ష్మీనరసు, కృష్ణారావులకు సంతకాలు చేసిన తెల్లకాగితాలు నియామకాల నిమిత్తం యిచ్చి వెళ్ళడాన్ని, కలెక్టర్‌కు ఆక్షేపణ తెలిపింది. తమ అనుచరులతో పాలనలో నింపి, గందరగోళం సృష్టించారని బోర్డు అన్నది.

(హెన్రినెవిల్ వెల్ష్‌పూల్‌లో పుట్టాడు. క్లైవు కుటుంబంతో సంబంధాలున్నాయి.)

తాత్కాలిక కలెక్టర్ మాథిసన్‌ను తనవైపు తిప్పుకోడానికి శేషగిరిరావు తన చాకచక్యతను ప్రదర్శించాడు. జాబితాను మార్చి, తగ్గించి మద్రాసుకు మాథిసన్ పంపాడు. గోల్డింగం ఎంపిక చేసిన వారిని వాసిరెడ్డి, చిలకలూరిపేట, మల్‌రాజు తాలూకాలలో, సమితులలో తొలగించాడు. వారు కొత్తవారని, అనుభవంలేని వారని అన్నారు. హుజూర్ నుండి, వాసిరెడ్డి ఇన్‌చార్జి స్థానం నుండి మంగనూరి లక్ష్మీనరసును తొలగించారు. అతని సోదరులు లక్ష్మీనారాయణ, చెంచు రామయ్యలను చిలకలూరిపేట, తెనాలి అమీన్‌స్థానాల నుండి తప్పించారు. రాచూర్‌లో అమీన్‌గా కృష్ణారావును డిస్మిస్ చేశారు. సబ్డివీస్‌ముఠాలో అమీన్లుగా వున్న నంబూరికృష్ణయ్య, బండారు రాజేశ్వరం తొలగించారు. ఖాళీ అయిన స్థానాలలో న్యాపతి ముఠాను ఎంపిక చేశారు. బాపట్ల తానాకు అమీన్‌గా వున్న నక్కలపల్లి సుబ్బారావును నయాబ్ సిరస్తిదారుగా హుజూర్ కచేరీలో పెట్టారు. వాసిరెడ్డి జమిందారీకి ఇన్‌చార్జి చేశారు. రామనాధబాబు దివాన్‌గా వున్న తోటకృష్ణమ్మను చేబ్రోలు థానా అమిన్ చేశారు. శేషగిరిరావు అల్లుడు పురుషోత్తమరావు హుజూర్ సెక్రటేరియట్‌లో

హెడ్‌గుమస్తా అయ్యాడు. ఆ విధంగా జిల్లాపై సిరస్తిదార్ పట్టు సడలించారు.

తాత్కాలిక కలెక్టర్ చర్యపై అనేక ఫిర్యాదులు రెవిన్యూబోర్డుకు చేరాయి. వ్యక్తులి మొత్తంగా తొలగించడంతో బాగా నిరసన వచ్చింది.

పిటిషన్ల పరంపరతో, పూర్తి విచారణ కావాలని రెవిన్యూబోర్డు కోరింది. మాతినన్ ఎంపిక ఆమోదించారు. వివిధ పిటిషన్లపై స్టోక్స్‌ను నివేదించమన్నారు. విషయాల్ని కూలంకషంగా చూచిన స్టోక్స్, శేషగిరిరావుకు వ్యతిరేకంగా వచ్చిన ఫిర్యాదులు సాక్ష్యాధారాలు, కృష్ణారావు, రామనాధబాబుపై ఆరోపణలు కూడా పరిశీలించారు.

1842 ఆగస్టు 18 వరకూ స్టోక్స్ ప్రథమ నివేదిక బయటపెట్టలేదు. జిల్లా అంతటి ముఠాధోరణి ప్రబలి, యావత్తు పాలనను చిన్నాభిన్నం చేస్తున్నది. గోల్డింగం నిందారోపణ చేసిన శేషగిరిరావు పిటిషన్లకు ఎలాంటి ఆధారములేదు. మాజీ కలెక్టర్ వాసిరెడ్డి జమిందారీ యాజమాన్యానికి పెట్టిన పేర్లను పాక్షికంగా మార్చారు. లక్ష్మీనరసు వ్యక్తిగతంగా అనేక ఉద్యోగాల్లు ఎంపిక చేసినందున, అందులో గోల్డింగం ప్రమేయంలేదు.

ఆ నివేదిక ఆధారంగా గోల్డింగం దోషంలేదని బోర్డు తేల్చింది. వదంతుల ఆధారంగా, ఎలాంటి సాక్ష్యాలు లేకుండా మాజీకలెక్టర్‌పై ఆరోపణలు చేసిన శేషగిరిరావును తీవ్రంగా తొలిసారి బోర్డు తప్పుపట్టింది.

ఉభయపక్షాల మధ్య వైరుధ్యం కొనసాగనిస్తే ప్రమాదకర ఫలితాలు వస్తాయనుకున్నారు. కృష్ణారావును కాదంటూ, గుంటూరుజిల్లాలో అతన్నిగాని, లక్ష్మీనరసునుగాని ఏ విధంగానూ నియమించరాదన్నారు.

రెవిన్యూ యాజమాన్యంలో పాతను కొనసాగిస్తూ, మితంగా పయనిస్తూ, ఆచరణలో సమస్యల్ని అవగాహన చేసుకొని పాలన

సాగించాలి. 1850 ప్రాంతాలలో మద్రాసు ప్రభుత్వం లోగడవున్న దారుణ దేశీయ ప్రభుత్వాలు రెవిన్యూ పద్ధతులను కొనసాగిస్తున్నట్లు దృష్టికి వచ్చింది.

(జె.డబ్లు.కేయి : ది ఎడ్మినిస్ట్రేషన్ ఆఫ్ ది ఈస్ట్ ఇండియా కంపెనీ (1855 లండన్) పే. 231)

మద్రాసుపాలన భారతీయపాలన. లండన్ నుండి సిద్ధాంతీకరిస్తే, నిర్ణయాలు చేస్తే, ఇండియాలో చిరకాలంగా వస్తున్న సంప్రదాయ రెవిన్యూ వసూళ్ళు మారవు. ఏ విధానం అవలంబించినా సరే, తొలుత బ్రిటిష్ పాలకవర్గం, తరువాత దేశస్తుల పాలకమండలి, గ్రామనాయకత్వ కుటుంబాలు నడిచే తీరులో పోవాల్సిందే.

మన్రో పేర్కొన రైత్వారి విధానంలో యీ విషయాలు గమనించ వచ్చు. రైత్వారి సెటిల్‌మెంట్‌లో కీలకమైంది పని స్వేచ్ఛ, సాగు స్వేచ్ఛ అనేది వుండాలి. డైరెక్టర్లకోర్టు అదే పేర్కొన్నది.

కొత్తవిధానంలో బలవంతం, నిబంధనలు వదిలేయాలి. రైత్వారీలో అత్యవసరస్థితి అది. కాని స్థానికంగా అది అన్వయించడంలేదు. సాగుదార్లు ఫలసాయం బాగా రాని భూముల్ని వదిలేస్తారు. వాటిపై అంచనాలు భారీగా పెట్టారు. రెవిన్యూ కోసం అలాంటి నిర్బంధాలు చేశారు. రైతు తనకు గిట్టుబాటు అయిన భూములు చేబట్టి, కానివి విదలేస్తాడు. గుంటూరుదాత కరువు తరువాత అటువంటి పద్ధతికి అనుకూలత వుందని సేలం కలెక్టర్ జేమ్స్ డైక్స్ రాశాడు. దప్పిక తీర్చుకోడానికి నీళ్ళులేని పరిస్థితి అది. 1835లో తాను కావాలనుకున్న భూమిని సాగుకు స్వీకరించే అవకాశంలేదు. అలా వదిలేస్తే, మరొకళ్ళు సాగుచేసుకునేందుకు వీలుగా మొత్తం భూమిని వదలేయాలి.

కేవలం బాగాలేని భూములు వదిలేస్తామంటే కుదరదన్నారు. ఇలాంటి పద్ధతులు ప్రభుత్వ ఆర్థికవనరుల్ని దెబ్బ తీశాయని, కేయీ రాశాడు.

రైత్వారిపద్ధతిలో వ్యక్తుల కమతాలు పెంచి, యూరోప్ అధికారులకు సంబంధం లేకుండా బాధ్యతలు పంచడమే. భారతీయ పద్ధతులలో వ్యవసాయానికి వత్తిడిచేసి, పన్నులు బాగాపెంచి, ప్రోత్సాహకాలు తగ్గించి, డబ్బులు రాబట్టడానికి స్థానిక నాయకులు చిత్రహింసలు చేసేవారు.

ప్రభుత్వం చూస్తూవుండగా, యిలాంటి అణచివేత పట్ల నిరసన బాగా పెరిగింది. రైత్వారిపద్ధతి సరిగా అన్వయించ నందున విఫలమైందని ఒక వాదన వుంది. మన్రో భావాలు అన్వయిస్తే మద్రాసురెవిన్యూ పద్ధతికి స్వస్తి పలక వచ్చునన్నారు. శాస్త్రీయ సర్వేకావాలి. అంచనాలు వేసి తగ్గింపులు చేయాలి. పెట్టుబడులు అభివృద్ధి చేయడానికి ప్రోత్సాహకాలు యివ్వాలి. సంపద జీవనాడుల్ని నొక్కివేస్తున్న భారతీయ అధికారులపై అదుపుపెట్టాలి. పన్నులు తగ్గిస్తే, స్వేచ్ఛగా సాగుచేయనిస్తే, వూరికే పడివున్న భూములు దున్నిసాగుచేస్తారు. అప్పుడు రెవిన్యూ తగ్గదు. పైగా పెరుగుతుంది. భయంతో, చీకట్లో కొట్టుమిట్టాడుతున్న పరిపాలన మారి, స్వేచ్ఛాధోరణి, విశ్వాసం, ఆశావాదం వస్తాయి.

స్టోక్స్ అలాంటి సంస్కరణ భావాలు వెల్లడించాడు. రెవిన్యూ యాజమాన్యం అభివృద్ధి చేయడానికి 1842 అక్టోబరు 25న ఆచరణాత్మక మైన మార్పులు సూచించాడు. పాతుకపోయిన అలవాట్లకు భిన్నంగా కొత్తవిధానాలు నాలుగు సూచించాడు. వ్యవసాయానికి స్వేచ్ఛ వుండాలి. బలవంతం వుండరాదు. పంటలు అంచనా వేసి విలువ గట్టేపద్ధతి పోవాలి. అది అనవసరం. అణచివేతకు దారితీస్తుంది.

కోతలకు ముందే అనుమతిపత్రం కావాలనే పద్ధతి మక్తా రైత్వారి

తీరుకు విరుద్ధం. అదిపోవాలి. రెవిన్యూవాయిదాల పద్ధతిపై చెల్లించ మనకుండా ఉత్పత్తిని మార్కెట్ చేయనివ్వాలి. ఈ సంస్కరణలతో అణచివేత, అనుమానం, జోక్యం స్థానిక అధికారుల గూడుపుఠాణి తొలగుతుంది.

శేషగిరిరావు తన భావాల్ని వ్యతిరేకిస్తున్నాడని స్టోక్స్ స్పష్టంగా చెప్పాడు. ఉత్తర సర్కార్లకన్నా యింకా బాగా శిక్షణ పొందిన సేవకులు వుంటే, లోపాయికారి వ్యవహారాలకు మించి, పనులు జరుగుతా యన్నాడు. ఆఫీసు అధికారి అనుభవశాలి, తెలివైనవాడు. కాని రెవిన్యూ పద్ధతులలో మంచి విషయాలు తెలియక, క్రూర విధానాలు ఆచరిస్తున్నాడు. స్టోక్స్ కూడా గోల్డింగం వలె గుంటూరు జిల్లా పరిస్థితిని అంచనావేశాడు.

స్టోక్స్ సూచించిన సాధారణ విధానాలతో బోర్డు అంగీకరించింది. కాని వాటిని అన్వయించడంలో జాగ్రత్త వహించమన్నది. చిరకాలంగా ఒక దోషబద్ధమైన విధానం అమలులో వున్నప్పుడు, దానికి బదులుగా ప్రవేశపెట్టే కొత్తపద్ధతిలో అతిజాగ్రత్త అవసరం.

స్థానికపరిస్థితులకు అవసరమైన వాటిని ప్రవేశపెట్టాలి. పూర్తిస్వేచ్ఛ యిస్తే సాగులో నిబంధనలు పాటించరేమో గమనించాలి. 1824 బళ్ళారి జిల్లా నిబంధనల బట్టి, కేటాయించిన భూమిలో మంచిచెడు పొలాలు సమానంగా వదలుకుంటేనే అనుమతించాలన్నారు. భూమిపై కవుళ్ళు నిర్ధారించాలన్నారు. అదుపు లేకుండా మార్పిడిచేసి, తొలగించ డాన్ని జాగ్రత్తగా చూడాలి. కాకుంటే రెవిన్యూ వసూళ్ళు దెబ్బతింటాయి. జిల్లాలో యింకా అనుభవం గడించే వరకు సంస్కరణల అమలు నెమ్మదిగా చేయమన్నారు. శేషగిరిరావు సంస్కరణలకు అభ్యంతర

పెట్టడంలో మంచిచెడులు మిళితమై వున్నాయి గనుక జాగ్రత్త వహించమన్నారు.

1843 మే 25న రెండో తడవ సంస్కరణల నివేదికను కలెక్టర్ సమర్పించాడు. జమిందారీల పాలన తొలగింది గనుక, ఆ గ్రామాలలో మార్పుకు హెూంశాఖ ఒప్పుకున్న రీత్యా గుంటూరు జిల్లాలో భూ విభజన త్వరగాచేసి, తగిన అదుపు విధించాలన్నారు.

భూమిపై అజమాయిషీలో వున్న వైరుధ్య పోటీ తొలగించి, బాధ్యతలు స్పష్టం చేయాలన్నాడు. భూ విభాగాల గందరగోళం చూపాడు. పరగణాలు, సీమలు, సర్కార్లు, సముతులు, ముత్తాలు, వంతులనేవి అస్పష్టంగా వున్నాయన్నాడు. భిన్న జమిందారీ కుటుంబాల మధ్య వున్న గ్రామాలను విడమరచి చూడదలచాడు. 14 రెవిన్యూ అమీన్లున్నాయి. అందులో 5కు పోలీస్ అజమాయిషీలేదు. రెండు ఉప్పు అమీన్లున్నాయి. దీనిస్థానే 12 తాలూకాలు రెవిన్యూ, పోలీసు అధికారాలు నిర్వహించేటట్లు విభజించాలన్నాడు. జమిందారీ విభజనతో నిమిత్తం లేకుండా తాలూకా విభజన జరగాలి. ఇవి సామీప్యత, పొందిక రీత్యా విభజించాలి.

హుజూర్, గైబతు సిబ్బందిని మళ్ళీ మార్చి, బాధ్యతలు స్పష్టం చేసి, గట్టి అదుపుతేవాలి. తాలూకా విస్తీర్ణత బట్టి 3 విధాలైన తహసిల్దార్లను నియమించి, 120, 100, 80 రూ.లు నెల వారీ జీతాలలో పెట్టాలి. 8 పెద్ద తాలూకాలకు డెప్యూటి తహసిల్దార్లుండాలి. హుజూర్ కచేరీలో అధికార్లు స్థిరపడని జిల్లా అధికార్ల స్థాయిలోనే వుండాలి. అసిస్టెంట్ సిరస్తిదార్ స్థానే అనువాదకుడు వుండాలి. హెడ్ ఇంగ్లీషురైటర్ దీని వలన కొంత విమోచన లభిస్తుంది.

ఇరువురు దేశీయ రికార్డు కీపర్ల స్థానే ఒకళ్ళుచాలని, ఒక ఇంగ్లీషు

రికార్డు కీపర్ వుండాలని, ప్రస్తుతం అలాంటిది లేదని పేర్కొన్నాడు.

పునర్విభజన రెండు అభ్యంతరాలను కలెక్టర్ వూహించాడు. జమిందారీలను వారి కుటుంబాలకు అప్పగిస్తే చట్టబద్ధమైన సమస్య రావచ్చు. ప్రతి జమిందారీకి ప్రత్యేక లెక్కలు నిర్వహించడం కష్టం. సాగులో అభివృద్ధి వలన సులభంగా ఆదాయం రాబట్టవచ్చు. ఇలా చేస్తే లోగడ వున్నదానికంటె, జిల్లా అధ్వాన్నం కాబోదు. ప్రతి వస్టేట్‌కు ప్రత్యేక లెక్కలు తయారుచేయాలి. దీనికి ఒక్కొక్క గ్రామలెక్కలు ఆధారం కావాలి. అప్పుడు అభ్యంతరాలను ఎదుర్కోవచ్చు.

బోర్డు యీ సంస్కరణలు అంగీకరించలేదు. జమిందారీల నుండి సమద్‌లు రాబట్టడంలో ఎదురైన చిక్కుల దృష్ట్యా, తీవ్ర మార్పులకు బోర్డు సిద్ధం కాలేదు. ప్రైవేటురుణాల సమాచారం, జమిందారీలలో రాగల ఉత్పత్తి కావాలి. సిద్ధాంతం ఆచరణ రీత్యా క్షేత్రసర్వే, అంచనా వేయాలి. అప్పటి వరకూ తీవ్ర సంస్కరణల జోలికిపోరాదు. సిర్‌స్తిదార్‌కు యీ సూచనలు ఓదార్పునిచ్చాయి.

1843 సెప్టెంబరు నాటిని శేషగిరిరావు ప్రభావం కిందవున్న అధికారుల ప్రతిబంధకం స్టోక్స్‌కు సహించరానిదైంది. లోగడ మాసాలలో జప్తి-జమిందార్ల అదనపు సిబ్బంది నియామకం న్యాపతి పక్షానికి బలం చేకూర్చింది. ఆగస్టు మరికొన్ని అదనపు నియామకాలు మంజూరు చేశారు.

పాలనలో కొన్ని మార్పులకు అక్టోబరు మధ్యలో చేయబోగా బోర్డు ఒప్పుకోలేదు. ప్రైవేటు రుణాలు, ఉత్పత్తి అంచనాలు జమిందారీలో ఎలా వుంటాయో తెలిస్తేగాని, పాలనాపునర్వ్యవస్థీకరణ ఒప్పుకోమన్నారు.

సబ్నవీస్ కృష్ణారావు నియామకంపై నిషిద్ధాన్ని తొలగించడానికి చేసిన

ప్రయత్నం నవంబరు 10న మానుకున్నారు. వి. కృష్ణారావుకు వ్యతిరేకంగా ముఠా కక్షలమూలంగా జనించినదని స్టోక్స్ స్పష్టంచేశాడు. కృష్ణారావు, అతని అనుచరులు దోషాతీతులుకాదు. వారికీ ఆశ్రిత పక్షపాతం వుంది. అంతమాత్రన అతన్ని కచేరీలో నియమించకూడదనడం సరి కాదన్నాడు.

అయినా కలెక్టర్ విజ్ఞప్తిని బోర్డు నిరాకరించింది. కృష్ణారావు పిటిషన్ తృణీకరించింది. జిల్లాలో కృష్ణారావు వుండడమే తీవ్ర అభ్యంతరకరం అన్నారు.

చిరకాలంగా ఎదురుచూస్తున్న నివేదిక 1843 డిసెంబరు 4న సమర్పించారు. వాసిరెడ్డి రామనాధబాబు వ్యవహారాలలో, చేబ్రోలు అమీన్ తోటకృష్ణమ్మ వున్నాడు. జిల్లాపాలనలో ఆయనకు పాతికేళ్ళ పైగావున్న తెలగకులస్తుడు. 1836లో వాసిరెడ్డి దివాన్‌గా అయ్యాడు. గ్రామస్తులనుండి భారీసొమ్ము రాబట్టడానికి, హుజూర్ సిరస్తిదార్ ఆధ్వర్యాన తోట కృష్ణమ్మ, అతని కుమారుడు తోట చిన్నకృష్ణమ్మ, తాలూకా అధికారులు హుజూర్ సిబ్బంది పీడించారు. 1842 జనవరిలో గోల్డింగం అతన్ని తొలగించగా చేబ్రోలు అమీన్ అయ్యాడు.

ఉత్తర సర్కారులో అనధికారికంగా డబ్బు గుంజడం సాధారణ మైంది. జమిందారు, అతని దివాన్ నేరాల్ని గుర్తించినా ఇతర అధికార్ల తప్పిదాలు వంటివేయివి కూడా అని చూడాలన్నారు. తోట కృష్ణమ్మను తొలగించడమా, మరోచోట నియమించడమా, వాసిరెడ్డి జమిందారీలో కొనసాగ నివ్వడమా అనేది స్టోక్స్ నిర్ణయానికి వదిలేశారు. హెన్రీ నెవల్ 18 మాసాలుగా సాక్ష్యాధారాలు సేకరిస్తున్న దృష్ట్యా, వేరే విచారణ అనవసరమన్నారు.

శేషగిరిరావు పట్టు సడలించడానికి 1844 ఫిబ్రవరి 1న స్టోక్స్

తుదిప్రయత్నంచేశాడు. మంగనూరి లక్ష్మీనరసును హుజూర్ సిరస్తిదార్‌గా నియమించి, కలెక్టర్ చర్యల్ని అడ్డుకుంటున్నందును శేషగిరిరావు పదవి తగ్గించారు. సాక్ష్యాధారం సరిగా లేనందున బోర్డు ఈ చర్యకు తృప్తి చెందలేదు. శేషగిరిరావును తొలగించడాన్ని బోర్డు ఆమోదించక, ఆయన్ను తిరిగి పదవిలోకి తీసుకోమని ఫిబ్రవరి 10న స్టోక్స్‌కు ఉత్తరువులిచ్చింది.

రాగద్వేషాల మధ్య పనేమీ తృప్తికరంగా సాగలేదు. బోర్డు మొండితనం వలన, 7 ఏళ్ళుగా జిల్లాలో ముఠాలుకొట్టు మిట్టాట సాగింది. అదే శేషగిరిరావును వెనకకేసుకరావడం. ఇరుపక్షాలూ తమ బలానికి, ఎదిరి పక్షాన్ని దెబ్బతీయడానికి ప్రయత్నించారు. ఒక ముఠా వాసిరెడ్డికి చెందినది. మరో ముఠా సత్తెనపల్లి మనూర్ వార్స్‌కు వివాహబంధాల రీత్యా వున్నది. ఉభయులపై ఆధారపడ్డవారి సంఖ్యను తమ అధికారంతో పెంచుకుంటూపోయారు.

గోల్డింగం నియమించిన జప్తిస్థాపనల స్థానంలో న్యాపతి ముఠాను మాథిసన్ 1842లో నియమించాడు.

సిరిస్తిదార్ వైపు మొగ్గుచూపడంతో, సబ్నవీస్ ముఠా స్థంభించింది. కలెక్టర్ స్థితి కూడా అలానేమారింది. 1843లో మిగిలిన జమిందారీ స్థానాలను న్యాపతి అనుచరులు వశపరచుకున్నారు. 1845 నాటికి శేషగిరిరావు అనుచరులలో 74 మంది బంధువులే. మిగిలిన వారు అతని కుటుంబానికి సన్నిహితులు. ఇతరులు స్నేహితులు, కృతజ్ఞతతో వచ్చినవారు.

గుంటూరులో స్థానిక అధికార ప్రదర్శన తారాస్థాయికి చేరగా, చివరకు కలెక్టర్‌ను అపఖ్యాతి పాలుచేసి, అతన్ని తొలగించేవరకూ వెళ్ళింది.

ఇందులో కుట్రగా ఆదాయం ప్రభుత్వానికి చేరకుండా జిల్లాలో దేశస్తవ్యవస్త వారికి రెవిన్యూలు దక్కాయి.

హుజూర్ సిరస్తిదార్ ఉత్తరువులననుసరించి అమీన్లు గ్రామాలలో రెవిన్యూ వసూళ్ళు చేయకుండా, పంటలు దెబ్బతిన్నాయని, మార్కెట్ బాగాలేదని సాకు చెప్పారు. ఇందుకు బదులుగా జిల్లా అధికార్లకు కొంత ముట్టచెప్పారు. మిగిలిన దానిలో రైతులకు, గ్రామనాయకులకు మరి కొంత దక్కింది.

స్టోక్స్ సంస్కరణలు అడ్డం పెట్టుకొని, గ్రామనాయకులు చాలా భూముల్ని వదిలేశారు. ఆ భూములకు తగ్గింపు ధరలలో అమ్మి, జిల్లా అదికారుల చేతులు తడిపారు.

మార్పిడిలో కొంత భాగం తీసుకునే పాతపద్ధతి అనుసరించారు. అవి తనిఖీ చేయమని కలెక్టర్ పంపిన అధికారులంతా హుజూర్ సిరస్తిదార్‌తో కుమ్మక్కి అయిన వారే. కనుక వారిచ్చిన నివేదికలను ఆమోదించారు. వదిలేసిన భూముల్ని తక్షణమే ఆక్రమించి, లాభసాటిగా గ్రామాళ్లలో పంచారు.

కలెక్టర్ కన్నుగప్పి యిదంతా ఎలా చేశారు? వెయ్యి గ్రామాలలో జిల్లా సిబ్బంది సహకారం లేకుండా కలెక్టర్ చేయగలిగిందేమీలేదు. సిరస్తిదార్‌ను అణచివేయడానికి కలెక్టర్ ప్రయత్నించి, బోర్డుకు నచ్చచెప్పే సాక్ష్యాన్ని అందించ లేకపోయాడు. అతని సిబ్బంది అంతా శేషగిరిరావుతో కుట్రపన్నినవారే. రెవిన్యూ దెబ్బతినగా ముఠా కుట్రలు సాగాయి.

స్టోక్స్ ఆరోగ్యం దెబ్బతిన్నది. అది జిల్లాపాలనకు దెబ్బ. కాని శేషగిరిరావుకు కలిసివచ్చింది. స్టోక్స్‌ను తొలగించే ప్రయత్నం చేయ నవసరం లేకుండాపోయింది. ఆగస్టు మధ్యలో స్టోక్స్ ఆరోగ్యరీత్యా జిల్లా

వదలాల్సి వచ్చింది. కొత్త తాత్కాలిక కలెక్టర్ వచ్చే వరకూ హెడ్ అసిస్టెంట్ హెన్రి నెవిల్ చార్జి తీసుకున్నాడు. (1844 సెప్టెంబరులో కొత్త కలెక్టర్ వచ్చాడు).

ఎలియట్ లాక్ హార్ట్ కలెక్టర్‌గా ఉత్తర సర్కార్ల అనుభవం లేనివాడు, గుంటూరు లోగుట్టు బొత్తిగా తెలియనివాడు. హుజూర్ సిరస్తిదార్ మాటల మాయలోపడ్డాడు. లోగడ కలెక్టర్ తెలివిమాలిన విధానాలు కారణంగా జిల్లా యిబ్బందులు వచ్చాయన్నాడు. జిల్లాలో సాలీనా కవుళ్ళనే అంగీకరించాలని, నిర్ధుష్టసమాచారం అందేవరకూ అలా కొనసాగించాలని రెవిన్యూబోర్డు చెప్పింది. కాని శేషగిరిరావు చెప్పినట్లు లాక్ హార్ట్‌విని గ్రామాలకు 3 ఏళ్ళ లీజు యిచ్చేయాలన్నాడు. లీజు ఒడంబడిక ప్రకారం, తక్కువ రెట్లతో వుంచి, చివరి ఏడాదిలో పెంచా లన్నారు. కరువు పరిస్థితి ముందున్నస్థాయిలో గ్రామాలున్నాయి. ఆ విధంగా శేషగిరిరావు తన జేబులు నింపుకునే పథకం వేశాడు. స్టోక్స్ అసమర్థుడన్నాడు. ఆయన తలపెట్టిన కొత్త మార్పులు విధ్వంసకరమైన వన్నాడు. గతస్థాయికి రెవిన్యూ వసూళ్ళు తీసుకెళ్ళి ఖ్యాతి పెంచుకోవాలని చూచారు.

(ఎలియట్ నివేదిక - న్యాపతి శేషగిరిరావు ప్రవర్తనపై వైట్ రిపోర్టు 1841 జులై 10.

గుంటూరులో రెవిన్యూ వసూళ్ళు పర్మినెంట్ సెటిల్‌మెంట్ ప్రకారం 12, 25, 458 రూ.లు వుండాలి. అది కాస్తా 5, 54, 298కి పడిపోయింది)

స్టోక్స్ గుంటూరు వచ్చిన సమయానికి స్థానికశక్తులు తమ పథకాలతో విజృంభించి నెమ్మదిగా, ప్రభుత్వానికి ఆదాయం రాకుండా నింపుకున్నారు. గ్రామాల నుండి సమాచారం వచ్చే అవకాశం స్టోక్స్‌కు లేదు. దేశస్థగుమస్తాల సహకారం లేదు. మద్రాసు మద్దతు లేదు. అన్నీ

కలసిపని చేశాయి. తన వెనుక ఏం జరుగుతున్నదో స్టోక్స్ గ్రహించలేక పోయాడు. అతని మాటలు పైఅధికారుల దగ్గర చెల్లలేదు. అతడు ముఖ్య హుజూర్‌గా నామమాత్రంగా వున్నాడు.

శేషగిరిరావు కింద మరాఠా బ్రాహ్మణ జిల్లా అధికారులు జమిందార్ల మడుగులొత్తే వారే. జమిందారు అనుభవించినవన్నీ వీరికి దక్కాయి. ప్రభుత్వం పేరిట వికేంద్రీకృత పాలన అధికారాలు చిక్కించుకున్నారు. వాటిని అదుపు చేసేవారు లేరు. హుజూర్ ఖ్యాతి వారి చుట్టూ ప్రసరించగా, రారాజుల వలె ప్రవర్తించారు. దేశస్తుని కుమార్తె పెళ్ళికి, విగ్రహావిష్కరణకు గ్రామాల నుండి డబ్బు వసూలు చేసేవారు. చెరుకూరు కరణాలు ఏడాదికి 100 రూపాయలు శేషగిరిరావుకు యిచ్చామని వెల్లడిస్తే, మిగిలిన జిల్లాలోని వెయ్యి గ్రామాల నుండి ఎంత వచ్చిందో వూహించాల్సిందే.

అదే సమయంలో గ్రామాలకు బేరసారాలలో కొంత గిట్టుబాటు అయింది. గ్రామం నుండి ఒక సబ్ ఆర్డినేట్ అధికారి డబ్బు స్వీకరిస్తే, అవినీతికి అతను బాధ్యత వహించేవాడు. నెపం పై అధికారిపై వేసి తనను రక్షించుకునేవాడు. గ్రామస్థాయి అవినీతి పాలనారంగంలో పాకితే గ్రామాధికారులు ఆ మేరకు తమను కాపాడుకునేవారు. ఈ ఆటలో ఉన్నతాధికారులు యిరుక్కునేవారు. గ్రామ ప్రభావంలో అధికారులు చిక్కుకపోయారు. చిన్న గ్రామాలలో జిల్లాపాలన బందీ అయింది.

పైస్థాయిలో హుజూర్ సిరస్తిదార్ వున్నందున అతడి స్థితి పెలుసుగా మారింది. అతనితో నెంపం ఆగింది. ఆదాయం పడిపోయి, ప్రశ్నలు జనిస్తే, అతడు జవాబుదారీ. చాలాకాలం వాతావరణ అననుకూలత, పంటలకు తెగుళ్ళు, మార్కెట్‌లోపం చెప్పేవాడు. కాని

అది అట్టేకాలం సాగలేదు. వేటుపడనే పడింది. ఉద్యోగ ఖాళీలు ఏర్పడ్డాయి. పైస్థాయిలో యివి ఎక్కువ అయ్యాయి.

గుంటూరు జిల్లా అధికారులకు యివన్నీ కొట్టినపిండి. అధికారంలో వుండగా డబ్బు చేసుకోవడం, పదవి ఎన్నాళ్ళుంటుందో అనే అనిశ్చితస్థితి వారికి రివాజు అయింది. వారి విధేయత అంతా కులానికి, కుటుంబానికే. సమతదార్లు కూడా తమ కులానికి, కుటుంబానికి, గ్రామానికి విధేయులు గనుక అలాంటి వత్తిళ్ళకే గురైనారు. డిస్మిస్ అయిన అధికారులు గుంటూరులోనూ కాకుంటే ఇతరచోట్లా మళ్ళీ పదవుల్లోకి వచ్చేవారు.



# అధ్యాయం - 13

# రాష్ట్రంలో ఇతరేతర శక్తులు

## (1842-1844)

దేశంలో కాకున్నా, మద్రాసులో జరుగుతున్న సంఘటనల దృష్ట్యా గుంటూరు పాలన దిగజారుడు స్థితిని చూడాలి. దీని సమగ్రచరిత్ర రాయవలసి వుంది. (జాన్ నార్టన్ : ఎ లెటర్ టు రాబర్ట్‌లో ఆన్ ది కండిషన్స్ అండ్ రిక్వైర్‌మెంట్స్ ఆఫ్ ది ప్రెసిడెన్సి ఆఫ్ మద్రాసు 1854 మద్రాసు) ఈ కాలంలో దక్షిణాది ఎలా వుందో గమనించాలి. 1842 తరువాత మద్రాసుప్రభుత్వం ఇతర విషయాలలో నిమగ్నమై గుంటూరును పట్టించుకునే స్థితిలో లేదు. ఈ విషయంలో లోగడ ముస్లిం, హిందూ పాలకుల పాలన పరిస్థితే బ్రిటిష్ వారికీ వుంది.

1839 తరువాత మూడు ప్రెసిడెన్సీలలో చర్చలకు, నిర్ణయాలకు యుద్ధసమస్యలు ఎదురయ్యాయి. కాబూలు బీభత్సం, ఆగ్నేయ సరిహద్దులో బ్రిటిష్ దళాల పరువు దక్కించుకోవడం, సింధు అమీర్లకు వ్యతిరేకంగా చర్యలు, దూరప్రాచ్యంలో బ్రిటిష్ వాణిజ్యానికి మద్దత్తు ప్రధానాంశాలైనాయి.

మద్రాసు దళాలు మద్దత్తుకోసం అట్టిపెట్టినందున, ఉత్తరాదికి

తరలించాల్సి వచ్చింది. కొన్ని దళాలు సికింద్రాబాద్, జబల్‌పూర్, నాగపూర్, యితర ఉత్తర సైనికస్థావరాలకు వెళ్ళాయి. మరికొన్ని సింధుకు, సింగపూర్‌కు, చైనాకు తరలాయి. బ్రిటిష్‌పాలన కింద వున్న చోట్ల మద్రాసు దళాల సమాచారానికి, అత్యవసర అవసరాలకు వినియోగించారు.

1832 తరువాత రాష్ట్రంలో తలెత్తిన తిరుగుబాట్లతో మద్రాసు సైన్యం నిమగ్నమైంది. విశాఖలో పర్లాకిమిడి, గుంసూరు తిరుగుబాట్లు, గంజాం పోరాటాలు కారణంగా కొండల్లో అడవులలో పోరాటాలకు, గెరిల్లా సమరాలకు దిగి చాలా యిబ్బందిపడ్డారు.

(డి. ఎఫ్, కారిమైకెల్ : ఎ మాన్యుల్ ఆఫ విశాఖపట్నం డిస్ట్రిక్ట్ 1869 మద్రాసు పే. 230.

టి. జె. మాల్తి : ఎ మాన్యుల్ ఆఫ్ గంజాం డిస్ట్రిక్ట్, 1918 మద్రాసు పే : 145-51)

మలబారులో మాప్లా తిరుగుబాటు వచ్చింది. కనరాలో పోరాటం తలెత్తింది.

(ఇన్ అండ్ ఎవన్స్ : మలబార్ డిస్ట్రిక్ట్ గజటేడ్ మద్రాసు 1908 పే. 83-89. లెటర్స్ ఆన్ కనరా ఇన్‌సరెక్షన్)

గంజాం, ఒరిస్సాలలో మనుషుల్ని బలియిచ్చే ఖోండ్ జాతులను మట్టుబెట్టడంలో చిక్కులు వచ్చాయి. కర్నూలు నవాబు యుద్ధపరికరాలు సమకూర్చుకొని, వహాబి కుట్రపన్నగా, కొద్ది ఎదురు పోరాటం జరిగి, జాగీర్‌ను స్వాధీన పరచుకున్నారు.

(ఎన్.జి. చెట్టి : ఎ మాన్యుల్ ఆఫ్ కర్నూలు డిస్ట్రిక్ట్ - మద్రాసు 1886 పే. 41)

మైసురులో కంపెనీకి వ్యతిరేకంగా కుట్రపన్నడంపై విచారణ జరిపారు.

(శేషగిరిరావు టు కమిషనర్ 15 అక్టోబరు 1838)

జిల్లాలో అవినీతి, కుట్రలతో పాలనావ్యవస్థ గందరగోళమైంది. కలెక్టర్ స్టోన్‌హౌస్, అతని సిరస్తిదార్ మధ్య వచ్చిన పొరపచ్చాలను పరిష్కరించడానికి 1839లో నెల్లూరుకు జార్జి కసంజర్‌ను పంపారు.

(ఎల్ఫ్‌కస్టిన్ టు కసంజర్ అండ్ స్టోన్‌హౌస్ 10 జులై 1839)

దక్షిన ఆర్కాటులో దిగజారిన పరిస్థితి చక్క బరచడానికి స్పెషల్ కమిషనర్ జాన్ డెంటన్ పంపారు.

(డబ్లు. ప్రాన్సిస్ : గజటేర్ ఆఫ్ సౌత్ ఆర్కాట్ డిస్ట్రిక్ట్ - 1906 మద్రాసు)

మధురలో రామనాథ్ జమిందార్ దివాన్‌కు హుజూర్ సిరస్తిదార్‌కు జరిగిన కుమ్మక్కిలో విపరీత అవినీతి నెలకొనగా 1842లో జార్టి డ్రూరీని పంపారు.

(ఎలియట్ టు ఎల్ఫినిస్టిన్ 1843 మార్చి 23)

1846లో రాజమండ్రి జిల్లాలో దిగజారిన పరిస్థితి కారణాలు కనుగొనడానికి సర్ హెన్రీ మాంట్ గొమరీని పంపారు. (హెన్రిమోరిస్ ఎ డిస్క్రిప్టిల్ అండ్ హిస్టారికల్ అకౌంట్ ఆఫ్ ది గోదావరి డిస్ట్రిక్ట్ ఇన్ ది ప్రెసిడెన్సి ఆఫ్ మద్రాసు - 1878 మద్రాసు) తిరునల్వేలిలో అధికార్ల మత విచక్షణపై కలహం తలెత్తింది.

(ఎ మెమోరియల్ ఫ్రం ది హిందు కమ్యూనిటి ఆఫ్ మద్రాసు టు ది కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్ 1846) ఇలాంటి వెన్నో మద్రాసు రాష్ట్రంలో తలెత్తగా పట్టించుకోవలసిన వచ్చింది.

ఎన్ ఫిన్‌స్టన్, ట్వేడేల్ గవర్నర్ల కాలంలో క్షుణ్ణంగా జరిగిందంతా తెలుసుకోవాల్సిన పనిలేదు. దక్షిణాదిలో యూరోపీయులు కొద్ది మందే గనుక, అధికారులు మరీ స్వల్పం గనుక, కట్టుగా వుంటూ గుసగులతో గడిపారు. దీని వెనుక అధికారకాంక్ష వున్నది. పాలనా ఉచ్చులు, కలం పోట్లు, చెవికొరకడం సాగిపోయాయి.

ప్రభుత్వంపై ప్రతిబింబించే వ్యవహారాలు రెండు కోణాలనుండీ చూడొచ్చు. ఎల్ఫిన్‌స్టన్ పాలనలో వాల్టర్ ఎలియట్ నిశిత పరిశీలకుడు, భావాల పుట్ట. నమ్మకస్తులైన అధికార్లకు బాధ్యతలు అప్పగించిన విశాల మనస్తత్వం గల పాలన అది. ఉదార సంస్కరణలకు తావిచ్చారు. ఆఫీసర్ల కోర్కెలను పాటించారు. ఎల్ఫిన్‌స్టన్‌తో పోల్చితే ట్వెడల్ పాలన పెళుసు, బిగుసుపోయిన రీతి కూడా. తాను మంచిదని భావించిన దానిపై గట్టిపట్టు పట్టేవాడు. వాస్తవాలకు అనుగుణంగా సిద్ధాంతాలను మలచుకోవడంలో చిక్కులు ఎదురయ్యాయి. మద్రాసులో పాలన ప్రక్షాళన చేయమని పంపిస్తే అన్నీ అనుమానాలే, నిరాశలే అతనికి. ఏవరినీ నమ్మలేక అధికారాలు అప్పగించేవాడు కాదు. తానే అన్నీ చేయబూనాడు. ఎవరిపైనా ఆధారపడకపోవడంతో, చేయలేక సొమ్మసిల్లాడు.

రాష్ట్రంలో, ప్రభుత్వ కుట్రలపై ఎలియట్, ట్వేడల్ భావాలు యిలాగున్నాయి :

ఈస్ట్‌ఇండియా కంపెనీ సేవలకు వాల్టర్ ఇలయట్‌ను అతని అత్త లేడీ ఎల్ఫిన్‌స్టన్ (12 వ లార్డ్ విధవ) సిఫారసు చేయగా, విలియం ఫుల్లర్‌టన్ ఎల్ఫిన్‌స్టన్‌నే నామినేట్ చేశాడు. 1819 జనవరిలో యిది జరిగింది. అతడు మంచి క్రీడాకారుడు. హెల్స్‌బరీ నుండి ప్రతిష్ఠాత్మక

సర్టిఫికెట్ వుంది. 1820 జూన్ 14న మద్రాసు చేరాడు. రెండేళ్ళపాటు ఫోర్ట్ సెయింట్ జార్జి కాలేజీలో భారతీయ భాషలు, చరిత్ర, లా, పాలన చదివి, చురుకుగా ఆరితేరాడు. తమిళం, హిందీలో ప్రతిభకు వెయ్యిపగోడాల గౌరవపారితోషకం పొందాడు.

(రైటర్స్ పిటిషన్స్ :

రాబర్ట్ సెవెల్ : సర్ వాల్టర్ ఇలియట్ ఆఫ్ వాల్ ఫెలి - ఎ స్కెచ్ ఆఫ్ హిజ్ లైఫ్ అండ్ ఎ ఫ్యూ ఎక్స్‌ట్రాక్ట్స్ ఫ్రం హిజ్ నోట్‌బుక్స్ - ఎడిన్ బరో 1896 పే 1-5) తరువాత తెలుగు, మరాఠి, పర్షియన్, అరబ్ భాషలలో ప్రావీణ్యత సాధించాడు.

రెండేళ్ళపాటు సేలం కలెక్టర్, మాజిస్ట్రేట్‌కు సహాయకుడుగా చేసిన తరువాత, నిబంధనారహిత ప్రాంతంలో నియమించమని అడిగాడు. పలుకు బడిగల స్నేహితుల ప్రభావంతో ధార్వాడ్ (బొంబాయి) రాజకీయ ఏజంటు.

జాన్‌థాకరేకి సహాయకుడుగా నియమితుడయ్యాడు. ఒక ఏడాదికే కిత్తూర్ రాజకీయ తిరుగుబాటును ఎదుర్కోవలసి వచ్చింది. థాకర్‌ని చంపేశారు. ఎలియట్‌ను ఆరువారాలపాటు నిర్బంధించారు. స్థానికులతో అనుభవం భారతీయ సమాజ అవగాహనకు ఉత్తరోత్తరా బాగా తోడ్పడింది. ఖైదీగా అతన్ని దయగా చూచారు. పట్టుబడిన వారిపట్ల దయతో, సహృదయతతో ఆదరించారు. వ్యక్తుల మధ్య నిర్దాక్షిణ్యాపగ చూచాడు. కులవిచక్షణ పట్టుచవిచూచాడు. విధేయతలు పరిశీలించాడు. ఇతర పాలకులకంటె లోతుపాతులతో హిందువులను అర్థం చేసుకున్నాడు. స్థానికుల ఆచారాలు, మనోభావాలు, వారిభాషలు, చరిత్ర తెలుసుకోవాలనే అతడి జిజ్ఞాస పట్ల ఎంతో ఆదరణపొందాడు. 70

ఏళ్ళ అనంతరం కూడా ధార్వాడ్‌లో అతన్ని యింకా గుర్తుంచుకున్నారు. మరాఠా ప్రాంతంలో వున్న మద్రాసీయుడతడు. అతన్ని అట్టిపెట్టడానికి ప్రత్యేక నియామకం చేసి, సర్ జాన్ మాల్కొం అక్కడే వుంచాడు. 1833లో వెళ్ళిపోయేనాటికి అతడిని వేటగాడుగా, పురావస్తుశాస్త్ర ఆసక్తిపరుడుగా చరిత్రకారుడుగా, భాషాపటిమ గలవానిగా, ప్రాచీన కళాఖండాలు అట్టిపెట్టేవానిగా పేరొందాడు.

(కల్నల్ వాల్టర్ కాంప్ బెల్ - మై ఇండియన్ జర్నల్ - 1864 ఎడిన్‌బరో పే.69-86.

1840 నాటికి దక్షిణాదిలో అతడు ప్రముఖ ఓరియంటలిస్ట్ రాయల్ ఏషియాటిక్ సొసైటీకి చాలా రాశాడు, బెంగాల్ ఏషియాటిక్ సొసైటీకి తోడ్పడ్డాడు. మద్రాసు జర్నల్ ఆఫ్ లిటరేచర్ అండ్ సైన్స్ స్థాపనకు తోడ్పడ్డాడు.)

ఎలియట్ సాహసాలలో తరువాత ఈజిప్టు ఎడారికి దారితీశాడు. నైలునదీ తీరంలో తిరిగి, డమాస్కస్, జరూసలేం, టర్కీ మీదుగా యూరోప్‌లో చాలా ప్రాంతాలు పర్యటించాడు. ఇంటివద్ద 17 మాసాలు గడిపి, తన బంధువు ఎల్ఫిన్‌స్టన్‌కు రాశాడు :

("నీవు మద్రాసుప్రభుత్వాన్ని పాలించబోతున్నట్లు చూచాను. చాలా సంతోషం. అందుకు నన్ను ఉపయోగిచుకుంటే సంతోషిస్తాను. 13 ఏళ్ళుగా నేను బయటవున్నాను. ప్రజావ్యవహారాలు బాగా అవగాహన చేసుకున్నాను. నీకు ఆంతరంగిక కార్యదర్శిగా వుండదలచాను. సైనిక వ్యక్తిని కాదు గనుక, నేను అదే చేయగలిగింది. ఈ కోరికను లార్డ్ ఎల్ఫిన్‌స్టన్ ఒప్పుకున్నాడు. వాల్టర్ ఇలియట్ టు లార్డ్ ఎల్ఫిస్టన్ 1836 ఏప్రిల్ 1" )

మస్కట్ ఇమాంకు బ్రిటన్ బహూకరించిన బోటు ప్రిన్స్‌రీజెంట్‌లో ఎలియట్, ఎల్ఫిన్‌స్టన్‌లు పయనించి, 1837 ఫిబ్రవరిలో మద్రాసు చేరారు.

1837-1843 మధ్య ఎలియట్ చాలా చురుకుగా పనిచేశాడు. రెవిన్యూబోర్డులో 3వ సభ్యుడుగా, కళాశాలబోర్డు మెంబర్‌గా, కానరీస్ భాష అనువాదకుడుగా, పర్షియన్ భాష తర్జుమా చేస్తూ వున్నాడు. వహాబీలు ఈజిప్టువారికి వైరుధ్యాల గురించి 1838 నవంబరు 24న సూయజ్ నుండి ఇలియట్ రాశాడు.

(మాల్టా వెళ్ళి పెళ్ళిచేసుకోడానికి ఇలియట్ సెలవు తీసుకున్నాడు) మూడు వారాల తరువాత మరియాహంటర్ బ్లయర్‌ను మాల్టాలో పెళ్ళి చేసుకున్నాడు. 1839లో అమరావతిలో తవ్వకాలు చేశాడు. 1840లో నీలగిరి కొండల్లో పరిశోధనలు గావించాడు. 1841 మార్చి 5న కలకత్తాలో గవర్నర్ జనరల్‌తో సంప్రదించి రాశాడు. "లార్డ్ ఆక్లండ్ నిర్దుష్ట ప్రకటన చేయలేదు. కాని నీ పథకం అంగీకరించి, మద్రాసులో టౌన్ డ్యూటీ, ట్రాన్సిట్ డ్యూటీ రద్దు చేయవచ్చు. సరిహద్దుల సుంకాలు మాత్రం అట్టిపెట్టి, మలబార్ పొగాకు గుత్తాధిపత్యం, ఉప్పు గుత్తాధిపత్యం రద్దు చేయవచ్చు."

దీనిని బట్టి గవర్నర్‌కు సన్నిహిత సలహాదారుగా ఎలియట్ వున్నాడు. రెవిన్యూ బోర్డులో ఆయన అంతగా వుండకపోవచ్చు. బోర్డు భారాన్ని తగ్గించడానికి 4వ సభ్యుడుగా కృషి చేశాడు. తరువాత వచ్చిన గవర్నర్ లార్డ్ ట్వేడల్ (1842 సెప్టెంబరు 24) గమనించినట్లు ఎలియట్ రెవిన్యూ, న్యాయకార్యదర్శిగా, లార్డ్ ఎల్ఫిన్‌స్టన్ మార్గదర్శకుడుగా వున్నాడు.

(1842 నవంబరు 26 ఎలెన్‌బరోకు - ట్వేడల్)

కొత్తగవర్నర్ చాలా మందకొడిగా సాగాడు. స్పష్టతలేదు. పాక్షిక,

అసంబంద్ధ భావాలతో వున్నాడు. వివేచన పాటించక, తన భావాలనే పట్టుకుకూర్చున్నాడు అని ఎలియట్ భావించాడు. లషింగ్టన్, జె.బర్డ్ వలెగాక, ట్వేడల్ బాధ్యత లంటే భయపడ్డాడు. కౌన్సిల్ టేబుల్ వద్ద చర్చలలో స్వల్పఖర్చుల వద్దే భయభ్రాంతులు వెల్లడించడంచూస్తే, గమ్మత్తు అనిపిస్తుంది. పరిపాలనలో అన్నిటి కుట్ర మాత్రమే ఆయనకు ఎదురైంది అని ఎలియట్ రాశాడు.

1825లో కర్నాటక నవాబు చనిపోయిన తరువాత, చేపాక్ పాలెస్‌ను, దర్బారు వ్యవహారాలను అతని సోదరుడికి అప్పగించారు. పసి వారసుడు యువకుడయ్యే వరకూ ఆ ఏర్పాటు చేశారు. 1842లో యువ నవాబుకు అర్హత వచ్చింది. అప్పటికి నయాబ్ బాగా డబ్బు మింగేశాడు. ప్రభుత్వం సంజాయిషీ కోరింది.

రిటైర్ అయిన కౌన్సిల్‌సభ్యుడు ఛార్లస్ లషింగ్‌టన్‌కు విచారణ అప్పగించారు. ప్రధాన కార్యదర్శి హెన్రీ చామియర్‌ను సంజాయిషీ అడిగి, 15 ఏళ్ళుగా సచివాలయంలో వుంటూ కూడా జరిగిన దుర్వినియోగాన్ని ప్రభుత్వదృష్టికి ఎందుకు తీసుకరాలేదని చెప్పమన్నారు. అతడు చురుకైన, జాగ్రత్తవహించిన అధికారి. ఛాంబర్ పత్రాలన్నీ బయటపెట్టాడు. స్టీవన్ రంబోల్డ్(లషింగ్ టన్) దర్బారుపై పూర్తిగా అజమాయిషీ కోల్పోయాడని తెలిపాడు. ఎఫ్. ఆడం అతన్ని రిలీవ్ చేయకముందే అలా జరిగింది. కౌన్సిలర్ సోదరుడు స్టీఫెన్‌ను ఆకాశానికెత్తి చూపినదంతా గాలిమూట అన్నారు. వారుసులపై మోపిన నిందారోపణలకు అతడు భాగస్వామ్యం వహించాలన్నాడు. నయాబ్ దుష్ప్రవర్తన ఆడం ప్రభుత్వానికి తెలుసునని కూడా బయటపెట్టాడు. నవాబ్ కుటుంబంలో అంతకుమించి అర్హుడు లేడు. కనుక గుడ్డిలో మెల్లగా అతన్ని అడ్డంపెట్టుకున్నారన్నాడు. ఈలోగా కర్నాటక సర్కారీ వ్యవహారాలు

గందరగోళ స్థితిలో పడ్డాయి. నెలలుగా జీతాలివ్వలేదు. చేపాక్‌భవనం అంతా అపనమ్మక వ్యవస్థలో వుంది. ఇతర నవాబుల దారిలోనే యువనవాబు కూడా సాగిపోయాడు.

గవర్నర్, కొత్త కౌన్సిల్ సభ్యుడు చావిన్‌కు అభిప్రాయభేదం ఏర్పడింది. చామిమర్‌ను పిలిచి రద్దు చేసిన డ్రాఫ్టులను, పబ్లిక్‌పత్రాలను, ఇన్నాళ్ళు దాచి ఆయుధాలుగా ప్రయోగిద్దామనుకున్న వాటిని వెలికి తీయమన్నాడు. గవర్నర్ తన మినిట్‌లో చామియర్‌పై చాలా హాని చేసే వ్యాఖ్యానాలు చేశాడు. ప్రభుత్వ తోకకు రేకు డబ్బా తగిలించినట్లయింది. ఆ విధంగా జరిగిన గందరగోళం పట్ల నవ్వుకుంటూ లషింగ్టన్ వెళ్ళిపోయినట్లు ఎలియట్ గమనించాడు.

కొత్తరాజ్యం పగ్గాలు పట్టింది. నగరానికి వెలుపల గిండీలో ట్వేడల్ కొలుపు తీర్చాడు. చుట్టూ వందిమాగధ స్నేహితులున్నారు. సముద్ర సుంకాల కలెక్టర్ విలియం అండర్ వుడ్ వారికి నాయకుడు. వీరింతా లెవియదన్‌కు యిరికించి ఆటాడించినవారే. రేవులో వ్యవహారాలు మరీ దిగజారిపోయాయి.

(సెక్రటేరియట్‌లో జరిగే దోబూచులాటలో ఎలియట్ తాత్కాలిక ప్రధాన కార్యదర్శి. పైగా తాత్కాలిక రెవిన్యూ, న్యాయ కార్యదర్శిగూడా. క్లర్క్ సీనియర్ అధికారి థామస్ అనుకూలుడుకాకున్నా మతప్రచారకుడు)

చామియర్ చిత్తశుద్ధిలేనివాడు. నోరుమూసుకుంటే మంచివాడే. కాని అలా వుండలేదు.

(ఎలియట్‌ను ఛీఫ్ సెక్రటరీగా వుంచబోమని, ఆయన సేవలు అవసరం లేదని చెప్పేశారు)

కొత్తప్రధాన కార్యదర్శి జాన్ థామస్ సమర్థుడు, ముక్కుసూటి మనిషి. రాబర్ట్ క్లర్క్‌ను కాదని అతన్ని నియమించడం కావాలని చేశారు. సీనియారిటి, అనుభవాన్ని బట్టి క్లర్క్ అర్హుడు. క్లర్క్ రాజీనామా చేసి ఇంటి ముఖం పట్టాడు. కైరోలో ఎల్ఫిన్‌స్టన్‌ను కలిశాడు. నిర్మాణాత్మకంగా చేసేదేమీ లేక ఎలియట్ రెవిన్యూబోర్డుకు సంతోషంగా వెళ్ళిపోయాడు. అది వదలాలని అతడు ఎన్నడూ భావించలేదు. మరియు ఎలియట్ ప్రకారం అతడక్కడ ప్రశాంతంగా, జాగ్రత్తగా గడిపాడు.

రెవిన్యూబోర్డు నుండి కూడా పరిస్థితి ఏమంత సరిగా అనిపించ లేదు ఎలియట్‌కు. వాతావరణమంతా అపనమ్మకంతో, కుట్రలతో, సంకుచితంగా మారింది. డ్రూరీ మధురైలో వున్నాడు. కలెక్టర్ బ్లాక్ బర్న్ సస్పెండ్ అయ్యాడు. జాన్ థామస్ సెక్రటేరియట్‌లో వూపిరాడని పనిలోపడ్డాడు. అతడు చివరకు అనామకస్థితికి పోయాడు. రెవిన్యూబోర్డు సభ్యత్వం నుండి మాంట్‌మౌరి తొలగించబడ్డాడు. తంజావూరుకు పంపిస్తే, హెూంశాఖ నుండి ట్వేడల్‌కు తీవ్ర అభ్యంతరాలు రాగా రాజమండ్రి జిల్లాకు విచారణ నిమిత్తం పంపేశారు.

ఇలియట్ యిలా రాశాడు.

"ఇదంతా చాలా హానికరం. ట్వేడల్‌పై చాలా గూడుపుఠాణి సాగింది. వారెవరో తెలియదు. తెలుసుకున్న దాన్ని బట్టి ఎవరో సమాచారం చేరేశారు."

ఇంకారాస్తూ :

"స్వదేశంలో నీపై చాలా వ్యతిరేక ప్రభావంవుంది. తప్పుడు సమాచారంపై దాడిసాగింది. అనధికార ఆధారాలు ముఖ్యంగా వచ్చాయి. సర్‌జేమ్స్ లషింగ్టన్ తీవ్ర వ్యతిరేకత చూపాడు. అతని సోదరుని కారణంగా

యిది జరిగింది. సర్‌జేమ్స్ పట్టుదల వలన నిన్ను వెళ్ళిపొమ్మన్నారు. నీవు దీనికి వ్యతిరేకంగా ప్రకటన చేయలేదు. కనుక శత్రువులదేపై చేయి అయింది. ఈ విషయాలు పట్టించుకుంటేమంచిది. నీ ప్రతిష్ఠ శాశ్వతంగా దెబ్బ తినకుండాచూచుకో."

(1843 మార్చి 25)

1843లో అకౌంటెంట్ జనరల్ ఆఫీసులో దుష్టవ్యవహారాలు, సదర్ అదాలత్, సుప్రీంకోర్టు బాహాటపోరాటం, మిలటరీబోర్డు పెల్లుబికిన గొడవలు ప్రధానకలహాలుగా పేర్కొనవచ్చు.

అసలు గొడవ మిలటరీబోర్డులో చూడాలి. అసమర్థ కార్యదర్శి మోబర్లేస్థానంలో ఎల్ఫిన్‌స్టన్ ప్రవేశించినప్పుడు, బోర్డుకు మెక్‌నైల్‌ను నియమించినప్పుడు, మోబర్లె ఫిర్యాదు చేశాడు. అతన్ని తిరిగి నియమించమంటూనే, ఎలాంటి ఖాళీస్థానం కూడా డైరెక్టర్ల కోర్టు చూపలేదు.

సెక్రటరీ విధుల్లో మిలటరీబోర్డు ఎందుకు జోక్యం చేసుకున్నదని ట్వేడేల్ ఆరాతీశాడు. మిలటరీ పరికరాల అధికారిక అంచనాలతో కూడిన స్టాక్ పుస్తకాలను గత సంవత్సరం నుండి కేవలం మార్పిడి చేశారని, సెక్రటరీకి ఆ విషయమే తెలియదని బోర్డు జవాబిచ్చింది. ఇదిగాక 23,000రూ.ల వరకు మోబర్లే మార్పులు చేశాడని, మరో 70,000 రూ.లు వదిలేశారని, 50,000 రూ.ల విలువగల ఉక్కుపరికరాలను పట్టించుకోలేదన్నారు. కమిషనరేట్‌లో పరిశీలిస్తే 105 లక్షలరూపాయల మేరకు దోషాలున్నాయన్నారు.

1843లో వ్యవహారమంతా ప్రభుత్వదృష్టికి వచ్చింది. సిం, మెక్‌నెల్ హెూరాహెూరి పోరాడుకున్నారు.

(మిలటరిబోర్డులో సిం సభ్యుడు)

మోబర్లే సౌశీల్యం, అతని గుమాస్తాల విషయంలో ఆరోపణలేదు. రెండుమాసాల తరువాత మెక్‌నెల్‌ను గవర్నర్ డిస్మిస్ చేశాడు. మెక్‌నెల్‌ను తిరిగి చేరమని, అతను కేవలం ఉత్తరువులు పాటించాడన్నారు.

తొలిదశలో మెక్‌నెల్‌కు డైరెక్టర్లకోర్టు నుండి విమోచనలేదని ఎలియట్ భావించాడు. హెూంశాఖ అధికారులు వ్యక్తిగత భావాలతో వ్యవహరించారని, ఎల్ఫిన్‌స్టన్ ప్రభుత్వంలో ముఖ్య నిర్ణయాలు గమనించడంలో యిదే కనిపించిందని ఎలియట్ తలపోశాడు. రికార్డులో లేకుండానే ప్రైవేట్ సిఫారులతో కోర్టు ఉత్తరువులు యిచ్చారన్నారు.

"ఇదంతా చూస్తుంటే, పరిస్థితులు, కోర్టువున్న తీరు ఎలాంటి విమోచన కలిగించదనిపిస్తోంది. కంట్రోలుబోర్డు చేబడితే తప్ప, ఆశలేదు. అసహ్యమైన చామియర్ కాస్తా గవర్నర్‌తో అంగీకరిస్తున్నాడు. మక్‌నెల్ అంటే అతడికి ద్వేషం. ఒకరినొకరు మర్యాదగా పలకరించుకోలేని స్థితిలో వున్నారు. మోబర్లేతో కూడా చామియర్ స్నేహపాత్రుడే."

(ఎలియట్ టు ఎల్ఫిన్‌స్టన్ 1843 నవంబరు 25)

మరో ఏడాది యీ వ్యవహారం సాగగా మోబర్లే అసమర్థత చూచి కోర్టు కలవరపడింది. విషయాలు బయటపడగా, ఇంగ్లాండ్ నుండి వత్తిడిరాగా, కోర్టు తన అభిప్రాయాలు మార్చుకోవలసి వచ్చింది. సైనికబోర్డులో మార్పుల్ని పునరాలోచించమని ట్వేడల్‌డేని అడిగారు. అంతటితో మద్రాసు వ్యవహారం పూర్తిఅయింది.

ఎత్తుగడలు, కుట్రలు గమనించి విసిగిన ఎలియట్‌కు గవర్నర్ తన అభిప్రాయం యింకా స్థిరపడింది. ట్వేడేల్ స్వయంగా ఆలోచించ

గలిగితే ఎంత బావుండననుకున్నాడు. కాని అతని అజ్ఞానం, ఆడంబరత్వం, తప్పుడు నిర్ణయాలకు దారితీశాయి. అతనికి అనుమానం ఎక్కువ. వెనుకచక్రం తిప్పినవారు లేన్, అండర్‌వుడ్‌లు. ప్రైవేట్ కార్యదర్శిగా లేన్ బాహాటంగా చెప్పేవాడు. విలియం అండర్ వుడ్ అసహ్యమైన, ముఠాతత్వం గలవాడు. జాన్ థామస్ ఒక్కడే వున్నత స్థానంలో గౌరవపాత్రుడు. ప్రభుత్వంలో అతనిమాట వినలేదు. డిండీనుండి తొలగించబడిన హెన్రీచామియర్ ప్రతిదానికీ అడ్డంగా రాసేవాడు. చామియర్ మినిట్స్ రికార్డుల నుండి తొంగిచూచి, గవర్నర్‌కు ఎసరు పెట్టేవి.

సైనిక తిరుగుబాటు అవలైట్ కావల్రీలో, 47వ దేశీయ కాల్బంలో జరగనున్నదని మాటల్లో వార్త వచ్చింది. ఎల్ ఫిన్‌స్టన్ మద్రాసుసైన్యాన్ని ప్రసిడెన్సీలో వారి స్థావరాలకు వచ్చేయమన్నాడు. ఇదంతా చూచి ఎలియట్ కలవరపాటుతో రాశాడు :

లార్డ్ ట్వేడేల్ సైనికధోరణి గమనించి ఉత్తరువులిస్తే బాగుండేది. కేవలం అసంతృప్తి సృష్టించడానికే ప్రయత్నించాడు. వెల్లింగ్టన్ డ్యూక్ చిత్తశుద్ధితో వ్యవహరించకపోవడం మరొకదారుణం. అసమర్థుడైన వ్యక్తిని వెల్లింగ్టన్ పంపాడు. ప్రెసిడెన్సీలో జరిగే చిన్న విషయాలను వీరు పట్టించుకోరు. ట్వేడేల్ కేవలం సైన్యంలో తిరుగుబాటుకు, అలజడికి దారితీశాడని ఎలియట్ రాశాడు.

ఎల్ఫిన్‌స్టన్, ఎలియట్‌లు గర్విస్తున్న అనేక రంగాలలో ప్రతిష్ఠంభన జరిగింది. పశ్చిమ రహదారిలో, వాలజానగర్ రైలుమార్గంలో పని ఆగింది. విద్యారంగంలో యూనివర్శిటీ, మెడికల్, ఇంజనీరింగ్ కళాశాలల్లో, ప్రావిన్షియల్ స్కూళ్ళలో ప్రగతిఆగింది. కాలేజీలలో ఖాళీలు నింపలేదు.

ఆ విషయంలో ప్రభుత్వ ఉత్తరువులు ఆపేశారు. 1842 విద్యాసంవత్సర నివేదిక సైతం అచ్చేయడానికి అనుమతి యివ్వలేదు.

(ఎలియట్ టు ఎల్ఫిన్‌స్టన్ - 1844 జనవరి 23 - ట్వేడేల్ ముగ్గురు కుమార్తెలు వరుసగా 2వ లార్డ్ వెల్లింగ్టన్, లార్డ్ రిప్పన్, రానున్న గవర్నర్ జనరల్ లార్డ్ డల్‌హౌస్‌ను పెళ్ళాడినట్లు ఎలియట్‌కు తెలియకపోవచ్చు.)

1843 చివరలో విద్యావిషయ దుస్థితి గమనించి ఎలియట్ రాశాడు. యూనివర్శిటి వ్యవహారాలపై ప్రభుత్వం నోట్ రాసింది. గత 20 ఏళ్ళుగా యూరోప్‌లో జరుగుతున్న విద్యాప్రగతిని గమనించామన్నారు. యూనివర్శిటీ విద్యపై ప్రభుత్వ ఆంక్షలతో విసిగెత్తిన ఎలియట్, కాలేజి బోర్డు నుండి రాజీనామా చేశాడు. అతన్ని అనుసరించి అడ్వొకేట్ జనరల్, మద్రాసు సమాజంలో బాగా గౌవరపాత్రుడు జాన్ నార్టన్ కూడా రాజీనామా చేశాడు.

ట్వేడల్ మార్క్విస్ ఒక సైనికుడు. 1812 యుద్ధంలో కెనడాలో పనిచేశాడు. అప్పుడు వెల్లింగ్టన్ కింద పెనిన్సులకే యుద్ధం అది. ఇండియాలో పని చేయాలనుకున్నాడు. ప్రభుత్వ బాధ్యతలు చేపట్టిన ట్వేడల్ కంట్రోలుబోర్డు ప్రసిడెంట్‌కు రాస్తూ (లార్డ్ పిజ్జరాల్డ్) ఏం జరుగుతుందో అర్థంకావడం లేదన్నాడు. కొత్తగవర్నర్ వచ్చినప్పుడు జనం ఆదరంగా చూస్తారు. వెనుక ఏముందో అర్థం కాదు. ఉద్యోగాలకోసం ఎదురుచూడడం కద్దు. ఆశ్రితపక్షపాతం వుంది. కాని సత్తాచూపందే ఉన్నతస్థాయికి పంపడం కుదరదు. గవర్నర్ పథకానికి హోంశాఖ పక్షపాతం అడ్డొచ్చింది.

ట్వేడల్‌కు తొలుత కార్యదర్శులతో ఘర్షణ వచ్చింది. తన ముందున్న వ్యక్తి నియామకాలన్నీ తాత్కాలికంగా నింపేశాడు. వాటిని కొనసాగించడం

కుదరదు. చామియర్ ఎప్పుడూ గిండిలో వుంటున్నందున ఆయన్ను బెంగుళూరు పంపారు. క్లర్క్‌ను తాత్కాలిక ప్రధానకార్యదర్శి చేశారు. ఎలియట్‌ను తాత్కాలిక రెవిన్యూ న్యాయ కార్యదర్శి చేశారు. వీరు చాలా ఆధారపడదగినవారన్నారు. కాని కొంచెంసేపు మాట్లాడిన తరువాత వారు నమ్మదగిన వారు కాదని స్పష్టపడింది. సిఫారసు లేఖలు అవతలపెట్టాను. లోగడ విచారణలపై కార్యాలయం ఏమీ చేయక, బాధ్యత తీసుకొనక, సమాచారాన్ని అందివ్వక, అధికారప్రతాన్ని దాచిందని ట్వేడల్ అన్నాడు.

నవాబ్ మైనారిటి హయాంలో దర్బారు దుష్టపాలనకు కంపెనీదే బాధ్యత. చార్లస్ లషింగ్టన్ సహాయపడకపోతే సరైన సమాచారం అందకపోయి వుండును. ఎల్ఫిన్‌స్టన్ ఒక వారం ముందు నియమించిన మస్నాద్ ఏజంట్ స్థానే, నవాబ్ నమ్మకస్తుడిని పెట్టారు. యూరోప్ వుద్యోగుల పదవీ తాపత్రయం వలన దేశీయులలో విశ్వాసం సడలి, వెధవ వేషాలకు తావిచ్చింది. (ట్వేడల్ యిదంతా ఫిర్జరాల్డ్‌కు రాశాడు.)

ఎకౌంటెంట్ జనరల్ కార్యాలయంలో సంక్షోభంలో సెక్రటేరియట్ సరిగా లేదు. లెక్కలన్నీ సరిగి చూడకపోవడంపై విచారణ జరపమని 1841లో కోర్టు యిచ్చిన ఆర్డర్‌ను ట్వేడల్ దృష్టికి రానివ్వలేదు. 3,70,000 రూ.ల ఖర్చు రద్దు చేయమంటూ ఎకౌంటెంట్ జనరల్ వచ్చి గవర్నర్‌ను కోరాడు. అక్రమ జమాఖర్చులపట్ల విస్తుపోయి, అజ్ఞాన విధానాలపట్ల ఆశ్చర్యపడ్డాడు. వసూలు చేయలేని వాటిని రద్దు చేయమని లోగడ రాసిన విషయం ఆయన దగ్గరపెట్టారు. లోగడ కోర్టు ఛైర్మన్ జేమ్స్ లషింగ్టన్‌కు గవర్నర్ రాస్తూ, కోర్టు రాసిన ఉత్తరాలన్నీ తన ముందుంచమనీ, వాటిని పాటించలేదనీ, తాను కార్యదర్శులకు చెప్పిన

దానికి యిది విరుద్ధమనీ అన్నాడు. మీరు చెప్పినా చెప్పకున్నా తెలుసుకుంటానన్నాడు.

మద్రాసులో వివిధ శాఖల పని తీరుబాగాలేక, మార్పులు చేశారు. కేంద్రపాలన కుదిపేశారు. కౌన్సిల్ నుండి లషింగ్టన్ వెళ్ళిపోవడం విచారకరం. ట్వేడల్‌కు మిగిలిందల్లా అతన్ని సమర్థించే బర్డ్, డ్రురీ మాత్రమే. కౌన్సిల్‌లో చామియార్ బదులు డ్రురీ, లేదా థామస్‌ను కోరాడు. వారిని సెక్రటేరియట్‌లో పెట్టారు. 1843లో భారమంతా థామస్ భరించాడు. థామస్ చాలా కృషి చేశాడని ట్వేడల్ అన్నాడు.

గవర్నర్‌గా 5 మాసాల తరువాత సమస్యలను సమీక్షించి, అవ సరాలు సూచించాడు. క్రమశిక్షణతో, అర్హత స్థానాలలో ఉద్యోగులను పెట్టి, కార్యాలయం అభివృద్ధి పరచదలచాడు. మద్రాసు. లండన్ మధ్య అంతరం తగ్గించదలచాడు. పిర్జరాల్డ్‌కు యిదంతా రాశాడు. ఎస్టర్ హౌస్‌లో వున్న నిబంధనలే మద్రాసులోనూ పెట్టాలన్నాడు. ఇండియాలో కూడా ఇంగ్లండ్ పద్ధతులు వర్తిస్తాయన్నాడు.

ప్రజలకు భారం తగ్గించడం ప్రభుత్వ బాధ్యత. దేశీయ ఉద్యోగులు దేశీయుల నుండి డబ్బు గుంజుతున్నారు. అన్ని వస్తువులలో అదనపు చార్జీలు వసూలు చేస్తున్నారు. దోషులుకాని తహసిల్దారు లేరు. అయినా కలెక్టర్లు వారిని అట్టిపెట్టారు. రెవిన్యూ పనుల్లో భారత ఉద్యోగులు దోషులైనా వారికి పై పదవులు యివ్వడం తగదన్నాడు. యూరోప్ ఉద్యోగులు అక్రమ వసూళ్ళు చేస్తే అడ్డుపడినట్లే, భారతీయులపట్ల కూడా వ్యవహరించాలి.

యూరోప్ ఉద్యోగులు కూడా దోషులే. కౌన్సిల్ సభ్యులు బోర్డు సభ్యులు, మద్రాసులో కార్యాలయాలు క్రమశిక్షణ పాటించడం లేదు.

స్నేహితుల్ని, బంధువుల్ని వెనకేసుకొస్తూ పాలనలో బాధ్యతల్ని మరచి పోతున్నారు. క్షేత్రంలో వుండగా గవర్నర్‌ను ప్రభావితం చేయడానికి చేసే ప్రయత్నం, కార్యాలయం బాగు పరచడంలో చూపలేదు.

కంపెనీ ఉద్యోగులు విధులు సరిగా నిర్వహిస్తే, భారతీయుల్ని కూడా నియమిస్తూపోవచ్చు. ట్వేడల్ సూచిస్తూ తరచు బ్రిటిష్‌సైన్యం, నౌకాదళంలో తనిఖీ జరిపినట్లే, దేశంలో కూడా ప్రవేశపెట్టాలన్నాడు.

1843 మే, జూన్ నాటికి ట్వేడల్ సంస్కరణలు యిబ్బందులను ఎదుర్కోవలసి వచ్చింది. మొత్తం ప్రక్షాళన గావించి, తిరగదోడాలనే ధోరణికి కౌన్సిల్‌లో ఒకరు అడ్డుపడ్డారు. కార్యదర్శులుగాక, గవర్నర్ పాలించాలనే దానికి సుముఖత రాలేదు. జేమ్స్ లషింగ్టన్‌తో చెబుతూ మనుషులు మంచివాళ్ళేగాని, యథేచ్ఛగా పోనివ్వడంతో అదుపు తప్పారన్నారు. మద్రాసులో బాధ్యతల్ని చూసి గవర్నర్ ఆశ్చర్యపడ్డాడు. ఆఫీసు విధులకు వ్యక్తిగత విషయాలకు తేడాలేకుండా పోయింది. కోర్టు ఉత్తరువులను గవర్నరే స్వయంగా అందచేసే పరిస్థితి వచ్చింది. ట్వేడల్ ప్రకారం సిద్ధాంతానికి ఆచరణకు సంబంధంవుండాలి.

ఒక నెలకు అతను అలసిపోవడం మొదలైంది. రోజంతా పనిచేసి, సాయంత్రం వినోద విందు చేస్తే, తనకు ఎవరిపట్లా ద్వేషంలేదని భావిస్తారనుకున్నాడు. ప్రతిశాఖనూ స్వయంగా అదుపు చేయాలని చూచాడు. యాంత్రికంగా పని జరగాలని ట్వేడల్ ఉద్దేశం.

ట్వేడల్‌కు వ్యతిరేకంగా గూడుపుఠాణీలు పథకాలు సాగాయి. భారతీయ రీతిలో కార్యాలయపని సాగిద్దామనుకున్నాడు. కాని మనస్సు మార్చుకొని, కుట్రలకు వ్యతిరేకంగా బాహాటంగా సమావేశాలే నయం అనుకున్నాడు. గవర్నర్ ఎదుర్కొనే చిక్కులు తెలియాలంటే జరిగేవన్నీ

బయటపెడితేచాలు. ఇదే విషయాన్ని గవర్నర్ పదే పదే చాటాడు. కంట్రోలుబోర్డుకు అధ్యక్షుడుగా లార్డ్ ఫిజ్జరాల్డ్ తరువాత లార్డ్ రిపన్ వచ్చాడు. గవర్నర్ అతనికి రాస్తూ, మద్రాసులో వుంటూ, కుతంత్రాలు ఎలా ఎదుర్కొన్నానో మీకు తెలియదన్నాడు. ప్రభుత్వం పట్ల యూరోప్‌లో వున్న భావాలు విస్మరించి వ్యవహరించే వారిపట్ల అప్రమత్తతతో వుండాలి. 1845లో రిచ్‌మండ్ డ్యూక్‌తో యీ విషయాలే చెప్పాడు. ఏ పని తలపెట్టినా, గవర్నర్ కాలంలో సగం అందుకే వినియోగించాలి. కుతంత్రాలు దుర్భరం.

(1845 ఫిబ్రవరి 23 రిచ్‌మండ్ కలెక్షన్స్ చిచెస్టర్ : కౌంటీ రికార్డు ఆఫీసు, గుడ్‌వుడ్ ఆర్కిల్స్)

1846 నాటిని కుతంత్రాల పరాకాష్ఠ గమనిస్తే, గవర్నర్ ప్రతిదీ చూడాల్సినస్థితి వచ్చింది. నిర్ణయాలు నిలిచిపోయాయి.

1845 నాటికి ట్వేడల్ రాస్తూ ఇండియాలో తనకు అవకాశం లేదని, ఫీల్డ్ కమాండ్ అవకాశం కూడా లేదని, మద్రాసులో గానుగెద్దు జీవితం తప్ప ఇంకేమీ మిగలలేదన్నాడు.

(గుడ్ వుడ్ ఆర్కివ్స్ - కౌంట్ రికార్డు ఆఫీస్ : చిచెస్టర్)

గవర్నర్‌పై వత్తిడులు పెరిగాయి. స్థానికపత్రికలు అతనిపై విమర్శలు ఎక్కుపెట్టాయి. ఇంగ్లండ్‌లో విమర్శలు వచ్చాయి. లార్డ్స్ హౌస్‌లో అతన్ని దుయ్యబట్టారు. ప్రభుత్వమద్దత్తుతో నడిపే స్కూళ్ళలో మత విచక్షణ చూపాడనేది, మద్రాసు సైన్యంలో తిరుగుబాటకు చోటు యిచ్చాడనీ అన్నారు.

గుంటూరులో పాలనావ్యవస్థ దిగజారడంపై చర్యల అనంతరం యిదంతా తలెత్తింది.

(ట్వేడల్ మతప్రచారకుడు. మతకార్యకలాపాలు వెనకేసుకొచ్చాడు. 1845-1848 మధ్య అతని లేఖలన్నీ మత వివాదాల గురించేవున్నాయి. మ్యాల్కొంలెవిన్ అతని విమర్శకుడు. దేశీయమతాలలో ప్రభుత్వజోక్యం తగదని ట్వేడల్ భావన. తిరునల్వేలిలో అతడు ప్రైవేట్‌గా మద్దత్తు యిచ్చిన విషయమై వ్యతిరేకత వచ్చింది.

ప్రొసీడింగ్స్ ఎట్ ఎ పబ్లిక్ మీటింగ్ ఆఫ్ ది హిందు కమ్యూనిటి - ఆఫ్ మద్రాస్ ఆన్ 7 అక్టోబర్ 1846 - మద్రాసు. ది హిందూ ప్రెస్ 1846)

ఈ సంఘటనల ప్రభావం రెవిన్యూబోర్డుపై పడింది. 1841లో జాన్ సలివన్, చార్లస్ కాటన్ వెళ్ళిపోయారు. చార్లస్ లషింగ్టన్ అధ్యక్షుడయ్యాడు. జార్జిడ్రురి రెండో సభ్యుడయ్యాడు. వాల్టర్ ఇలియట్ మూడో సభ్యుడు. అలెగ్జాండర్ మక్లీన్ నాలుగో సభ్యుడు.

1838లో మక్లీన్‌ను 4వ తాత్కాలిక రెవిన్యూబోర్డు సభ్యునిగా ఎల్ఫిన్‌స్టన్ నియమించాడు. తన ప్రైవేట్ కార్యదర్శిగా వాల్టర్ ఇలియట్ ముమ్మర పనిలో వుండగా బకాయిలు తొలగించే పనికి మక్లీన్‌ను ఉద్దేశించారు. 1835 నుండే తన జిల్లా చెంగల్పట్టుకు దూరంగా వుండడానికి, మక్లీన్‌కు యిదొక సాకు. క్షేత్రంలో కష్టించి పనిచేయక, గవర్నర్‌పై తన ప్రమోషన్‌కు వత్తిడి చేస్తూ పోయాడు. మలబాదు కలెక్టర్ పదవి యిష్టంలేదు. బోర్డులో డ్రురీ నియామకానికి అభ్యంతర పెట్టాడు. సీనియర్ల దోషాలు వెతికి, తనకు నియామకం యిమ్మన్నాడు.

(ఎల్ఫిన్‌స్టన్‌కు మక్లీన్ 1840 ఫిబ్రవరి)

1843లో బోర్డులో 2 ఖాళీలు వచ్చాయి. డ్రురి ప్రధానకార్యదర్శి అయ్యాడు. మౌంట్‌గొమరి ఉత్తరసర్కార్లు (ముఖ్యంగా రాజమండ్రి)

కమిషనర్ అయ్యాడు. యాండ్రూ రాబర్ట్సన్ 2వ సభ్యుడయ్యాడు. మక్లిన్ ఉప్పుకోర్టులో తాత్కాలిక రెండో జడ్జిగావున్నాడు. డికిన్సన్ అనారోగ్యంతో కొండప్రాంతాలకు వెళ్ళాడు.

రెవిన్యుబోర్డు ఆఫీసుకు కార్యదర్శిగా థామస్పై క్రాఫ్టను నియమించ మని గవర్నర్ను జానడెంట్ కోరాడు. ఎడ్వర్డ్ లోవెల్ను బోర్డులో నియమించారు.

బోర్డు సమస్యలు పై వివాదాల చర్చ 1837 నుండీ సాగుతున్నది. జాన్బర్డ్, హెన్రీ చామియర్లు విరుద్ధపోరాటాల్లో దిగారు.

1843 మే 5న చామియర్ వాదిస్తూ బోర్డుకు తగిన సహాయం కావాలన్నాడు. 1837 నుండీ వస్తున్న వాదనబట్టి, సమిష్టి బాధ్యతలుగాక, వ్యక్తుల మధ్య బాధ్యతలు అప్పగించాలన్నాడు.

చామియర్, బర్డ్ మధ్య వాదాలు సాగాయి. లోగడ వున్న ఏర్పాట్లనే ట్వేడల్ సమర్తించాడు. సభ్యత్వంపై సూక్ష్మ చర్చ సాగింది.

బోర్డు లోపాలు కారణంగా 1843లో ఎలియట్కు విశ్రాంతి లేకుండాపోయింది. మరోపక్క బోర్డులో పేరుకపోయిన పనిచూచి, 1844 మే 17న మరో మినిట్ రాశాడు చామియర్. గవర్నర్ ఎన్ని నివేదికలు అడిగినాసరే, సభ్యుల మధ్య పని విభజించకపోతే ఉపయోగం లేదన్నాడు. పేరుకపోయిన పనిపట్ల బర్డ్ చామియర్లు విచారించినా, బోర్డును ఖండించలేక పోయారు. మిగిలిన పనిపూర్తి అయ్యేవరకూ 4వ సభ్యుడి సేవలు అందుకోవచ్చన్నారు.

బోర్డుసభ్యులు విధుల్ని అశ్రద్ధచేసి వుండాలి. లేదా రెవిన్యూబోర్డు పద్ధతే అసమర్థం అయి వుండాలని గవర్నర్ భావించాడు. అసమర్థత

అంతర్గతంగావుందా, లేక ఆచరణలో పరిష్కారాలు కనుగొనగలదా అనేది చూడాలన్నారు. అసలు అన్ని పనులు పేరుకపోనివ్వాల్సింది కాదు. ఈ సమస్యను ఎలా పరిష్కరించాలో వ్యవస్థను మార్చడం ఏ విధంగా అనేది గవర్నర్‌కు తేలలేదు. పేరకుపోయిన పనిముగించాలని బోర్డు సభ్యులు కృషిచేశారని గవర్నర్ అన్నాడు. (మినిట్ బై లార్డ్ ట్వేడల్ 1844 ఆగస్టు 3 - ట్వేడల్ కలెక్షన్స్ - Tweeddele Colection 1844 సెప్టెంబరు 24)

అయినా కొన్ని జిల్లాలనుండి ప్రభుత్వానికి నివేదికలు పంపకుండా జాప్యం చేయడం ఆశ్చర్యకరం అన్నాడు. బోర్డుకు 12 మాసాలక్రితం పంపిన మధుర రెవిన్యూపాలనా నివేదిక ప్రభుత్వానికి చేరనేలేదు. బోర్డుపని క్లిష్టమైనదని అంగీకరించాల్సిందే. రెండేళ్ళుగా ముఖ్యవిషయాల చర్చలో బడినబోర్డు సాధారణ పాలన పట్టించుకోలేకపోవడం సహజం. ఈ పరిస్థితులపట్ల ప్రభుత్వం సహనం చూపాలి. పరిస్థితిని గవర్నర్ వెనకేసుకొచ్చాడు. అంతటితో వివాదానికి కప్పు వేశారు. దశాబ్దం తరువాత కూడా రెవిన్యూబోర్డులో పేరుకపోయిన పనిసమస్య తేలలేదు.

(రికెట్స్ : రిపోర్టు ఆఫ్ ది కమిషన్ ఫర్ ది రివిజన్ ఆఫ్ సివిల్ శాలరీస్ అండ్ ఎస్టాబ్లిష్‌మెంట్ 1858 మద్రాసు పే. 160)

వీటన్నిటి దృష్ట్యా గుంటూరులో ఎలాంటి పాలన జరుగుతున్నదో ప్రభుత్వ అధికారులు పట్టించుకోలేదు. బోర్డు అంతాగందరగోళం, మందగొడి వ్యవహారంతో కూడింది. స్వతహాగా మితధోరణి గలది. బోర్డులో పాతను కొనసాగించుట, సంప్రదాయాన్ని పాటించుట, నిర్ణయాలు తీసుకొనుట, రాజీపడి ఏకాభిప్రాయానికి వచ్చుట అవసరం. మద్రాసు రెవిన్యూబోర్డు ప్రభుత్వకోర్కెను తృప్తిపరచలేకపోయింది.

# అధ్యాయం - 14

# 1845లో విచారణ

మద్రాసు ప్రెసిడెన్సీలో ఒకానొక జిల్లాపై విచారణ జరపడం వింతకాదు, అరుదూ కాదు. 1843 ఫిబ్రవరిలోనే ఉత్తర సర్కార్లలో వేగంగా తగ్గిపోతున్న రెవిన్యూ గురించి, జమీందార్ల బకాయిలు తక్షణమే విచారించాలన్నారు. దీనికిగాను సర్ హెన్రీ మోంటగొమరీని రాజమండ్రి జిల్లాకు పంపి, కారణాలు పరిష్కారాలు తెలుసుకొని, పరిస్థితి ఎలా మెరుగుపరచాలో చెప్పమన్నారు.

గోదావరి నదీతీరాన గల రాజమండ్రి జిల్లా అన్ని విధాలా గుంటూరును పోలింది. కలెక్టర్ జార్జిస్మిత్ 20 ఏళ్ళపాటు (ఇది చాలా అరుదు నాడు) జిల్లాలో పనిచేశాడు. జిల్లా జడ్జి జేమ్స్ థామస్ భార్య స్మిత్‌ను తల తిక్క కలెక్టర్ అని అతన్ని వర్ణించింది. రెవిన్యూను అసంభవ పరిస్థితులలో సైతం కాపాడినవాడతడు.

(జూలియ థామస్ - లెటర్స్ ఫ్రం మద్రాసు, డ్యూరింగ్ ది ఇయర్స్ 1836-1839 లండన్, జాన్‌ముర్రే 1846 కరువు, తుఫాన్ రావచ్చు. సగంమంది రైతులు తలదాచుకోడానికి జిల్లా వదలవచ్చు. డబ్బు రాబట్టే

దారే లేకపోవచ్చు. అయినా నయానా భయానా, జనం అలమటించినా, తలచింది చేసి, రెవిన్యూ బోర్డుకు డబ్బు పంపి, తలతిక్క కలెక్టర్ అని పేరు తెచ్చుకున్నాడు).

హుజూర్ కచేరీలో దేశస్తుల దయాదాక్షిణ్యాలకు పరిపాలన వదలి, గ్రామనాయకుల, గైబతూల వత్తిళ్ళకు విడిచిపెట్టాడు. యాజమాన్య లోపం బాధ్యతారాహిత్యం స్మిత్‌లో గమనించిన మోంట్‌గోమరి అతన్ని తొలగించి, జిల్లాను కమిషనర్ సర్ హెన్రీకి అప్పగించారు.

1844 మార్చి 18న మాంట్‌గోమరి నివేదిక కాకినాడ నుండి పంపారు. రాజమండ్రి జిల్లా గురించి పంపిన మాంట్‌గోమరి నివేదిక బోర్డు రికార్డులలో వుంచారు. అన్ని జిల్లాల, జమీందార్ల గురించి ఉత్తర సర్కార్లలో బోర్డుకు నివేదికలు వచ్చే అవకాశం వుంది. బోర్డు పరిశీలనకు పంపిన నివేదికను, మధుర నుంచి వచ్చిన డ్రురీ రిపోర్టు వలె నవమాసాలు అట్టిపెట్టవద్దన్నారు.

1844 మే నుండి 1845 జులై 14 లోగా మాంట్‌గోమరి నివేదికను బోర్డు సమీక్షించింది. అప్పటికి బోర్డు సభ్యులంతా మారారు. 1846 జనవరి 6వ హెన్రీ చామియర్ స్పందిస్తూ ముఖ్య విషయాలపై నిర్ణయాలు తీసుకోకుండా వున్న రెవిన్యూ బోర్డు అసమర్థత వలన జరిగేదేమీ లేదన్నాడు. 1846 ఏప్రిల్ 17న మాంట్‌గోమరి నివేదిక పంపేసిన మూడు రోజులకే, గుంటూరు జిల్లా పతనావస్థ పై వాల్టర్ ఎలియట్ తన నివేదిక సమర్పించాడు.

గుంటూరు పరిస్థితిపై ప్రభుత్వం, రెవిన్యూబోర్డు ఆందోళన చెందడం సహజం. సాధారణ పరిస్థితి కంటె సగానికి తక్కువగా రెవిన్యూ పడిపోయింది. 1842-3 జమాబంది నివేదిక 1844 మే 31 వరకూ

పంపలేదు. 1842 నవంబరు 21న ప్రభుత్వం యిచ్చిన ఉత్తరువులు అమలుకు ఏమీ చేయలేదు. జమీందారీల పునర్వ్యవస్థీకరణ, బాగుపరచడం జరగాల్సింది. జమీందార్ల ప్రైవేటు రుణాల గురించి ఏమీ తెలియదు. ఎలా పరిష్కరించాలో అగమ్య గోచరంగా నున్న కాలంలో జమీందార్లు ఏం చేయబోతున్నారో తెలియదు. అమాని యాజమాన్యాల క్రింద వున్న జమీందార్లను నిర్వహణ భత్యాలు మంజూరు చేశారు. ఎస్టేట్లను ఎటాచ్ చేసిన చోట శాస్త్రీయ సర్వే జరిపి అంచనా వేయాలి. ఇంజనీరు ఆధ్వర్యంలో జరగాల్సిన యీపని 3 ఏళ్ళ పాటు జరగాలి. దీని వ్యయం 75000 రూపాయలు. కలెక్టర్‌కు వ్యతిరేకంగా జిల్లా అధికారులున్న విషయం తెలుసు. స్టోక్స్ మత కార్యకలాపాలలో నిమగ్నమయ్యాడని ఫిర్యాదులున్నాయి. (స్టోక్స్, నెవిల్ తమ సొంత ఖర్చులతో ఇంగ్లీషు, దేశీయ పాఠశాలల్ని బలపరిచారు. వాటిని లూథరిన్ మిషనరీలు ప్రారంభించాయి.)

1844 ఆగస్టు 15 నాటికి కలెక్టర్ ఆరోగ్య పరిస్థితి క్షీణించిందని తెలిసింది. ప్రభుత్వానికి దరఖాస్తు పెట్టి వెళ్ళనున్నాడన్నారు. అంతటితో జిల్లా పరిస్థితి విచిత్రంగా మారింది. జమీందార్ల నుంచి 68 లక్షల రు.ల రుణాలు రావలసి వుంది. ప్రైవేటు అప్పుల సంగతి తెలియదు. జిల్లా పాలన పెంపొందించడానికి ప్రతిభ, అనుభవం కావాలి.

విధులు విస్మరించి, మత కార్యకలాపాలలో నిమగ్నుడైనందుకు స్టోక్స్‌ను సంజాయిషీ అడిగారు. జిల్లా పాలన పునరుద్ధరించడానికి ఏం చేయాలని బోర్డును గవర్నర్ అడిగాడు.

గుంటూరులో 5 జమీందారీల గురించి సరిగా తెలియదని చామియర్ సెప్టెంబర్ 7న చెప్పాడు. ఉత్తర సర్కార్లకు లాక్‌హర్ట్ పూర్తిగా కొత్త.

కనుక కొంత కాలం ఏమీ చేయజాలడు. ఈలోగా యింకా దిగజారి పోకుండా ఒక అనుభవజ్ఞుడైన కమిషనర్‌ను నియమించమని చామియర్ సూచించాడు. సరిదిద్దాల్సిన పనులు చాలా వున్నాయి. స్టోక్స్ మతచర్యలు ఏం చేశాడో ప్రధానం కాదు.

గుంటూరులో లేదా ఉత్తర సర్కార్లలో అనుభవశాలి అయిన కలెక్టర్ అవసరమని బర్డ్ చెప్పాడు.

1842లో కోర్టు సూచించినట్లు భత్యాలు పెంచి నియామకం జరగాలన్నాడు. బోర్డు నుండి ఇంకా సమాచారం రావలసి వుండగా విషయం అంతటితో ముగించారు.

స్టోక్స్‌ను జాప్యం చేయవద్దన్నామని బోర్డు చెప్పింది. స్టోక్స్ ఎందుకు ఆలస్యం చేశాడో తెలియదు. ఆయన్ను ఏమీ అనలేదు. స్టోక్స్‌కు మంచి వారసుడుగా మంచి వ్యక్తిని వేయదలచి, అతన్ని అన్నిటికీ కారకుడని నిందించలేదు. స్టోక్స్ మత కార్యకలాపాల గురించి ఏ వార్తా రాలేదు. కనుక అతన్ని సంజాయిషీ అడగలేదు. తాత్కాలిక కలెక్టర్, హెడ్ అసిస్టెంట్ పరిపాలనలో తలమునకలైవున్నారు. తక్షణ సమస్యలకు ప్రత్యేకాధికారిని నియమించాలి. నెలకు రు.500 అదనపు భత్యం యివ్వాలంటే, కలకత్తాలో సుప్రీం ప్రభుత్వ అనుమతి కావాలి. తక్షణ పరిష్కారంగా కమిషనర్‌ను నియమించడమే మార్గం.

రెవిన్యూ బోర్డులో పని పేరుకుని వున్నందున, బోర్డు సభ్యుడికి బదులు, కలెక్టర్‌ని పంపాలని ట్వీడల్ భావించాడు. జిల్లాలో క్షీణించిన స్థితిని ఎప్పుడో ప్రభుత్వ దృష్టికి తీసుకు రావలసింది. గత ఏడాది వచ్చిన పెను తుఫాన్ కూడా ప్రధానంగా పరిస్థితులకు దోహదం చేసి వుండొచ్చు. రాజమండ్రి మధురలో జరిగిన జాప్యాన్ని నమూనాగా ట్వీడల్ చూపాడు.

ప్రభుత్వంలో ఇతర సభ్యులు కమిషనరే కావాలంటే, బోర్డు సభ్యుడిని పంపిస్తానని గవర్నర్ అన్నాడు.

బర్డ్ తన లోగడ విమర్శకే కట్టుబడి స్టోక్స్ తన విధులలో విఫలుడయ్యాడన్నాడు. ఉత్తర సర్కార్లలో డెంట్‌కు అనుభవం వుంది. కౌన్సిల్‌లో అతడు బర్డ్ స్థానంలోకి వస్తాడు. భారత ప్రభుత్వ అనుమతి అవసరం లేకుంటే, స్పెషల్ సబ్ కలెక్టర్ మార్గాంతరం అన్నాడు.

గుంటూరు కమిషనర్‌గా డెంట్‌ను పంపారు. స్టోక్స్ పాలన ఖండించక ముందే మరో తాత్కాలిక కలెక్టర్‌ను నియమించదలచారు. న్యాయశాఖకు లాన్‌హర్ట్‌ను పంపారు. గుంటూరులో ఒకటి రెండు తాలూకాలు ముందుగా సర్వే చేసి, దుస్థితి కారణాలు కనుగొనాలి. అదనపు సహాయానికి స్పెషల్ అసిస్టెంట్‌ను, కమిషనర్ దేశీయ వ్యవస్థను అప్పగించవచ్చు. కౌన్సిల్‌లోకి డెంట్ వస్తే అతని అనుభవం ఉపయోగపడుతుంది.

ఈ పథకం అంత సులువుగా పనిచేయలేదు. డెంట్ జబ్బుతో వున్నాడు. ప్రైవేట్ సెక్రటరీ నోటీసు పంపగా, తన సిక్ సర్టిఫికెట్ యిచ్చాడు. కలకత్తా వెళ్ళి, ఆరువారాల్లో చనిపోయాడు. రాబర్ట్‌సన్‌ను గుంటూరు వెళ్ళమన్నారు.

అతడు సమర్థుడు కాదు. అయినా సిక్ సర్టిఫికెట్ సమర్పించాడు. కన్యాకుమారి వెళ్ళి, ఇంగ్లండ్ చేరుకున్నాడు. ఆ పదవి ఎలియట్‌కు వచ్చింది.

2 మాసాలు సెలవు ఎప్పుడో ఎలియట్‌కు రావలసింది. కొలంబోలో ఎల్ఫినిసన్‌ను కలియడానికి అతను, మరియా సిద్ధమౌతున్నారు. క్రిస్మస్‌నాడు దుర్వార్త అందుకున్నాడు.

ఎలియట్ స్పందించి, చేసేది లేక, విధి నిర్వహణకు అంగీక రిస్తున్నట్లు, మరియ బాగా నిరుత్సాహపడినట్లు లార్డ్ ఎల్ఫినిస్టన్‌కు రాశాడు.

మరియా కూడా చాలా ఆగ్రహించి ఎల్ఫినిస్టన్‌కు రాసింది.

(1845 జనవరి 20, ఫిబ్రవరి 12)

పైగా అదే సమయంలో ఎలియట్ దంపతులు తమ రెండో సంతానం కోసం ఎదురు చూస్తున్నారు. 6 నెలల్లో యిచ్చిన పని పూర్తి చేయగలనని ఎలియట్ భావించినా, రెండేళ్ళు కూడా పట్టే అవకాశం వుంది.

అప్పట్లో లోలోన జరుగుతున్న కుట్రలకు వాల్టర్ ఎలియట్ నియామకం కూడా ఒక కారణం. బోర్డులో ఖాళీలు ఏర్పడగా ఉ ద్యోగావకాశాలకు, ఆశ్రిత పక్షపాతానికి దారి తీసింది.

వాల్టర్ నెత్తిన బెట్టిన గుంటూరు వ్యవహారం పై మరియా ఆగ్రహించింది. బోర్డులో ఇతర సభ్యులెవరూ ఏమీ చేయరు. వాల్టర్ తిరిగి వచ్చేనాటికి పని చాలా భయంకరంగా పేరుకొని వుంటుంది.

జార్జిడ్రురీని బోర్డు మొదటి సభ్యుడుగా, జాన్ థామస్‌ను ఛీఫ్ సెక్రటరీగా అలెగ్జాండర్ మక్లీన్‌ను తాత్కాలిక రెండో సభ్యుడుగా, జాన్ గోల్డింగంను మూడో సభ్యుడుగా చేశారు. మక్లీన్, గోల్డింగం నియామకాలు వివరించాలి.

1844 అక్టోబరు 11న మక్లీన్‌ను కడప కలెక్టర్, మెజిస్ట్రేట్‌గా నియమించి, సదర్ అదాలత్ మూడో జడ్జిగా కొనసాగమన్నారు. ఒక ఏడాదిపాటు రెండో జడ్జి మాల్కోం లెనిన్‌తో అతనికి పోరాటం జరిగింది. బెంగుళూరు టర్ఫ్ వ్యవహారాలలో కూడా మక్లీన్ చిక్కుకున్నాడు. 1844

డిసెంబరులో సుదీర్ఘ సెలవును నుండి హెన్రీడికిన్‌సన్ తిరిగి రాగా, మక్లీన్‌ను సదర్ అదాలత్ నుండి తొలగించారు. జనవరి 1న శాశ్వత ఖాళీ రాబోతున్నా యీ చర్య గైకొన్నారు. ఆగ్రహావేశుడైన మక్లీన్ తాను ఇతరులపై దృష్టిలో చులకన అవుతానని, కోర్టులో చాలా చేశానని వాపోయాడు. దేశం వదలిపోతానని బెదిరించాడు.

ట్వీడల్ స్పందిస్తూ న్యాయ సంబంధపనికి మక్లీన్ అర్హుడు కాదని, అతని బాగుకోసమే అలా చేశామన్నారు. తన జీతం తగ్గిపోతుందని మక్లీన్ అన్నాడు.

బోర్డులో గోల్డింగంను నియమించారు. అతడు నెమ్మదిగా తన పని చేసుకుంటాడు. 8 సంవత్సరాలుగా అతడు నెల్లూరు, మచిలీపట్నంతో సహా క్షేత్రంలో పనిచేసి వచ్చాడు.

అలెగ్జాండర్ బ్రూన్ తొలుత గోల్డింగం నియామకం పట్ల ఆక్రందించాడు. గుంటూరు మాజీ కలెక్టర్‌గా చేశాడు. పైకి వస్తున్నా తృప్తిలేదు. గవర్నర్ తనకు హామీ యిచ్చాడని, ప్రభుత్వానికి రాస్తూ, డైరెక్టర్ల కోర్టుకు సైతం తెలియపరిచాడు. 2 నెలల తరవాత అదంతా ఉపసంహరించుకుంటున్నానని, తన సెలవు రద్దు చేస్తే, ఉద్యోగంలో కొనసాగుతానన్నాడు. గవర్నర్ అనుమతించాడు. (గోల్డింగం సామర్థ్యం గురించి డ్రురీ, ఎలియట్ వ్యతిరేకించలేదు).

ఎలియట్ కాలయాపన లేకుండా గుంటూరు వెళ్ళాడు. కడప హుజూర్ సిరస్తిదార్ అప్పారావు సేవలు కావాలని స్వీకరించాడు. నెలకు రు.600ల ఖర్చుతో, ఇద్దరు సర్వేయర్లు, మెడికల్ సబ్‌ఆర్డినేట్, డ్రస్సర్, వివిధ సామగ్రి తీసుకుని ప్రారంభించాడు. గుంటూరులో చేరి అన్ని ముఖ్యవిషయాలలో సూటిగా ప్రభుత్వంతో వ్యవహరించమన్నాడు.

ఫిబ్రవరి 3న మద్రాసు నుండి బయలుదేరిన ఎలియట్, ఇండియాలో అత్యంత వేడివున్న జిల్లాకు అతి వేసవి కాలంలో వెడుతున్నానని, ముందంతా వేడి అని వ్యాఖ్యానించాడు. నెల్లూరు మీదుగా సిబ్బందితో సహా పయనించాడు. నల్లని మైదానాలు, మట్టి గుడిసెలు, చెదురుమదురుగా చెట్లు, అరుదుగా చెరువులు, నీటి ఎద్దడి, త్రాగడానికి కరువు, ఎదురుకాగా ఇంకా దారుణ స్థితి ఎదురుకాబోతున్నదన్నాడు. ఫిబ్రవరి 16న గుంటూరు చేరగానే, యిక ఆలోచించే సమయంలేదు.

స్వయంగా పరిశీలిస్తే తప్ప దేన్నీ నమ్మకుండా, హుజూర్, జమీందారీ, గైటబులను పక్కన పెట్టి, మూల సమాచారానికి వెళ్ళాడు. గత 12 మాసాల రికార్డులతో 100 గ్రామాల కరణాలను తన ముందుకు రమ్మన్నాడు కమిషనర్.

గుంటూరు చేరుకోవడంలో గల కష్టాల్ని ఏకరువు పెట్టారు కరణాలు. తాత్కాలిక కలెక్టర్ డేనియల్ వైట్ ఉత్తరువుల అమలుకు కృషి చేశాడు. పెద్ద దొర ముందుకు అందరూ చేరారు. రికార్డులు చూపమంటే ఏడుపు ముఖాలు పెట్టి, లేవని సంజ్ఞలు చేశారు. జమీందారు పుస్తకాలన్నీ తీసుకెళ్ళాడన్నారు. చావిడి తగలబడి కాగితాలన్నీ కాలిపోయాయన్నారు. దొంగలు పడి కాజేశారన్నారు. తుఫానులు, పెనుగాలులు వచ్చాయన్నారు. చదలు తిన్నాయన్నారు. తన బంధువు ఆ సమయంలో కరణంగా వుండేవాడని ఒకరన్నారు. మొత్తం మీద రికార్డులు పోయాయి. ఎలియట్ ప్రకారం రికార్డులే లేవు.

తనకు జాయింటు మాజిస్ట్రేట్ అధికారాలు యివ్వమని, తీవ్ర ప్రతిబంధకాలు ఎదుర్కొంటున్నానని ఎలియట్ మద్రాసుకు రాశాడు. ప్రభుత్వం అభ్యంతర పెట్టింది. జవాన్లను యిచ్చి సహాయపడమని,

వైట్‌కు ఉత్తరువులిచ్చారు. వైట్, నెవిల్ అవసరార్థం వెళ్ళారని, సమయానికి, లేరని ఎలియట్ చెప్పాడు.

(కమిషనర్ ఉత్తరువులు పాటించమని లాక్‌హార్డ్ ఆర్డర్లు యిచ్చాడు)

3 వారాలు తిప్పలుబడి, రికార్డులు లభించక కరణాల నుండి హామీలు తీసుకొని వారి ప్రకటనలు అబద్ధమని తేలితే శిక్షార్హులని స్పష్టపరిచారు. చివరకు గుంటూరు నగరానికి సమీపంలో ఉన్న తక్కెళ్ళపాడు గ్రామంలో రికార్డులు దాచిన స్థలం కనుగొన్నారు. వెళ్ళిన అధికారులు కొంత జాప్యం చేయడంతో రికార్డులు అదృశ్యమయ్యాయి.

కరణాలను శిక్షించడానికి తగిన సాక్ష్యాధారాలు లభించాయి. ఫలితంగా హుజూర్ కార్యాలయంలో కుమ్మక్కయి రెవిన్యూ తగ్గించుకో జూచినందుకు అధికార పత్రాలు దాచినందుకు, ప్రభుత్వ నిధుల దుర్వినియోగానికి బాగా శిక్షవేసి, జరిమానా విధించారు. దాంతో అనేకమంది కరణాలు దాచిన రికార్డులు బయట పెట్టారు. అయినా విచారం వెలిబుచ్చుతూ సంజ్ఞలతోనే వచ్చారు.

హుజూర్ కచేరీలో దేశస్థ ప్రముఖులు, సిరస్తిదారు కలవరపడ్డారు. కమిషనర్ విచారణకు అడుగడుగునా అడ్డుపెడుతూ, తిప్పికొట్టారు. జిల్లా అంతట యీ పని జరిగింది. ఎలియట్‌కు చికాకు కలిగించేవి, కాలయాపన చేసేవి ప్రయోగించారు. కమిషన్ తొలిప్రయత్నం సన్నగిల్లగా, కరణాలు ధైర్యం తెచ్చుకున్నారు. హామీలు, బెదిరింపులు, లంచాలు, వత్తిడులు సాగగా, కొత్తగా బయటపెట్టినవాటిని గమనించారు. కొత్త ఫిర్యాదులు కమిషనర్ దాకా రానివ్వలేదు.

1844-45లో జమాబంది సమయం వచ్చింది. వైట్, నెవిల్ జిల్లాలో మరోవైపుకు వెళ్ళారు.

ఎలియట్ ఏకాకి అయ్యాడు. తనకు అందిన సమాచారం ఆధారంగా స్థానిక అధికారుల దుష్టప్రయత్నానికి శిక్షించాలంటే, మాజిస్ట్రేట్ అధికారాలు లేవు. కమిషనర్ చెప్పినట్లు చేయమని వైట్ స్పష్టంగా చెప్పినా, హుజూర్ అధికారుల జాప్యం చేయడమో, పట్టించుకోకపోవడమో చేశారు. పైకి ఎంతో గౌరవం యిచ్చినా పని జరగలేదు. ఏది చేయబోయినా తటస్తం చేశారు. కలెక్టర్ కార్యాలయంలో జరుగుతున్న వ్యవహారం కారణంగా ఎటుచూచినా దిగజారుడే ఉన్నది.

ఎలియట్‌తో వైట్, నెవిల్ అంగీకరించారు. జిల్లా అధికారులకు తెలిసే గ్రామ లీజులు తక్కువకు యిచ్చారు. స్థానికులు పెత్తందార్లను అడ్డుకున్నారు. హుజూర్ సిరస్తిదార్‌కు తెలియకుండా యిదంతా జరగడంలేదనేది సుస్పష్టం.

1826 జూన్ 19 బోర్డు ఉత్తరువులు వున్నా, పని చేసే జిల్లాలో అధికారులు భూములు సంపాదించుకోరాదన్నా, న్యాపతి శేషగిరిరావు, అంబర్‌ఖానా పురుషోత్తమరావు నక్కలపల్లి సుబ్బారావుతో సహా అనేక మంది అధికారులు భూములు సంపాదించారు.

ప్రత్యేక అనుమతి వుంటే, రిజిస్టర్ చేసి మాత్రమే భూములు తీసుకోవచ్చు. ఈ విషయం జిల్లా అధికార్లకు బాగా తెలుసు. జిల్లా అధికారులు తమ భూముల సంగతి కచ్చితంగా చెప్పాలని 1843 అక్టోబరు 28న స్టోక్స్ ఉత్తరువులున్నాయి. ఒక్క అధికారి కూడా బయటపెట్టలేదు. అలాంటి నిబంధన వున్నట్లయితే తెలియదన్నారు.

ఏప్రిల్ 2న ఎల్ఫిన్‌స్టన్‌కు గుంటూరు పరిస్థితిని ఎలియట్ తెలియజేశాడు. జమీందార్ల తలబిరుసుతనం మోతాదు మించిందన్నాడు. వారికి దేశీయ ఉద్యోగులు వంత పలికారు. గత ఏడాది రెవిన్యూ బకాయి

సగం వసూలు కాలేదు. స్టోక్స్ విసుగు చెంది కష్టాల్ని ఎదుర్కోలేక పోయాడు. బోర్డు ఆక్షేపిస్తే అనారోగ్యమని, తప్పించుకున్నాడు. ఎలియట్ దృష్టిలో వైట్‌కు తెలుగు రాకపోయినా, రైత్వారీ పద్ధతి తెలియకపోయినా మంచి వాడుగా మిగిలాడు.

1845 ఏప్రిల్ 26న నయాబ్ సిరస్తిదార్ నక్కలపల్లి సుబ్బారావును, 1845 మే 2న న్యాపతి శేషగిరిరావును వైట్ సస్పెండ్ చేశాడు. లంచాలు తీసుకున్నారు. పారితోషికాలు స్వీకరించారు. ప్రభుత్వ నిధుల్ని దుర్వినియోగం చేసి, జేబులు నింపుకున్నారు.

(ఎలియట్ యిచ్చిన సమాచారంతో చర్య తీసుకున్నానని, సిరస్తిదార్‌పై పూర్తి నివేదిక యిస్తానని బోర్డుకు తెలియజేశాడు వైట్)

దేశస్త నాయకులు ఏమీ బెదరలేదు. తమకు ఎదురైన బెదిరింపులు ఎదుర్కోవడానికి సిద్ధమయ్యారు. నాలుగు మాసాలపాటు న్యాపతి యిల్లు కుట్రల కుతంత్రాల కేంద్రంగా మారింది. హుజూర్ సిరస్తిదార్ దగ్గర అధికార్లు, నాయకులు కూడారు. కమీషనర్ ఆఫీసుకు వెళ్ళిన కరణం, గ్రామనాయకులను పిలిచారు. శేషగిరిరావు మళ్ళీ పదవిలోకి రానున్నాడని చెప్పారు. లోగడ రెండుసార్లు తొలగిస్తే ఏమైంది. అతని ప్రభావం అలాగే వుంది.

అన్నిచోట్లకు మనుషుల్ని పంపారు. లోగడ సమాచారం ఎలియట్‌కు ఇచ్చిన వారిచే బోర్డుకు ఫిర్యాదులు చేయించారు. బలవంతంగా తమ నుండి వత్తిడి చేసి చెప్పించారనిపించారు. కమిషనర్, తాత్కాలిక కలెక్టర్ చేసిన పనులే యివన్నీ అన్నారు. శేషగిరిరావు అతని అనుచరులు దిగ్విజయం పొందగలరన్నారు.

అది ఏప్రిల్, మే గనుక, చాలా వేడి వున్నది. స్వయంగా గ్రామాలకు

వెళ్ళాలని ఎలియట్, అప్పారావు, సిరస్తిదార్ తలపెట్టి మూలం ఎక్కడుందో పట్టుకోవాలన్నారు.

లోగడ రాబర్ట్ సన్, ఓక్స్, విష్, గోల్డింగం, స్టోక్స్‌కు బోర్డు నుండి ఎదురైన అడ్డంకులు ఎలియట్‌కు లేవు. గ్రామ నాయకుల మస్తత్వం అప్పారావు, ఎలియట్‌లకు బాగా తెలుసు.

వడగాలుల్లో, విపరీత ఎండల్లో తెల్లని గుడారాలు వేసుకొని పర్యటన చేశారు. కమిషన్ కష్టించి పనిచేశాడు. సిబ్బంది హడావుడిగా వ్యవహారాలు నడిపారు.

104 డిగ్రీల వేడి. బల్లని తాకితే కాలేది. పొయ్యి మీదనుండి అప్పుడే తీసినంత వేడిగా రాత్రిళ్ళు పక్కబట్టలుండేవి. ఇది ఎలియట్ అనుభవం.

అసౌకర్యాలు పట్టించుకోలేదు. రాత్రి పొద్దుబోయేంతవరకూ కమిషనర్ పని చేశాడు.

రికార్డులు దాయడానికి కరణాలు, గ్రామ నాయకులు ప్రయత్నించారు. దొంగ ప్రయత్నాలను పట్టేశారు. కొన్ని రికార్డులు ఆమోదించారు. ఎప్పుడో రాసిన దొంగ లెక్కలు దొరికాయి. బావుల్లో, చెరువుల్లో, పాతర్లలో చించిపడేసిన, తగలెట్టిన కాగితాలు లభించాయి. ఎలియట్ గుమాస్తా ఒకరు చావిడిలో నిద్రపోతుంటే నిప్పంటించారు. గుమాస్తా బతికి బయటపడ్డాడు. రికార్డులు తప్పించుకోలేక పోయాయి.

ఎలియట్ దృష్టిలో పరీక్షకు నిలిస్తే తప్ప ఏ రికార్డు అసలైనది కాదు. రెండో ప్రతి యిచ్చినా జమీందార్‌ను కనుగప్పడానికి తయారు చేసినవి కావని నిర్ధారణ చేసుకోవలసివుంది. కొందరు పిరికి అధికార్లు అసలు రికార్డులు చూపేవారు. కరణం, రైతు కుటుంబాలను విడివిడిగా చేసి, ఒక పథకం ప్రకారం, ఎలియట్, అప్పారావులు అడిగి తెలుసుకునేవారు.

నిజంకోసం రకరకాల ఉపాయాలు ప్రయోగించారు. అయినా కరణాల తప్పుడు రికార్డులు యిచ్చి అదే సరైనదని ప్రమాణం చేసేవాడు. కాని పాత కాగితాలపై సిరా కొత్తది గనుక పట్టుబడేవారు. కరణాల చిరకాల అనుభవం, అభ్యాసంతో యీ మోసాలకు దిగారని ఎలియట్ రాశాడు.

కమిషనర్ ముందుకు సాగిపోతున్నట్లు సస్పెండ్ అయిన సిరిస్తదార్‌కు తెలిసింది. తానే స్వయంగా తన వాళ్ళతో వూళ్ళలోకి వెళ్ళాడు. సబ్బవీస్ ముఠా తనను సస్పెండ్ చేయించారన్నాడు. తన ఉత్తరువులు ఉల్లంఘిస్తే ఖబడ్దార్ అని హెచ్చరించాడు.

శేషగిరిరావు పాచిక పారలేదు. అతని ప్రభావాన్ని జిల్లా అధికారులు తిప్పికొట్టారు. పరిపాలనకు అడ్డొస్తే సిరస్తిదార్‌కు ప్రమాదం అని ఎలియట్, వైట్‌లు బెదిరించారు. అలాంటి ధోరణి జిల్లాలో బాగా పనిచేసింది. ఎలియట్, అప్పారావుల పాచిక పారింది.

అవినీతికర శక్తుల్ని ఏరివేయడానికి కలెక్టర్ కృషి చేశాడు. పొరలు తొలగిస్తూ పోతే, కొత్త సంబంధాలు బయటపడ్డాయి. ధూమల్ లక్ష్మీ నరసురావు, మనూరు వెంకట కృష్ణారావు, తాలూకా అమిన్, నయబ్ (సత్తెనపల్లి తాలూక)లను తొలగించారు. వారు జమీందార్, సిరస్తిదార్‌కు బంధువులు. వారి కింద వున్నవారు జమీందారు సోదరుడు, బంధువు అని బయటపడింది. చిలకలూరిపేట అమిన్, నయబ్‌ను తొలగించి, తాలూకా మారుమూల నుండి ఎంపిక చేస్తే అతనూ, అమిన్ బావమరిది అని తేలింది. జిల్లా ఉద్యోగాల్లో సిరస్తిదారుకు 74మంది బంధువులున్నారు. పాత నాయకత్వాన్ని దెబ్బతీయాలంటే అనూహ్య చర్యలు తప్పవు.

జిల్లా సిరస్తిదార్‌గా పూనానుండి డి.శ్రీనివాసరావు అనే మరాఠా

బ్రాహ్మణుడిని తెచ్చారు. అతని పేరు చెక్కి కృష్ణారావు అని తప్ప యింకేమీ తెలియదు. అతనికి జిల్లాలో బంధువులు లేరని తెచ్చారు. మరాఠా బ్రాహ్మణులను జిల్లా కార్యాలయంలోకి తీసుకవస్తుండేవారు.

వాసిరెడ్డి, సత్తెనపల్లి, చిలకలూరిపేట రేపల్లె జమీందారీలు, మల్‌రాజు జమీందారీలో 30 గ్రామాలు. వెరసి 577 గ్రామాలు పరిశీలించి, రికార్డులు సాక్ష్యాలుగా ఎలియట్ ఆధ్వర్యాన జరిపారు.

నిజాం నుండి 57 ఏళ్ళ క్రితం జిల్లాను స్వీకరించినప్పుడు ఎలావుందో, ప్రస్తుతం గుంటూరు యింకా అధ్వాన్నంగా వుందని ఎలియట్, లార్డ్ ఎల్ఫిన్‌స్టన్‌కు రాశాడు. బహుశ ఔద్ ప్రాంతంలో మాత్రమే యింతకు మించిన దారుణం వుండేమో. ప్రజలు దిగజారి, అబద్ధాలు, కుతంత్రాలు, మోసాలతో వున్నారన్నాడు. 6 నెలలో గ్రామ గ్రామం విచారణ పూర్తి చేసిన ఎలియట్, జమీందార్ల అప్పులు, రానున్న ఉత్పత్తి శక్తి సేకరించాడు.

గుంటూరు తాలూకాలో పైలట్ సర్వే, అంచనా పర్యవేక్షించాడు. జిల్లా అంతటా కలెక్టర్ ఆ పద్ధతి పాటించవచ్చునన్నాడు. అంతటితో ఎలియట్ మద్రాసు వెళ్ళాడు. మద్రాస్ పాత సర్వే విధానంపై డబ్బు తగలెయ్యడం అనవసరం. బొంబాయిలో శాస్త్రీయ పద్ధతి అప్పటికే వాడారు. మద్రాసులో ఎలియట్ కాదన్న పథకాన్నే గుంటూరులో చేబట్టామన్నారు. ఇద్దరు సర్వేదారులను కావాలంటే, వచ్చిన ఒకతను దేనికీ పనికిరాడని తేలింది. సర్వే అనుభవం గల 10 మంది కర్నూలు నుండి వచ్చి, గుంటూరు నచ్చక వెళ్ళిపోయారు. ఎలియట్ స్వయంగా గ్రామంలో కంసాలి సహాయంతో పని చేశాడు. సర్వే చేయడం ఎలాగో ఒకడజను నిరుద్యోగులకు నేర్పాడు. మద్రాస్ దత్తమండలంలో నియమించిన ధోరణిలోనే సర్వే సాగిందన్నాడు. (సర్వేకు వృత్తి తెలియనివారిని పెట్టడం దారుణమని ఎలియట్ రాశాడు)

సర్వే విషయమై చర్చకు మద్రాసు రమ్మని ఎలియట్‌ను పిలిపించారు. ఎలియట్ మద్రాసులో నివేదిక పూర్తిచేయవచ్చు. భార్యతో గడపవచ్చు. 19 ఆగస్టున ప్రభుత్వానికి రాస్తూ తన విచారణ గుంటూరులో పూర్తి అయిందన్నాడు. బోర్డు రికార్డులు పరిశీలించి నివేదిక యిస్తానన్నాడు. ప్రెసిడెన్సీకి వచ్చే వరకు నివేదిక ఆపుతానన్నాడు. గుంటూరులో చేసిన కృషి అంతా చేబట్టి ఆగస్టు 31న మద్రాసు చేరుకున్నాడు. ఒక వారం రోజులలో అతనికి కుమారుడు పుట్టాడు. సెప్టెంబరు 8న ప్రభుత్వానికి తన రాక తెలియజేశాడు.

డేనియల్ వైట్ జబ్బుపడి గుంటూరు వదలడంతో జిల్లా ఇన్‌చార్జిగా ఎవరనేది వివాదాస్పదమైంది. జిల్లా సర్వే అంతా ఎలియట్ (Elliot) పూర్తి చేస్తే బాగుంటుందని జూనియర్ కౌన్సిల్ సభ్యుడు హెన్రిడికెన్స్ అన్నాడు. గుంటూరును నెవిల్‌కు వదిలివేయడం తగదని వెంటనే ఎలియట్ చార్జి తీసుకోవాలని ట్వీడల్ (Tweedale) అన్నాడు. చామియర్ ఒప్పుకోలేదు. సర్వేపై చర్చ పూర్తి చేయాలంటే ఎలియట్ అవసరమన్నాడు. ఎలియట్‌ను గుంటూరు పంపాలని డికెన్సన్ గట్టిగా కోరాడు.

సస్పెండ్ అయిన సిరస్తదార్ ప్రమాదకర ప్రభావం వలన, తాత్కాలికంగా ఎలియట్‌ను పంపాలని గవర్నర్ భావించాడు. నవంబరు 6న తక్షణమే ఎలియట్ గుంటూరు వెళ్ళాలన్నారు.

ఎలియట్ నిరసన తెలిపాడు. తన ఆరోగ్యం బాగాలేదు. డాక్టర్ శాండర్సన్ అతనికి వైద్యం చేస్తున్నాడు. రిపోర్టు పూర్తి కాలేదు. కమిషన్ చేసిన తరువాత కలెక్టర్ స్థాయికి దిగడం తగదు. ఎల్ఫిన్‌స్టన్‌కు రాస్తూ అయినా గుంటూరు వెడతానన్నాడు.

బోర్డులో సీనియర్ సభ్యుడ్ని గుంటూరు పంపడంపట్ల ఎలియట్ భార్య మరియా ప్రభుత్వాన్ని నిరసించింది. జాన్ గోల్డింగంను అట్టి పెట్టదలచి వాల్టర్‌ను బోర్డుకు రానివ్వడం లేదన్నది.

తనను తాత్కాలిక కలెక్టరుగా వెళ్ళమంటున్నారని, డెంట్‌ద్రురీలు కలెక్టర్ మాజిస్ట్రేట్ హెూదాలతో వుండేవారని చూపి, ఎలియట్ విజ్ఞప్తి చేశాడు. జిల్లా అంతా సర్వే, అంచనా పూర్తి అయితేనే కమిషనర్ విధులు పూర్తిగావించినట్లని ట్వీడల్ రాశాడు.

చామియర్ ఆగ్రహించి, గోల్డింగంను పంపాలని, 5 ఏళ్ళు జిల్లాలో కృషి చేసినందున అర్హత వుందనీ చెప్పాడు. ఇలియట్ జిల్లాకు తిరిగి వెళ్ళాల్సిన పని లేదన్నాడు. అతన్ని పంపడం తొలుత ఉద్దేశించిన దానికి విరుద్ధం అన్నాడు. బోర్డులో సర్వే గురించి చర్చించే సమర్థుడే మిగల రన్నారు. జిల్లా దుస్థితికి గోల్డింగం కారణమన్నాడు. ఉత్తర ఆర్కాట్‌కు గోల్డింగంను, లోవెల్, కాటన్లను వారి స్థానాలకు పంపితే డెప్యూటేషన్ బత్తాలు మిగులుతాయన్నాడు.

గుంటూరు కమిషనర్‌గా కొద్ది వారాలు వెళ్ళమని ఎలియట్‌ను ట్వీడల్ కోరాడు. అయితే యీలోగా స్టోక్స్ గుంటూరు వెళ్ళడంతో అత్యవసరం తప్పింది.

చల్లని వాతావరణంలో ఎలియట్ అనారోగ్యంగా వుంటూ, వేడి రాగానే కోలుకున్నాడు. 1846 ఏప్రిల్ 17న భారీ నివేదిక సమర్పించాడు. ఎల్ఫినిస్టన్‌కు రాస్తూ గుంటూరులో పాత బొంబాయి సర్వే పద్ధతి పెట్టాలనుకున్నారు గనుక తాను వెళ్ళనక్కరలేదన్నాడు.

ఎలియేట్ మళ్ళీ బోర్డుకు రాకుండానే మక్లీన్ ప్రయత్నించాడు. అయినా ఏప్రిల్ 23న ఎలియట్ బోర్డుకు వచ్చాడు. తాత్కాలిక 3వ

సభ్యుణ్ణి చేసినందుకు మక్లీన్ అభ్యంతరం తెలిపాడు. ఉత్తర ఆర్కాట్‌కు వెళ్ళడానికి గోల్డింగం సిద్ధపడ్డాడు. తాత్కాలిక 4వ సభ్యుడుగా బోర్డులో వుండమని గోల్డింగంకు డికిన్‌సన్ సూచించాడు. దీనిపై స్థానిక పత్రికలకు వార్తల్ని చామియర్ లెనిన్, మక్లీన్ ఎవరో ఒకరు చేరవేశారు. స్పెక్టేటర్ ఎలియట్ గుంటూరు మిషన్ పై వ్యాఖ్యలు చేసింది.

400 పేజీలలో ఎలియట్ రిపోర్టు వచ్చింది. జిల్లా ఆర్థిక దుస్థితి, పాలనా పతనావస్థ, జమీందార్ల పతనం చర్చించింది. 12 ఏళ్ళుగా జమ అయిన బకాయిల గతేమిటో పేర్కొన్నారు. ఆర్థికత, సమాజం, పాలన గురించి వివరంగా పరిశీలించింది. 60 ఏళ్ళ పాలన సమీక్షించింది. ఏడు బృహత్ గ్రంథాలలో ఎలియట్ వైట్ ఉత్తరాలు, గ్రామాలలో సాక్ష్యాలు, లోగడవలె కలెక్టర్ల ఉత్తర ప్రత్యుత్తరాలు ఆధారాలతో మిగిలిన వివరాలు యిచ్చారు. లెక్కల వివరాలున్నాయి. చరిత్రకు ఆ నివేదిక గొప్ప ఖని. సంక్షిప్త నివేదిక 20 పేజీలలో యిచ్చారు.

దుష్పరిపాలన గుంటూరు దుర్భర స్థితికి కారణమని ఎలియట్ అన్నాడు. ప్రకృతి వైపరీత్యాలు, మార్కెట్ క్షీణత శాశ్వతంగా దెబ్బతీయలేదు. ముందు జమీందార్లు, తరువాత జిల్లా అధికార్లు జిల్లాను అధోగతిపాలు చేసిందన్నాడు. కంపెనీ పాలనలోకి వచ్చిన తొలిదశకంటె యిప్పుడు జిల్లా ఘోరంగా వుందన్నాడు. హుజూర్ కచేరీ అజమాయిషీలో జిల్లా అధికారులు గ్రామ నాయకులు కుమ్మక్కే యీ స్థితికి కారణమన్నాడు. కొన్నేళ్ళుగా ప్రభుత్వానికి రావలసిన నిధులు దారిమళ్ళాయి. జనం నుండి రెవిన్యూ వసూళ్ళయినాయి. ప్రభుత్వాన్ని బలహీన పరిచారు. సమస్యను కేవలం పైపైనే చూడగలిగామని, లెక్కలు చెప్పకుండా 572801లు గ్రామాల నుండి వసూళ్ళు చేశారని,

రూ.51,458లు రెవిన్యూ హుజూర్, గైబతు అధికార్ల కైవసం అయ్యాయన్నాడు. (1842కు ముందు రు.202902లు జమీందార్ల కైవసం అయింది).

జిల్లా ప్రజలు అసత్యాల్లో బ్రతకడం లేదు. చిత్తశుద్ధి లోపించింది అనలేం. దోషమంతా వ్యవస్థలో వుంది అన్నాడు ఎలియట్.

జిల్లా వ్యవస్థకు ఒకే కారణాలు ఒకే ఫలితాలను సృష్టించాయని ఎలియట్ నివేదించాడు.

ఎప్పుడైతే జిల్లా కలెక్టర్ వద్ద పలుకుబడిగల ఆఫీసర్‌ను జమీందార్ కొనడానికి సిద్ధమయ్యాడో;

ఎప్పుడైతే జిల్లా అధికారి జీతం తక్కువగా వుండి, పదవీకాలం, ప్రమోషన్ అనిత్యమో;

ఎప్పుడైతే భారీ మొత్తాన్ని వసూలు చేసుకోనిచ్చి, భారీ రాయితీలు యిస్తారో;

ఎప్పుడైతే అమాని జమీందారీ పాలనలో మార్పులు జరుగుతాయో;

ఎప్పుడైతే కలెక్టర్ల మార్పులు తరచూ జరిగి, కలెక్టర్లకు పరిమిత పెత్తనం వుంటుందో;

తగిన సాక్ష్యం సేకరించడానికి కష్టమైనప్పుడు జిల్లా, గ్రామాధికారులు యథేచ్ఛగా వ్యవహరిస్తారో.

ఎప్పుడైతే సమాచారం లేక, నిర్దిష్ట సర్వే లోపించి, అంచనా వుండదో.

అప్పుడు పాత ఆచారాలతో స్థానిక శక్తులు రాష్ట్ర అధికారాన్ని దిగదుడుపుగా చూస్తారు.

కేంద్రానికి అదుపు రావాలంటే 8 సంస్కరణలు వుండాలని ఎలియట్ సూచించాడు.

1. జమాబంది నిర్వహించడానికి సరైన సర్వే, పూర్తి పునర్విభజన, మెరుగైన పరిస్థితులలో జరపాలి.

2. గ్రామ నాయకులు, జిల్లా అధికార్ల వ్యవహారాలు అదుపులో పెట్టడానికి సరైన, సంపూర్ణ భూ రిజిస్టర్ అవసరం.

3. గ్రామ సంస్థల్ని పునరుద్ధరించి కరణాల మితిమీరిన అధికారాలు అదుపు చేయాలి. గుంటూరులో 882 గ్రామాలలో 46 గ్రామాధికార్లు వివిధ పదవులతో పిలవబడ్డారు. పెద్ద రైతు, పెద్ద కాపు, పెద్ద నాయుడు, పెద్ద రాజులు, పెద్ద రెడ్లు, పెద్ద తానాదార్లు. వీరంతా పేరుకేగాని అసలు పెత్తనం లేదు. మునసబులూ అంతే. అధికారమంతా కరణాలకే వుంది.

4. గ్రామ ఖర్చును పూర్తిగా రద్దు చేయాలి లేదా కచ్చితంగా అదుపులో పెట్టాలి.

5. అద్దెలు లేని ఇనాం భూముల విషయం పరిశీలించాలి. చెల్లని పట్టాల్ని తిరగదోడాలి.

6. సామర్థ్యం పెంచడానికి జమీందారీ సరిహద్దులతో నిమిత్తం లేకుండా తిరగదోడాలి.

7. ఇంగ్లీషు, దేశీయ భాషల రికార్డులు అమర్చి, అదుపు చేయాలి. గుంటూరు దఫ్తర్ ఖానా గందరగోళంగా వుంది. పట్టికల నమోదు లేదు. ప్రతులు సరిగా పుస్తకాలలో చేర్చలేదు. 4 వేల లెక్కల దఫ్తర్లు సక్రమంగా పెట్టాలి. పేపర్లు కట్టల నుండి తీసి గుడ్డ మూట చుట్టి రికార్డు గదుల్లో అడ్డదిడ్డంగా పారేశారు.

8. జిల్లా పాలక వ్యవస్థ పెంచాలి. ఆఫీసర్ల సంఖ్య, వారి జీతం

పెరగాలి. రైత్వారి జిల్లాలలో వారికి దీటుగా జిల్లా అధికారుల జీతా లుండాలి. కలెక్టర్, హెడ్ అసిస్టెంట్ అతి భారాన్ని అలాంటి వాతావరణంలో సాగించడం దుర్లభం. జిల్లా పైనా గ్రామాధికార్ల పైనా కన్నేసి వుంచలేరు. కలెక్టర్ల అధికారాల్ని తెగిందాకా లాగి ప్రయోజనం లేదు. ఇనాంలు, సర్వేలు చూడడానికి ప్రత్యేకాధికారులు కావాలి. ఓక్స్, విష్ల క్రింద గుంటూరు విలసిల్లింది. కలెక్టర్ జీతం బాగా వుండాలని డైరెక్టర్ల బోర్డు సూచించిన విషయం వినిపించుకోవాలి.

జమీందారీలను ప్రభుత్వానికి అమ్మేయాల్సిందే. ఉదారంగా జమీందార్లు నివసించడానికి భత్యాలు యివ్వాలి. వారి కుటుంబ స్వభావం గమనిస్తే అతి విలాసాలు, అసమర్థత, అవినీతి మారదనిపిస్తుంది. కరణాలు, గ్రామాధికారులతో వారు తట్టుకోజాలరు. ప్రభుత్వం ఎంత ఉదాశీనంగా వున్నా అదంతా బలహీనంగా భావిస్తారు. జమీందారీలను రద్దు చేస్తే ప్రజాదరణ కోల్పోతామనడం సరికాదని ఎలియట్ తలపోశాడు. పైగా జనానికి తమని కాపాడే పాలక వ్యవస్థ, అణచివేత నుండి ఆదుకునేరీతి కావాలనుకుంటున్నారు. జమీందారీ కుటుంబాల పట్ల విధేయత వారి గృహాలకే పరిమితం. గంజాంలో వున్న ప్రాచీన కుటుంబాలు కానరావు. జమీందార్లకు ఉదార రీతి పొందే హక్కేమీలేదు. ఈ పరిస్థితికి వారికి 8 శాతం ఉదారభత్యం యిస్తే చాలు.

కడప హుజూర్ సిరస్తిదారు అప్పారావును ప్రస్తుతించాడు. ఎలియట్ నివేదికలో తుదిగా చూడొచ్చు. గుంటూరులో అతడు చేరక ముందు ఎలియట్ కలవలేదు. అయినా అతని ఎంపిక పట్ల ఎలియట్ విచారపడలేదు. ఈ మరాఠా వ్యక్తి కష్టించిన తీరు, ఓపిక, నిశిత దృష్టి కమిషన్ విజయ సాధనకు ఉపకరించిందన్నారు.



అధ్యాయం - 15

# ఉన్నతాధికారుల స్పందన

## (1846-1848)

గుంటూరు జిల్లా పరిశీలన జిల్లా పాలనలో కీలక మార్పుకు దార్శి తీసింది. వాల్టర్ ఎలియట్ జీవిత సేవలో మార్పు వచ్చింది. ఆయన వెలుగులోకి తెచ్చిన సమాచారం రాష్ట్ర యంత్రాంగాన్ని కుదిపింది. గానుగెద్దు పయనం నుండి బయటకు లాగింది. ఆ తర్వాత నిర్ణయాల పట్ల ఆట్టే అభ్యంతరాలు లేవు. స్థానిక నాయకుల వ్యవహారాలు ఉన్నతాధికారుల పరిశీలనకు గురి చేశాయి. స్థానిక ప్రభావం అచితూచి, లోపాలను సరిదిద్దుకోమన్నారు. గుంటూరులో వీటి ప్రభావం చూడడానికి సంవత్సరాలు పట్టింది. అయినా పాత జడత్వం వదలిపోయింది. పాలనా చక్రాలు నెమ్మదిగా భిన్నమార్గంలో సాగాయి.

1845లో స్టోక్స్ గుంటూరుకు తిరిగి వస్తే, మద్రాసులో ఆయనపట్ల సానుభూతితో వినేవారున్నారు. కచేరీని ప్రక్షాళన చేశారు. వైట్ నియమించిన కచేరీ గైబటు వ్యక్తులు ఆయనకు అనుకూలంగా పని చేశారు. బోర్డులో గోల్డింగం, ఎలియట్ వున్నందున పూర్తి సహకారంతో తక్షణ పరిష్కారాలు లభించాయి.

1846 మే - డిసెంబరు మధ్య జిల్లా పాలన సక్రమ మార్గంలోకి వచ్చింది. 5 వేల రూపాయల చొప్పున జమీందారీలను ప్రభుత్వం కొనేసింది. గుంటూరును 12 పొందికైన తాలూకాలుగా విభజించారు. (పల్నాడుతో కలిపి 14) తాలూకా కచేరీ నుండి 2 లేక మూడు గంటల్లో ఏ వూరైనా చేరవచ్చు. గ్రామాధికారులు త్వరగా సమావేశం కావచ్చు. జిల్లా అధికారులు వేగంగా చర్యలు తీసుకోవచ్చు. ఆ విధంగా పని భారం తగ్గించారు. 640 గ్రామాలలో గ్రామ మునసబులను నియమించి, జీతాలు, అవకాశాలు ఏర్పరచి, కరణాలకు దీటుగా ఏర్పాట్లు చేశారు. ప్రమాణయుతంగా ఫారాలు, పద్ధతులు ప్రవేశపెట్టి మోసం చేయడం దుర్లభం చేశారు. ఎలియట్ చేసిన పైలట్ సర్వే వలన మక్తా గ్రామాలు 467కు పెరిగాయి. మక్తా గ్రామాలలో పంటలు అమ్ముకోవడం సులువు చేశారు. అందువలన రెవిన్యూ వసూళ్ళు మునుపటి కంటే సకాలంలో జరిగాయి.

(హడల్‌స్టన్ స్టోక్స్ - జమాబంది రిపోర్టు 1256 ఫసలి) పల్నాడులో సర్వే లెక్కలు తిరగదోడారు. నయాబ్ సరస్తిదార్ పూర్తిగా రిజిస్టర్ చేయగా, దాచిన సాగు విషయాలు బయటపడ్డాయి. ఇనాంలు కొలిచారు. రెండేళ్ళలో భూమిశిస్తు పెరిగి 10వేల రూపాయలకు మించింది. ఉప్పుశాఖ అవినీతి లేకుంటే రెవిన్యూ చాలా పెరిగేదే.

1843లో స్టోక్స్ ప్రతిపాదించిన పాలనా సంస్కరణలు 1846-1847 మధ్య అమలులోకి వచ్చాయి. సమస్యలు వున్నాయనుకోండి. కనీసం బోర్డు, కలెక్టర్లకు మద్దతు పలికింది ఉన్నతాధికారుల అనుమతికి లోబడే. సమస్య ఏమంటే, గ్రామాలలో, జమీందారీలలో రావలసిన బకాయిలు, జమీందార్లు, జిల్లా అధికార్లు కాజేసిన సొమ్ము రాబట్టడం ఎలాగ అనేదే. కాజేసిన, దాచిన సొమ్ముకు ప్రయత్నిస్తే ఎదురైన న్యాయ చిక్కులు,

కోర్టు కేసులు అన్నీ రికార్డులలో నిండి పోయాయి. రు.74,14,378లు 14 అణాలు 5 దమ్మిడీలు పోయిందనుకొని వదిలేయమని 1849 అక్టోబరు 22న ఉత్తర సర్కార్ల కమిషనర్ ఎలియట్ చెప్పాడు.

ఎలియట్ రిపోర్టు ఇచ్చిన తరువాత ప్రభుత్వం సంప్రదింపుల మినిట్ సిద్ధం చేయడానికి 20 మాసాలు గడచింది. ఈ లోగా ఉత్తరాల రూపేణా రిపోర్టు విషయాలు డైరెక్టర్ల కోర్టుకు చేరింది. బయట పెట్టినప్పుడల్లా తగిన పరిష్కార చర్యల అనంతరమే యిదంతా జరిగింది.

1845 జులై 10న డేనియల్ వైట్ పూర్తి నివేదికను రెవిన్యూ బోర్డుకు 81 పేరాలలో పంపాడు. సస్పెండ్ అయిన సరస్తిదార్ పై అభియోగాలు, వాటిని సమర్థించే సాక్ష్యాలతో యివి వున్నాయి. ఈ సమాచారం ఎలియట్ సమకూర్చాడు.

శేషగిరిరావు తెలిసి, కావాలని రెవిన్యూ వసూళ్ళు చేయక, స్టోక్స్ వ్యక్తిత్వాన్ని దెబ్బ తీశాడు. గ్రామాలలో కవుళ్ళు కావాలని తగ్గించుకో నిచ్చాడు. పైగా భూములు కాజేశాడని వైట్ రాశాడు. అతన్ని ఏవిధంగా వర్ణించినా తక్కువే అన్నాడు. ప్రభుత్వం శేషగిరిరావును ఎన్నడూ నియమించరాదని వైట్ అన్నాడు.

ప్రభుత్వం కలవరపడి కేవలం డిస్మిస్ చేస్తే చాలదని, చట్టబద్ధ చర్యలకు పూనుకున్నారు. పూర్తి విచారణ జరిపి, సాక్ష్యాలు సేకరించి, తీర్పు వచ్చిన తర్వాతే కేసు పెట్టాలన్నారు.

శిక్షించడానికి కేసు మాత్రమే చాలదని, విఫలమయ్యే చిక్కువున్నదనీ వైట్ అన్నాడు. కనుక తక్షణమే అతన్ని బోర్డు డిస్మిస్ చేసింది. ఈలోగా వైట్ ఆరోగ్యం క్షీణించింది. పరిపాలనా భారమంతా నెవిల్ పై పడింది.

గుంటూరులో యూరోప్ పెత్తనాన్ని దిగదుడచడానికి ప్రయత్నాలు జరిగాయి.

జిల్లా అధికారుల అవినీతి చర్యలకు తీవ్రచర్య వుండాలని ట్వీడల్ అన్నాడు. జిల్లాలో యింకా విద్రోహ చర్యలకు పాల్పడుతున్న శేషగిరిరావును శిక్షించా లన్నారు. కలెక్టర్లు హెచ్చరికలు చేస్తే రెవిన్యూ బోర్డు పట్టించుకోపోతే ఏమౌతుందో చూడమని డికిన్సన్ అన్నాడు. గోల్డింగం స్టోక్స్ మాట వింటే అంత అవినీతి, అణచివేత వుండేది కాదన్నాడు. కలెక్టరు యీ సంగతి తరచు ఫిర్యాదు చేస్తుండగా, యిప్పటికీ పరిస్థితి మెరుగైనట్లు లేదు. ప్రభుత్వ జోక్యం అవసరమౌతున్నది. శేషగిరిరావును శిక్షించే అవకాశం కనిపించనందున, న్యాపతి శేషగిరి రావును, అతని అల్లుడు అంబర్ ఖానా పురుషోత్తమ రావును (హెడ్ గుమాస్తా) శాశ్వతంగా ప్రభుత్వ సేవల్లోకి రానివ్వరాదు. జిల్లా వ్యవస్థలో అవినీతి అలముకున్నప్పుడు, అభియోగాలు రుజువైనచోట సీనియర్ అధికారి పై గట్టి చర్య అవసరమని హెన్రీ చామియర్ కోరాడు. శేషగిరిరావును క్రిమినల్ కోర్టు ముందు నిలబెట్టా లన్నాడు. అలాంటి చర్య నిమిత్తం దేశస్త నాయకుల విషయాలు బోర్డుకు పంపారు.

డిస్మిస్ చేసినట్లు తెలిసి, తనను కాపాడుకోడానికి శేషగిరిరావు మద్రాసు చేరాడు. శేషగిరిరావు చిత్తశుద్ధి లేని వాడని లెనిన్‌కు తెలిసి, అతన్ని చూడ, విముఖత వ్యక్తం చేశాడు.

శేషగిరిరావు ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశాడు. నిష్పాక్షిక అధికార్లిద్దరితో విచారణ జరిపించమన్నాడు. తన పేరు నిలబెట్టుకోడానికి అలా అడుగుతున్నానన్నాడు.

(ట్వీడల్‌కు విజ్ఞప్తి 1845 డిసెంబరు 14).

లోగడ యూరోపియన్ అధికారులు 12 మంది తన సేవల్ని ప్రస్తుతించిన జాబుల్ని జత చేశాడు. యూరోప్ అధికారులకు తనపై తప్పుడు ఫిర్యాదులు చేసిన మంగనూరు లక్ష్మీనరసురావు, సబ్నవీస్ వెంకట కృష్ణారావులు యిదంతా చేయించారన్నాడు. అలా పథకం వేసిన వారిని పట్టించుకోవడం పట్ల గుంటూరులో చుట్టుపక్కల జిల్లాలలో చిత్తశుద్ధి గలవారు విస్తుపోతున్నారన్నాడు.

స్టోక్స్, నెవిల్, గోల్డింగంల శత్రుత్వం ఎలియట్, వైట్‌ల పాక్షికతలో దేశీయ ఉద్యోగుల్ని కాపాడడంలో రెవిన్యూ బోర్డు వైఫల్యం దృష్ట్యా తనకు న్యాయం చేకూర్చమన్నాడు. (మద్రాసు రెవిన్యూ లెటర్స్ 1846 మార్చి 7) లోగడ యిచ్చిన తన 6 పిటిషన్లు బోర్డులో నిద్రిస్తున్నాయన్నాడు. శిక్షించేవాడు, జడ్జి ఒకరే అయినప్పుడు, గోల్డింగం రెవిన్యూ బోర్డులో వుండగా, న్యాయ విధానానికి విరుద్ధంగా తీరు నడుస్తున్నదన్నాడు.

1846 మే నాటికి హెడ్ సిరస్తిదార్, హెడ్ గుమాస్తా పై యిక సాగడం మానుకున్నారు. మద్రాసు, లండన్ మధ్య సాగిన ఉత్తర ప్రత్యుత్తరాలు, శేషగిరిరావు పిటిషన్, 2 ఏళ్ళు అలాగే వుండిపోయాయి. దేశస్త అధికారుల దోషంపై అభిప్రాయ భేదం లేదు. ప్రభుత్వ తీర్పు అంగీకరించారు.

(1848 జూన్ 1న కేసు తుది పరిష్కారం గుంటూరుకు పంపేశారు)

ఎలియట్ రిపోర్టుననుసరించి గుంటూరు సమస్యల్ని ప్రభుత్వం 1847 డిసెంబరు 6న పట్టించుకున్నది. మూడు తీరుల అభిప్రాయాలు వెల్లడయ్యాయి. సంక్షోభానికి కారణాలు, జమీందార్ల విషయం ఏం చేయాలి. ఎలియట్ 8 సిఫారసులను ఏం చేయాలి.

గుంటూరు గొడవల వెనుక దుష్టపరిపాలన వున్నది. గుంటూరులో శాశ్వత కౌలుదారీ పద్ధతి అమలు చేశారు. అంచనాలు మితంగా వున్నా,

చెల్లింపు అంతంత మాత్రమే అయినా, కుటుంబ కలహాలు, కోర్టు తగాదాలు, ఆశ్చర్యకరంగా విలాస ఖర్చులు, కరువు, తెగుళ్ళు వున్నా ఖర్చు బెట్టడం, జిల్లా అధికారుల గ్రామ నాయకులు కుమ్మక్కు కావడం కారణంగా జిల్లా ఎన్నడూ లేనంతగా దీనావస్థకు గురైంది. జమీందారీ సెటిల్‌మెంట్ వైఫల్యానికి ప్రభుత్వం కారణంకాదు. కానీ ప్రభుత్వ యాజమాన్యం తేలికగా కొట్టేయగూడదు. గోల్డింగం, స్టోక్స్ చేసిన ప్రయత్నాలకు మద్రాసు మద్దత్తు లేదు. జిల్లా అధికారులు శిక్షలు లేకుండా తప్పించుకున్నారు.

(సగటున రెవిన్యూ దుర్వినియోగం 8 శాతం వుంది. కాని యీ సంఖ్య చాలా హెచ్చుగా వుండాలి).

జమీందార్లకు యిచ్చే విషయమై ప్రభుత్వానికి 3 సమస్యలు ఎదురయ్యాయి.

1. జమీందారీలను మళ్ళీ పునరుద్ధరించుట
2. ప్రతి కుటుంబానికీ కొన్ని గ్రామాలు యిచ్చుట.
3. డబ్బు ఒనగూర్చుట.

ఎలియట్ ప్రకారం భత్యాలివ్వాలేగాని, వారిని తిరిగి తీసుకు రాకూడదు. వారి పాలనా సేవలకు పరిహారంగా చెల్లించడం ఒక్కటే మిగిలిందన్నారు. సేవలు లేవు గనుక, హక్కులు లేవు. సాలీనా జమీందార్లకు కప్పంలో 8 శాతం సుమారు ఒక లక్ష రూపాయలు యివ్వమని ఎలియట్ చెప్పాడు. దీనివలన వారి గౌరవం దక్కుతుంది. దేశీయులు అది హర్షిస్తారు. గవర్నర్ ఇన్‌కౌన్సిల్ యీ సూచన అంగీరించాడు. లోగడ తీసుకుంటున్న పెన్షన్ మినహాయించదలచారు కూడా. ఏడాదికి 34,800లు ఆ మొత్తం వుంది. (గార్డన్ మెకంజి, ఎ మాన్యుల్ ఆఫ్ కృష్ణా డిస్ట్రిక్ట్ 1887 మద్రాసు).

ఎలియట్ 8 సిఫారసులు ప్రభుత్వం సమర్థించింది. గ్రామాలపై అదుపు వుండాలనేది బాగా పట్టించుకున్నారు. ఇనాం భూములతో సహా, పూర్తి భూ వివరాల రిజిస్టర్ తయారు చేయాలి. రెవిన్యూ అంచనాలలో కులం పేరిట యిచ్చే సౌకర్యాలు సాధ్యమైనంత వరకు తగ్గించాలి.

1100 మునసబులు, 1100 కరణాలు, 1500 తిలారీలు - పోలీసులు అవసరం. వారికి జిల్లా తాలూకా ట్రెజరీల ద్వారా చెల్లించాలి. గ్రామ ఖర్చు రద్దు చేయాలి. అలా ప్రకటించాలి. ట్రెజరీల నుండి తప్ప, బత్తాలు మరెక్కడ నుండి తీసుకున్నా శిక్షార్హం చేయాలి. నిర్దుష్ట సర్వేను బట్టి యివన్నీ చేయాలి. స్టోక్స్ అభివృద్ధి చేసిన మక్తా అంచనాల ప్రకారం ఉమ్మడి గ్రామ కవుళ్ళు పెంపొందించాలి.

ఎలియట్ సిఫారసులు ఆమోదించిన ప్రభుత్వం ఆర్థికాభివృద్ధి పై దృష్టి సారించింది. అందులో నీటి వనరులు ప్రధానం. గుంటూరు ఇంజీరింగ్ శాఖలో ఒక అసిస్టెంట్ ఇంజనీర్ (సివిల్) పూర్తిగా యీ పనికి వుండాలి. కృష్ణానదిపై ఆనకట్ట కడితే, నీటి సరఫరా సక్రమం అవుతుంది. పంట కాలాలు అనూహ్యంగా మారినా ఎదుర్కోవచ్చు. నిరంతర నీటి సరఫరా వలన ఆర్థిక సుస్థిరత, అభివృద్ధి వుంటుంది.

ఎలియట్ రిపోర్టు, మద్రాసు నుండి లేఖ చూచి లండన్ పెత్తందార్లు ఉలిక్కిపడ్డారు.

మద్రాసు ప్రభుత్వానికి వ్యతిరేకంగా జమీందార్లకు అనుకూలంగా వున్న దృష్ట్యా కోర్టు వ్యాఖ్యానించింది. నిజమైన కారణాలు తెలిస్తే ఎస్టేట్లను అమ్మమని, ప్రభుత్వం కిందకు తీసుకొమ్మని అనేవాళ్ళు అన్నారు.

జమీందార్ల రద్దుకు తీసుకున్న చర్యలన్నీ సమర్థించారు. దీని రాజకీయ ఫలితాలు ఎలావుంటాయోనని లండన్‌లో కలవరం చెందారు. వారిపట్ల

విశ్వాసరాహిత్యంగా వ్యవహరించామనే అభిప్రాయం రాకూడదు. ప్రభుత్వం ఏకారణాలుగా వారి రద్దుకు నిర్ణయించిందో అనేది తగినంత ప్రచారం చేయాలి. ఉత్తర సర్కారు కలెక్టర్లు జమీందార్లకు, ఇతర వర్గాలకు గుంటూరు ప్రొసీడింగ్స్ వివరించమన్నారు. జమీందారీల వ్యవస్థను అట్టిపెట్టిన తీరు, సనద్‌ల లొంగుబాటు వెనుక దారుణాలు తెలియాలి.

ఇనాం కవుళ్ళ విచారణలో కొంత తటపటాయింపు గమనించారు. అనేక ఇనాంలు చెల్లవని ఎలియట్ సిఫారసు చేశాడు. ఇనాంలు తిరిగి యివ్వాలనేవారు. వారి పట్టాలకు ఆధారాలేమిటో చూపాలి. మార్జిన్‌లో పెన్సిల్‌తో రాస్తూ, వున్న వ్యవస్తను ఇదంతా మార్చేసినట్లే. ప్రభుత్వం, తన పట్టా హక్కుల్ని వివరించాలి. ఇలియట్ సిఫారసులు అతని పట్ల నమ్మకాన్ని దెబ్బతీస్తున్నాయి. అది విశ్వాస ఘాతుకమౌతుంది.

(1854 వరకు ఇనాంల విచారణ మొదలు కాలేదు. వాటిని తిరగదోడలేదు.)

ఆ తరువాత 20 ఏళ్ళకు గానీ ఫలితం చూడలేదు.

బాధాకరమైన అంశాన్ని డైరెక్టర్ల కోర్టు పట్టించుకున్నది. చాలాకాలం పాలనా లోపాన్ని గమనించలేదు. కలెక్టర్లను తరచు మార్చడం ఒక కారణం. అయినా అధికారంలో వున్న వారి దృష్టికి ఒక్క ఉదాహరణ సైతం రాకపోవడం ఆశ్చర్యం. జిల్లా అధ్వాన్న స్థితిని గమనించలేదు. ఏదో కుట్ర జరిగిందని కోర్టు భావించింది. ఇందులో బలహీనత, అసమర్థత వుందని కోర్టు అన్నది. రెవిన్యూ బోర్డుకు కలెక్టర్లకు మధ్య వివాదాలు, సిరస్తెదార్ల నియామక కలహాలు, మద్రాసు అజాగరూకతలను సూచిస్తున్నది. దుశ్చింతలో జమీందార్లకు మించి పోయి కలెక్టర్లు వ్యవహరించారు. దాతృత్వ సంస్థలకు దోపిడీ సొమ్మును కట్టబెట్టారు.

ఎలియట్ బయట పెట్టిన వాటి ప్రభావం బాగా వుంది. నష్టాలు 80 లక్షల మేరకు వున్నాయి. దీనికి తగ్గట్టుగా మద్రాసు ప్రభుత్వం స్పందించలేదు. వాటిని సరిదిద్దడానికి చర్యలు తీసుకోలేదు.

(జమీందార్లపట్ల సానుభూతి పోడానికి యివ్వన్నీ కారణాలు) ఎలియట్ నివేదిక, దాని పరిశీలనకు ప్రభుత్వం చేసిన జాప్యం చాలా అసంతృప్తినిచ్చింది. (1846 ఏప్రిల్ నుండి 1847 డిసెంబరు దాకా పట్టించాయి.)

వాల్టర్ ఎలియట్ బయట పెట్టిన గుంటూరు పరిస్థితి ఎంత ఆందోళన కలిగించిందంటే, లండన్ పాలకులు మళ్ళీ ఉత్తర సర్కార్ల విషయం తరచి చూచారు. ఇతర జిల్లా గతి కూడా దారుణంగానే వుంది. (అప్పటికి ప్రభుత్వం పూర్తిగా మారిపోయింది. ట్వీడల్ యింటికెళ్ళాడు. చామియర్ రిటైర్ అయ్యాడు. త్వరలోనే డికిల్సన్ రిటైర్ కాబోతున్నాడు.)

సిఫారసులను అమలు చేయడానికి ఏమీ చేయలేదు. రాజమండ్రిలో సర్ హెన్రీమాంట్ గోమరి కూడా ఎలియట్ వలె సిఫారసులు చేశాడు. శ్రద్ధగా పర్యవేక్షణ అవసరం అన్నాడు.

*ఉత్తర సర్కార్లలో బకాయిలు*

| సర్కార్లు | 1839 బకాయిలు | 1846 బకాయిలు |
|---|---|---|
| గుంటూరు | 43,76,332 | 74,37,106 |
| రాజమండ్రి | 12,13,863 | 14,25,605 |
| మచిలీపట్నం | 17,07,059 | 28,08,855 |
| విశాఖపట్నం | 3,07,441 | 4,04,325 |
| గంజాం | 2,69,308 | 9,00,058 |

రెవిన్యూ బోర్డు సభ్యుడికింద ఉత్తర సర్కార్లను ఉంచారు. ప్రస్తుత జీతం నెలకు వెయ్యి రూపాయలతో బాటు, ఉత్తర సర్కారు కమిషనర్‌కు ప్రత్యేక డిప్యూటేషన్ బత్తా యిచ్చారు. కమిషనర్‌కు ప్రత్యేకాధికారాలివ్వాలని భారత ప్రభుత్వాన్ని కోరారు. వాల్టర్ ఎలియట్ ప్రదర్శించిన సత్తా అభిలషణీయం అందుకు అర్హత స్థానం అతడికి యిచ్చారు.

కోర్టు సూచనల్ని మద్రాసు ప్రభుత్వాధినేత సర్ హెన్రీ పోటింగర్ తక్షణమే పాటించాడు. ఉత్తర సర్కారు జిల్లాలకు ఆ సూచనలు పంపించాడు. ఎలియట్‌కు ఉత్తర సర్కార్ల పాలన అప్పగించారు. రెవిన్యూ బోర్డు అధికారాల్ని ఎలియట్‌కు దత్తం చేశారు. ఇందుకు మరామ్మత్తు శాఖను మినహాయించారు. రెవిన్యూబోర్డు భారాన్ని నాలుగోవంతు తగ్గించారు.

గుంటూరులో త్వరితగతిన రికవరి చేశారు. దాంతో కరువు ముందటి స్థితికి పరిస్థితులు పునరుద్ధరణ అయ్యాయి.

1847 జనవరి 31 ప్రకటన ప్రకారం గుంటూరు కలెక్టర్లపై అభిశంసన తక్షణమే జాన్ గోల్డింగంను స్పందింపచేసింది. ఇన్నాళ్ళుగా అతడు చెబుతున్నవి అమలులోకి వచ్చాయి. జమీందార్ల దుష్పరిపాలన సూచిస్తూ అతడు చార్లస్ కాటన్‌కు రాసి, పరిష్కారం సూచిస్తూ పోయాడు (1839 డిసెంబరు 13).

మద్రాసు ప్రభుత్వం ఉపద్రవాల గురించి అధికంగా ప్రస్తావించినా, జమీందార్ల దుష్పరిపాలన చెబుతూనే వచ్చారని అన్నారు.

జిల్లా కోలుకొన్న తీరు, ఉత్తర సర్కార్లను, కమిషనర్‌కు అప్పగించడం మద్రాసు ప్రభుత్వానికి తృప్తి నిచ్చింది. గోల్డింగం రెవిన్యూ బోర్డులో 3వ సభ్యుడుగా శాశ్వత అర్హత పొందాడు. అతనిపై దోషాలన్నీ

పటాపంచలయ్యాయి. గుంటూరు దుష్పరిపాలన విషయమై యిది స్పష్టపడింది.

వాల్టర్ ఎలియట్ సర్వీసు ఆరంభం అంతం దివ్యంగా సాగింది. 1854 ఆగస్టు 16 వరకు ఉత్తర సర్కార్ల ఇన్‌ఛార్జిగా వున్నాడు. తరువాత కౌన్సిల్ సభ్యుడుగా టి.వి. స్టోన్ హౌస్ స్థానంలోకి వచ్చాడు. ఆ సిపాయి తిరుగుబాటు కాలంలో లార్డ్ హారిస్ ఆరోగ్యం క్షీణించగా, ఎలియట్ ప్రొవిజనల్ గవర్నర్ అయ్యాడు. (ఆయన కజిన్, లార్డ్ ఎల్ఫిన్‌స్టన్ అప్పుడు బొంబాయి గవర్నర్) అప్పుడే కంపెనీ నుండి రాజుకు భారత దేశ పెత్తనం సంక్రమించింది. 1859 డిసెంబరు 27న అతడు రాజీనామా చేశాడు. ఆరేళ్ళ తరువాత అతని సేవలకు నైట్ హుడ్ యిచ్చారు. తరువాత ప్రాచ్య ఖండం అధ్యయనం చేసి, ఖ్యాతి పొందాడు ఎలియట్.



## ముగింపు - ముక్తాయింపు

గుంటూరుజిల్లాలో రాష్ట్రాన్ని దెబ్బతీస్తూ స్థానికశక్తులు నెమ్మదిగా బాగుపడుతూపోయాయి. ఇది 1788-1848 మధ్య, ముఖ్యంగా 1837 నుండి 1845 వరకు గమనార్హం. గ్రామాల విషయమై కచ్చితమైన సమాచారం లేదు. మద్రాసు మద్ధతు లోపించింది. అలాంటి దశలో బ్రిటిష్ అధికారులు బలహీనపడ్డారు. తమ కింద వారిపై అదుపువహించ లేకపోయారు. జిల్లా అధికారులు అందునా మరాఠా బ్రాహ్మణులు, సిరస్తిదార్ ఆధ్వర్యంలో జమిందార్లవలె వ్యవహరించారు. ప్రభుత్వం పేరిట వీరు చలాయిస్తుంటే అదుపు చేసేవారేలేరు. అధికార మందిమార్బలం అంతా వీరికి వుండేది. హుజూర్ పెత్తనంలో తామే దైవాంశ సంభూతులమన్నట్లు సగర్వంగా తలెత్తుక తిరిగారు. కూతురు పెళ్ళి, విగ్రహావిష్కరణ పేరిట గ్రామాలనుండి కట్నాలు, కానుకలు స్వీకరించారు. ఈ బేరసారాల్లో గ్రామాలూ లాభపడక పోలేదు. గ్రామ సొమ్ముతో పైఅధికారులను వశపరచుకొని, తమ ప్రభావం కిందకు పాలనావ్యవస్థను వుంచుకోగలిగారు.

గ్రామాలు చిన్నగా కనిపించినా పెద్ద జిల్లా పాలనావ్యవస్థను కట్టి పడేయగలిగారు. స్థానిక ప్రభావం గణనీయంగా ప్రభావం చూపెట్టింది. కేంద్రపెత్తనం బలహీనంగా, ఎలాంటి ప్రభావం లేకుండావుంది. అనేక ఏళ్ళపాటు కేంద్రపెత్తనాన్ని కాదని, కంపెనీ విధానాన్ని కప్పి పుచ్చిన తీరు స్థానిక బలంగా పరిణమించింది.

స్థానికం ఒకవైపు, కేంద్రం మరోవైపు, పాలనలో, రాజకీయంగా ఎలా సాగాయనేది పరిశీలించడమే యీ గ్రంథ ఉద్దేశ్యం. పరస్పర విరుద్ధంగా ఒకదాన్ని మరొకటి కాదంటూ సాగిన తీరు చూడడమే యిక్కడ

ప్రస్తావించాం ఈ రెండూ పొందిక లేనివి. ఒకవైపు అకాశం, మరోపక్క దుమ్ముధూళి, యీ రెండిటి నడుమ నెమ్మదిగా సాగిన పెత్తనం, గోలగోలగా దర్పం చాటిన కేంద్రం, శక్తివంతంగా ప్రదర్శితమైన ధోరణి గమనించాలి. ఒక జిల్లాలో, పరిమిత స్థాయిలో యీ రెండు పరస్పర విరుద్ధశక్తుల వైవిధ్యం గమనించాం.

చూడడానికి చిన్నగా కనిపించే తెల్లని చిన్న చెదలు, వేలాదిగా కలిస్తే భారీవృక్షాన్ని తొలిచి, తినేస్తాయి. డాక్ బంగళాలో వదలేసిన కుర్చీకి చెదపడితే చూస్తుండగానే అది ఎందుకూ కొరగాకుండాపోతుంది. చలిచీమలు కలిసినట్లే స్థానిక నాయకత్వం మౌనంగా, నెమ్మదిగా భారీపాలనను కేంద్రంలో కుదిపేశారు. భారతదేశంలో ఛత్రం కింద కూర్చొనడం రాజరీవికి లక్షణం. కంపెనీబలం దేశంలో అలాగే వుండేది. దాని నీడన తలదాచుకోడానికి ఎందరికో అవకాశం కల్పించింది.

అధికార చట్రంలో అడుగడుగునా స్థానికశక్తులు జోక్యాన్ని అడ్డుకున్నాయి. జిల్లాలో బయటవారి ప్రవేశాన్ని నిరోధించాయి. జిల్లాలో తలెత్తిన గ్రామ మితవాదశక్తులు బయటిశక్తులకు అడ్డుపడ్డాయి. స్థానికనాయకులు తాము చెప్పేది పాటించాలని కేంద్రపాలితులు తలపోశారు. ఆ విదేశీశక్తుల్ని చెడగొట్టి, అవినీతిలోకి దింపడం స్థానికశక్తులు చేసిన ప్రయత్నమే.

గ్రామానికి, హుజూర్‌కు మధ్యస్థాయిలో, జిల్లాపాలనాసంస్థలలో, దళారీల చుట్టూ సంఘర్షణలుండేవి. ఉభయపక్షాలూ యీమధ్య దళారీలను విధేయంగా వుంచుకోవడం, లేక అవినీతిపనులతో భ్రష్టం చేయడం అనేవి యధాశక్తి చేశారు.

పరిపాలనలో స్థానిక, కేంద్రశక్తులు పరస్పరం తలపడ్డాయి. వ్యవస్థలో,

ప్రభుత్వ పనిలో యీ పోరాటం చూడొచ్చు. ఈ యంత్రాంగాన్ని అదుపులో పెట్టడానికి ఉద్దేశించిన నియమ నిబంధనలు, సిబ్బంది మార్చడం, ప్రసార సాధనాలు, ఫైళ్ళ జాప్యం, మార్పులు చేర్పులు చేయడంలో కనిపించేవి. జిల్లాలో ప్రభుత్వ యంత్రాంగాన్ని అదుపులో వుంచాలన్న వారే తమ ఆసక్తులు కూడా జాగ్రత్తగా చూచుకున్నారు. 1831లో జాన్‌విప్ వెళ్ళిపోయారు. 1845లో వాల్టర్ ఎలియట్ వచ్చారు. అప్పుడు మద్రాసు ప్రభుత్వపక్షంలో పాలన సాగలేదు.

గుంటూరులో స్థానిక ప్రభావ విశేషం ఏమంటే, పై అధికారులకు లొంగి వున్నట్లే కనిపించి, తమ పబ్బం గడుపుకోవడం. (ఇది డా॥ ఎ.టి. ఫిష్‌మాన్‌కు చెప్పిన అంశం. ఆయన ఆంధ్ర క్రిస్టియన్ కళాశాల సభ్యుడు. మిషనరీగా 40 ఏళ్ళ అనుభవం వుంది. తెలుగులో పండితుడు.

ఫిల్డ్‌నోట్స్ 1959 నవంబరు 5

ఎ.టి. ఫిష్మన్ - కల్చర్ ఛేంజి అండ్ ది అండర్ ప్రివిలెజ్‌డ్ 1941 మద్రాసు)

మద్రాసుపెత్తందార్లను కలవరపరచిన యీ ధోరణిలో ఒక వైపున అణగివున్నట్లే కనిపించి, మరోపక్క ప్రతిఘటించడంవుంది.

స్థానికపెత్తందార్లుగా పెత్తనంవహించిన యీ ముఠాలు తెల్లని చర్మవర్ణం గల కులాలు. వారిలో వారు సంఘర్షించినా లేకున్నా, యీ బ్రాహ్మణకులాలు కొన్నిసార్లు శూద్రులలో ఉన్నత కులాలతో కలసి గ్రామాలలో అధికారం, జిల్లాలలో పాలనపై గుత్తాధిపత్యం సాధించారు. ద్విజులకు మంచిచెడ్డల విచక్షణ లేదు. ఆద్యంతాలు లేవు. సంపూర్ణం అసంపూర్ణం అనేదిలేదు. వారి ఉమ్మడి కుటుంబాలు, వారి కులంచుట్టూ పరిభ్రమించారంతే.

మానవత్వం అక్కడే అంతమై, అనుమానం, వ్యతిరేకత ఆరంభ మయ్యాయి. ప్రజాసేవ, సమాజవిలువ, ఆసక్తులు, ఉద్దేశాలు, విధేయతలు, జాతీయత, బాధ్యతలు అన్నీ తమ కుటుంబం, తమ కులం చుట్టూ గిరిగీసుకొని పరిభ్రమించాయి. కులాల రీత్యా స్థిరీకరణ వుంది. కుటుంబాలు సామాజికంగా, నైతికంగా గిరిగీసుకొని సాంఘిక వ్యవస్థను రూపొందిచుకున్నాయి. అన్ని స్థాయిల్లో పై అంతస్తువారే లాభపడ్డారు. సమాజాన్ని అలాగే అట్టిపెట్టడానికి మత, సంఘ, ఆర్థికపరంగా విధులు ప్రవేశపెట్టారు. వారే స్థానిక ప్రభావానికి మూలం.

వారంతా ఒకే భావనతో ఒకే వర్గంగా లేరు. కొందరు స్థానికంగా భూమిని అంటి పెట్టుకున్నారు. మరికొందరు వింజామరలు పట్టుకొని, స్థంభాలను ఆధారం చేసుకున్నారు. నియోగి బ్రాహ్మణులు ఒక గొడుగు కింద వుండాలనుకోలేదు. మరాఠా బ్రాహ్మణులు (దేశస్తులు) విపరీతంగా బాగా లాభం పొందారు. వ్యవస్థ కుప్పకూలితే నష్టపడడానికి సిద్ధపడ్డారు.

పాలనలు మారిపోతుంటే నియోగి కరణాలు వుందాశీనంగా వున్నారు. పాలన మారుతుండగా దేశస్త బ్రాహ్మణులు జిల్లా అధికార్లుగా తమ బలాన్ని కాపాడుకుంటో పోయారు. స్థిరత్వం, శాంతి వున్నప్పుడు వారెక్కువగా ప్రయోజనం పొందారు.

ఉత్తరభారతదేశంలో సాంఘికవ్యవస్థ మతంలేని సమాజంగా వున్నప్పుడు స్థితి గురించి ఆగస్టిన్ చిత్రించాడు. పర్సివల్ స్పియర్ అందులో భాగంగా వుదహరించడం గమనించాలి.

ఉన్నత క్రింది వర్గాల మధ్య సంబంధాలు, ఒక ఉన్నత కులానికీ, మరో పైకులానికీ, స్థానికం కేంద్రసంస్థలకూ మధ్య సంబంధాలను యీ ప్రకటనలో చాలా బాగా అతికేటట్లు చూపారు.

"రాజ్యం ఒక పెద్ద దోపిడీముఠా. వారి దృష్టిలో మిగిలిన వారంతా కొరముట్లు మాత్రమే."

(టి.జి.పి. స్పియర్ : ట్విలైట్ ఆఫ్ ది ముగల్స్ - కేంబ్రిడ్జి 1951 పే 120)

దేశస్తులు ఒక దోపిడీముఠా అనుకుంటే, వారు మరో దోపిడీ ముఠాతో వ్యవహరిస్తున్నారనవచ్చు. మనం పరిశీలించే కాలంలో, వాడల్‌స్టన్ స్టోక్స్‌కు వ్యతిరేకంగా, శేషగిరిరావు నాయకత్వాన గ్రామనాయకులను కూడా గట్టి సాధించడమే. అలా చేయడంలో వారు నెమ్మదిగా రహస్యంగా ఒక రాజ్యంలో మరోరాజ్యాన్ని అల్లుకొచ్చారు. వారికి సమాజంలో కిందవర్గాల సంక్షేమం, ఆర్థికసాంఘిక అభివృద్ధి పట్ల ఎలాంటి సానుభూతి లేదు. వారంతా సహజంగా తక్కువ వారనే భావించారు. అలాంటి వారెప్పుడైనా జారిపోవచ్చు. కనుకనే, ప్రభుత్వపాలనకంటె వీరు యింకా దారుణంగా అణచివేతకు పూనుకున్నారు. ఉన్నంతలో పీక్కు తినడమే వారి పని. దీనివలన జిల్లా బాధలకుగురైంది.

యూరోప్‌పాలకులు సంప్రదాయంగా వస్తున్న ఉన్నతవర్గాలపై వారి విశ్వాసంపై, సంప్రదాయాలపై ఆధారపడి, రెవిన్యూకోసం చూడడం గమనార్హం.

దేశాన్ని జయించడానికి యూరోప్ అధికారులు భారతసైన్యాన్ని ప్రయోగించ లేదా. అలాగే యూరోప్ అధికారుల లాంఛనపెత్తనం క్రింద భారతీయపాలక వ్యవస్థ రాజ్యం చేసింది. జేమ్స్‌డైక్స్ యీ పాలనవ్యవస్థ గురించి యిలా చెప్పాడు.

"భారతసామ్రాజ్యం ఒక ప్రపంచవింత. యుద్ధరంగంలో రక్తం

ధారబోసినవారు భారతసైనికులే. అధికారంలో తిష్ఠ వేసిన వారికి విధేయులుగా పనిచేశారు. హిందూస్తాన్‌లో యీ పురోహితవర్గం పాలకుల పట్ల విధేయులుగా వున్నారు. మనువుకాలం నుండి దేశరాజకీయ భవిష్యత్తును వీరే పాలించారు. ముసల్మానులు, మొగలాయీలు, హిందువులు, మరాఠీలు ఎవరు కత్తిబట్టినా, పాలకమండలి జేబులు నింపడానికి వీరు పాటుబడ్డారు.”

(జె.బి.డబ్ల్యు. డైక్స్ : సేలం యాన్ ఇండియన్ కలెక్టరేట్ 1853 మద్రాసు. పే 324)

కొన్ని పర్యాయాలు బ్రాహ్మణులు ముందుచూపులేక, తాత్కాలిక రెవిన్యూకోసం చూచి, రేపటిమాట విస్మరించక పోలేదు. కాని దక్షిణాదిలో దేశస్థులు వేలాదిగా ప్రభుత్వసేవల్లో తరాలుగా సేవించారు.

గుంటూరులో (ఇతర జిల్లాలలో) అవినీతిచర్యలు చూచినంత మాత్రాన మరాఠాబ్రాహ్మణులు మధ్య దళారీలనే మాట మరువరాదు. విధేయతలో వారు స్థానికమూ కాదు, కేంద్రం పట్లనే అంటి పెట్టుకోలేదు. పొందికగా తమ స్వార్థాన్నే చూచుకున్నారు.

“టిప్పుసుల్తాన్‌ను సేవించి, తూర్పుతీర ప్రభువులను చూచిపెట్టిన మరాఠా బ్రాహ్మణులు ఇంగ్లీషు ప్రభుత్వ ఖజానా నింపడంలోనూ తోడ్పడ్డారు. బ్రాహ్మణుడెవరూ తానొక దేశానికి కట్టుబడినట్లు భావించడు. అతడు ద్విజుడు కనుక అతనికి అలాంటి బంధాలుండవు. నువ్వు ఏ దేశస్తుడివి అని అడిగితే, తన కుటుంబంలో వాడే భాషను ప్రయోగిస్తాడంతే. అతనికి అతని తండ్రికి ఒక దేశానికి కట్టుబడడం లేదు. భారతదేశాన్ని ఎవరు పాలించినా సరే, ఆర్థిక విషయాలు మాత్రం ద్విజులపరంగా సాగుతాయంటారు.”

(డైక్స్ : సేలం పుట 323)

మధ్యవర్తి దళారీలుగా దేశస్థులు సమర్థులు, రహస్యంగా వత్తిడి చేయగలవారు. గ్రామాల నుండి పిండ గలిగనంత రెవిన్యూపట్ల వారికి నమ్మకం వుంది.

మరాఠీభాషను అడ్డం పెట్టుకొని సమాచారం ప్రసారంగావిస్తారు. ఎడమచేయి ఏం చేస్తున్నదో కుడిచేతికి తెలుసు. భారీ, సంక్లిష్ట లెక్కలతో మరాఠి, ఇంగ్లీషుఫారాలు అనంత డూప్లికేషన్‌తో, యూరోప్ అధికారుల కళ్ళుగప్పి, వాస్తవాలను దాచి, నిజాలకు ముసుగులు తొడిగారు.

(తాలూకా, జిల్లా లెక్కల పత్రాలలో అంకెల పట్టికలు 1200 వుండేవని బోర్డిలన్ రాశాడు) (జాన్ నార్టన్ : లెటర్ టు రాబర్డ్‌లో ఆన్ ది కండిషన్ అండ్ రిక్వైర్‌మెంట్ ఆఫ్ ది మద్రాసు ప్రసిడెన్సీ: 1854 మద్రాసు : ఉత్తర ఆర్కాటు కలెక్టర్ జేమ్స్ బోర్డిలన్ నివేదికను యథాతథంగా ఉదహరించారు) మధ్యదళారీలుగా) తమ పాత్రకు తగ్గజీతం రాకుంటే, ఏ అడ్డదారి తొక్కితే జేబులు నింపుకోవచ్చునో వారికి బాగాతెలుసు. ఇలాంటి అవినీతి పెద్ద విశేషమేమీకాదు. ఈనాటికే స్థానికప్రభుత్వం విషయంలో అవినీతిలేని పాశ్చాత్య దేశాలు అరుదు.

హుజూర్ కచేరీ స్వాధీనంలో వున్న దేశస్థ బ్రాహ్మణులు విద్రోహచర్యల్ని గుంటూరుకే గాదు, యావత్తు దక్షిణ భారతానికే అమలుపరచారు. రికెట్ రాసిన ప్రకారం తమకు హానీ జరుగుతుందేమోననే భయంతోనూ, లాభాలు పొందేటందుకూ, కుల, కుటుంబ సంబంధాలతో, అవినీతి పనులకు పూనారు.

(రికెట్ : రిపోర్టు ఆఫ్ ది కమిషనర్ ఫర్ ది రివిజన్ ఆఫ్ సివిల్

శాలరీస్ అండ్ ఎస్టాబ్లిషమెంట్ - 1858 కలకత్తా పేజి. 343)

నెల్లూరుజిల్లా నయాబ్ సిరస్తిదార్‌కు జిల్లాపాలనలో 56 మంది బంధువులుండేవారు. బళ్ళారిజిల్లాలో 388 ఆఫీసర్లకుగాను, 235 మంది బ్రాహ్మణులుకాగా, అందులో అధికసంఖ్యాకులు దేశస్తులు. 1849లో వాల్టర్ ఎలియట్ కమిషనర్‌గా మచిలీపట్నం వెడితే 4 వేల ఉత్తరాలు హుజూర్‌లో జవాబులేకుండా పడివున్నాయి. అక్కడ రిచర్డ్ పార్టర్ కలెక్టర్. పరిపాలన అంతా సుందరగిరి రామానుజరావు, హుజూర్ సిరస్తిదార్ కింద వున్నది.

అధికారం కోల్పోయిన రామానుజరావు కలెక్టర్ అంతుచూస్తా నన్నాడు. ఆర్మిసర్జన్ సంగతి తేలుస్తానన్నాడు. 116 మంది అధికార్లను విచారిస్తే అందరూ విముక్తి పొందారు. ఒక్కరికీ శిక్షపడలేదు. (గార్డన్ మెకంజి : ఎ మాన్యుల్ ఆఫ్ కృష్ణా డిస్ట్రిక్ట్ 1883 మద్రాసు పేజి. 352)

యావత్తు ప్రసిడెన్సీలో సాలీనా కనీసం 40 లక్షలరూపాయలు రెవిన్యూజిల్లా అధికార్లు కాజేశారని రికెట్స్ కనుగొన్నాడు.

కంపెనీపెత్తనాన్ని మోసం చేయడం భారతీయఅధికార్లకే పరిమితం కాదు. మద్రాసుసైన్యంలో కూడా యిదివున్నది. గవర్నర్ ట్వేడల్ ప్రాయికుగా వృత్తినైపుణ్యత రీత్యా సైనికుడు. అతడిలా రాశాడు. :

"1837-45 మధ్య 8 ఏళ్ళుగా మద్రాసుసైన్యం ముసుగులో తిరుగుబాటు చేసింది. అన్ని రాకల తిరుగుబాట్లు సాగాయి కీలక వ్యక్తులకు ఎలాంటి శిక్షపడలేదు. ప్రతిశిక్ష కూడా విఫలమైంది. వారిని అనుసరించిన వారు శిక్షకు పాత్రులుకాగా, అసలువారు తప్పించు కున్నారు."

(డ్యూక్ ఆఫ్ రిచ్‌మండ్‌కు ట్వేడల్ 1845 మార్చి 13 గుడ్‌వుడ్ ఆర్కివ్స్, చిచెస్టర్, కౌంటి రికార్డు ఆఫీసు : మద్రాసు - ఉత్తరాదికి అడ్డంకిగా హైదరాబాద్ సాలార్‌జంగ్ వున్నాడు.)

సమస్యలో కీలకపాత్ర నాన్‌కమిషన్డ్ అధికార్లు అని, అలాంటి అలజడిని రానిచ్చిన యూరోప్ అధికార్లను దోషులుగా పేర్కొన్నాడు ట్వేడల్ వీరంతా జమాదార్లు, సుబేదార్లు.

సైనిక తిరుగుబాటులో మద్రాసు ప్రసిడెన్సీ గట్టిగా నిలవడానికి మరాఠా బ్రాహ్మణులు కొంతకారణం. దక్షిణాదిలో కంపెనీ రాజ్యంకు బలాన్ని సమకూర్చిన భారతీయపాలన వలన యీ గమనిక అవసరం. రాజ్యం ఓడితే తమ స్థితి దెబ్బతింటుందని, వచ్చేదేమీ లేదనికూడా వారి భావన. (మద్రాసుసైన్యంలో అలజడి చూచి యూరోప్ అధికార్లు జాగ్రత్త వహించారు.)

19వ శతాబ్దం తొలిభాగంలో ప్రసిడెన్సీలో కొద్దికొద్దిగా ఇంగ్లీషుభాష, చదువు, రవాణాపథకం, రాకపోకలు, అప్పు, బాంకింగ్, నీటిసాగు, కరువు నివారణ, ప్రజారోగ్యం, అభివృద్ధికర సాంకేతికత, పరికరాలు, మార్కెట్ ఆర్థికవ్యవస్థ, పాలనలో కొత్తరీతులు, ఆదర్శాలు చోటుచేసుకున్నాయి. పాతవ్యవస్థలోవున్న నాయకత్వంలోకి, సంప్రదాయాలు ఆచారాలు పాటిస్తున్న వారిలో వీటిని కేంద్రపాలితులు తెచ్చిపెట్టారు.

జిల్లాస్థాయిలో పాతకొత్తల మధ్య ఘర్షణ జరిగింది.

మద్రాసులో కేంద్రపాలితులు సంప్రదాయబద్ధులైన భారతీయత పాటించినవారే. అంతమాత్రాన ప్రభుత్వం చురుకుగా, భయానకంగా, సూటిగ్గా చేసిందనిగాదు. నెమ్మదిగా, బలహీనంగా, తప్పించుకుంటూ సాగింది. ప్రసిడెన్సీలో పెత్తందార్లు అలాంటి పాలకులతో వున్నారు.

కుట్రలు, కుతంత్రాలు, ఆఫీసులు పెంచుకుంటూ పోవడం, అలజడిని స్తంభింపజేయడం, అతిజాగ్రత్త మద్రాసులో కొట్టొచ్చినట్లుండేవి. గ్రామప్రాంతాల్లో 30 ఏళ్ళుగా వున్నవారు, ఉత్తరాదిలో పని చేయనివారు, కనిపించేవారు. అవివాహితులుగా, శక్తిసంపన్నులుగా ప్రవేశించి, వృద్ధులైపోయారు. వాతావరణాన్ని తట్టుకున్నవారు భారతీయ విధానాలకు అలవాటుపడలేదు. వాల్టర్ ఎలియట్ చల్లని వాతావరణం పడక గుంటూరులో ఎండలను భరించాడు. అలాగే సంస్కరణలు చేద్దామని, యువత ఉత్సాహంతో సాగుదామనే కోరికలేక, నిరాశా పూరితులుగా గిడసబారారు. (వృద్ధాప్యం వలనగాక ప్రతిభకు ప్రమోషన్ రావాలి. నిద్రబోయేవారు న్యాయవ్యవస్థలోకి వచ్చారు. పొరపాటున ఖైదీకి బదులు సాక్షిని వురి తీసినందుకు పోస్ట్‌మాస్టర్ జనరల్‌గా ప్రమోషన్ వచ్చింది. అని జాన్ నార్టన్ రాశాడు.)

మద్రాసులో పాలక సిబ్బంది జిల్లాలలో పాలకమండలిని పోలివున్నది. హుజూర్ సిరస్తిదార్ వలె ప్రధాన కార్యదర్శి, అంతస్తులో, పనులలో, అధికారంలో కనిపించాడు. ఇతర కార్యదర్శులు నయాబ్‌లు, దివానులు, దుబాసీల వలె వున్నారు. ఒకే పాలక కమిషనర్ వ్యవస్థలోకి అన్ని బోర్డులను తెచ్చివుంటే ఎంతో సమర్థవంతంగా పని జరిగేది. దానికి బదులు మిగిలిన సర్వీసుకాలం వెళ్ళబుచ్చుదామనే వారికి ఆశ్రయంగా మారింది. ఈ పాలకసిబ్బందిలో మితధోరణి గూడుకట్టుకున్నది. వారి కార్యకలాపాలన్నీ నిరంతరంగా మందగొడిగా, తమను సంరక్షించుకునే ధోరణిలో ఫైళ్ళు నడిపారు. జిల్లాలలో కొత్తగా పాలన ప్రారంభించిన వారు ధైర్యంగా కొత్త ప్రతిపాదనలు పెడితే, బోర్డు సభ్యులు చికాకుపడ్డారు. పల్లెప్రాంతాల్లో కలిసి పనిచేసిన వారిపట్ల, వారి సుదీర్ఘ సేవలపట్ల సానుభూతి చూపారు.

క్రిందిస్థాయి నుండి పరికిస్తే, పల్లె ప్రాంతాల్లో స్టేషన్ నుండి గమనిస్తే,

చర్య ప్రతిచర్య, అనుపానులు, అభ్యుదయ మితవాద ధోరణులు కనిపిస్తాయి. గుంటూరు సమస్యలకు వీటిని అన్వయిస్తే ఆసక్తుల ధోరణి చూడవచ్చు. పేద, నోరు లేని భారతీయుల పట్ల అభ్యుదయకర ఆసక్తిని జిల్లా కలెక్టర్‌లో, కౌన్సిల్ ప్రభుత్వంలో, కంట్రోలు బోర్డులో స్పష్టంగా చూడొచ్చు. మరొకవైపు మితధోరణి గలవారు ప్రతిస్థాయిలో హెచ్చు తగ్గులను పాటించగా, లండన్ నుండి మద్రాసు మీదుగా గుంటూరు వరకు, స్థానిక ప్రభావాలతో జమీందార్లకు, దేశస్తులకు, రెవిన్యూబోర్డుకు, డైరెక్టర్లకోర్టుకు బంధాలు వేసుకున్నారు. దీనివలన ప్రతిస్థాయిలో కప్పదాట్లు చూడవచ్చు. క్రింది, పైస్థాయి వారికి వ్యతిరేకంగా నడిచేతీరు కూడా గమనించవచ్చు.

మద్రాసు గవర్నర్ ఎంపికలో కంట్రోలు బోర్డుకు ప్రభావం వుండేది. మద్రాసులో కౌన్సిల్‌ను డైరెక్టర్లకోర్టు ఎంపిక చేసింది. అందులో గవర్నర్ ప్రభావం లేకపోలేదు. మద్రాసులో బోర్డులో, సచివాలయంలో ఇదీ మరీ స్పష్టం. క్రింది స్థాయిలో కలెక్టర్లను గవర్నర్ ఎంపిక చేశాడు. భారతదేశంలో జిల్లా అధికారాల తుదినిర్ణయ హక్కు రెవిన్యూబోర్డుకు వున్నది. ఈ విరుద్ధ ద్వంద విధానంలో, రహస్యంగా పెత్తందారీతనాన్ని కాదనే ధోరణి కనబడింది. మద్రాసు గూడుపుఠాణీలో, విధానాల స్తంభనలో బాగా పాత్రవహించింది.

మద్రాసు పెత్తన వ్యవస్థలో బలహీనతలు, నిర్మాణ లోపాలున్నాయి. రెవిన్యూబోర్డు పాలక నిర్ణియాలన్నీ స్పష్టంగా గిరిగీసి మంచిచెడుల మధ్య నిర్ణయం తీసుకున్నవికావు.

నెలలతరబడి జాప్యం చేసి, తీసుకున్న నిర్ణయం బాధ్యతను ఎవరిమీదకో నెట్టేసేవారు. చివరకు లండన్‌నుండి నిర్ణయం వచ్చేసరికి,

సమస్య స్వరూప స్వభావాలు పూర్తిగా మారిపోయి, అది నిరుపయోగం అవుతుంది. చివరకది చచ్చివూరుకుంటుంది.

గుంటూరు రెవిన్యూవిధానం విఫలమైంది. సకాలంలో సక్రమంగా రెవిన్యూ వసూలు చేయడమనేది అసలు విధానం. ఆ తరువాత సంపద పెంచడం, వనరులు పెంపొందిచడం, రెవిన్యూ వచ్చేట్లు చూచుకోవడం, ప్రధాన విధానం. కాని మనం పరిశీలించినంతవరకు ఆ లక్ష్యం సాధించలేదు.

ఈ లక్ష్యసాధనకు రెండు పద్ధతులు చేబట్టారు. కంపెనీపాలనకు పూర్వం వున్నట్లే, స్థానిక నాయకులకు తిరుగులేని పెత్తనం యిచ్చి, అజమాయిషీ లేకుండా చేయమన్నారు. దీనికి లండన్ ఆమోదం రాకముందే ఆ విధానం విఫలం గానారంభించింది. జమీందార్లు ఎలాంటి బాధ్యత లేకుండా అనుభవించసాగారు. రెవిన్యూ చెల్లించకపోగా, చెల్లించిన వారిని వ్యతిరేకించారు. దీర్ఘకాలిక అభివృద్ధికి బదులు, అందినంతవరకు దండుకోవడం మొదలెట్టారు. తమకు నీడ ఏర్పాటు చేసుకొని అనుభవిస్తుండగా వారి వ్యవస్థలోనే చలిచీమలు చేరి బల వంతపు పామును తినేశాయి. స్థానికనాయకుల సత్తాను అంచనా వేయలేక ప్రభుత్వం విఫలమైంది. జమిందార్లను ఏ మేరకు ప్రభుత్వం ఆదుకున్నదనేది ప్రశ్నార్థకమే.

రెవిన్యూ సూటిగా ఉత్పత్తిస్థానం నుండే వసూలు చేయాలనేది విఫలమైంది. ఇందుకు కారణాలు స్పష్టంగా లేవు. జిల్లాలో భారతీయ అధికార్లతో ప్రభుత్వానికి సంబంధంలేదు. ఏం జరుగుతున్నదో తెలియలేదు. ఎక్కువకాలం జిల్లాలోవున్న కలెక్టర్ విషయం తెలిసి హెచ్చరిస్తే పట్టించుకోలేదు. పైఅధికారుల లక్ష్యమే కలెక్టర్ల లక్ష్యంకూడా.

అతడు పాటించిన పద్ధతులు ఒకటే కాకుండొచ్చు. అలాంటి కలెక్టరుకు అండగా నిలవలేకపోయారు. మంచి సంకేతాలను రెవిన్యూబోర్డు పెడచెవిన బెట్టింది. తీవ్రకరువు రావడం, స్థానికనాయకులపై సానుభూతి వుండడం వలన వృద్ధ, అనుభవజ్ఞులైన దేశస్తనాయకులను నమ్ము కోవచ్చని రెవిన్యూబోర్డు భావించడం, ఆలోచన మూసుకపోయి చేసినపనే. రెవిన్యూబోర్డుకు తగిన కారణాలు వుంటే వుండొచ్చు.

అనేకమంది భారతీయ అధికార్లు, ముఖ్యంగా దేశస్తుల సేవలు లేకుండా కంపెనీ అంతసులభంగా దేశాన్ని పాలించగలిగేదికాదు. కేవలం సైన్యాన్ని కూడాగట్టినంత మాత్రాన స్థానికనాయకుల ఆదరణ, విధేయత రాదు. సంక్లిష్టమైన ప్రభుత్వ యంత్రాగాన్ని సాఫీగా నడపజాలకపోయేవారే. దేశపాలనకు మనుషులు, నైపుణ్యం, సాధన సామాగ్రి అవసరం. స్థానికనాయకుల నుండి సహకారం, నమ్మకంకూడా కావాలి. కేవలం హింసతో సరిపెడతామంటే సాగదు. దేశస్తనాయకుల బలహీనతలు అదుపులో పెట్టడానికి వారి ఆస్తులు కూడా గమనించాలి. గొల్డింగం పాలనను అస్తవ్యస్థం చేసి అవినీతి మయం చేసిన శేషగిరిరావు, నాడు స్టోక్స్‌ను కూడా అలాగే తిప్పలుపెట్టాడు. అందుకు మారుగా అప్పారావు సమర్థతతో ఎలియట్ విచారణ సఫలతకు తోడ్పడ్డాడు. ఒక మరాఠా బ్రాహ్మణుడు చెదలు పోగుచేసి పంపిస్తే, మరో బ్రాహ్మణుడు రక్షణ గొడుగుపట్టాడు.

ఈ విధానాల సాఫల్యత వైఫల్యాలను తెలివిగా అంచనా వేయలేక పోవడంలో పాలనా వ్యవస్థలో ఒకరిలోపం అనలేం. మనుషుల్ని అంచనావేయడంలో యీ వైఫల్యం వుంది. ఒక కులం, ఒక వర్గంలో ఎంపిక వైఫల్యమూ కాదు. సరైన వ్యక్తుల్ని నిర్ణయించడంలోనే లోపంవుంది. ఏ పద్ధతి అనేదికాదు, మనుషులెవరనేది ప్రధానం.

ఎంపికలో నమ్మకలో వైఫల్యత కనిపించింది. పెత్తందార్లు సరైన వ్యక్తుల్ని గుర్తించలేదు. సరైన వ్యక్తుల్ని కనుగొన లేకపోయామంటే సరిపోదు. అధికారంలో సరైన వ్యక్తుల్ని పెట్టకపోవడమే కీలకమైన తప్పిదం.

సరైన వ్యక్తులకు పెత్తనం ఎందుకు అప్పగించలేదనడానికి కొన్ని సూచనలు రంగంలో పనిచేసే వ్యక్తిపై నమ్మకం వుంచక యంత్రాంగాన్ని నమ్ముకున్నారు. తీవ్ర కేంద్రీకరణలో దోషాన్ని చూచిన జాన్ నార్టన్ యిలా అన్నాడు :

"వ్యక్తుల్ని కేంద్రీకృత వలపన్ని బిగించకుండా, యధేచ్ఛగా మనుషులుగా చూడాలి. ప్రతిదానికీ గజట్ ఉత్తరువులకై కలెక్టర్లు ఎదురుచూసే దుస్థితివలన ఏమీ చేయలేకపోయారు" (జాన్‌నార్టన్ : ఎ లెటర్ టు రాబర్ట్‌లో ఆన్ ది కండిషన్ అండ్ రిక్వైర్‌మెంట్స్ ఆఫ్ మద్రాసు ప్రసిడెన్సీ 1854 మద్రాసు పే. 319)

కలెక్టర్లకు తగిన స్వేచ్ఛలేదు. తమ పనిలో జయంసాధించాలంటే, విచక్షణాధికారాలుండాలి. నిర్ణయాలకు, వ్యక్తుల ఎంపికకు, తొలగింపుకు అవకాశం వుంటే, జిల్లాపాలనలో కొంత సాధించగలిగేవారే. రెవిన్యూబోర్డు అనంతంగా సాగిన కాగితాలను, తన నిర్ణయాలను నమ్ముకున్నది. రంగంమీద పనిచేసే వ్యక్తుల అభిప్రాయాలు వృధా అయిపోయాయి.

జిల్లా అధికారిగావున్న బ్రిటిష్ వారికి అన్నీ తెలుసుననీ, సమర్ధుడనీ జిల్లా అంశాలన్నీ గుప్పిట్లో పెట్టుకున్నాడని నమ్మడమే తప్పు. జిల్లా కలెక్టర్లు మనుషులను ఆకర్షించి కూడగట్టుకోవడంలో వారి పాలనా రీతి తోడ్పడిందనీ, ప్రభుత్వాన్ని సంక్షేమ పెత్తనంగా భావించారనీ కె.ఎన్.వి. శాస్త్రి రాశారు.

(కె.ఎన్.వి. శాస్త్రి : ప్రిన్సిపల్స్ ఆఫ్ డిస్ట్రిక్ట్ ఎడ్మినిస్ట్రేషన్ ఇన్ ఇండియా

1957 ఢిల్లీ) 19వ శతాబ్దంలో జనం నమ్మిక ప్రకారం కలెక్టర్ల కృషి, సమన్వయం, పర్యవేక్షణ కారణంగా అసాధ్యమైనదేదీ లేదనిపించారు.

గుంటూరులో 1833 దాతకరువు నుండి 1845లో విచారణ వరకూ చూస్తే, కలెక్టర్లు కీలుబొమ్మలవలె ఆటాడి మద్రాసువారు ఆడించినట్లు ఆడారు. దీనివలన రెవిన్యూబోర్డు వలె వీరి నిర్ణయాలు బిర్రబిగుసుక పోయి, ముక్కేది అంటే తలచుట్టూ తిప్పి చూపినట్లయింది. ఇచ్చి పుచ్చుకునే ధోరణ కనిపించలేదు. కలెక్టర్లలో ఎల్ఫినిస్టన్ రాకపూర్వం కలెక్టర్లను మార్చిన తీరు కూడా పాలనను బలహీనపరచింది. జాన్‌విష్, థామస్ ఓక్స్‌లను చాకచక్యం గల హుజూర్ దేవుళ్ళుగా భావించారు. అలాగే స్టోక్స్, నెవిల్ చారిత్రకపాత్ర నిర్వహించారు. కాని పైనుంచి దైవం చూస్తున్నదని పెత్తందార్ల వైపు చూసినంతవరకూ జిల్లా వెలవెలబోయింది.

కలెక్టర్‌పెత్తనం నామమాత్రంకాగా హుజూర్ సిరస్తిదార్‌కే అధికారం, ప్రతిష్ఠ దక్కాయి. అతని చేతిలో అధికారం నిరంతరంగా, అతని పక్షానికి నిరవధికంగా సాగింది. కలెక్టర్ చేతులు కట్టేసి, హుజూర్ సిరస్తిదార్‌ను మద్రాసు పెత్తందార్లు యథేచ్ఛగా వదిలేశారు.

కలెక్టర్ వచ్చారు, పోయారు. కాని హుజూర్ సిరస్తిదార్ అలాగే వున్నాడు. అతను సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు. జిల్లాకు ప్రధానమంత్రి. కలెక్టర్ మాట తుడిచిపారేసి, మద్రాసు అధికారులు అతన్ని పట్టించుకున్నారు. రెవిన్యూబోర్డు నయాబ్‌ను, అమీన్లను అట్టిపెట్టారు. జిల్లాపై అతని పెత్తనం వ్యక్తిగతం, సూటిగా, కీలకంగా సాగింది. అతనుగాని అతని మనుషులుగాని దోషులని తెలిసినా, తేలికగా శిక్షించి పోనిచ్చారు.

జిల్లాపాలనలో కంపెనీ చేబట్టిన రెండు విధానాలు మాత్రం

కొంతమెరుగైనవని చెప్పాలి. దుష్టపాలన పట్ల జాగరూకత వచ్చింది. అసమర్థులైన యూరోపియన్ అధికార్లతో సొంతం సక్రమ ఉద్దేశాలు కనిపించాయి. భారతీయుల పట్ల మంచి మార్గాన్ని అనుసరించారు. తప్పుదిద్దుకొని నిశితంగా చూచేదృష్టి వచ్చింది.

(పేదరైతుల పట్ల సానుభూతి ఓక్స్, విష్ గోల్డింగం, స్టోక్స్, ఎలియట్ రచనలలో స్పష్టపడింది. దేశస్త నాయకులలో పట్టించుకోవడం కనిపించింది)

పాలకులు నెమ్మదిగా సమస్యలను సరిదిద్దినా, శాశ్వత పరిష్కారాలకు బాటలు వేశారు.

రెవిన్యూ ఆదాయాన్ని స్థంభింపజేయడంలో స్థానిక నాయకులు తమ చాకచక్యాన్ని చూపారు. వారికి అందిన సమాచారం బట్టి అలా చేయగలిగారు. పాలకులను అజ్ఞానంలో అట్టి పెట్టారు. అందువలన మద్రాసు, లండన్‌లో రైత్వారి పద్ధతి గురించి వేరే తీరుగా అర్థం చేసుకున్నారు.

(జె.డి. బోడిలన్ : రిమార్క్స్ ఆఫ్ ది రైత్వారి సిస్టం ఆఫ్ లాండ్ రెవిన్యూ ఏజ్ ఇట్ ఎగ్జిస్ట్ ఇన్ ది ప్రసిడెన్సీ ఆఫ్ మద్రాసు 1853 మద్రాసు)

సమాచారం లభించేసరికి, అది నిర్దుష్టంగా అందుబాటులోకి రావడంతో, సమస్యలను పక్కన బెట్టి, పరిష్కారాలు చేయగలిగారు. వాల్టర్ ఎలియట్‌ను సరైన సమయంలో పంపి గుంటూరుజిల్లాలో కంపెనీపాలనా స్థంభనను ఛేదించగలిగారు. అతను కనుగొన్న విషయాలతో సరైన చర్యలు తీసుకున్నారు. జిల్లాపాలన పట్ల వున్న అజ్ఞానాన్ని అతను బట్టబయలు చేశాడు.

జిల్లాలో నిజమైన వనరుల గురించి అంతవరకూ తెలియదు. నిర్దుష్టసర్వే అప్పటికి లేదు. ఇనాం భూముల గురించి ఏమీ తెలియదు. రికార్డులు సిద్ధం చేసి క్రమంగా అట్టి పెట్టడం అంతరకూ జరగలేదు.

ఆ తరువాత 20 ఏళ్ళలో తీసుకున్న నిర్ణయాలపరంపరతో జిల్లాపాలనా తీరు, వ్యక్తుల వ్యవహారం పూర్తిగా మారిపోయింది. గ్రామ మునుసబులు అధికారంలోనూ ప్రతిష్ఠలోనూ గట్టిపడ్డారు. గ్రామకరణాల స్థితి పలచబడింది. గుంటూరులో రికార్డు కార్యాలయం పూర్తిగా మార్చేసి కట్టుదిట్టం చేశారు. మరాఠీ లెక్కలు రద్దు చేశారు. ఇనాం భూముల విషయమై జరిగిన విచారణ బాధాకరమైనది. 1868లొ శాస్త్రీయసర్వే, క్షేత్రం అంచనా తగ్గింపు రేట్లతో ప్రవేశపెట్టారు. సాలీనా సెటిల్‌మెంట్ స్థానే, తరచు అంచనాలు చేశారు.

కృష్ణానదిపై ఆనకట్ట నిర్మాణం పూర్తి అయింది. కాలువల వలన డెల్టాప్రాంతం పచ్చనిపైర్లతో సంపన్నమైంది.

ఇంగ్లీషుస్కూళ్ళు స్థాపించారు. జిల్లా సర్వీసులో తొలిసారి పాశాత్య విద్యాభ్యాసం చేసిన వారిని తీసుకున్నారు.

1850-1870 మధ్య జిల్లా పాలన విప్లవాత్మకంగా మారింది.

జిల్లాపాలనపై దేశస్తులపట్టు వదలించే చర్యలు చేబట్టారు. 1826 నుండీ జిల్లాలో పనిచేసే అధికారి భూములు వుంచుకోరాదని నిబంధన వచ్చింది. 1859 నుండీ ఒకే కుటుంబంలో ఇద్దరు ఒకే జిల్లాలో ఉ ద్యోగంలో వుండరాదని ఆంక్షపెట్టారు. ఒకే కులానికి చెందిన ఇరువురు పాలనలో ఉన్నత పదవులలో వుండరాదన్నారు. మరాఠాబ్రాహ్మణుడు హుజూర్‌శిరస్తిదారుగా వుంటే, నయాబ్ తహసిల్దార్ దేశస్త బ్రాహ్మణుడికి యివ్వరాదు. జిల్లా సర్వీసులోకి కులంతో నిమిత్తం లేకుండా

